శ్రీరస్తు.

శ్రీలలితాంబాయైనమః

# లలితాంబోపాఖ్యానము.

(ఆతుకూరి పాపయామాత్యప్రణీతము.)

మొదటికూర్పు.

చింతలపాటివంటు జమీన్దారులు

శ్రీరాజా వాసిరెడ్డి శ్రీచంద్రమౌళీశ్వర ప్రసాద్ బహదర్ వారి

యాదరణమున

శ్రీమాహిష్మతీముద్రణశాలయందు

ముద్రితము.

ముక్త్యాల.



1917.

# పీఠిక.

ఈలలితాంబోపాఖ్యానమును ఆతుకూరి పాపయకవి రచించెను. ఈతఁడు ఆతుకూరి యయ్యనామాత్యుని పౌత్రుఁ డనియు ఆదిమూర్తి సత్కవికిని సావిత్రమాంబకును బుత్రుఁ డనియు గద్యములవలనను గ్రంథాంతమునఁ గలసీసపద్యమువలనను దెలియుచున్నది. ఇంతకుఁ దక్క గ్రంథమం దెచ్చటను గవియుదంతము తెలిసికొనుట కాధారభూతము లగుపద్యము లెవ్వియును గానఁబడవు. ఈగ్రంథము ధాన్యవాట్యమరేశ్వరస్వామివారికిఁ గృతి యీయఁబడినది. భూలోకదేవేంద్రుఁ డన జగద్విఖ్యాతకీర్తి వడసిన శ్రీరాజా వాసిరెడ్డి వేంకటాద్రినాయఁడు బహద్దరు ప్రభువర్యునిరాజధానిగా నలరిన గుంటూరుమండలములోనియమరావతిపురియే యీధాన్యవాటి. దీనికే ధాన్యకటకము ధరణికోట యని నామాంతరములు. ఆరాజచంద్రునిచే నచట నుద్ధరింపఁబడిన శ్రీయమరేశ్వరాలయ మిప్పటికిని సుస్థితి నలరారుచున్నది. కవివంశజు లీప్రాంతములం దెవ్వరును గానరారు. గుంటూరుమండలములోని పల్నాడు నత్తెనపల్లి తాలూకాలలో నెచటనో కల రని వినికి. ముక్త్యాలసంస్థానములోని శ్రీలక్ష్మీనరసింహక్షేత్ర మగు వేదాద్రి కనతిదూరమునఁ గలకాశేనిపల్లి యగ్రహారములో నీకవికి మాన్యముండె ననియు దాని నిప్పుడు కవిదౌహిత్రు లనుభవించుచున్నా రనియుఁ దెలియవచ్చెడిని. ఆంధ్రదేవీభాగవతమును రచించినములుగు (వేమనారాధ్యుల) పాపయారాధ్యు లను కవివరుఁ డీపాపయామాత్యునిశిష్యుఁ డనియు నొకకింవదంతి కలదు. ములుగు పాపయారాధ్యులు శ్రీవేంకటాద్రిప్రభువర్యునిసమకాలికుఁ డనుజనశ్రుతిం బట్టియుఁ దత్ప్రభూత్తముఁడు పందొమ్మిదవశతాబ్ద్యారంభమున రాజ్యపాలనము చేసియుండుటం బట్టియు నీగ్రంథకర్త పదునెనిమిదవశతాబ్దిమధ్యమున నుండియుండు నని యూహింపఁ దగి యున్నది. ఈతనికాలము నివాసము మొదలగువిశేషము లింకను విచారణీయములు. భాషాపోషకు లగుమాన్యప్రభుచంద్రులు శ్రీరాజా వాసిరెడ్డి శ్రీచంద్రమౌళీశ్వరప్రసాద్ బహదరు మన్నెసుల్తాన్గా రీగ్రంథమును సేకరించి ముద్రింపించి యాంధ్రలోకమునకుఁ మహోపకారము గావించినందుల కెంతయు స్తోత్రపాత్రులు.

ఈలలితాంబోపాఖ్యానము బ్రహ్మాండపురాణములోనిది. ఇదిహయగ్రీవుం డగస్త్యమహామునికిఁ జెప్పినకథ. ఇందు సతీదేవి దక్షునియాగమునకుఁ బోయి పరాభూత యై చిదగ్నియందు దేహము చాలించి హిమవంతునకుఁ సుతయై పుట్టుటయు, వీరభద్రుఁ డుద్భవించి దక్షాధ్వరధ్వంస మొనర్చుటయు, దేవతలు తారకాసురబాధ కోర్వఁ

తారక తన్నుం జనసమర్థుం డగుకుమారదేవుని శివునివలనఁ బార్వతియందుఁ బడయఁ గోరి మన్మథునిఁ బురికొల్పి పంపుటయు, సమాధినిష్ఠుం డగుశివునకుఁ బరిచర్య సేయుపార్వతిపై ననురాగముఁ గల్పింప మన్మథుండు కుసుమశరములు వఱపి శివునికోపంబునకుఁ బాత్రుండై దగ్ధుఁ డగుటయు, ఆభస్మమునుండి భండాసురుం డుద్భవించి లోకంబులఁ బీడించుచుండఁ దన్నిధార్థము దేవతలప్రార్థనంబునఁ బరమశివుండు మహాయాగము చేయుటయుఁ, జిదగ్నియందు శ్రీలలితామహాదేవి యావిర్భవించి ఘోరయుద్ధంబున భండాసురునిఁ బరిమార్చుటయు, లలితాంబానుగ్రహంబున మన్మథుం డుజ్జీవితుండై పార్వతీపరమేశ్వరులను బరస్పరానురక్తులఁ జేయుటయు, వారిపరిణయంబును, కుమారస్వామిజననంబును, తారకాసురవధమును మొదలగువిషయములు వర్ణింపఁబడి యున్నవి.

ఇందుఁ బూర్వకవిసమ్మతములు కానిప్రయోగములు క్వాచిత్కముగ నట నట గన్పట్టినను బాపయామాత్యునికవిత్వము నిర్దుష్టమై లలితపదకలితమై సంస్కృతవ్యాహారబాహుళ్యంబై ద్రాక్షాపాకమున నొప్పుచున్నయది.

ఈగ్రంథమునకుఁ బ్రత్యంతరము లభింపమి నిందు సవరింపక విడువఁబడిన స్ఖాలిత్యములు పునర్ముద్రణమున సంస్కరింపఁబడును.

చల్లా సూర్యనారాయణ.

ముక్త్యాల.

15-12-1917.



# విషయసూచిక.

## ప్రథమాశ్వాసము.



## ద్వితీయాశ్వాసము.



## తృతీయాశ్వాసము.

చతుర్థాశ్వాసము.



పంచమాశ్వాసము.



షష్ఠాశ్వాసము.



సప్తమాశ్వాసము.

## అష్టమాశ్వాసము.



ఓమ్.

శ్రీసద్గురుచరణారవిందాభ్యాంనమః.

శ్రీ

# లలితోపాఖ్యానము.

## ప్రథమాశ్వాసము.



శ్రీగౌరీస్తనభద్రకుంభయుగళీ♦శ్రీగంధకస్తూరికా
సౌగంధ్యాన్వితచారువక్షుఁడు సుధా♦సారాభకారుణ్యవీ
క్షాగోపాయితసర్వలోకుఁడు రమాం♦చద్ధాన్యవాటీపురీం
ద్రాగారుం డమరేశ్వరుండు మము ని♦త్యంబున్ గృపం బ్రోవుతన్. 1

చ. జనకగుణంబు నీదుమది ♦ సంగతమే కద యెంత వేఁడినం
గనికర మింత లేదు బిగి♦కౌఁగిటఁ జేర్ప వటంచు నెయ్యపుం
గినుక విభుండు వల్కఁ బరి♦కించితి వౌ భళి దీని సంచుఁ గాం
తు నలమి తత్కఠోరత చ♦నుంగవఁ దెల్పు భవానిఁ గొల్చెదన్. 2

సీ. శరదంబుజాతలో♦చనతచే రహిఁ గాంచి, యబ్జారిధారి యై ♦ యతిశయిల్లి
నరనియంతృత్వవి♦స్ఫురణ సన్నుతి నొంది, గాంగేయవాత్సల్య♦గరిమఁ బూని
ప్రథితవారణముఖ♦రంజనశాలి యై, నరకసంహరణత్వ♦పరిణతిఁ గని
ధామవృషాకపా♦యీమనోహరి యై, వసునేత్రతాహ్లాది ♦ వన్నె కెక్కి

తే. పంచబాణప్రవర్ధన♦పటిమ గలిగి, తనర శివునకు నెందు భే♦దంబు లేక
యలరు శ్రీవిష్ణుదేవు మ♦హానుభావు, మహితకరుణాస్వభావు నె♦మ్మదిఁ దలంతు. 3

మ. సరసీజాతపరాగసమ్మృదితమున్ ♦ స్వైరింపఁగా లేనిసీ
చరణాంభోజయుగంబు మత్సుదృఢవ♦క్షఃపీఠసంవాసితా

పరితం గండెనో చూత మంచు నగుచున్ ♦ బాదంబుపైఁ జాఁచుశ్రీ
హరికేల్దమ్మిఁ జనుంగవ న్నిలుపులో♦కాంబన్ బ్రశంసించెదన్. 4

శా. నాభీపద్మమునందు నిన్నుఁ గనియె ♦ న్నారాయణుం డీవు వ
క్షోభాలప్రముఖాంగకంబులఁ బ్రజన్ ♦ సూటిం గనన్ సాగినా
వా భాగ్యే యిది నీదువంశమహిమం♦బా యంచు నవ్వించుబ్రా
హ్మీభామామణిఁ గౌఁగిలించువిబుధ♦జ్యేష్ఠున్ దలంతు న్మదిన్. 5

మ. ప్రసవాస్త్రుండు మఱంది యేరమణికిన్ ♦ బాథోధిరాట్కన్య యే
వసుధాశ్రోణికి నత్తగారు హరి యే♦వామాక్షికిన్ మామగా
రు సురజ్యేష్ఠునిరాణివాస మయి యే♦ప్రోయాలు వర్తించు న
ట్టిసుదంతామణి నారసజ్ఞపయి రూ♦ఢిన్ నృత్తము ల్సేయుతన్. 6

సీ. కామదేవశుభాభి♦రామవామాంకని,వాస యై సంతతో♦ల్లాస యగుచుఁ
గోదండసాయకాం♦కుశపాశశోభిత,హస్త యై భువనప్ర♦శస్త యగుచు
బాలమార్తాండప్రభా భాసమానభ,వ్యాంగి యై కరుణాంత♦రంగి యగుచు
భండనప్రతిహత♦భండాదిదైత్యప్ర♦కాండ యై ప్రాభవా♦ఖండ యగుచుఁ

గీ. దత్సమర్థస్వరూప యై ♦ తత్త్వభవన,దీప యై శివశక్త్యైక్య♦రూప యగుచు
గోమనీషామనోవాగ♦గోచరప్ర,భావ యగులలితామహా♦దేవిఁ దలఁతు. 7

సీ. సురశైలమందర♦ధరణీధ్రముల నైనఁ, జిమ్మఁ జాలెడునొంటి♦కొమ్మువాఁడు
సారిది బ్రహ్మాండంబుఁ ♦ జుట్టివేయఁగ నోపు,డంబైన నిడుదతొం♦డంబువాఁడు
తలఁచినమాత్రఁ గొం♦డలవంటివిఘ్నముల్, దొలఁగించుతనపేరి♦బలమువాఁడు
పర్వతరాట్సుతా♦పరమేశ్వరమనోంబు,జానందవర్ధనుం ♦ డైనవాఁడు

గీ. దివ్యచామరసదృశక♦ర్ణములవాఁడు, సమరజయకారణచతుర్భు♦జములవాఁడు
పూర్ణకారుణ్యమున నన్నుఁ ♦ బ్రోచుఁ గాత, దేవనుతుఁడు లంబోదర♦దేవుఁ డెపుడు. 8

క. అద్వంద్వతపోయుతు సా,త్వాద్వారిజనాభు గాథ♦కరుణాంబునిధిన్
విద్వద్వనరుహరవిఁ గృష్ణద్వైపాయనుఁ దలంతు ♦ సద్భక్తి మదిన్. 9

క. రామాయణామృతంబున్, భూమిజనుల కొసఁగి నాల్గు♦పురుషార్థము లు
ద్దామముగ సంఘటించుమ,హాముని వాల్మీకిఁ దలఁతు ♦ నాదికవీంద్రున్. 10

గీ. గాఢముదమునఁ దలఁచెదఁ ♦ గాళిదాస,మాఘభారవిబిల్హణ♦మల్హణులను
బాణభానుమయూరసు♦బంధుదండి,ముఖుల సంస్కృతకవుల న♦ద్భుతచరితుల. 11

గీ. అనుపమప్రజ్ఞు శబ్దశా♦సనుఁ దలంతు, నుభయకవిమిత్రునికవిత్వ♦విభవ మెంతు
ఘనమతిఁ బ్రబంధపరమేశ్వ♦రుని నుతింతు, సహజపాండిత్యు మదిలోన ♦సంస్మరింతు.

వ. అని యివ్విధంబున నిష్టదేవతాస్తుతియు నాదిమకవీంద్రనుతియును గావించి మదుపాస్యదేవత లగుభవానీశంకరులయనుగ్రహాతిశయంబున సంస్కృతాంధ్రభాషాకవిమనోహారంబుగా సకలాంధ్రజనహృద్యంబుగా నాంధ్రభాషచేఁ బద్యకావ్యం బెద్దియేనియు నొక్కటి నిర్మించి శ్రీధాన్యవాటిపురాధీశ్వరుం డగుశ్రీమదమరేశ్వరదేవునకు సమర్పింపవలయు నని మనంబునం దలంచుచుండి యొక్కనాఁ డి ట్లని వితర్కించితి. 13

క. శ్రీమద్వేదవ్యాసమ,హాముని సాత్త్వాత్మకుండుఁ ♦ డష్టాదశసం
ఖ్యామహితపురాణంబులఁ, దా మును నిర్మించె జగము ♦ ధన్యతఁ జెందన్. 14

వ. అ ట్లమ్మహామునిచేత నిర్మింపంబడి. 15

మ. అమరెన్ వైష్ణవశైవవామనభవి♦ష్యద్బ్రహ్మకైవర్తలైం
గ్యములున్ గారుడమాత్స్యభాగవతమా♦ర్కండేయముల్ నారదీ
యము నాగ్నేయము కౌర్మపాద్మములు బ్ర♦హ్మాండంబు బ్రాహ్మంబు స్కాం
దము వారాహము నా నవద్వయపురా♦ణంబుల్ మహీమండలిన్. 16

వ. ఇవ్విధంబున సకలలోకప్రసిద్ధం బగునమ్మహాపురాణసముదాయంబునందు. 17

క. శైవపురాణంబులు పది, భావింపఁగ రెండు శక్తిఁ ♦ బ్రతిపాదించున్
గోవిందు నాల్గు పేర్కొనుఁ, బావకసూర్యులను రెండు ♦ ప్రస్తుతి సేయున్. 18

వ. అదిగావున బ్రహ్మాండపురాణంబును మార్కండేయపురాణంబును దేవీమాహాత్మ్యప్రకాశకంబు లై యుండు నందు. 19

క. ముఖ్యం బగుబ్రహ్మాండా,భిఖ్యపురాణంబులోనఁ ♦ బెంపొంది జగ
త్ప్రఖ్యాతము లలితాంబో,పాఖ్యానము వెలయు సరస♦పండితసభలన్. 20

గీ. అయ్యుపాఖ్యానరాజంబు ♦ నంధ్రభాష, సుప్రబంధంబుగాఁ జేసి ♦ సూరిజనము
మది ముదము నొందఁ జేయుదు ♦ సదయహృదయ,సాంబశివకరుణాకటా♦క్షంబువలన.

క. విశ్వంభరలో మత్కృతి, శాశ్వతముగ వెలయఁ జేయ ♦ సమకట్టితి ని
త్యైశ్వర్యధాన్యవాట్యమ,రేశ్వరుఁ డుండంగ నాకు ♦ నిఁక వెఱ పేలా. 22

వ. అని మనంబున నిశ్చయించి. 23

షష్ఠ్యంతములు.

క. భవునకు నమదంభోరుహ,భవునకు నిజదృష్టిమాత్ర♦పరిభూతమనో
భవునకు నపరిమితప్రా,భవునకు నిరతిశయసత్కృ♦పావిభవునకున్. 24

క. హరునకు నతపాతకసం,హరునకు దానవమదాప♦హరునకు మహిమా
కరునకు త్రిజగత్క్షేమం,కరునకు గళకాంతివిజిత♦ఘననికరునకున్. 25

క. కృతికి దయారసపూరితి,మతికి మునీంద్రాంతరంగ♦మానిత భవ్యా
కృతికిఁ బశుపతికి జిరెరితి,పతికిఁ బదానతమహేంద్ర♦భామాపతికిన్. 26

క. శ్రీకంఠునకు శరీకృత,వైకుంఠున కుగ్రదాన♦వప్రమథన శౌ
ర్యాకుంఠున కత్యంతబ,హూకృతదానజనమాన♦సోత్కంఠునకున్. 27

క. కరిచర్మాంబరునకు శుభ,కరునకు శ్రీధాన్యవాటి♦కాపురవరమం
దిరునకు నతిరతాసాత,త్పరునకు నమరేశ్వరునకుఁ ♦ బరమప్రీతిన్. 28

వ. సమర్పితంబుగా నాయొనర్పంబూనినశ్రీలలితాంబోపాఖ్యానంబునకుఁ గథాప్రారంభం
బెట్టి దనిన. 29

చ. మునికరసప్తనాగరుఁడు ♦ శుభ్రయశశ్శపరిపూరితాష్టది
గ్వలయుఁడు వామనీకృతిం♦వగ్రహారోధకవింధ్యశైలుఁ డ
స్ఖలితతపఃప్రభావుఁడు వి♦కారవిదూరనిజస్వభావుఁ డో
కలశజుఁ డొప్పు నాకశిఖి♦ఖామణిమాత్రటమూర్తియై యనన్. 30

సీ. శ్రీకంఠపావరా♦జీవయుగ్మమదాళి, యాశ్రితకువలయ♦హారిణపాళి
దంతావళీకృతేం♦ద్రద్యుమ్న నృపహేళి, కలుషసంఘాతోగ్ర♦గహనకేళి
నాగీకృతోద్ధత♦నహుషభూవరమాళి, పీతరిక్తీకృత♦వీచిమాలి
ఖర్వీకృతోచ్చవిం♦ధ్యోర్వీధ్రసురపాళి, తేజోధరీకృత♦దీప్తిమాలి
గీ. మానిమాతుండై తుందత♦నూనపాత్ర్ప,తాపజీర్ణీకృతోగ్రవా♦తాపినామ
రాక్షసాధిపస్వీకృతో♦రభ్రితనుఁడు, శమఘనుఁ డగస్త్యనామసం♦యమధనుండు. 31

వ. అమ్మహాత్ముం డశేషతపోవిశేషప్రతోషితశేషభుజంగభూషణకరుణాకటాక్షవీక్షాసుధా
రసప్రసన్నసులబ్ధజ్ఞానవిజ్ఞానుండు గావున సర్వజ్ఞుం డయ్యును లోకహితార్థంబుగా నఖిల
ధర్మజిజ్ఞాసాపరాయణుండై యుండునంత. 32

సీ. అఖిలవిద్యాధారుఁ ♦ డనుసమాఖ్య వహించె, నేదేవుఁ డమృతాశ♦నాదు లెన్న
మధుకైటభాసుర♦మథనుఁడై యేదేవుఁ, డాగమంబులఁ దెచ్చి ♦ యజున కిచ్చె
నిష్కళంకేందువి♦నిర్మలస్ఫటికాభ,దీప్తివిస్ఫూర్తి యే♦దేవుమూర్తి
ధ్యానమాత్రిమునవి♦ద్యాప్రదుం డేదేవుఁ, డాశ్రితశ్రేణికి ♦ ననుదినంబు
గీ. నట్టిదేవుండు శ్రీరమా♦పాణినాథుఁ, డాశ్రితాష్టవిధైశ్వర్యుఁ ♦ డఘవిదూరుఁ
డబ్జసంభవవంద్యపా♦దాంబుజుండు, శ్రీహయగ్రీవుఁ డలరుపూ♦ర్ణేహుఁ డగుచు. 33

వ. ఇవ్విధంబున భగవంతుండును సత్యజ్ఞానానందమయుండును స్వప్రకాశుండును నగు
నద్దేవుం డప్పచోటికి నయ్యగస్త్యమహామునీంద్రుం డరుగుదెంచి సభక్తికంబుగాఁ

బ్రదక్షిణప్రణామాదు లాచరించి యంజలిపుటంబు ఫాలభాగంబున ఘటియించి యమ్మహామహునితో నిజాభీష్టంబు విన్నవించి ప్రసన్నముఖుం డగునమ్మహాత్ముని ముఖంబునం గ్రమక్రమంబున నఖిలధర్మంబులు నాకర్ణించుచుం దదీయవచనసుధారస పానంబున నించుకేనియుఁ దనియనిమనంబున వెండియు సత్కథావిశేషంబులు విను వాఁడై వినయవినమితోత్తమాంగుం డగుచు నద్దేవున కి ట్లనియె. 34

సీ. కరుణాసముద్ర శ్రీ♦కాంతామనోహర, సర్వజగన్నాథ ♦ సాధుపోష
సకలవిద్యాధార ♦ షడ్గుణైశ్వర్యసం,పన్న చతుర్భుజ ♦ పరమపురుష
దేవసంస్తుత హయ♦గ్రీవస్వరూప వి,జ్ఞానానుసంధాన ♦ సరసహృదయ
దేవ నీ విప్పుడు ♦ దెల్ప సమస్తవ,ర్ణాశ్రమధర్మంబు ♦ లక్రమముగఁ
గీ. దెలిసె శాస్త్రతత్త్వంబు నీ♦వలన విదిత
మయ్యెఁ జండికాదేవిమ♦హానుభావ
మఖిలమును మఱి బ్రాహ్మ్యాదు ♦ లైనమాతృ
కలమహిమ లెల్ల వింటిమి ♦ సులభముగను. 35

వ. మహాత్మా యింక నొక్కటి దేవరవలనఁ దెలియ నిచ్ఛ గలిగియున్న దది యెయ్యది యనిన. 36

గీ. అఖిలసురపూజ్య యేదేవి ♦ యరసి చూడ, జయము గలుగు నేదేవిప్ర♦సాదమునను
భుక్తిముక్తుల నేదేవి ♦ పొసఁగ నొసఁగుఁ, దెలియఁ బలుకుము మాకు న♦ద్దేవిమహిమ.

క. భుక్తిప్రద మగుదైవము, ముక్తి నొసంగదు తలంప ♦ ముక్తిప్రదమున్
భుక్తి నొసంగదు భుక్తిని, ముక్తి నొసఁగునట్టిదైవ♦ముం జెపు మనఘా. 38

వ. అని విన్నవించుటయు నద్దేవుం డి ట్లనియె. 39

గీ. భోగమోక్షంబులను రెంటి ♦ భూరికరుణ
నాశ్రితులకు నొసంగుసా♦మర్థ్య మెందు
నరసి చూచిన లలితాంబ♦యందె కాక
యన్యదేవతాబృందంబు♦నందుఁ గలదె. 40

క. జగముఁ గలిగింపఁ బెంపఁగ, ముగియింపఁగఁ జేయుమహిమ ♦ మువ్వురియందున్
నెగడించినదేవత యజ్జగదీశ్వరి గాక యొరులు ♦ శక్తు లగుదురే. 41

గీ. శక్తిచక్రైకనాయికా♦సంజ్ఞ చేతఁ, బరఁగులలిత సాక్షాత్పర♦బ్రహ్మ మెన్న
నట్టిదేవిచే మూర్తిత్రయంబు నాథ,వంత మగుచుండఁ దక్కిన♦వారు లెంత. 42

మ. మును భండాసురుఁ డన్బలాఢ్యుఁడు మహా♦మూర్ఖుండు లోకత్రయం
బు నసారంబుగఁ జేయ నజ్జగములన్ ♦ బూర్వప్రకారప్రవ

ష్ఠింప మొందింపఁగ నద్వితీయపరమ♦బ్రహ్మంబు స్త్రీరూప మై
తనరెన్ శ్రీలలితాభిధానమున ను♦ద్దామప్రభావంబునన్. 43

వ. అనిన విని లోపాముద్రావల్లభుం డశ్వగ్రీవున కిట్లనియె. 44

క. భండాసురుఁ డన నెవ్వఁ డ,తం డెవ్వనిపుత్రుఁ డతని♦తా వెయ్యది త
చ్చండత నేక్రియ జగములు, బెండువడియె నెవ్వఁ డతని♦పించ మడంచెన్. 45

క. తత్పీడితలోకావన,తాత్పర్యము నేఘనుండు ♦ దాల్చి మెఱసె నే
తత్పరమామృతకథ బుధ,హృత్పర్వము గాఁగ విస్త♦రింపు హయాస్యా. 46

వ. అనిన విని హయగ్రీవుం డిట్లనియె. 47

సీ. కలశసంభవ నీవు ♦ కౌతుకంబున నడి,గినకథ వినిపింతు ♦ వినుము తెలియఁ
దరుణేందుమౌళి స♦దాశివుం డేకనాఁడు, కైలాసపర్వతా♦గ్రంబు నందు
సనకసనందనా♦ద్యనిమిషయోగీంద్ర,సేవ్యమానుం డయి ♦ దివ్యమహిమ
నలరుచు నందిమ♦హాకాళభృంగిము,ఖ్యములగుగణమండ♦లములు గొలువ

గీ. మహితవిభవ మాస్థాన♦మంటపమున, నవ్యమణిమయసింహాస♦నంబు మీఁద
దక్షపుత్రియుఁ దాను మో♦దంబుమీఱఁ, గర్థిఁ గొలువుండె బ్రహ్మాదు ♦ లభినుతింప.

వ. ఇవ్విధంబునఁ గరుణాసముద్రుండును సర్వేశ్వరుండును సర్వజ్ఞుండును షడ్గుణైశ్వర్య సంపన్నుండును ననాదినిధనుండును నగుసదాశివుండు సకలదేవగణంబులు తన్నుం గొలువఁ గొలువుండి తత్కాలోచితంబుగా సతీదేవితోడిసరససల్లాపసుఖం బనుభవించుచుఁ గొంతదడ వున్నచోఁ దత్సమయప్రవర్తమానదక్షయాగమహోత్సవనిరీక్షణ కౌతుకాధీనమానసంబులై తదీయయజ్ఞవాటంబునకుం జనియెడుదేవసైన్యంబులకలకలంబు విని యాసర్వేశ్వరి యీకోలాహలంబునకుఁ గారణం బేమొకో యని తద్వృత్తాంతంబు దెలియుటకు శీఘ్రగామియు గగనప్రచారచంచరుండును నగునొక్కప్రమథాగ్రణిం బంచిన నతం డరిగి తత్కారణంబుఁ దెలిసియు మగుడ వేగంబున వచ్చి సతీపరమేశ్వరులకు నమస్కరించి భక్తివినయవినమితోత్తమాంగుం డై యద్దేవి కిట్లనియె. 49

సీ. జనని మీతండ్రి ద♦క్షప్రజాపతి మహా,యజ్ఞంబు సేయంగ ♦ నర్థిఁ గోరి
పిలువఁబంపిన నమ♦రులుఁ దదాజ్ఞావశ,వర్తులు గావునఁ ♦ ద్వరితముగను
దమతమసైన్యసం♦ఘములతోఁ బోవుచు,న్నా రిది వారిమ♦హారవంబు
కలకలంబున కిది ♦ కారణం బని తెల్పి, యతఁ డూరకున్నచో ♦ నాదరమున

గీ. విని సతీదేవి దమతండ్రి ♦ విభవ మెసఁగఁ, జేయుయాగంబుఁ గనుఁగొనఁ ♦ జిత్తమునఁ గుతూహలంబు జనింప సం♦తోష మొదవ, విభునిఁ గనుఁగొని యిట్లని ♦ విన్నవించె. 50

క. దేవ భవత్ప్రియభృత్యుఁడు, దా వినిపించినవిధంబుఁ ♦ దడయక వినుటన్
దేవగణంబులకలకల, రావముకారణము మనకుఁ ♦ బ్రకటం బయ్యెన్. 51

సీ. మాతండ్రి దక్షుండు ♦ మహనీయ మగుమఖ, మొనరింపఁ దొడఁగి యా♦యనిమిషులను
మునులను రాఁ బంచె ♦ ననుచు విన్నదిమొద, లయ్యుత్సవముఁ జూడ ♦ నటకుఁ బోవ
నుత్సాహ ముదయించె ♦ వాత్సల్యమున మీఱ, లనుమతి దయసేయ ♦ నచటి కేఁగి
యక్కలఁ జెలియండ్రి ♦ నన్నదమ్ములఁ దల్లి, దండ్రులఁ దన్మిత్ర♦తతులఁ దక్కఁ

గీ. గలుగుబంధుజనంబులఁ ♦ గాంచి యధ్వ
రోత్సవము వారితోడ నే♦త్రోత్సవముగఁ
జూచి వేగ వచ్చెద వారిఁ ♦ జూచి పెక్కు
దినము లయ్యెఁ గావునఁ జూడ ♦ మనసు వొడమె. 52

క. ననుఁ జూడఁ గోరుదురు వా, రనిశము వారలను జూడ ♦ నట్లన నాకున్
మనసు గలుగు నదిగావున, ననుజ్ఞ దయసేయ వలయు ♦ నట కరుగుటకున్. 53

గీ. అనుచు నీరీతి వేఁడున♦య్యంబుజాక్షిఁ, జూచి పలికె నిశాకర♦జూటుఁ డపుడు
వార్షికాంభోదగంభీర♦వాక్యఫణితి, సతివ యట నీదుపోక నా ♦ కనభిమతము. 54

వ. అది యెట్లంటేని దీనికి మూలంబు చాలఁ గలదు మున్ను మాతెఱంగుఁ దెలిపెద వినుము మేము విశ్వంబునకు నిష్టప్రదాతల మనిష్టార్థనివారకులము సకలలోకపూజ్యులము సత్యజ్ఞానానందస్వరూపులము కృతకృత్యులము స్వాత్మానందపరాయణుల మిట్టు లగుట దెలిసి మాకు నమస్కరించుటకు సమస్తబృందారకసందోహంబులు నిత్యంబును వచ్చుచుండ నందులోపల భవజ్జనకుం డయ్యును దురభిమానవంతుం డగుదక్షప్రజాపతి తనకు నేను జామాత ననియెడుభావనచేత మదీయనమస్కారం బపేక్షించి యుండ నేనును దేవతానమస్కారాంగీకరణసమయంబున దక్షునిఁ జూచి యతనితో సర్వసామాన్యకుశలప్రశ్నంబు చేసితిఁ గాని శ్వశురుం డని యాతనికి నమస్కరింపలే దది యెట్లనినఁ బ్రణయకలహంబులయం దీర్ష్య వహించి యున్న నీదుప్రసన్నతకొఱకు సాంతఃకరణపూర్తిగా నీకు నమస్కరింతుఁ గాని యింతకు మిక్కిలి యెవ్వరికి నేను ప్రణామంబుఁ జేసి యెఱుంగ నట్టిద కాదె భువనత్రయంబునందును నాకు నమస్కార్యుం డైనవాఁ డెవ్వండును గలుగం డది యట్లుండె నివ్విధంబునం దనకు నమస్కరింపని నన్నుం గని క్రోధమూర్ఛితుండై మీతండ్రి యేమేనియుం గొన్ని నిందావాక్యంబులు పల్కుచు రోషాగ్నిదందహ్యమానమానసుండై నిజమందిరంబున కరిగె నప్పు డతని యాననంబునం గలిగినకోపవికారంబును దౌరాత్మ్యంబును దురభిమానితయుం జూచితి

నదిగావున నాఁటివైరంబు దినదినప్రవర్ధమానం బై యుండుటంజేసి మనలం బిలి
పించుట మాని యుత్తమబుద్ధులును మూఢులును బామరులును నైనయమరులతోఁ
గూడి మదీయదూషణంబువలన నిరర్థకం బైనయజ్ఞకర్మం బారంభించి యున్నవాఁ
డట్లగుటంజేసి నీ వందులకుఁ బోవ నలవ దటు గాక నిజేచ్ఛాప్రాబల్యంబునం బోయెద
వేనిఁ బొమ్ము వెంటనే మద్వాక్యంబు ఫలింపఁ గల దని సకలలోకవశంకరుం డగు
శంకరుండు హితోపదేశంబు చేసిన దాక్షాయణి వెండియుఁ బ్రాణవల్లభున కిట్లనియె.

గీ. అట్లు లైన లోకేశ నే ◆ నచటి కరిగి, మొఱకుఁదనమున దేవర ◆ నెఱుఁగ లేక
దూషణము సేయుదక్షుని ◆ తోడ నీదు,మహిమఁ దెల్పి యాతనిమూర్ఖ ◆ మతి మరల్తు.

మ. అతఁ డీరీతి భవద్విదూషణము సే ◆ యం జాగిన ట్లైనఁ గు
త్సితపుణ్యలోకము ప్రాప్త మౌ నతనికిన్ ◆ సిద్ధంబుగాఁ గావునన్
హితముం దెల్పి మరల్ప కూరకయు యి ◆ ట్లే నుంట యన్యాయ మౌ
మతి నూహింపఁగఁ దండ్రి వృద్ధుఁడు మహా ◆ మూర్ఖుండుఁ దా నౌటచేన్. 57

వ. అదియునుం గాక. 58

గీ. అఖిలలోకేశ్వరేశ్వరు ◆ ననుఁగుమామ, తలఁచి చూడ సతీదేవి ◆ తండ్రి గతుఁ
డెంతమాహాత్మ్యుఁ డని జను ◆ లేవగింప, మనకు నపకీర్తి గాదె నె ◆ మ్మదిఁ దలంప. 59

వ. కావున. 60

చ. ఎటువలెఁ జెప్పఁ దన్మతికి ◆ నీర్ష్య జనింపదు మీపయిన్ హితం
బెటువలెఁ జెప్ప దూషణము ◆ లేమియుఁ జేయక యుండు మి మ్మతం
డెటువలెఁ జెప్ప రాఁ బనిచి ◆ యెంతయు సత్కృతిసేయు మీకు నే
నటువలెఁ జెప్పి కార్యము స ◆ మస్తము గ్రక్కునఁ జక్కఁజేయుదున్. 61

చ. ముది మది తప్పి తండ్రి యతి ◆ మూర్ఖుఁ డై భవదీయనిందయన్
విదితమహాంధకూపమున ◆ వెంగలి యై పడఁ బోవఁ జూచి యి
ట్లదలిచి సాధుమార్గమున ◆ నాతనిఁ జేర్చుట మీకు నిప్పు డొ
ప్పిన దగుఁ గాదె యీపని కు ◆ పేక్ష యొనర్పఁగ నాకు ధర్మమే. 62

మ. అవధూతాకృతిచేతఁ గప్పఁబడుమీ ◆ యత్యంతమాహాత్మ్య మా
త్మ విమర్శింప నశక్య మై యునికి భ ◆ స్మచ్ఛన్న మౌ నగ్ని నా
త్మ విమర్శింపక సంస్పృశించినక్రియన్ ◆ మాతండ్రి దూషించె మి
మ్ము వెసం బోయి మరల్తు నాతనిమహా ◆ మూర్ఖత్వదుర్మానముల్. 63

వ. కావున దేవా యనుజ్ఞ దయచేయవలయును మ్రొక్కి వేఁడికొనియెద నని విన్నవించిన శంకరుం డద్దేవివచనంబులకు నేమియు ననలేక తదీయగమనంబు దనమనంబునకు ననిష్టం బైనను దత్కార్యం బవశ్యంబు భావి యగుటఁ దెలిసి యెట్టకేల కనుమోదించిన దాక్షాయణి నిజజనకయజ్ఞక్రియామహోత్సవనిరీక్షణలాలస యై పోవ నుద్యోగించుటఁ దెలిసి నందికేశ్వరానుజ్ఞాతులై తత్సహాయు లగుమహాప్రమథులు మహాకాళ మహాకర్ణ ఘంటాకర్ణ కపాలవంతులును కుంభోదరనికుంభనీలగ్రీవమృగాంతకులును నూర్ధ్వకేశ కేతుమాలి తంతు మకరలోచనులును సోమకానిలబాహువులును భైరవ కాలభైరవ స్వచ్ఛందభైరవోన్మత్త విశ్వఘస్మ కాలముఖులును సింహకేతు మణికంధర మణిమంతులును మొదలైనగణశ్రేష్ఠులు మహాకారులు మహాసత్త్వులు మహాజస్కులు శస్త్రపాణులు దేవీరక్షణార్థంబు స్వస్వామిచరులై యనేకగణనాథులతోడం గూడం దగిలి యమ్మహానుభావం బరివేష్టించి చన్న నద్దేవియు వాయువేగంబు గలతురగంబులు పూనినకాంచనవిమానంబున గగనగమనంబున సత్వరంబుగాఁ బోవుచుండ వైమానికదేవచారణాప్సరోగణసంస్తూయమాన యగునయ్యంబిక సఖీజనంబులు ప్రాణంబులకంటెను బ్రియపాత్రంబులై తన్మనోవినోదనప్రియకథాప్రసంగప్రవీణంబులై కలాచిచామరతాళవృంతకనకపాదుకాతాంబూలపేటికాభూషామంజూషాదివిశేషవస్తువులు గొని జనకభవనంబునకుం జనియెడుసతీదేవివెంట నరుగుదెంచె నయ్యవసరంబున గగనోల్లంఘికేతనపదపటానిలసంఘట్టింబులై మేఘబృందంబులు విరియుచుండ ఘంటాఘణఘణాత్కారంబుల రోదసీవివరంబు పూరించుచు సువర్ణభూషణమయంబు గావున సువర్ణశైలంబుకరణి విరాజమానం బై మహావేగం బైన వ్యోమసంచారంబున సుపర్ణుతోఁ బురుడించుచుఁ దద్విమానం బరుగుచుండఁ దన పరిభాగంబున భాస్కరాభిముఖంబు లై వికృతస్వనంబులతోడ ఖగంబులు ఘోషించె నబ్భవానికి దక్షిణభుజచక్షురాదికస్పందనంబు గలిగెఁ బ్రతికూలవాయువులు వీచె దిక్కులు ధూమాక్రాంతంబులును ఘోరాభ్రానంబు లయ్యె నివ్విధంబున ననేకదుర్నిమిత్తంబులు దోఁచిన నవి యెల్ల ననుసంధించి శంకించియు నమ్మహాదేవి తండ్రియజ్ఞవాటికిఁ బ్రవేశించి యచ్చట మాతృభగిన్యాదిబాంధవులను బ్రహ్మాదిప్రజాపతులను గ్రమంబునఁ గనుంగొనుచు మఱియును. 64

ఆ. అమరనాథు నగ్ని ♦ నంతకు నసురేంద్రు, నంబుధీశు ననిలు ♦ నభవమిత్రు
నంబుజాతహేతుని ♦ నమృతమయూఖునిఁ, జూచె శారదాబ్జ♦సుభగనయన. 65

వ. మఱియు వసు సిద్ధ కిన్నర గంధర్వులను దిగ్గజంబులను శచీస్వాహాధూమజ్ఞాసీతిబుద్ధిసన్నతులను దక్కిన దేవాంగనల నప్సరోగణంబులను మఱియు నానావిధయజ్ఞపా-

త్రంబులచేతఁ బ్రయోగకుశలు లైనబ్రాహ్మణులచేతఁ బరీక్షకు లైనసదస్యులచేతఁ గర్మలంపటు లైనఋత్విక్కులచేత నిజాకర్ణనవిధ్వస్తపాతకంబు లైనమంత్రఘోషణంబులచేత సాంగంబు లైనప్రయాజానూయాజస్వాహాకారవౌషట్కారవషట్కారంబులచేత స్తోత్రశస్త్రసామంబులచేతఁ బురోనువాక్యాయాజ్యలచేత సధికశుభకర్మంబులచేత యజమానపత్నులచేత యాజకృత్యంబులచేతఁ బశుసంజ్ఞపనంబులచేత దర్భసంవేష్టితంబులై పాశయుక్తంబు లైనయూపంబులచేత నతిశోభితం బగుయజ్ఞవాటంబు నిరీక్షించి దక్షనందన యత్యంతప్రీతమానస యగుచు మఱియు వివిధంబు లగునాశ్చర్యంబులం జూచుచుఁ దనతో వచ్చినగణంబుల నంతంత నిలువ నియమించి ప్రాణసమాన లైనసఖీమణు లిరుగడలం జనుదేర దురభిమాని యగునిజజనకు సమీపంబునకుం జనియె నని చెప్పి హయగ్రీవుండు మఱియు ని ట్లనియె. 66

క. ఇటు వచ్చుపుత్రికం గని, కుటిలభ్రూకుటికఠోర ♦ ఘోరం బగుమో
మటుఁ ద్రిప్పె దక్షుఁ డవమతిఁ, గటము లదర నల్లునందుఁ ♦ గలిగినయీర్ష్యన్. 67

మ. అతఁ డీరీతి సమస్తబాంధవులకున్ ♦ హర్షంబుతోఁ బ్రీతి సే
సి తనుం జూడఁగ వచ్చుపుత్రియెడ ని ♦ స్స్నేహాత్ముఁ డై యల్లునిన్
మతి నుద్దేశము చేసి నిర్భయత దు ♦ ర్మానంబునన్ భర్త్సనా
యుతదుర్వాక్యరపంక్తిఁ దచ్ఛ్రవణసం ♦ యుక్తంబు చేసెన్ వడిన్. 68

మ. అకులీనుండు కపాలభూషణుఁడు చి ♦ త్యాభస్మదిగ్ధాంగుఁ డై
నకపర్ది న్నిజనాథుగాఁ బడయుటన్ ♦ నాపుత్రి వయ్యు న్నినిం
దకుఁ బాత్రత్వము నొంది తీ వతఁడు మి ♦ థ్యామాని యత్యంతదాం
భికుఁడున్ ధూర్తుఁడు శక్తిగర్వితుఁడు పా ♦ పిష్ఠుం డనాచారుఁడున్. 69

శా. సన్నింద్యుం డవధూతవేషుఁడు సదా ♦ చారాహితుండున్ వృథో
త్పన్నాహంకరణుం డమంగళుఁడు నుద్య ♦ త్తాపసాకారసం
ఛన్నుం డాతనివేషకల్పనయుఁ ద ♦ చ్చారిత్రముం జూడఁగా
నెన్నంగా నశివంబు లూరక శివుం ♦ డెట్లయ్యెనో రూఢతన్. 70

క. చరితము వేషము వసతియుఁ, బరికింపఁగ నశివము లయి ♦ పరమతపోదం
భరతిన్ సమస్తజనులన్, వరుసన్ మోహితులఁ జేయు ♦ వశ్యాకృతితోన్. 71

ఆ. అట్టివానిఁ జెట్టఁ ♦ బట్టినకతమున, నబల నీ వనర్హ ♦ వైతి విపుష
కుక్కతిత్తిలోని ♦ గోక్షీరమును బోలెఁ, జెలువ యింక నేమి ♦ చెప్పఁ గలదు. 72

క. నాయజ్ఞానంబున నమ్మాయికుఁ డిటు లల్లుఁ డయ్యె ♦ మసలక నీవున్
మీయింటి కరుగు మిప్పుడ, మాయజ్ఞము నీవురామి ♦ మఱి నిల్చునొకో. 73

క. ఇటు పిలువనిపేరంటం, బిటకుఁ రా నీకుఁ దగునె ♦ యెవ్వ రయిన స
ఛ్ఛుట వచ్చి భిక్షుకింకరి, యిట ర మ్మని నిన్నుఁ బిల్చు ♦ ఱుఁగము మేముఁ. 74
క. అని యివి మొదలగుపరుషవ,చనశరములఁ దక్షునోంబు♦జను వేధించెన్
దనయ యనక సకలజగ,జ్జనని యనక యల్లుసందు ♦ సక్రోధుం డై. 75
వ. అప్పుడు. 76
మ. అనయస్ఫారమహాకఠోరవచన♦వ్యాపారుఁ డౌ దక్షునిం
గని నిర్హేతుకృపాపయోధి యగున♦క్కల్యాణి దేవాదిదే
వునియర్ధాంగము సర్వలోకజనులన్ ♦ బోషించువిన్నాణి స
జ్జనముల్ మెచ్చ హితోపదేశము లొన♦ర్పం జొచ్చె న్యాయ్యంబుగన్. 77
శా. ఈదౌరాత్మ్యము తండ్రి నీవలన నేఁ ♦ డీక్షింపఁ గాన్పించె నీ
కీదుర్మార్గము మూలనాశకర మిం ♦ దెవ్వాఁడు బోధించె నా
హా దౌర్భాగ్యనిదాన మీపని యశో♦హానిప్రదం బెన్న నో
హో దుష్టాత్ముఁడ వై తి వీవు పరమే♦శ్వాత్పన్నతన్ గాంచియున్. 78
క. చేసినకర్మములఫలము, చేసేతం గుడువక నిర♦సింపఁగ వశమే
నీసాంగత్యంబున నక,టా సజ్జననికరములకు ♦ హానియు నొదవెన్. 79
క. అత్యుత్కృష్ట మగుప్రజా,పత్యధికారంబు డిందు♦పడె నీకుం బా
తిత్యద మగుదుర్మార్గా,ధ్యత్యము శివునందుఁ జేయఁ ♦ దలపెట్టుటచేన్. 80
క. యజ్ఞంబు యజ్ఞభోక్తయు, యజ్ఞఫలము యజ్ఞకర్త ♦ యరయఁగ నెవ్వం
డజ్ఞానహరుని నాస,ర్వజ్ఞుని ని ట్లనుట ధర్మ♦వా దుష్టాత్మా. 81
క. శివ యనఁ బరఁగినయెవ్వని,పవిత్రనామంబుఁ దలఁచు♦భవ్యులఁ జేరో
న్నవిమలులు ముక్తి నొందుదు, రవర్ణ మయ్యభవుఁ జేయ ♦ నగునె దురాత్మా. 82
క. జ్ఞానాగ్నిదగ్ధకల్మషు, లైనతపోనిష్ఠులు మును ♦ లాత్మారాముల్
పూనికఁ బూజించెద రె,వ్వానిఁ దగునె తెగడ నట్టి♦వానిం గుమతీ. 83
క. సకలజగంబుల మూర్త్యష్టక మై యెవ్వండు ప్రోచుఁ ♦ జతురత నాచం
ద్రకళావతంసు శివు నెఱుఁగక నిందించెదవు నీవు ♦ గర్హితహృదయా. 84
వ. అని మఱియును. 85
క. పాప మహో పాప మహో, పాపం శాంత మధు నైవ ♦ పాపం శాంతం
పాపం హతం హత మిదం, పాప మనుచు నమ్మహాను♦భావ పలుకుచున్. 86
వ. వెండియు దక్షునిం జూచి సాంత్వనస్వరంబున ని ట్లనియె. 87

ఆ. ఏమి చెప్పఁ గలదు ♦ తామసంబున నంధ,కూపమునఁ బడంగఁ ♦ గోరె దీవు
వినుము నాదుపలుకు ♦ వెస మూలనాశన,కారి యైనయావి♦చార ముడిగి. 88
ఉత్సాహము. ఇంత యైన నమ్మహాత్ము♦నిద్ధమహిమఁ దెలిసి త
త్ప్రాంతమునకు నరిగి నీవు ♦ ప్రార్థనముగ నాతనిన్
శాంతియుక్తుఁ దోడితెచ్చి ♦ సత్కృతం బొనర్చినన్
సంతసంబు గల్గు నీకు ♦ సర్వబంధురాజికిన్. 89
క. లేకున్న నీదుయజ్ఞము, నీ కభిచారంబ యౌను ♦ నిక్కము పుణ్య
శ్లోకుని నుపాస్యదేవత, శ్రీకంఠు ననాదినిధను ♦ సేవాప్రీతున్. 90
క. శివుఁ బిలువక యీవిధమున, నవధీరితుఁ జేసి నీవు ♦ యజ్ఞకరణదీ
క్షి వహించి యున్నకతమున, నవనం బటువంటి దౌట ♦ సందేహం బే. 91
క. నిను శివునకు నిలుపఁగ, మనసునఁ గోర్కి గలదేని ♦ మసలక నీ వ
ల్లునిఁ దోడి తెచ్చి సత్కృతి, యొనరింపు మొనర్పకున్న ♦ నొప్పమి వచ్చున్. 92
క. అగణితగణనాథుం డా,జగదీశ్వరుఁ డతనియలుక ♦ సైరింపఁగ ని
జ్జగముల నెవ్వఁడు గలఁడే,కగణ్యక్రోధంబు నైనఁ ♦ గడఁగి సహింపన్. 93
క. సకలచరాచరములుఁ జా,లక యుండు నటంచు దేవ♦లలనార్చిత యం
బిక దెలుప నతఁడు బద్ధ,భ్రుకుటి యగుచు మఱియు ఖడ్గ♦రూక్షోక్తులచేన్. 94
క. నొప్పించినయజ్జనకుని,యొప్పమి మదిలోన రోసి ♦ యుద్ధతరోషం
బప్పు డుదయింప నతనిం, దప్పక కని తజ్జ మైన♦తనువు విడువఁగన్. 95
క. తలఁచి శివద్రోహివి నీ,ఖలగాత్రమువలనఁ గలుగు♦కాయము విడువన్
వలెఁ గాక దీనివలనన్,ఫల మేమి భవత్కులప్ర♦ణాశముకొఱకున్. 96
క. మేను విడుంగుట యుక్తమ,నూనక్రోధాగ్ని నిపుడ ♦ యుడుగక కాల్పం
గా నేను శక్త నయ్యెను, బూనిక నిను జనకుఁ డనెడు♦బుద్ధిం గాల్పన్. 97
క. అంజక జగదీశుఁడె చ,క్కం జేయు న్నిన్నటంచు ♦ ఘనయోగకళా
వ్యంజకనాసాగ్రగదృ,క్ఖంజనయుగ యగుచు బద్ధ♦కంజానన యై. 98
సీ. అతిధైర్యమున నింద్రి♦యముల సకలమాత్మ, నల్లనల్లనఁ గుది♦యంగఁ జేసి
యోగంబుచేఁ దను♦త్యాగంబు సేయంగ, నమకట్టి తనప్రియ♦సఖిగుఱించి
పలికెఁ గల్యాణి మ♦ద్భర్త సర్వేశ్వరు,పార్శ్వంబుఁ జెందు ని♦ర్భయము గాఁగఁ
దోడినెచ్చెలులతోఁ ♦ గూడ సమస్తగ,ణాధీశ్వరులతోడ ♦ నతిరయమున
గీ. నేను పతియాజ్ఞ మీఱిన♦నేర మపుడ, యనుభవించితి నీదుస♦మక్షమునన
యట్టు లగుటఁ దనుత్యాగ ♦ మరయ మేలు,కారణాంతరమును మఱి♦కలదు వినుము.

ఉ. పూర్వపరార్ధవేళఁ బరి♦పూర్ణమహానియమంబుతోడ ని
ర్గర్వత నూఱులక్షలును ♦ గ్రమ్మఱ నేఁబదిలక్ష లబ్దముల్
సర్వసుపర్వపూర్వసుర♦సంయమినమస్కృత మాతపంబు ను
ప్పర్వతసార్వభౌముఁడు స♦భక్తిగఁ జేసెను మత్ప్రియంబుగన్. 100

సీ. ఇవ్విధంబునఁ జేయు♦హిమవంతుతపమున, కిచ్చలోపల మెచ్చి ♦ యేను సతని
మ్రోల సన్నిధిచేసి ♦ ప్రాలేయగిరినాథ, నీదునిష్ఠకు సుప్ర♦మోద మంది
యుఱునట్టివరముఁ నీ ♦ కొసఁగంగ వచ్చితి, వేఁడు మిచ్చెద నన్న ♦ వినతభక్తి
నిర్భరమానస♦నీరేరుహుం డయి, కరములు ముకుళించి ♦ గిరివరుండు

గీ. తల్లి నాయందు నీవు సం♦తసము గల్గి, చేరి కరుణామృతంబు వ♦ర్షించెదేని
బుత్త్రి వగుము మత్కులము ప♦విత్రితముగ, నామనోభీష్టమిది తవ♦న్యం బెఱుంగ. 101

క. అని భక్తినమ్రుఁడై వేఁడిన నాతనికోర్కి కడుఁ గ♦డిఁది యైనను ద
ద్ఘనభక్తి కలరి నీకో,రినయట్ల తనూజ నగుదుఁ ♦ బ్రియముగ నీకున్. 102

క. అని వర మిచ్చితి నోచెలి, విను మివ్వరమునకు నిదియ ♦ వేళ యగుం గా
వున హిమవద్గిరివరునకుఁ, దనయ నగుదుఁ దదభిలాష ♦ ధన్యతఁ జెందన్. 103

క. మును శివదూషకతమునకు, జనియించినయట్టిమేను ♦ చయ్యన విడువన్
ఘన మైనయట్టియేత, జ్జనుష్కృతాఘంబు దొలఁగు ♦ సఖి క్షణమాత్రన్. 104

సీ. మాస్వామికడకు ధై♦ర్యస్వాంతమున నీవు,నీసఖీవారంబు ♦ నేగు డిపుడ
మ్రొక్కెదఁ బలుమాఱు ♦ మోహప్పఁ గే లొదలఁ, గదియించి మన్నాథు♦పదములకును
నావచనంబుగా ♦ దేవదేవునకు మ,దీయప్రణామముల్ ♦ దెలుపు మింకఁ
బ్రాణసమాన వై ♦ పరఁగ నీవును దోడి,చెలు లిట్టికష్టంబుఁ ♦ దెలియఁ జూచి

గీ. చిత్తములు శోకభారంబుఁ ♦ జెందకుండ, నగణితస్థైర్యధృతినుండుఁ ♦ డంతమీఁద
నద్రిరాజనందన నయి ♦ యలరునన్నుఁ, జేరి దుఃఖంబు నుజ్జగిం♦చెదరు మీరు. 105

క. అని పలికిన నచ్చెలి కను, వనరుచు విలపింప యోగ♦పర యై నాసా
గ్రనిబద్ధదృష్టి యగుచున్, ఘన మగుధ్యానమున మూల♦కమలమువలనన్. 106

గీ. కలుషహర మహాచిదగ్నిఁ బ్ర♦జ్వలితముగ నొనర్చి యద్దేవి సర్వలో♦కార్చిత మగు
తనదుమే నందులోనఁ ద♦త్క్షణమ దీప్య,మానముగఁ జేసె సురలు వి♦స్మయము నొందఁ

వ. ఇవ్విధంబున. 108

మ. భువనశ్లాఘ్యసతీసతీతనువు క♦ర్పూరప్రదీపంబుపో
లిక వియద్భాగమునందుఁ బ్రజ్వరిలుచున్ ♦ లీలన్ దిరోధాన మొం

డె విచిత్రంబుగఁ గొంతసేపునకుఁ ద♦ద్వృత్తాంత మత్యద్భుతం
బవితర్క్యం బొకభస్మరేణువును లే ♦ దయ్యెన్ నభోభూములన్. 109

గీ. అప్పు డద్దేవి మినుతోఁ శివ ♦ సరిగి తుహిన,నగకులము శ్రేష్ఠము పవిత్ర♦ముగ నొనర్ప
హిమనగేంద్రకళత్ర మై ♦ యెసఁగుమేన,కారమణి నాశ్రయించెఁ ద♦ద్గర్భ మగుచు.110

క. మును పితృదేవత లేరమ,ణిని మానసమున సృజించి ♦ నీహారాద్రీం
ద్రునకు మహాత్మున కొసఁగిరి, ఘనకృపతో నట్టిమేన♦కాసతి నియతిన్. 111

క. ముల్లోకములకు నిజముగ, దల్లి యగుచు నలరుసంబఁ ♦ దనగర్భమునన్
డెల్లముగఁ దాల్చెఁ జూపఱ, కెల్లను విస్మయముదంబు ♦ లినుమడి గాఁగన్. 112

ఉ. చంద్రకళోపమాన యగు♦సర్వజగజ్జనయిత్రి మేనకా
చంద్రముఖీసుగర్భ మను♦చారుపయోజలధిన్ మనోజ్ఞతా
సాంద్రరుచిచ్ఛటామహిమఁ ♦ జాలఁ దనర్పఁ గ్రమక్రమప్రవృ
ద్ధిం ద్రిజగత్ప్రకృష్ట మగు♦తేజము నయ్యమమేనఁ గన్పడెన్. 113

గీ. సకలసాగరభూధర♦సరిదరణ్య,సహితభూమి ధరించుతు♦షారశైల
పతి జగన్మాతఁ దనదుగ♦ర్భమునఁ దాల్చు,జాయ నప్పుడు దాల్ప న♦శక్తుఁ డయ్యె.

సీ. ఏకకాలోదితా♦నేకమార్తాండతే,జోరాశిసదృశతే♦జోనికాయ
మాశైలనాథకు♦లాంగనామణిమేనఁ, బూఁటపూఁటకు వృద్ధిఁ ♦ బొందుచుండె
నట్టితేజము చూచి ♦ యయ్యవనీధర,సార్వభౌముఁడు మహా♦సమ్మదమునఁ
దనదుమనంబులో ♦ మును నిజతపమున, కాత్మలో మెచ్చి య♦య్యఖిలజనని

గీ. తనకు దయచేసినవరప్ర♦దాన మపుడు, సఫల మయ్యె నటంచు ని♦శ్చయము చేసె
నపుడు దౌహృదలక్షణం ♦ బవ్వధూటి, దాల్చె జగములు సంప్రమో♦దంబు నొంద.

క. కమలదళిచారునేత్రకు, గమనము కడు మంద మయ్యె ♦ గర్భభరమునన్
రమణీకపోలయుగళము, విమలార్ధేందుయుగళంబు♦విధమున నొప్పెన్. 116

క. ఆనీలచూచుకం బై, యానారీమణికుచద్వ♦యము శోభిల్లెన్
మానితమత్తభ్రమరా,లీనపయోజాతకోశ♦లీలాస్పద మై. 117

క. నలు వగుగర్భవివృద్ధిన్, వళు లేవియుఁ గానఁబడక ♦ వరనీలిమచే
నెలదేఁటిచాలుపోలికఁ, బొలుపుగ నూగారు మెఱసె ♦ భూధరసతికిన్. 118

గీ. అల్లనల్లన నడతెంచు♦నప్పు డైన, నవనిధరపత్నికి నిడూర్పు ♦ లతిశయించె
నలఁత మిక్కిలి యాటచే ♦ సొలపుఁజూపు, నిద్దపుఁగనీనికల కొక♦నీటు దెలుప. 119

గీ. గర్భభరఖేదసంజాత♦ఘర్మబిందు,జాల మతిమనోహర మయి ♦ శైలరాజు
నువిదతనువల్లిఁ గనుపట్టె ♦ ధవళకోర,కప్రతతిభాతిఁ దద్గుణ♦గణమురీతి. 120

గీ. ప్రియవచఃకలనాపటు♦ప్రియసఖీమ,ణీశతము గొల్వఁ గ్రమముచే ♦ నీరజాక్షి
యొక్కచెలిహస్త మెప్పుడు ♦ నూఁతకొనుచు, నడుచుఁగాని తనంతన ♦ నడువ లేదు.

చ. ఇటువలె గర్భచిహ్నముల ♦ నింపులు గుల్కుచు నుండుమేనకన్
దటిదుపమానగాత్రి నిజ♦దారఁ గనుంగొని గోత్రభర్త మి
క్కుటపుముదంబునన్ దనదు♦గోత్రము లోకములోన శ్రైష్ఠ్యవి
స్ఫుటిత వహించె నంచుఁ గడుఁ ♦ బొంగి చెలంగుచునుండు నత్తఱిన్. 122

సీ. అంచితోచ్చగ్రహ♦పంచకం బగువేళ, విబుధవాద్యంబులు ♦ వినుచువేళ
దిశలు నిర్మలదీప్తిఁ ♦ దేజరిల్లెడువేళ, సురతతుల్ విరివాన ♦ గురియువేళ
గంభీరకలఘోష♦ణాంభోద మగువేళ, ననుకూలభగ్రహం ♦ బైనవేళ
సురభిశీతలమంద♦హరిణాశ్వ మగువేళ, స్వచ్ఛాంబునిమ్నగం ♦ బైనవేళ

గీ. నమరకాంతామణులు వేడ్క ♦ నాడువేళ, నఖిలజీవులు నానంద ♦ మందువేళఁ
గనియె భగవతి నఖిలలో♦కైకజనని, రమ్యగుణభూష యాశైల♦రాజయోష. 123

గీ. దివిని శశిరేఖపోలిక ♦ భువిని మెఱసి, ప్రాకటం బగురత్నశ♦లాకరేఖ
లలితహృద్యంబు గాఁగ న♦లంకరించెఁ, గన్నతల్లి సజ్జగములఁ ♦ గన్నతల్లి. 124

గీ. అంకరహితరాకాహరి♦ణాంకవదన, లద్రిరాజవధూమణు ♦ లనిశమును స
ఖీజనముఁ దాము లాలింపఁ ♦ దేజరిలె సు,రూప యాబాల మాణిక్య♦దీపరేఖ. 125

క. బహుమహిళాజనసంకుల,మహీధరాధీశసదన♦మధ్యంబున నా
మహనీయ యొప్పెఁ దారా,సహితవ్యోమమున మెఱయు♦శశిరేఖక్రియన్. 126

గీ. సోగ తొలకన్నుఁదమ్ముల♦సోయగంబు
నర్ధచంద్రుని నిరసించు♦నలికశోభ
లలితనీలాలకంబులు ♦ గలుగుకూఁతుఁ
మోముఁ గని మోదమునఁ దేలెఁ ♦ బ్రేమఁ దండ్రి. 127

గీ. సుగుణమణినిధి నప్పట్టిఁ ♦ జూచి తొడల,మీఁద నిడి యుపలాలించి ♦ మోదవార్ధిఁ
దేలుచును దృప్తినొందఁగాఁ ♦ జాలఁడయ్యె, ననయకీర్తి మహీధర♦చక్రవర్తి. 128

చ. సుగుణి హిరణ్యనాభునకు ♦ సోదరి యై హిమవంతునింట దే
వగణనిషేవ్య యాశిశువు ♦ వర్ధిలుచున్ దమతల్లిమేనకన్
జగములలో నమేయ మగు♦శ్లాఘ్యతఁ నొందఁగఁ జేసెఁ దచ్ఛపో
యుగళరసాయనంబు లయి ♦ యొప్పు సుధాభకలానులాపముల్. 129

[illegible]. అరుణవేణీపరిష్కృతా♦హాటకమసృణకలితమేచకభాసురాం♦గంబులతోడఁ
జూడఁ జెలువొందె సంచార♦సుభగ మైన,నీలపాంచాలికయుఁబోలె ♦ శైలతనయ.

క. అభిజనానామధేయం, బాభూధరపతి యొనర్చె ♦ నటఁ బార్వతి యం
చాభద్రకీర్తికిఁ దదా,ఖ్యాభవ్యస్మృతియ చాలు ♦ నఘములఁ బాపన్. 131

వ. ఇవ్విధంబున నజ్జగన్మాత తల్లిదండ్రులకు నత్యంతప్రేమ కాస్పదం బై శైశవక్రీడా 132
పరాయణ యగుచు.

సీ. రాకేందుకలితోడ ♦ వరకందుకక్రీడ, సలుపు నొక్కొకవేళ ♦ నెలమి మిగులఁ
గృత్రిమపుత్రిక♦కేళీవినోదముల్, వెలయించు నొక్కొక♦వేళయందు
నాళికలతోఁ బాంసు♦లీల నొక్కొకవేళఁ, దలపెట్టుఁ జూపఱు ♦ లలరుచుండ
ప్రాణకాంక్షితపద♦న్యాసముల్ సలుపు నొ,క్కొకవేళ భువి క్రొత్త♦యొప్పు దాల్పఁ

గీ. నద్రి యగుహిమవంతునె♦త్తములయందు
నురువదీవాలుకలయందు ♦ సొంపు మీఱఁ
దనదుసంచారమునఁ బవి♦త్రత్వ మొంది
ధరణి ధన్యతఁ గాంచ భూ♦ధరతనూజ. 133

చ. క్రమమున నగ్గిరిప్రవర♦కన్యక శైశవ ముజ్జగించి పెం
పమరఁ బ్రసూనబాణునియ♦హంకృతి కెల్లను మూలకంద మై
కొమరు వహించుయౌవనము ♦ గొబ్బునఁ దాల్చె మణీశలాక చా
రుమహితశాణసంస్కృతిని♦రూఢి వహించినమాడ్కి నత్తఱిన్. 134

సీ. ప్రత్యగ్రపల్లవ♦ప్రతిమల్లమార్దవ,హారితరస్వభా♦వారుణములు
సౌభాగ్యరేఖాళి♦శోభాసుసంధ్యాక్త,యోగ్యలసత్సుగు♦ణోల్బణములు
చరణవిన్యాసావ♦సరధరాసుందరీ,కుంకుమోదకసేచ♦నాంకదములు
చంద్రికాపరిశుద్ధ♦చారునఖావళీ,రమణీయకాంతివి♦రాజితములు

గీ. సన్నిమంజీరహ్వానస్మ♦రాశకములు, యోగిహృత్పంకజధ్యాన♦యుక్తతమము
లంబురుహదర్పసుషమావి♦డంబనములు, శైలరాట్కన్యపాదాంబు♦జంబు లమరె.

క. మదనువిజయకాహళులో, మదిఁ దలఁపఁగ నతఁడు దాల్చు♦మార్గణనిధులో
సుదతీమణిజంఘికలో, యిది దెలియఁగరాఁ దటంచు ♦ నెంతురు జనముల్. 136

సీ. స్వర్ణరంభాకాండ♦సౌభాగ్యనిరసన,విద్యావిచక్షణ♦హృద్య మగుచు
రాజితకందర్ప♦రాజవాహ్యమనోజ్ఞ,బంధురశుండావి♦భాసి యగుచు
దుర్గ్రహోద్రగమ్య♦త్ర్యంజయహృదయదం,తావళాలానప్ర♦ధాన మగుచుఁ
త్రిజగతీవిజయధు♦రీణప్రసూనాస్త్ర,ఘనజయస్తంభసం♦కాశ మగుచు

గీ. గాఢసౌందర్యనిర్జిత♦కరభ మగుచుఁ, గాంతిఁ జెన్నొందె నత్యంత♦కాంత మగుచు
భూమిధరమండలీసార్వ♦భౌమతనయ,యూరుయుగళంబు శ్లాఘన♦యోగ్య మగుచు.

సీ. రత్నాఢ్యకాంచికా♦రమణీయ మగుచు దె,త్నాకరకాంచిక ♦ ననుకరించి
ప్రేమతోఁ దండ్రి య♦ర్పించెనో స్వనితంబ,గౌరవం బన మహో♦దార మగుచు
నమితశృంగారమై ♦ యభ్రమాతంగోత్త,మాంగాభిరూప్యావ♦హాసి యగుచు
హరినీలమణిమయ♦ధరణీధరోన్నత,కటకసౌందర్యసం♦కలిత మగుచు

గీ. సైకతంబులతోడఁ ద♦చ్ఛవలు సలిపి, మారురథచక్రములతోడ ♦ మాఱుకొనుచు
డంబు గనిపించె శోభాక♦దంబ మనఁగ, భాతి జగదంబికనితంబ♦భార మపుడు. 138

క. చారువళీత్రయి నీలన,రోరుహవీథీమనోజ్ఞ♦రోమావళి గం
భీరమనోహరనాభిక, యారమణీమధ్యలతిక ♦ యపు డొప్పెసఁగెన్. 139

గీ. శంకరునియణిమాభిదై ♦శ్వర్య మవ్వ, డద్రిజామధ్యరూప మై ♦ యమరె నేమొ
కాక పరమాణురూప మై ♦ కానఁబడని,యోగులమనంబు తద్రూప ♦మొందె నేమొ.

సీ. యౌవనభద్రదం♦తావళకుంభముల్, లలితదోర్యూమలకో♦ల్లంకషములు
సమతాంచితక్రమ♦క్రమవర్ధనాక్రాంత,మహితతతాన్యోన్య♦మండలములు
కామరాజాభిషే♦కప్రయోజనసోద,కస్ఫురత్సౌవర్ణ♦కలశరుచులు
గ్రావసుతాదేహ♦కాంతిసరఃక్రీడ,నోద్యోగకోకద్వ♦యోజ్జ్వలంబు

గీ. లంధకారాతిహృత్ప్రయ♦స్సింధుమథన,మంథరనసుంధరాధర♦బంధురములు
విమలహారలతాపరి♦వేష్టితంబు, లద్రిరాట్కన్యవక్షోరు♦హములు దనరె. 141

సీ. తనయందుఁ గలదృఢ♦త్వము హిమవంతుండు, రహి నిచ్చె ననఁగఁ గ♦ర్కశతఁ దనరి
నిక్కుమొనలచే ♦ మక్కువఁ జుబుకంబు, ముద్దాడునట్లు గో♦మునఁ దనర్చి
సౌభాగ్య మనుమణి♦సదనంబుపై రత్న,కలశంబులో యనఁ ♦ గాంతి నలరి
గగనంబు పుష్కరా♦ఖ్యంబౌటఁ బరిణాహ,బహుళత ద్రావె నాఁ ♦ బరిఢవిల్లి

గీ. స్వచ్ఛగుచ్ఛంబులను బయో♦జాతకోశ,ములను బంగరుబొంగరం♦బులను లికుచ
ఫలములను మీఱి భూధర♦పతితనూజ,చారువక్షోజయుగ్మం బు♦దార మయ్యె. 142

క. శృంగారవతిభుజంబు ల,సంగమహారాజడోలి♦కాబద్ధము లౌ
బంగరుచేరులరీతిఁ జె,లంగె శిరీషసుమకోమ♦లత్వము నగుచున్. 143

సీ. పాత్రితర్వికస్వర♦పాథోరుహస్పర్ధి,సుస్నిగ్ధకాంతిసం♦శోభమాన
మారుణ్యసలిలోరు♦ధారానిషిక్తాఖి,లాశావధూటీక♦దంబకంబు

శ్రీకంఠదేవపా♦ణీకరణాతిభా,గ్యప్రథమోచిత♦హారితరము
రత్నాంగుళీయక♦రమణీయకాంతివ,ర్ధిష్ణుస్వభావర♦క్తిమయుతంబు

గీ. నుత్యసౌభాగ్యరేఖామ♦నోహరంబు, తారకోపమనఖకాంతి♦వారకంబు
చాలఁ జెన్ను వహించె నా♦శైలతనయ,లలితకోమలకరకమ♦లద్వయంబు. 144

క. కంబువరంబు మిగిలి క్రము,కంబు న్నిరసించి శైల♦కన్యామణికం
ఠంబు కడు మెఱసె భాగ్యా,ఘుంబుల్ బ్రకటించురేఖ♦కాత్రయి దోఁపన్. 145

క. వదనము శరదిందువిభా,సదనము తారావిలాస♦సౌష్ఠవవిలస
ద్రదనము కృతముకురాంబుజ,కదన మనఁగ సార్వభౌమ♦కన్యకు నమరెన్. 146

గీ. వామలోచననాసిక ♦ వజ్రపుష్ప,హేమపుష్పకోరకముల ♦ నీసడించు
బాలికకపోలఫలకముల్ ♦ చాలఁ గాంతి,మెఱసి మణిదర్పణములకు ♦నోఱపుఁ గఱపు.

క. కుందంబులె దంతములు మ,రందమ్ములె నసవాక్య♦రచనలు ప్రావృ
ట్కందంబులె యలకము లర,విందంబులె కన్ను లద్రి♦విభునందనకున్. 148

క. అబ్దనిభంబు కుచద్వయ, మబ్దనిభము ముఖము కచము ♦ లబ్దనిభము ల
య్యబ్దాధిపతనయకు శర,దబ్దనిభము మందహాస ♦ మలవియె పొగడన్. 149

చ. అరు దగునూత్నపల్లవము♦నందలి శ్వేతసుమంబుమాడ్కి భా
సురవరవిద్రుమస్థ మయి ♦ శోభిలుముత్తెమురీతి నెంతయున్
సరసత నొప్పె శైలజకుఁ ♦ జారుతరారుణిమాధరోష్ఠమున
స్థిర మగునట్టిలేనగవుఁ♦దేట జనంబులచూడ్కి కింపుగన్. 150

గీ. మగువఫాలంబు కార్తిక♦మాసపూర్వ,పక్షమధ్యతిథిక్షపా♦ధ్యక్షసదృశ
మింతిబెళుకుఁజూపులు హరి♦ణేక్షుమీన,ఖంజనేందీవరాళిరే♦ఖాజయములు. 151

సీ. తాపింఛకిసలయ♦స్తబకశోభ హసించి, బర్హిబర్హప్రభఁ ♦ బరిభవించి
యిందీవరచ్ఛవి ♦ నెకసక్కె మొనరించి, సజలనీలాంబుద♦చ్ఛాయ మించి
చంచరీకవిభాప్ర♦పంచంబు నిరసించి, హరినీలమణికాంతి ♦ నవహసించి
శైవాలదీప్తితో ♦ సరసము ల్పచరించి, చామరరోచుల ♦ సంతరించి

గీ. సహజసౌరభ్యమై ఘన♦శ్యామ మగుచు, బర్బరస్నిగ్ధకుటిలతా♦భాసి యగుచుఁ
జాల వర్ధిల్లి పర్వత♦చక్రవర్తి,వరసుతామణిధమ్మిల్ల♦భరము దనరె. 152

గీ. ఈవిధమ్మున నారూఢ♦యౌవనత్వ,గౌరవము నొంది గిరిరాజ♦కన్య తండ్రి
మందిరంబున వర్తిల్లె ♦ మాన్యమహిమ, సకలసద్గుణపూర్ణ యై ♦ చాలఁ దనరి. 153

క. అని చెప్పిన విని యశ్వా,ననుఁ గనుఁగొని హర్షమానన♦మునఁ దలిర్పన్
వినయమునఁ గుంభసంభవుఁ, డనూన మగుభక్తి నిట్టు ♦ లను నాతనితోన్. 154

గీ. దేవసంస్తుత శ్రీహయ♦గ్రీవరూప, సర్వవిద్యానిదాన వి♦శ్వప్రధాన
మానితమహోదయాగుణాం♦భోనిధాన, దేవ యొక్కటి యడిగెదఁ ♦ దెల్ప వలయు.

క. దక్షకృతనికారంబున, దాక్షాయణి మేనుఁ దొఱఁగఁ ♦ దద్వృత్తము ఫా
లాక్షుఁడు సమస్తలోకా, ధ్యక్షుఁడు విని యేమి చేసె ♦ దైవతపూజ్యా. 156

క. నయహీనుఁ డైనదక్షుని,పయిఁ గోపము చేసెనో స్వ♦భావమున దయా
మయుఁ డౌట నూరకుండెనొ, హయవదన యెఱుంగఁ జెప్పు ♦ మయ్యా వినియెదన్.

వ. అనిన విని యద్దేవుం డమ్మునిపతి కి ట్లనియె. 158

సీ. అఖిలజగన్మాత ♦ యభవుపట్టపుదేవి, యగుసతీదేవి దే♦హంబు వదలి
యెపుడు తుషారమ♦హీధరేంద్రునిఁ జేరె, నపుడ యమ్మహితాత్మ♦యనుఁగుఁజెలులు
మహనీయు లైనస♦మస్తగణేశ్వరుల్, దక్షునియజ్ఞస♦ద్మముననుండి
కడు విషణ్ణాత్ము లై ♦ కైలాసగిరిఁ జేరి, రంత శూన్యవిమాన ♦ మాశ్రయించి

గీ. తత్సఖీమణు లాగణా♦ధ్యక్షులును మ,హేశుతో నిట్టిదుర్వార్త ♦ యెట్లు నుడువు
వార మని పరితాపిత♦స్వాంతు లగుచు, నడుగడుగునకు భీతభీ♦తాత్ము లై రి. 159

క. కొంతదడ విట్లు భీత,స్వాంత లగుచు సఖులు బాష్ప♦వర్షంబులు నే
త్రాంతములఁ దొరఁగఁగా నం,తంతఁ గదిసి రంతకాంత♦కాంతికభూమిన్. 160

వ. ఇవ్విధంబున నప్పరమేశ్వరుసాన్నిధ్యంబునకుఁ జని యక్కాంతామణులు గద్గదకంఠం
బులతో దేవీవృత్తాంతంబు సమస్తంబును భయకాతరస్వాంతంబులతో విన్నవించిన.

గీ. ఆమహేశుండు యోగసం♦త్యక్తదేహ
యైనదక్షతనూజవృ♦త్తాంత మెల్లఁ
దెలిసి క్షణమాత్ర మత్యంత♦ధీరచిత్తుఁ
డయ్యు దుఃఖభరాక్రాంతుఁ ♦ డయ్యె నపుడు. 162

వ. ఇత్తెఱంగున నమ్మహాదేవుం డించుకసేపు దుఃఖంబు నొంది సర్వజ్ఞుండు గావున నంతట
దాని నుజ్జగించె నయ్యవసరంబున. 163

క. త్రైలోక్యఘస్మరుం డగు,ఫాలాక్షునిహృదయమున న♦పారక్రోధ
జ్వాల యుదయించె రిపుని,ర్మూలనవిద్యాప్రవీణ♦రూక్షతరం బై. 164

క. దుర్వాక్యోద్ధతదక్షా,ఖర్వమహాగర్వగాఢ♦గహనదహనతా
ధూర్వహశీలం బై నిగ,మార్వక్రోధాగ్ని వెలిఁగె ♦ నతిభయదం బై. 165

క. ఆలో దక్షాన్వయవన,మూలచ్ఛేదనకుఠార♦ముఖ్యం బగుచున్
ఫాలాక్షుఫాలమున నా,భీలంబున భ్రుకుటి మెఱసె ♦ భీషణతర మై. 166

క. నవపల్లవపాటల మగు, భవప్రియధరకిసలయంబు ♦ పౌనఃపున్య
ప్రవితతనిశ్వాసచటుల,పవనహతం బగుచు నపుడు ♦ పలుమఱు నదరెన్. 167

క. ఫాలనయనాంగకంబులు, జ్వాలారూపంబు లయ్యె ♦ సంస్వేదపృష
జ్జాలంబు లగ్నికణముల,లీలన్ వెలుఁగొందెఁ బ్రజ్వ♦లితతేజమునన్. 168

క. అలఘుతరక్రోధప్ర,జ్వలితాంధకరిపుశిరస్థ♦జాహ్నవి యపు డి
ట్టుల మసలుబుద్బుదములతోఁ, గళపెళ యని యుడికె భయద♦గాఢస్ఫూర్తిన్. 169

గీ. దేవదేవవిభూషణా♦శీవిషములు, తన్మనఃప్రోద్ధకోపాగ్ని♦దాహ మొంది
తనువు లద్దేవుఁ బెనఁగొనఁ ♦ దలలు వాల్చెఁ, దాంతశాకినీకాండవి♦ధంబు దోఁప. 170

ఆ. నిత్యశోణకాంతి ♦ నెగడినమూఁడవ,కంటితోడిమైత్రిఁ ♦ గాంచె ననఁగ
నిఖిలలోకనాథ♦నేత్రయుగ్మము గాఢ,రోహితప్రభాని♦రూఢ మయ్యె. 171

క. ఆహరుపటుకోపనము,త్సాహముఁ గని ప్రమథవరులు ♦ సాధ్వసమతులై
గేహాంతరముల డాఁగిరి, సాహసమున ప్రోల నిలువ ♦ శంకించి మదిన్. 172

మ. ప్రమథాధీశ్వరు లిట్లు రుద్రునియపా♦రక్రోధసంరంభసం
భ్రమ మీక్షించి పలాయమాను లయి వి♦భ్రాంతిన్ వెసన్ డాఁగ ప్రో
ల మహాత్ముం డగునందికేశ్వరుఁడు ని♦ల్వన్ గొంత శంకించి ని
ల్చె మహాదేవుపిఱిందిదిక్కున ధృతి♦స్తేమాభిరామాకృతిన్. 173

సీ. ఉగ్రుఁ డీశరణి న♦త్యుగ్రకోపాగ్ని మూ,ర్తీభవించినరీతిఁ ♦ దేజరిల్ల
దర్దిరఁ దిరిగె ధా♦త్రీచక్ర మతిగాఢ,ఘూర్ణన మొందె స♦ప్తార్ణవములు
తామరసాప్తుఁ డం♦తర్ధానదశ నొందె, నత్యంతభయవిహ్వ♦లాత్ముఁ డగుచు
సాధ్వసంబునఁ గుల♦శైలంబు లూటాడె, రాలెఁ దారకము ల♦భ్రంబువలన

గీ. నేమి చెప్పఁ జరాచర♦స్తోమ మెల్లఁ, దత్క్షణంబున నధికసం♦త్రస్త మయ్యె
నపు డకాండమహాప్రళ♦యావసరము,పగిదిఁ దోఁచె లోకుల కతి♦భయదముగను.

వ. అంత మహాదేవుం డగుసద్దేవుండు నిజలలాటతటసముద్భూతం బైనయొక్క స్వేదజల బిందువు తననఖాగ్రంబున మీటిన నది భూమిపయిం బడుటయు నబ్బిందువువలన.

సీ. బ్రహ్మాండభాండక♦ర్పరభిత్తనూచ్ఛ్రాయుఁ, డురువహ్నికీలాని♦భోర్ధ్వకేశుఁ
డఖిలజగద్ఘస్మ♦రాభీలవిగ్రహుం, డతిభీషణాయుధా♦తతభుజుండు
బద్ధభయంకర♦భ్రుకుటిభీకరవక్త్రుఁ, డట్టహాసదళద్ది♦శాంతరితుఁ
డత్యయసమయమహా♦తాశదీప్తాంగుండు, ప్రళయకాలాంతక♦ప్రతిభటుండు

గీ. భద్రచరితుండు శ్రీవీర♦భద్రనాముఁ, డాశ్రితావనుఁ డతులబా♦హాబలుండు
సకలగణయూథనాథుండు ♦ సర్వశత్రు,భీముఁ డుదయించె మాఱట♦భీముఁ డనఁగ.

వ. ఇవ్విధంబున నుదయించి యవ్వీరభద్రుం డమ్మహారుద్రునకు సాష్టాంగదండప్రణామం బాచరించి భక్తిపూర్వంబుగా నిట్లని విన్నవించె. 177

గీ. దేవదేవ జగన్నాథ ♦ దేవనికర, సేవ్యపదపద్మ నాచేతఁ ♦ జేయఁ దగిన
కజ్జ మానతి యిమ్ము మీ♦కరుణ నెంత,దుష్కరం బైన సాధింతు ♦ దుష్టదమన.

క. దేవరకు నే విధేయుఁడ, భావింపఁగ సకలకార్య♦పద్ధతుల మహా
దేవ నియోజ్యుఁడ నే నటు, గావున యుష్మత్ప్రసాద♦గౌరవమహిమన్. 179

సీ. ఉర్వీతలంబుధ♦రోత్తరంబుగ బెట్టు, వైతునో లోష్టంబు♦వడువు ద్రోప
క్ష్మాచక్ర మంతయు ♦ గడగడ వడఁకంగఁ, జేయుదునో యన♦పాయపటిమ
సప్తవారాన్నిధి♦జలమెల్ల క్షణమాత్రఁ, ద్రావుదునో యద్భు♦తంబు గాఁగ
భువనత్రయముః గూడఁ ♦ బొదివి గుటుక్కున, మ్రింగుదునో ఫల♦రీతి గాఁగ

గీ. సర్వజగముల నెంతయు♦సాధ్యమైన, దేవ మీయాజ్ఞ నేను సా♦ధించువాఁడ
నీదుభ్రూవల్లి యించుక♦నెఱిఁ గదల్పఁ,గల దె నా కసాధ్యంబు లో♦కత్రయమున.

వ. అని యివ్విధంబున వీరభద్రుండు విన్నవించిన రౌద్రోద్రేకదుర్నిరీక్ష్యుం డగు రుద్రుం డతనిం గనుంగొని నీవు శీఘ్రంబ చని మద్ద్రోహియు మదీయదూషణతత్పరుండును బాపాత్ముండును దురభిమానియు వృథాగర్వుండును వృథామదుండును నైనదక్షునియజ్ఞంబు నిర్దయుండవై మర్దింపు మెల్లవిధంబులఁ దత్క్రతుధ్వంసనంబు నీకుఁ గర్తవ్యం బని యాజ్ఞాపించినఁ గ్రోధజ్వలితుం డగుచంద్రమౌళియానతిఁ గైకొని యమ్మహావీరుండు మహావేగంబునఁ గైలాసంబుననుండి దక్షయజ్ఞవాటంబునకుం జనునప్పు డతనిరోమకూపంబులవలనను బ్రదీప్తం బగు తదీయఫాలలోచనంబువలనను దత్కర్ణనాసికావివరంబులవలనను దంష్ట్రాభయంకరం బైనతన్మహాస్యంబువలనను సహస్రాంశుసహస్రప్రభాసంపన్నులు సహస్రయుగభర్తలు సహస్రాస్త్రాయుధనిస్వను లమోఘకఘస్మరులు నగుసహస్రలక్షసంఖ్యాకులు మహాప్రమథేశ్వరులు వెడలి యంబరం బెల్ల నెక్కుయెత్తునఁ గబళించువిధంబున భూమిచక్రంబుఁ బట్టి పిడిచి పిప్పిచేయుకరణి సకలభూతంబుల గ్రసించువారలుం బోలె నరిభయంకరు లగుచు నవ్వీరభద్రునిఁ గొల్చి చని రప్పు డగ్గణేంద్రసేన యమ్మహాత్మునియాజ్ఞ వహించి యత్యంతదుర్బుద్ధి యగుదక్షప్రజాపతియజ్ఞవాటంబు నావరించె నివ్విధంబునఁ బ్రమథేశ్వరావృతం బగునయ్యజ్ఞవాటంబు మహాప్రళయప్రజ్వలజ్జ్వలనజ్వాలాజాలసమావృతం బైనసముద్రోదకంబుకరణి సంక్షోభంబు నొందె నిట్లు మహాసంరంభంబున మహాబలుం డైనవీరభద్రుండు సర్వసుపర్వనికాయంబులపైఁ బఱతెంచిన. 181

క. తెఱనోటిమేకముఁ గని వెసఁ, బఱచు వెఱమేకంబులట్లు ♦ పైకి నుఱుకుచు
చ్చుఱకంటిదారకొడుకుఁ గని, పఱచిరి తెఱగంటు లపుడు ♦ బలువెఱతోడన్.

వ. ఇట్లు హాహాకారంబులతోడఁ గొందఱు పలాయితులైరి కొందఱు మూర్ఛ నొందిరి కొంద ఱాక్రందించిరి కొంద ఱీవ లావల నురిగిరి త్యక్తధ్రువోపభృజ్జుహూప్రముఖయజ్ఞపాత్రసమాజకులైనయాజకులు కాందిశీకులై పాఱిరి వారలందఱతిఖేదంబున నయ్యో దుష్టుం డగుదక్షునిదౌరాత్మ్యంబునఁ గులనాశనంబు సంప్రాప్తం బయ్యెం దత్సాంగత్యంబున నందఱమును జెడియెద మని యొక్కపెట్ట ఘోషించిరి తత్సమయంబున మహేంద్రుండు మయూరవేషంబున నత్యంతభీతుం డగుచుఁ బలాయితుం డయ్యె నంత నయ్యజ్ఞంబు సంత్రాసంబున మృగరూపధారియై పఱచిన దానిం జూచి యవ్వీరాగ్రగణ్యుండు సత్వరంబుగా వెనుతవిలి తూణీరముఖంబువలన నొక్క నిశాతశిలీముఖంబు దిగిచి శరాసనగుణంబున సంధించి హరిణరూపం బైనయాసప్తతంతువుశిరంబుఁ దెగ నేసిన పురోడాశసువాసితం బైనశోణితంబు వెల్లిగాఁ దొరుఁగ నది మహీతలపతితం బయ్యె దానం జేసి యవ్వీరభద్రునకుఁ గ్రతుధ్వంసి యనునామంబు ప్రఖ్యాతం బయ్యె నిట్లు యజ్ఞంబు నిగ్రహించి యవ్వీరుండు యజ్ఞవాటాంతరస్థితులైనయమరుల మర్దించుకొఱకు మగిడి దారుణక్రోధహుతాశనుం డై చూపులచేతనే విశ్వంబు దహించువాఁడపోలె వచ్చుచు నెదుర ననూరుసారథియుతంబును నేకచక్రంబును సప్తతురంగవాహితంబును నగుసుందరస్యందనంబు నధిరోహించి నిల్చినసహస్రకిరణు నాదిత్యుం గని యత్యుగ్రవిక్రమంబునఁ దద్రథంబుమీఁదికి లంఘించి కేశాకర్షణంబున నతని భూమిపైఁ బడఁ దిగిచి కపోలతాడనంబున భిన్నదంతుఁ జేసిన దానం జేసి పూషుండు నాఁటంగోలె పిష్టాశి యయ్యె నయ్యవసరంబున రదనోత్పాటనసంభూతశోణితసంసిక్తసకలాంగుం డై యవ్వివస్వంతుం డుదయశైలశిలాసంఘర్షితుండపోలెఁ జూపట్టె నంత భిన్నదంతుం డైనభాస్వంతు విడిచి యవ్విక్రమవంతుం డతివేగంబ నిశాధీశుపైఁ గవిసి యతనిం బట్టికొని ధరణీతలంబునం బడవైచి మదోద్దండశుండాలంబు బాలహరిణంబునుం బోలె నతికఠినం బైన నిజపాదంబునఁ బుష్పసుకుమారం బైనతచ్ఛరీరం బేకకళావశేషం బై యత్యంతకృశం బగునట్లుగాఁ జదిపిన నయ్యమృతకిరణుం డత్యంతపీడితుం డయ్యును ధైర్యం బవలంబించి యమ్మహాత్ముని ననేకవిధంబుల స్తుతియించిన. 183

మ. విజితామిత్రుఁడు వీరభద్రుఁడు జగ♦ద్విఖ్యాతచారిత్రుఁ డా
రజనీనాథకృతస్తవంబున సమ♦గ్రప్రీతియుక్తాత్ముఁ డై

నిజశీర్షాభరణంబు గాఁగ నతని ♦ న్నిల్పెన్ దదాద్యంబుగాఁ
ద్రిజగచ్ఛ్లాఘ్యత నొందె నాఘనుఁడు పే♦ర్మిన్ జంద్రచూడాఖ్యచేన్. 184

వ. మఱియును. 185

క. భీతిభ్రష్టవిపంచిక, యై తొలఁగువచోవధూటి ♦ నతఁడు గదిసి సం
ఛాతభ్రూణాగఁ జేసి భ,యాతురులై చూప ఱెల్ల ♦ హా హా యనఁగన్. 186

ఉ. అంతటఁ బావకుం డొడరి ♦ యామహనీయభుజాబలుండు దు
ర్దాంతుఁడు వీరభద్రుఁ డసి♦ధారఁ దదీయభుజాయుగంబు కా
లాంతకశౌర్యుఁ డై తునిమి ♦ యప్రతిమానతఁ దేజరిల్ల దై
త్యాంతకుఁ డుద్ధతిం గవిసె ♦ నాతనిపైఁ బటువిక్రమంబునన్. 187

వ. ఇట్లు గవిసి. 188

శా. హస్తప్రోద్యతచక్రుఁ డై విహగరా♦జారోహణప్రక్రియా
శస్తుం డై కదనోత్సవాంచితమహా♦సంరంభుఁ డై కప్పె నా
వాస్తోష్పత్యనుజన్ముఁ డాశుగమహా♦వర్షంబునన్ ఘోరశౌ
ర్యాస్తోకుం డగువీరభద్రుని భుజా♦హంకార ముప్పొంగఁగన్. 189

వ. ఇవ్విధంబున నిజపక్షవిక్షేపజాతమహావాతవ్రాతసముద్ధూతసప్తసాగరుం డగు గరుడునిపై నుండి యపారదివ్యాస్త్రధారలు పఱఁగించునారాయణునిం గనుంగొని వీరభద్రుండు రౌద్రక్రోధంబున మహాస్యందనస్థితుం డై యస్త్రజ్వాలాకలాపంబుల వేఁడి చూపుచు నతనిపయిం గవిసె నప్పు డయ్యిరువురకు మత్తదంతావళయుగళంబునకుఁ బోలెఁ బ్రకంపితత్రిభువనం బగునాయోధనంబు ప్రవర్తించె నివ్విధంబునఁ జక్రహస్తుండును గణేశ్వరుండును రోషాట్టహాససింహనాదంబుల దశదిశలు పూరించుచు నొకరి నొకరు చుట్టుకొనివచ్చుచు నన్యోన్యభర్త్సనంబులు సలుపుచు నొండొరులపై దివ్యాస్త్రంబులు ప్రయోగించుచు నితరేతరాస్త్రంబు లుపసంహరించుచుఁ దమతమహస్తలాఘవంబు ప్రకటించుచు నతిభీషణంబుగాఁ బరాక్రమించుచుండ వారలసంరంభం బాలోకించి విరించి వీరభద్రునకు జయంబు సిద్ధం బగుట నిశ్చయించి యతనిఁ జేరి వినయనిభృతుం డగుచు ని ట్లనియె. 190

క. దేవ భవద్రధికత్వము,హావైచక్షణ్యమునకు ♦ ననుకూలముగా
నావాజిచోదకత్వము, వావిరి మీ రవధరింప ♦ వలయుఁ గరుణతోన్. 191

క. మీతండ్రి మును పురత్రయ,దైత్యేయులమీఁద నలిగి ♦ దండెత్తుతఱిన్
సూతత్వంబు నడపుమ,చ్చాతుర్యంబునకుఁ జాల ♦ సంతోషించెన్. 192

వ. అని విన్నవించి తదనుజ్ఞాతుం డై వారిజాతోద్భవుండు తదీయసూతకృత్యంబు నందు నిలిచి యతనిక్రోధసంరంభంబు నిజసారథ్యప్రావీణ్యప్రకటనంబున మాటి మాటికిఁ దొలంగించుచున్న పద్మజునియందు సుప్రీతుండై వీరభద్రుండు సుదర్శనాయుధునితో నాయోధనంబు సలుపుసమయంబున. 193

పంచచామరము. పినాకశార్ఙ్గనిర్గతాతి♦భీషణాస్త్రముల్ నిశా
తనాతపాదికారణత్వ♦దారుణంబు లై ఘనా
ఘనోద్ఘవాశవిప్రకాండ♦కాండతుల్యతాప్తిఁ జే
తనాతిభీతిదంబు లయ్యెఁ ♦ దన్మహారణంబునన్. 194

క. అయ్యవసరమున నస్త్రా, జయ్యునిఁగాఁ దలఁచె నాత్మ ♦ సరసీజాక్షుం
డయ్యుగ్రతనూభవు న,క్షయ్యద్యుతి వీరభద్రు ♦ శౌర్యసముద్రున్. 195

వ. ఇట్లు దలంచి. 196

గీ. అఖిలలోకభీషణసహ♦స్రారచక్ర, మమ్మహావీరుపై వైచె ♦ నబ్జనేత్రుఁ
డంబరం బెల్ల నిజనిన♦దాభిపూర్ణ, మై మెఱయఁ జేసె నప్పు డ♦య్యాయుధంబు.

వ. ఇట్లు నారాయణప్రయుక్తంబై సుదర్శనంబు వచ్చుచున్నం గనుంగొని. 198

గీ. భద్రచారిత్రుఁ డవ్వీర♦భద్రుఁ డుగ్ర,మగునఁ దనదువక్త్రము విస్తృ♦తముగఁ జేసి
యఖిలజనములు నరుదంద ♦ నపుడు మ్రింగె, దానవారిప్రయుక్తసు♦దర్శనంబు.199

శా. చక్రం బిమ్మెయి వీరభద్రుఁడు మహోగ్రా♦త్మోగ్రహోగ్రుఁ డై మ్రింగినన్
జక్రీశానుశయానుఁ డప్డు రణముం ♦ జాలించి యామేటితో
నక్రౌర్యంబుగ ని ట్లనున్ భవదమే♦యత్రాణముల్ వేగముల్
విక్రాంతిన్ సహియింపఁగాఁ గలఁడె యీ♦విశ్వంబునం దెవ్వఁడున్. 200

సీ. రౌద్రవిక్రమ వీర♦భద్ర మహావీర, నీపరాక్రమమును ♦ నీబలంబు
నీమహావేగంబు ♦ నిఖిలలోకాతీత,ములు మహేశ్వరుఁ డైన♦భువనపతికి
ఘనశౌర్య నీవు సా, క్షాత్తనయుండవు, శతకోటివాఁడిమి ♦ సరకుగొనని
మత్సుదర్శనమస్త్ర♦మమును నీ విటు మ్రింగఁ, బాడ లేక పోయె న♦ద్భుతము గాఁగ

గీ. గావున దురాత్మ నీదక్షుఁ ♦ గావ నెవ్వఁ, డైనఁ గలఁడె త్రిలోకంబు ♦లందు వెదకఁ
దలఁచి చూచిన నేనె యీ♦దశను జెంద, నన్య్యు లెంతటివారు దే♦వార్చనీయ.201

ఆ. ఇట్టులగుటఁ జేసి యనఘ శివద్రోహి, బహులపాతకుని ♦ భవజ్జనిత్రి
శతయు ద్రోహి యైన♦యత్యంతపాపిష్ఠు, హీను దక్షు నిపుడ ♦ యే పడంపు. 202

క. కాలాంతరమున నేనును, జాలఁ దపము చేసి నీదు♦జనకుం డగునా
నీలగ్రీవుప్రసాదము, చేలలిఁ జక్రంబుఁ గాంతు ♦ సిద్ధము మగుడన్. 203

క. భద్రిస్వస్తులు గావుత, భద్రచరిత నీకు వీర♦భద్ర యిఁక మహా
రుద్రుఁ డెటు లాజ్ఞ యిచ్చెన్, సద్రితముగ నటుల పనులు ♦ సాధింపు మిటన్.

ఆ. ఎద్ది యానతిచ్చె ♦ నీశుఁ డయ్యాజ్ఞ నా,యదియ కాఁగ నీదు♦మదిఁ దలంపు
మాగమంబులందు ♦ నఖిలపురాణంబు,లందు మాకు భేద ♦ మనఘ లేదు. 205

ఆ. మాన్యచరిత నేను ♦ మహనీయశక్తిని, శక్తిమంతుఁ గాఁగ ♦ శంభు నెఱుఁగు
మహితశక్తియుక్తి♦మంతుల కించుక, యేని భేద మన్న ♦ నెవ్వఁ డోపు. 206

ఆ. దినకరునకు మఱి త♦దీయతేజమునకుఁ, గీలికిని బ్రదీప్త♦కీలమునకుఁ
జంద్రునకు మనోజ్ఞ♦చంద్రికకును భేద, మడరి యెవ్వఁ డైన ♦ నుడువఁ గలఁడె.

వ. మఱియు నొక్కటి చెప్పెద. 208

ఆ. భోగమున భవాని ♦ పురుషరూపంబున, నేను సంగరంబు♦లోన దుర్గ
యలుకఁ గాళికాఖ్య ♦ యై యమ్మహేశ్వరు,నాదిశక్తి నల్వు ♦ రనఁగ వెలయు.

వ. అట్లగుట మాకిరువురకు భేదంబుఁ దలంపవలదు శంభునాజ్ఞయ మదాజ్ఞ యగు టం జేసి నిర్దయంబుగా దక్షుని మర్దింపు మని పలికి ప్రభవిష్ణుం డగునవ్విష్ణుండు వీరభద్రునితోడిరణంబు చాలించుటయు నయ్యాదిమవీరుండు నిజసారథి యగు చతురాననునాత్మప్రసాదైకభాజనంబుగా సంభావించి యనంతరంబ దక్షప్రజాపతిమందిరంబుఁ బ్రవేశించి యట్టహాసంబు చేసిన నచ్చటివార లమ్మహాధ్వనికి మూర్ఛితులై రప్పు డత్యంతభయకాతరస్వాంతులై కొందఱుమునీశ్వరు లగ్గణేశ్వరుపాదంబులపయిం బడిరి కొందఱు తాపసులు ప్రతిపదం బతని స్తోత్రంబుచేసిరి వీరభద్రుండును నవ్విప్రులు దురాచారులైనను భీతివిహ్వలులు గావున వారల విడిచి యాగశాలాగతుండై నదక్షునిం జేరి కఠోరవాక్యంబులఁ బలుమాఱు భర్జింపుచుఁ గరాళకరవాలంబున నతనిశిరంబుఁ ద్రుంచె నప్పు డయ్యజమానునిపత్ని భయకంపితగాత్రియై కేశబంధంబు వీడఁ బాదంబులు దడఁబడ నాక్రందించుచుఁ జరణంబులమీఁద వ్రాలిన నద్దారుణశౌర్యుం డమ్మానినిం గడకుఁ ద్రోచి ఛిన్నంబై గళచ్ఛోణితం బగుదక్షుశిరంబు వితానాగ్నియందుఁ బడవైచి ‹ఇదందక్షశిరోభక్షయాగ్నే› యని భర్త్సనవాక్యంబులు పలికిన నవ్వేతానదహనుండు పూర్వంబున నవ్వీరవరుచేత విలూనభుజాద్వయుండు విష్ణువున శిరోరక్షణార్థియై స్వనిక్షిప్తం బైనదక్షమూర్ధంబు నాక్షణంబ భక్షించె నంత. 210

సీ. దక్షునిభార్య లం♦దఱు మహాసాధ్వస,విహ్వలస్వాంత లై ♦ వితతశోక
గద్గదవచన లై ♦ గళదశ్రునయన లై, విభ్రష్టభూషణ♦వితతు లగుచుఁ
బ్రస్ఖలత్కోమల♦పాదవిన్యాస లై, పద్మనిభోత్తాన♦పాణు లగుచు
ముక్తకైశిక లయి ♦ మోముల నతిదైన్య,రసము నిండారఁ దా ♦ రస్వరమునఁ
గీ. గరుణముగ నేడ్చి రొండొరుఁ ♦ గౌఁగిలించి, యెద్ది కర్తవ్య మని దైవ♦మింత చేసె
నని మహార్త లై క్షోభ♦ద్రాంతరంగ, మతిదయాభరితంబు గా ♦ ననఘచరిత.
వ. ఇవ్విధంబున దక్షప్రజాపతిభార్య లత్యంతశోకంబున నాక్రందనంబు సేయుచు నద్దే
వుని స్తోత్రపూర్వకంబుగా ని ట్లని ప్రార్థించిరి. 212
సీ. శ్రీవీరభద్ర మ♦హావీర కారుణ్య,వారిధి సాక్షాచ్ఛి♦వస్వరూప
సర్వజగచ్చక్ర♦సంహార భైరవ, యఖిలజగద్రక్ష♦ణాంతరంగ
శిష్టపాలనశీల ♦ దుష్టనిర్మూలన,ప్రావీణ్యసంపన్న ♦ దేవదేవ
దారుణశౌర్యని♦ధాన లోకేశ్వర, బ్రహ్మగోవిందశి♦వస్వరూప
గీ. నీదునేత్రాగ్ని దగ్ధ మౌ♦నిఖిలజగముఁ, దిరుగఁ గల్పించి పాలించు♦దేవనుతుఁడ
వట్టినీయందు మత్పతి ♦ యైనదక్షుఁ, డలిగి తత్ఫల మిప్పుడ ♦ యనుభవించె. 213
క. ఈతనిదుర్బుద్ధికిఁ దగ, నీ తెఱఁగున శిక్ష చేసి ♦ తింతియ ప్రజకున్
బ్రాఁతిగఁ దాఁ బతి నని గ,ర్వాతిశయము నొంది చెడియె ♦ నరయక యితఁడున్.
గీ. వీరపుంగవ కోపంబు ♦ విడువు మింక, నీదుకోపమహాగ్నికి ♦ బీదవిప్రుఁ
డకట యొకలక్ష్య మగునె క♦ల్పాంత వేళ, సకలలోకబృందంబు ల♦క్ష్యంబు గాక.
క. వైధవ్యము మము నిప్పుడు, బాధింపక యుండ నితఁడు ♦ బ్రతికెడు వెరవున్
సాధింపవలయు గణయూ,థాధిప నీ కిల నసాధ్య ♦ మరయం గలదే. 216
మ. అని పల్కౌటును దక్షభామినుల హీ♦నార్తిం దనున్ వేఁడ నా
ఘనుఁ డత్యంతకృపాతరంగితమనః♦కంజాతుఁ డై యాతనిన్
బునరుజ్జీవనధన్యుఁ జేయు వెరవున్ ♦ బుద్ధిన్ విచారించి చ
య్యన సంధించెను మేషమూర్ధము తదీ♦యం బై నకంఠంబునన్. 217
క. సంధానమాత్రమున నా,కంధినిషంగాత్మజన్మ♦కరుణాపేక్షా
బంధురత బ్రదికి లేచెను, బంధు లలర దక్షుఁ డపుడు ♦ భార్యలనడుమన్. 218
వ. ఇవ్విధంబున సముత్థితుం డై మేషమూర్ధుం డగుదక్షప్రజాపతి స్వదోషప్రకటన
పూర్వంబుగా వీరభద్రుని ట్లని స్తుతియించె. 219
చ. క్రతు వను పేర వర్తిలి స్వ♦ఘాతుక మౌ నభిచారకర్మ మీ
గతి నొనరింపఁగాఁ బడియె ♦ గర్వమునన్ శివు యజ్ఞపూగుష్కున్

గ్రతుఫలదాయి శంకరు ని♦రంజనునిన్ భగవంతు నీలలో
హితు మది నాదరింపక వి♦హీనమనీషుఁడ నైతి నక్కటా. 220

సీ. మ్రొక్కెద సద్భక్తి ♦ మోడ్పుఁ గేల్దోయితోఁ, బలుమారు శ్రీవీర♦భద్ర నీకు
నల్పమేధస్కు మ♦హాపరాధి ననాథుఁ, గృపతోడఁ జూచి ర♦క్షింపు నన్నుఁ
గినుకఁ బ్రజాపతి ♦ ననుగర్వమున మత్త,చిత్తుండ నగుచు స♦త్సేవ్యచరణు
లోకత్రయప్రభు ♦ వాకాలకంఠు మ,హాదేవు జామాత ♦ యనెడుబుద్ధిఁ

గీ. దుచ్ఛదుర్భాష లాడి త♦ద్ద్రోహి నైతి, దేహధారులలో శివ♦ద్రోహు లైన
యల్పులకు నెన్నఁటికి నర♦కాబ్ధి దాఁటు,వార్త యైన లే దెందు నీ♦వసుధలోన.

క. నాదోషంబునకుఁ దగిన,యీదండన మాచరించి ♦ తిది నాభాగ్య
ప్రాదుర్భావము గాదె స,దాదర యీమేలు పొగడ ♦ నలవియె నాకున్. 222

క. నీమహిమఁ దెలిసి యెన్నఁగఁ,దామరసోద్భవున కైనఁ ♦ దర మగునె యచిం
త్యామేయశక్తియుక్తుఁడ, వీమాబోఁటులు నుతింప ♦ నెంతటివారల్. 223

క. ఇది యాదిగ నీకరుణన్, విదితంబుగ బ్రదికినట్టి♦నేను భవచ్ఛ్రీ
పదసేవ యనిశమును జే,యుదు ననహంకారభక్తి♦యుక్తము గాఁగన్. 224

వ. అని దక్షప్రజాపతి స్తుతియించిన వీరభద్రుండు ప్రసన్నుం డై యతని నాదరించి తదీయాధ్వరంబునకు శిరంబు సంధించి యెప్పటియట్ల ప్రవర్తింప నానతిచ్చి పురవైరినివాసం బైనకైలాసంబునకు సపరివారుండై యరిగె నని చెప్పి హయగ్రీవుండు వెండియు ని ట్లనియె. 225

శా. అక్షుద్రప్రతిమప్రభావనిధి యా♦నావీరభద్రుండు త్ర
యక్షావాసముఁ జేరి తన్ను గణయూ♦థాగ్రేసరు ల్గొల్వ ఫా
లాక్షుం గాంచి తదంఘ్రియుగ్మమున ను♦ద్యద్భక్తితో మ్రొక్కి శా
ర్వాక్షీణం బగునైజవర్తనము సా♦ద్యంతంబుగాఁ దెల్పినన్. 226

వ. అమ్మహేశ్వరుం డమ్మహనీయునియతిలోకం బైనపరాక్రమంబునకు మెచ్చి యతని సంభావించి తక్కినగణాధ్యక్షుల సదయాలోకనంబున నాదరించి యిచ్ఛావర్తనంబున నుండె. 227

క. ఈవీరభద్రచరితము, పావనము శుభంబు దీనిఁ ♦ బఠియించిన దు
ర్భావు లగుపాపు లైన స్వ,భావంబున శివపదంబుఁ ♦ బ్రాపింతు రిలన్. 228

ఆ. ఈపవిత్రచరిత ♦ మెవ్వరు పఠియింతు, రామహాత్ము లిల మ♦హానుభావు
లై విశుద్ధకీర్తు ♦ లై సుదుర్లభభాగ్యు, లై విపాపు లగుదు ♦ రనఘచరిత. 229

వ. అని హయగ్రీవుండు సాదరంబుగాఁ దెలిపిన. 230

## ఆశ్వాసాంతపద్యములు.

శా. ఆధారాదిషడంబుజాఖ్యగణనా♦థాద్యామరేశాత్మస
ద్బాధామోచనతత్పరాత్మసురసం♦భావ్యాంఘ్రిపద్మద్వయా
రాధిస్వాశ్రితయోగిపుంగవమనో♦రాజీవవీథీమహో
సౌధాభ్యంతరమందిరా సువిలస♦చ్ఛైలేంద్రజాసుందరా. 231

క. కరధృతహరిణశశాంకా,భరణ సురాధీశమకుట♦బద్ధమణిరుచి
స్ఫురితచరణ మనసిజసం,హరణ నిజపదాశ్రితోత్ప♦లామృతకిరణా. 232

పంచచామరము. సురేశ్వరార్చితాంఘ్రిపద్మ♦శోభిధాన్యవాటికా
పురేశ్వరామరేశ్వరాఖ్య ♦ పూర్ణకామసేవధీ
శ్వరాప్తభూధరేశ్వరాత్మ♦జామనఃపయోరుహా
హరీశ్వరాపురత్రయేశ్వ♦రాసురత్రయాంతకా. 233

### గద్యము.

ఇది శ్రీభవానీశంకరకరుణాకటాక్షవీక్షాసుధారసాసారప్రసారసులబ్ధ
కవితావైభవాపస్తంబసూత్ర పరాశరగోత్రవిలస దాతుకూరివంశ
సంభవాయ్యనామాత్యపౌత్రాదిమూర్తినామసత్కవిపుత్ర
సకల సుకవిజనవిధేయ పాపయనామధేయ
ప్రణీతంబైన లలితాంబోపాఖ్యానం
బనుమహాప్రబంధంబునందుఁ
బ్రథమాశ్వాసము.





ఓమ్.

శ్రీసద్గురుచరణారవిందాభ్యాంనమః.

శ్రీ

# లలితాంబోపాఖ్యానము.

## ద్వితీయాశ్వాసము.




రమణసారసభవ
స్వారాజప్రముఖదేవ♦వర్ణ్యమహిమ గౌ
రీరమణీమృదుమానస
వారిరుహదినేశ ధాన్య♦వాట్యమ రేశా. 1

వ. అవధరింపు మప్రమేయప్రభావుం డగుహయగ్రీవునకు మేధాసాంద్రుం డగునగస్త్య
మహామునీంద్రుం డి ట్లనియె. 2

క. శ్రీమహితవీరభద్రక,థామృతపానమున గాఢ♦హర్షము నొందెన్
నామానస మశ్వాసన, హైమవతీదేవిచరిత ♦ మవశిష్ట మిఁకన్. 3

సీ. అచలరాజాత్మజ ♦ యారీతి నారూఢ,యౌవన యై యేమి ♦ యాచరించెఁ
దత్పరిణయమహో♦త్సవ మెట్లు వర్తించె, యాచనచే శంభుఁ ♦ డామృగాక్షిఁ
బెండ్లియాడెనో లేక ♦ పృథ్వీధరతనూజ, తానె మున్నుగ మేరు♦ధన్వికడకు
వచ్చి యాఘనుని వి♦వాహమయ్యెను వారి,చరిత మెవ్విధమునఁ ♦ బరఁగవిల్లె
గీ. నిది సవిస్తరముగఁ దెల్పు ♦ సదయహృదయ, నిఖిలకథలకు నీవె పె♦న్నిధివి యట్టు
లగుట నడిగెద నన్న న♦య్యశ్వవదనుఁ, డాకలశసంభవున కిట్టు ♦ లనుచుఁ జెప్పె.

ఆ. ఎద్ది విన్నమాత్ర ♦ నేనఃపయోరాశి, దాఁటి యెవ్వ రైన ♦ ధన్యు లగుదు
రట్టియంబికామ♦హాదేవశుభవృత్త, మవధరింపు కలశ♦భవమునీంద్ర. 5

సీ. అద్దేవి సకలలో♦కాద్భుతతారుణ్య,లావణ్యశుభలక్ష్మ♦లక్షితాంగి
యై విశ్వమునకు మ♦హానందవర్ధని, యగుచు శోభిలఁ జూచి ♦ యచలనాథుఁ

డంతరంగమున ని ♦ ట్లని వితర్కించె మ,ద్వంశంబునకు వన్నె ♦ వావి గలుగ
జనియించినట్టియా♦సర్వజగన్మోహ,నాతిసౌందర్య మ♦దాత్మజాత
సీ. క్షీరసంస్కారయోగమ♦ణిప్రదీప,మాలికయుఁ బోలె నలరించె ♦ మద్వశంబు
విలసదనుపమసౌభాగ్య♦కలల నెసఁగు,తన్వి చే ధన్య మయ్యె మ♦దన్వయంబు. 6
క. శివపదజచేత్ర కనుగుఁ, డెవరుఁ గాంక్షించునట్టి♦యీపావన మొదవెక్
గావున నేతన్వృత్తం, డెవరుఁ డెవ్వండు గలఁడొ ♦ యఖిలజగములక్. 7
క. సకలగుణసంపదల నీ,యకలంకశశాంకవదన ♦ కనుగుణుఁ డగువాఁ
డీక ముజ్జగములలోనఁ వెదకి చూచిన లేఁడ యెవ్వి♦ధమున దొరకునో. 8
చ. హరిహాయుఁ డాశ్రయాశుఁడు క్ష♦తాంతుఁడు వార్ధివిభుండు వాయువుక్
హరసఖుఁడుక్ సుహాపము స♦మగ్రముగా వహియింప నోప రీ
కరివరగామినీమణికిఁ ♦ గాంచనగర్భుఁడు నైన దీటుగాఁ
డరయ మురాంతకుం డయిన ♦ నంబుజనేత్రకు సాటి వచ్చునే. 9
వ. అని యివ్విధంబున హిమవంతుం డేకాంతంబునఁ దనమనంబున వితర్కించుసమయం
బున. 10
సీ. సంపూర్ణపూర్ణిమా♦చంద్రమండలసామ్య,నిర్మలత్వము మేన ♦ నివ్వటిల్లఁ
గారుమెఱుంగుని♦గారంబు నిరసించు,భవ్యపింగళజటా♦పటలి మెఱయ
ననునిమేషాంతరా♦త్మానుసంధానవి,స్ఫుటపులకాంచిత♦మూర్తి యొప్ప
గంగాజలాభిషి♦క్తవిశుద్ధ మగుచు గో♦క్షీరధావళ్యశ♦రీర మమర
గీ. మహతి యనెడునాద బ్రహ్మ♦మహిత మైన,వల్లకి ధరించి గీతప్ర♦బంధహృద్య
రచనఁ జంద్రశేఖరునిఁ బొ♦గడుచును వచ్చె, నారదుండు విజ్ఞానవి♦శారదుండు. 11
వ. ఇట్లు సర్వతసహాయుండై సకలలోకంబులయం దాశ్చర్యదర్శనార్థంబు సంచరించు
వాఁడు గావున నాకాశంబుననుండి హిమనగేంద్రునిమందిరంబున కవతరించి యభ్యం
తరస్థితుం డై నయతనిం జేర వచ్చుసమయంబున దివ్యతేజశ్శోభితుండును దివ్యజ్ఞానసం
పన్నుండును నగునద్దివ్యమునీంద్రునిం గని గిరీంద్రుండు ప్రత్యుత్థానంబు చేసి తోడి
తెచ్చి సముచితాసనంబునఁ గూర్చుండఁబెట్టి యర్ఘ్యపాద్యాదిపూజనంబు లాచరించిన
నత్యంతసంతుష్టుండై నారదుం డతని కిట్లనియె. 12
క. వాసవుఁడు దేవతల కగ్రేసరుఁ డెటు లట్ల సర్వ♦గిరులకు నీవ
గ్రేసరుఁడ వైతి నీదుమ,హాసౌజన్యంబు మమ్ము♦దావహ మయ్యెక్. 13
క. సుముఖుఁడవు గుణాఢ్యుండవు, సమధికభూచక్రభరణ♦సామర్థ్యుఁడ వా
దిమకూర్మశేషదిగ్గజ,గములక్ మీరును ధరింపఁ♦గా మహి నిల్చెక్. 14

వ. అట్లు గావున నీవును సకలలోకశ్లాఘనీయుండవై యున్నవాఁడ విటమీఁద నీదు భాగ్యమహిమ యెంతని కొనియాడ వచ్చుఁ బర్వతసార్వభౌమ సావధానంబుగా వినుము. 15

క. పదునాలుగులోకములకు, సదయతఁ దల్లి యయి మనుచు♦సర్వేశ్వరి నె
మ్మది భవదాత్మజ యయ్యెక్, విదితంబుగ నీదుభాగ్య♦విభవం బనదే. 16

ఆ. అద్రినాథ లక్ష్మి ♦ యనఁ బుష్టి యన ధాత్రి, యనఁగఁ గీర్తి యనఁగ ♦ నంబిక యన
నీతనూజ యైన♦యీాతలోదరియె ను, మ్మదియుఁ గాక యొకటి ♦ యనఘ వినుము. 17

క. ఈమానిని యమృతాంశుశి,రోమణి కర్ధాంగ మగుచుఁ ♦ బొల్పెసఁగుఁ గాంచుక
నామాట వేదవాక్యము,గా మదిలో నమ్మ వలయు ♦ ధామ్నాధరమౌళీ. 18

గీ. స్వధ యనఁగ స్వాహ యన నీతి ♦ సన్నతి యన
నాత్మవిద్యయు గుహ్యవి♦ద్యయు ననంగ
సరవిఁ బాపఘ్ని పావనా♦శని యనంగ
మహిమ నీసుత విలసిల్లు ♦ మాన్యచరిత. 19

చ. తలఁచిన నీతనూభవ స♦దాశివునంకవిభూషణంబు గాఁ
గల దిటమీఁద నిక్క మటు ♦ గావున నీవు నుపేక్ష సేయ కీ
నెలఁత ననూనయౌవన వి♦నిర్మలకీర్తిని దోడుకొంచు ని
శ్చలతఁ దపం బొనర్చు సల♦శంభునియాశ్రమసీమఁ జేరుమా. 20

ఉ. నావచనంబుసం దిపు డ♦నాదర మించుక యైనఁ జేయ క
ద్దేవునియాశ్రమంబునకుఁ ♦ దీవ్రతఁ బ్రీతికఁ దోడుకొంచుఁ బొ
మ్మావిభుఁ డప్పుతావహవ♦హామహనీయతపోగరిష్ఠని
ష్ఠావిధి నున్నవాఁడు బుధ♦సన్నుత దక్షసుతావియోగతక్. 21

వ. కావున నీవు స్థాణ్వాశ్రమంబునకుం జని యచ్చట మహావైరాగ్యసంపన్నుండును విజితేంద్రియుండును నై యతిఘోరతపంబు సేయుచున్న శంభునిసమీపంబునకరిగి పరిచర్యార్థంబుగా నమ్మహాత్మునిఁ బ్రార్థించి తదనుజ్ఞ వడసి యిక్కుమారి నప్పరమేశ్వరునొద్ద నునిచి మగిడి యీ నగరంబున కరుగుదేరవలయు నిట్లు చేసితేనియుఁ గ్రమక్రమంబున నీపుత్రికతోడిపరిచయంబు శంకరునకుఁ గల్గు దాన నమ్మహాత్ముండు వైవాహికవిధానమార్గంబున నిమ్మానినితోడిసాంగత్యం బంగీకరించు నేతదర్థంబు ♦ందుఁ దారకాసురపీడితు లై పురందరాదిబృందారకశ్రేష్ఠులు గరిష్ఠం . బగుభవత్సాహాయ్యకం బనుష్ఠించువా రట్టు లౌట నిది యవశ్యకరణీయం బని భవిష్యదర్థంబు దెలిపి యథేచ్ఛా

సంచారి యైనారదముని చెప్పిన హిమవంతుండు దివ్యదర్శనసంపన్నుం డైనయద్దేవర్షి వాక్యంబులు విని నిజాన్వయం బంబికాజననంబున నత్యంతపావనం బయ్యె నని మనంబునం దలంచి సంతుష్టుం డై స్థాణ్వాశ్రమంబునకు నరుగ సమకట్టి జయావిజయాభిధానసఖీమణిద్వయసమేత యగునిజప్రియతనూజాతం దోడుకొని యచ్చటికిం జని యనేకకోటిసంఖ్యాకులును మహాబలులు నైనగణనాథులచేత సర్వతఃపాలితం బై ఫలపుష్పసమృద్ధం బై కైలాసశైలప్రత్యంతపర్వతసమీపవిరాజితం బై శాంతసకలప్రాణిసమూహంబు గావున నతిమనోహరం బై సుస్నిగ్ధశీతలచ్ఛాయంబు లగుకంకేళిదేవదారుప్రముఖతరుసముదయంబుచే నతివిలసితం బై సురపున్నాగశింశుపాలోధ్రప్రాయంబు లైనకాంతారంబులచే నతిశోభితం బై పుణ్యపక్షిమృగాకీర్ణం బై లఘుశీతలస్వచ్ఛమధురసువాసితజలనిర్ఝరౌఘం బై కస్తూరీమృగనివాససురభితశిలాతలం బై మఱియు సదాశివభక్తినిష్ఠాగరిష్ఠులును సదాచారులుఁ ద్రిపుండ్రాంకితమస్తకులు భస్మోద్ధూళితసర్వాంగులు నైనయనేకబ్రహ్మచారుల కధిష్ఠానం బై యుండియు. 22

క. ఈశాన చంద్రచూడ సదాశివ శ్రీనీలకంఠ ♦ త్ర్యంబక యనుచున్
వాశితమిషమునఁ బలుకుశుభాశయఖగకులముచేత ♦ నతిభూషిత మై. 23

క. శ్రీవార్తయైన లేక తపోవైభవవర్ధనంబు ♦ భూరితపస్యా
భావిత మగుస్థాణ్వాశ్రమ, మావసుధాధరమహేంద్రుఁ ♦ డర్థిం జేరెన్. 24

గీ. చేరి యయ్యాశ్రమముబహి♦ర్ద్వారమునను, నిజతనూజాత నిల్పి వి♦నీతవేషుఁ
డగుచు భక్తిసంకుచితుఁ డై ♦ యచట నుండెఁ, గనియె నంత శిలాదనం♦దనుని ఘనుని.

వ. ఇవ్విధంబున నంతస్స్పృహాబహిర్ద్వారస్థితుం డైనమహారాజును నందికేశ్వరుం గని యల్లన నతనిఁ జేరం జని సవినయంబుగా ని ట్లనియె. 26

గీ. అనఘ నందీశ నీవు సో♦మార్ధమౌళి, యైనశంభున కెపుడుఁ బ్ర♦ధానభక్తుఁ
డవు గదా మత్ప్రయోజన ♦ మవితథంబు, గాఁగ విన్నవింపుము శైల♦కార్ముకునకు. 27

క. సేవింప నిచ్ఛయించెద, భావంబున నతనిపాద♦పద్మయుగళమున్
గావున నెఱిఁగింపుము దృష్టావసరుండ వయి యస్మ♦దాగమనంబున్. 28

చ. అని గిరిరాజు వేఁడినఁ బ్రి♦యంబున నంది శశాంకశేఖరున్
గని ప్రణమిల్లి యాత్మకర♦కంజమునన్ వదనంబుఁ గప్పి స
ద్వినయముతోఁ దుషారపృథి♦వీధరభర్త భవత్పదాబ్జసే
వన మెదఁ గోరి దేవ యిట ♦ వచ్చె నటంచును విన్నవించినన్. 29

క. ఆసర్వేశ్వరుఁడు విని దయాసాగరుఁ డగుటఁ జేసి ♦ యప్పుడ కించి
ద్భ్రూసంజ్ఞచేతఁ దెల్పెన్, నాసన్నిధిఁ జేర్పు తుహిన♦నగపతి ననుచున్. 30

చ. అది గని నంది వేగ నచ♦లాధిపునొద్దకు నేగి యాతనిన్
సదనములోనికిన్ హృదయ♦సమ్మద మొందఁగఁ దోడితెచ్చి యా
త్రిదశనిషేవితాంఘ్రి యగు♦దేవునిముందఱ నిల్ప నాతఁడున్
విదితవినీతిఁ జేసెఁ గడు ♦ వేడ్కఁ బ్రణామము భక్తియుక్తితోన్. 31

వ. ఇట్లు సాష్టాంగదండప్రణామంబు చేసి లేచి తనవచ్చినకార్యం బద్దేవునకు విన్నవింప నుద్యుక్తుం డై వినయవినమితశరీరుం డగుచు ముకుళితకరకమలుం డై యి ట్లనియె.

సీ. స్వామి నీ వఖిలవి♦ష్టపవందనీయుండ, వాద్యంతరహితుండ ♦ వక్షరుండ
వాత్మతంత్రుఁడవు శు♦ద్ధాత్ముఁడ వప్రమే,యప్రభావుఁడవు దే♦వాదిదేవుఁ
డవు సర్వలోకసా♦క్షివి మహేశ్వరుఁడవు, సర్వజ్ఞుఁడవు శుద్ధ♦సత్త్వమూర్తి
వమితతేజోరాశి ♦ వటు గాన నీపాద,కమలసంస్మరణ మొ♦క్కటియె చాలుఁ

గీ. బాతకౌఘంబు శీఘ్రమ ♦ పాయుఁదోలఁ, దాపసతపఃఫలము భవ♦ద్దర్శనంబు
వినయవృత్తి ని న్నాశ్రయిం♦పనిజనులకుఁ, గర్మఫలసిద్ధి యేరీతిఁ ♦ గలుగ నేర్చు.

క. భవదీయపూజ సల్పెడు,సువినీతుల కందరాని♦శుభములు గలవే
శివ నేను విన్నవించుమ,నవి దేవా యవధరించి♦నన్ ధన్యుండన్. 34

వ. అది యెయ్యది యంటేని. 35

గీ. దేవ పార్వతి యనెడు మ♦దీయతనయ, సకలసుగుణాఢ్య గలదు యు♦ష్మత్పదాబ్జ
యుగళశుశ్రూష సేయ మ♦హోత్సుకత్వ, మెలమిఁ దన్మానసంబునఁ ♦ గలిగి యుండు.

క. దేవరపాదాంబుజయుగ,సేవన్ దనవాంఛితంబు ♦ చేకుఱు నంచున్
భావమున నమ్మి యిపుడు ద,యావననిధి వైననీదు♦నాశ్రమమునకున్. 37

గీ. వచ్చి భవదీయగృహబహి♦ర్ద్వారభూమి, నిలిచి యున్నది దయ చేసి ♦ నీ వనుజ్ఞ
యిచ్చినటు లైనఁ దోడ్తెత్తు ♦ నింతి నిపుడ, తత్సఖీమణిద్వయసహి♦తంబు గాఁగ. 38

క. స్త్రీలకుఁ బురుషులకుం బసి,బాలురకున్ బండితులకు ♦ భవదీయసప
ర్యాలోలతయె పరాయణ, మాలోకింపఁగఁ దదన్య ♦ మరయం గలదే. 39

గీ. అలఘుగుణ నీవు విజితేంద్రి♦యులకు నెల్ల, నగ్రగణ్యుఁడ వటు లౌట ♦ నస్మదీయ
కన్య దేవరశుశ్రూషఁ ♦ గదిసి యుండి, నీతపము విఘ్నముగఁ జేయ ♦ నేర దనఘ.

గీ. బాల యీరీతి దేవర♦పాలనుండి, తన మనోరథసిద్ధి త♦థ్యముగఁ గాంచు
నీకు నియమంబు తక్కువ ♦ గాక యుండు, జలజలోచన నీచెంత ♦ నిలుచుకతన. 41

గీ. దేవరకు దాసి యగుచు మ♦దీయదుహిత, మహితభక్తితో గేహస♦మ్మార్జనాది
కము లనాయాసముగ గర♦గరికతోడ, నలుప నేర్చు భవన్నేత్ర♦సంజ్ఞమాత్రి. 42

సీ. శృంగారముగఁ గోమ♦లాంగి గోమయమున, నతిరమ్యముగ గృహం ♦ బలుక నేర్చుఁ
గందక యుండఁగ ♦ సుందరి పుష్పముల్, గోసి మాలికలుగాఁ ♦ గూర్చ నేర్చు
లలితహృద్యంబుగా ♦ నెలఁత నిర్ఝరజల,కలశము ల్గొని వచ్చి ♦ నిలుప నేర్చు
హోమపూజాదిద్రవ్య♦ములవి మున్నె యమర్చి, యిచ్చకు మెచ్చుగా ♦ నీయ నేర్చుఁ
గీ. బలుకు ల్కిక వేయు నేల య♦జ్జలజవదన, వెలయ దేవరతలఁపున ♦ మెలఁగ నేర్చుఁ
గమలనేత్రి వధూచిత♦కార్య మెల్ల, నాచరింపంగ నేర్చు మీ ♦ రాజ్ఞ యొసఁగ. 43
చ. అని యిటు లద్రినాథుఁడు మ♦హావినయంబున విన్నవింపఁగా
విని పరమేశ్వరుం డను వి♦వేకనిధీ భవదిచ్ఛ యెట్టు ల
ట్లొనరఁగ నాచరింపుము గు♦ణోన్నత దీనను దోష మేమి యం
చనుమతి యిచ్చె నాతఁడుఁ బ్రి♦హర్షముతోడ నమస్కరించుచున్. 44
ఆ. తనయఁ దోడితెచ్చి ♦ తరుణేందుశేఖరుఁ, బూజసేయు మనుచు ♦ బుద్ధి గఱపి
దేవుకడఁ దదీయ♦సేవార్థ మై నిల్పెఁ, గన్య సకలలోక♦మాన్య ధన్య. 45
వ. ఇవ్విధంబున హిమవంతుండు దనవచ్చినకార్యంబు నిర్వర్తించి సంతుష్టాంతరంగుం డై మరలి నిజనగరంబునకుఁ జనియె నంత. 46
సీ. ఆపార్వతి సఖిద్వ♦యోపేత యగుచు వి,నీతియు భక్తిమా♦నితయు సమ్య
గాచారనిష్ఠయు ♦ ననుకూలయును నై మ,హేశ్వరసేవ యం ♦ దెన్నఁ డైన
నాలస్య మించుక ♦ యైన నెఱుంగక, వేదికాసమ్మార్జ♦నాదికములు
సరసతఁ బుష్పాప♦చయముఁ దన్మాలికా,గ్రథనంబు సేయుచుఁ ♦ బ్రథితము లగు
గీ. దేవపూజనివేదుల ♦ భావ మలర, భూరిచందనమాలిక ♦ లొప్పసఁగఁ గట్టి
ముఖ్యకుసుమాక్షతలతోడఁ ♦ బూర్ణకుంభ, మచట నిల్పుచు మఱియు న♦య్యబ్జవదన.
సీ. చాలవింతగఁ దీర్చు ♦ శాలితండులచూర్ణ,రంగవల్లికలు గే♦హాంగణమునఁ
దర్పణార్థంబు శు♦ద్ధజలంబుఁ గొని వచ్చి, యతిభక్తిఁ బశుపతి ♦ కందియిచ్చు
దాపున నిల్పు మం♦దాకినీసౌవర్ణ,పద్మజాలముఁ దెచ్చి ♦ బహువినీతి
హోమార్థ మై యతి♦కోమలం బగుకుశ,యును బల్లవంబులు ♦ నొసఁగు వేడ్క
గీ. సమయ మెఱిఁగి నిత్యంబును ♦ సముచితముగఁ, జంద్రచూడునిసేవ యీ♦చంద మమరఁ
జేసె భవ్యనిజాభీష్ట♦సిద్ధికొఱకు, నయ్యశశ్విని బహుకాల ♦ మభిమతముగ. 48
వ. అంత. 49
సీ. సర్వేశ్వరుండు స్త్రీ♦సంశ్లేషవిముఖుఁ డై, నాసాగ్రవినిహిత♦నయనయుగళుఁ
డాత్మనిరుద్ధేంద్రి♦యగ్రామఁ డుంచిత,భూమిమధ్యహృదయుఁ డు♦ద్దామనియమ

యుక్తుఁ డంతర్దృష్టి♦యును నై పరానంద,మయు మై నిరంజన♦మై యమేయ
మై సదోల్లాస మై ♦ యక్షర మై నిర్వి,కార మై యొప్పున♦గణ్యు మైన
గీ. స్వస్వరూపంబునందు వి♦శ్వంబు గాఁగ, నెలమిఁ దనదుప్రత్యగ్దృష్టి♦నిలిపి నిస్త
రంగ మై కానఁబడుసము♦ద్రంబు వోలెఁ, జోద్యముగ వికల్పక్షోభ♦శూన్యుఁ డగుచు.
క. శమధనుఁడు శంభుఁ డపు డా,స్తిమితాకృతి యగుచు నిష్ఠ♦చే సంఖ్యాన
క్రమము యథావిధి నడపుచు, విమలాత్మజ్యోతిఁ గనుచు ♦ వేడుక నుండెన్. 51
శా. ఆలోఁ దారకుఁ డన్మహాదనుజు బా♦హాశౌర్యవిస్ఫూర్తిచే
శైలారిప్రముఖామరోత్తములు త్రా♦సభ్రాంతు లై యార్తి వే
ధోలోకంబున కేగి యచ్చట మహా♦త్మున్ దేవతాజ్యేష్ఠు భా
షాలావణ్యవతీవిభుం గని యుదం♦చద్భక్తితో మ్రొక్కుచున్. 52
క. శరణంబ వగుము మా కని, హరిహయముఖదేవవర్యు ♦ లప్పుడు భయకా
తరు లై యాక్రందించిరి, సరసిజభవుమ్రోల నధిక♦సంభ్రాంతమతిన్. 53
చ. పడపడి యాతనిన్ వివిధ♦భంగులఁ బ్రస్తుతిచేసి తారకా
ఖ్యదనుజుచేయుబాధలు స♦మస్తముఁ దెల్పఁగఁ గోరి పల్కి రో
త్రిదశవరార్చితాంఘ్రియుగ ♦ దేవ జగంబులఁ గల్గఁజేయఁగా
విదితము గాఁగఁ బ్రోవఁగ ను♦పేక్షయొనర్పఁగ నీవె యెన్నఁగన్. 54
వ. అని మఱియును. 55
ఆ. నీవె జీవితంబు ♦ నీవె మాకు బలంబు, నట్టు లగుట నిప్పు ♦ డస్మదీయ
రక్ష సలుప కిటు లు♦పేక్షసల్పఁగ నీకుఁ, దగునె వేగ యభయ♦దాత వగుము. 56
క. లోకాధిప దయచేయుము, మా కధికారంబు లిచ్చి ♦ మన్నించిననీ
వీకరణి నుపేక్షించుట, నీకష్టము నొందినార ♦ మిపుడు ఖలులచేన్. 57
క. దైత్యకృతం బై యిపు డొక,యత్యాహిత మొదవె మాకు ♦ నట్టు లగుట స
ప్రత్యయముగ నిట వచ్చితి, మత్యాపన్ను లగుమమ్ము ♦ నరయు మధీశా. 58
ఆ. ఈమహాభయంబు ♦ హృదయశల్యం బయి, యతికఠోర మగుచు ♦ నార్తిఁ జేసె
నట్టు లగుట నతిర♦యంబున దానిఁ దొ,లంగఁ జేయుపనిఁ ద♦లంపు మభవ. 59
వ. అది యెయ్యది యనిన విన్నవించెద మత్యంతకరుణాకటాక్షంబునఁ జిత్తగింపవలయు
హిరణ్యకశిపునామధేయుం డైనయొక్క మహాదైత్యునివంశంబున నుద్భవించి తత్తు
ల్యపరాక్రమవంతుం డై తారకుం డనుదైత్యేంద్రుండు భవద్దత్తవరప్రాబల్యంబున
నుద్ధతుం డై మహాసత్త్వుండును సమధికధైర్యశాలియు నత్యంతచపలుండును దుర్న
యుండును దుర్మానియు దుర్మదాంధుండును నై మాకు నిత్యంబు నహితంబె

చేయుచు యజ్ఞకర్మవినాశకుం డై సకలజగంబును స్వాహాస్వధావషట్కారవర్జితంబు సేయుచు నకారణక్రోధంబున సర్వమునీశ్వరులను బీడించుచున్నవాఁ డివ్విధంబున నతండు త్రైలోక్యంబును బరితపింపం జేయుచు మఱియు నిమ్మహేంద్రునియధీనంబు లైన చింతామణికామధేనుకల్పవృక్షంబుల నపహరించి నిజభేరీధ్వనిశ్రవణమాత్రంబున సమస్తబృందారకులుఁ గాందిశీకు లైనఁ దాను స్వర్గంబుపై విడిసి యచ్చటియఖిలధనంబును గొల్లఁగొని తదీయగోపురాట్టాలకసౌధప్రగ్రీవకాదులను మత్తవారణవేదులను ననేకసోపానపఙ్క్తులను వివిధంబు లగుచంద్రశాలలను సభామంటపకోటులను రత్నఖచితగృహంబులను సౌవర్ణసునికేతంబులను బడ నడిచి దర్పితుం డై యద్దురాత్ముండు పాకశాసను నశేషరాజ్యంబును నాశంబు నొందించి చంద్రసూర్యాద్యధికారంబులును దాన చేయుచున్నవాఁ డదిగావున చంద్రునిచంద్రత్వంబును సూర్యునిసూర్యత్వంబును నగ్నియగ్నిత్వంబును యమునియమత్వంబును నతనిచే నపహరింపంబడియె వారల కృత్యంబులు దాను నిర్వహించుట గాక విశేషించి వారల బాధించుచున్నవాఁ డయ్యుల్పునిచే నఖిలదేవాంగనాసంఘంబులును జెఱఁ బడి యున్నయవి యిట్టికష్టంబు దేవరవారియెదుర విన్నవించుటకు లజ్జ వొడముచున్నది తత్ప్రతాపాగ్నిచే జగత్త్రయంబును దపించుచున్నది మా కెప్పుడును దద్భయజ్వరంబున నాయాసంబె కాని యాహారవిహారాదులయందు మనస్స్వాస్థ్యంబు గలుగకున్నది రేయుంబగలుఁ దద్బాధాపరిభూతుల మై యున్నవార మట్టు లగుట మాలోపలఁ గొందఱు మనుష్యరూపంబున వసుధాతలంబున సంచరించుచున్నవారు. దేవకార్యంబులును బితృకార్యంబులును నెచ్చటనేనియుఁ గనవినఁబడకున్నవి యీప్రకారంబున స్వర్గమర్దనుండును సమగ్రబలనిధియును నైనతారకాసురుండు ప్రతాపదీపితుం డై చక్రపాణిచక్రంబున కైనను శూలహస్తుని శూలాయుధంబున కైన నసాధ్యుం డై యున్నవాఁ డిందులకుఁ గర్తవ్యం బెయ్యదియో దాని మాకు నుపదేశింపవలయు భవదీయవరగర్వితుం డగునప్పూర్వగీర్వాణుండు సచరాచరం బైనత్రైలోక్యంబుఁ దనయఱచేతికిఁ దెచ్చియున్నవాఁడు నీవు సర్వజగత్స్రష్టవు సర్వలోకపితామహుండ వస్మద్విపత్సముద్రకర్ణధారధురంధరుండ వై యుండి మాకు నెద్ది చేసిన దుష్టాసురబాధ యడఁగునో యట్టికర్తవ్యోపాయం బుపదేశింపక యిట్టులూరకున్నవాఁడవు తారకుం డుచ్ఛ్రయంబున నుండ నస్మజ్జీవనం బేలాగునఁ బ్రవర్తించు నని యతిదైన్యప్రలాపంబుల నమరులు ప్రార్థించినఁ గమలసంభవుండును గరుణాభరితుం డై ప్రతిపక్షమర్దితు లై భయార్దితు లైనవారలం గనుంగొని సాంత్వనమధురంబుగా ని ట్లనియె. 60

క. సురలార దుష్టతారక,పరిపీడితు లై నమీరు ♦ బహుతరచింతన్
దురపిల్ల నేల మీ కొక,పరమోపాయంబుఁ దెలిపి ♦ పనిచెద మిమ్మున్. 61

సీ. మేదురబలశాలి ♦ యాదైత్యపతి తొల్లి, బాల్యకాలంబునఁ ♦ బరమఘోర
మైనమహాతపం ♦ బత్యంతనియతితో, ననుఁ గూర్చి యాచరిం♦చినఁ దదీయ
భీమతపోనల♦ధూమాయితంబు లౌ,పదునాల్గుజగములు ♦ భ్రాంతి నొంది
సకలచరాచర♦ సంఘ మవ్వేఁడిమిఁ, దనికి యెంతయుఁ బరి ♦ తాప మొందె

గీ. నట్టి యెడ వానితపమున ♦ హర్ష మొంది, నేనుఁ బ్రత్యక్షమై రజ♦నీచరేంద్ర
వరము వేఁడు మిచ్చెద నని ♦ కరుణతోడఁ, బలుక వాఁడును సంతోష♦భరితుఁ డగుచు.

గీ. కమలభవ స్రష్ట వఖిలలో♦కంబులకును, సర్వకామప్రదుండవు ♦ జనకుఁడవును
బ్రకటముగ నీవ నీకంటె ♦ నొకఁడు గలఁడె , తాపసులకుఁ దపఃఫల♦దాయి వీవ. 63

క. కమలాసన నీకుఁ బ్రసా,దము నాయందుఁ గలదేని ♦ దాక్షిణ్యముతో
డ మదీయవాంఛితము నొసఁ,గుము నీ కది విన్నవింతు ♦ గురుతరభక్తిన్. 64

క. ఏవీరుఁ డగ్నిముక్త,మహావీర్యమువలన నుదయ♦మంది ప్రబలుఁ డౌ
నావీరుఁడుదక్క నితరు, లావీరులచేత నభయ ♦ మయ్యెడి నాకున్. 65

క. అని యివ్విధమున నను న,ద్దనుజుఁ డడుగ నతనిభక్తి♦తత్పరతకు నే
మనమున హర్షించుచు నా,ఘనవర మపు డమరులార ♦ కరుణ నొసఁగితిన్. 66

క. నాచేత నిట్టు లాక్షణ,దాచరుఁడు వరంబు గాంచి ♦ తా వర్ధిలుటన్
నీచత వాని వధించుట, నాచారము నాకుఁ దలఁప ♦ ననుచిత మెందున్. 67

ఆ. ఎంతదుష్టుఁ డైన ♦ నెంతధూర్తుం డైన, నెంతకఠినుఁ డైన ♦ నెంతకపట
వంతుఁ డైన మఱియు ♦ నెంతశఠుం డైనఁ,దగదు తానె పెంచి తానె చెఱుప. 68

చ. అదియును గాక మద్వరమ♦హాబలసంపద వృద్ధిఁ బొందునా
త్రిదశరిపు న్మదంబడఁప ♦ దేవతలార యశక్య మేరికిన్
మదిఁ దలఁపంగ నాకును స♦మర్థత లే దెటు లన్న నగ్నిచే
సదనము గాల్చి యెవ్వరికి ♦ శక్యము క్రమ్మఱ దాని నార్పఁగన్. 69

వ. అట్లు గావున. 70

క. తారకదోర్విక్రమసం,హారం బేశూరవర్యుఁ ♦ డశ్రమమున దు
ర్వారుఁ డయి చేయుఁ గలఁ డ,వ్వీరుఁడు సేనాని యైన ♦ విజయము మీకున్. 71

ఆ. అట్టివాఁడు గలుగ ♦ యత్నంబు సేయుఁడు, వాఁడు కరుణ మీకు ♦ వాహినీశుఁ
డైన మీ కసాధ్య ♦ మగునది లే దెందు, వినుఁడు తద్విధంబు ♦ విస్తరింతు. 72

గీ. శ్రీమహాదేవుఁ డాశ్రితకామధేను
వఖిలజగదీశ్వరుండు చంద్రావతంసుఁ
డభవుఁ డె సమర్థుఁ డగు నచలాత్మజాతఁ
గూడి తారకుఁ బరిమార్చు కొడుకుఁ బడయు. 73

క. అతఁ డిపుడు దక్షసుత యాత్మతనుత్యాగంబు చేసి తలఁగినది మొదల్
వితతం బగువైరాగ్యము, మతిఁ బూని మహానియమసమగ్రుం డగుచున్. 74

వ. అతిఘోరం బగుతపోనిష్ఠ వహించి తరుణీసామీప్యమాత్రంబునందును బరాఙ్ముఖత్వంబు నొంది స్వాత్మధ్యానపరాయణుండై నిరంతరాత్మావలోకనంబు సేయుచు స్థాణ్వాశ్రమంబున నివసించియున్నవాఁ డిప్పుడు మీరు చేసినభాగ్యవిశేషంబున దైవయోగంబున భవత్సేవార్థంబుగా గురుప్రబోధిత యై పర్వతరాజనందన యచ్చట నిలిచియున్నది యక్కన్యక యనేకప్రకారసపర్యలఁ దన్ను సేవింపుచుండ సౌందర్యతరంగిణి యగునమ్మందగమన నవలోకింపక నమ్మగువతో సంభాషింపక కేవలధ్యానపరాధీనుండై యున్నవాఁ డక్కురంగధరశేఖరుం డక్కురంగనయనతోడిసాంగత్యం బొనరించునట్లుగా మీరు యత్నంబు సేసినట్లైన నదిమొదలుగా మీకు సుఖంబు గలుగు నాసర్వేశ్వరుం డాసర్వమంగళతోఁ గ్రీడించుచు నవ్వనితాశిరోమణియందు నిజవీర్యనిక్షేపణంబు సేయంగలవాఁ డవ్వామలోచన ప్రజ్వలజ్జ్వలనోపమానం బైనతత్తేజంబు సహింప నోపక భూమియందు నిలుపఁగల దవ్వసుంధరాదేవియు నట్లు పరమేశ్వరవీర్యభరణంబునం దసమర్థయై పావకునందు దాని నునిచి తాను నిర్భరంబుగా నుండఁగల దద్ధనంజయుండును స్వనిక్షిప్తపురంజయవీర్యంబుఁ గ్రమంబునఁ జంద్రభార్య లైనకృత్తికలార్వురయందును నిక్షేపింపఁ గలవాఁడు వారును దద్రేతోధారణంబున సంతాపితలగుచు వియన్నదీజలంబులఁ దదుత్సర్జనంబు చేసి సుఖంబున నుండంగలవా రయ్యమరతరంగిణియు నయ్యమరతరంగిణీధరమహావీర్యదహనజ్వాలాజాలసంతప్తనిజాకృతి యగుచుఁ దన కనతిదూరంబున నుండుశరవణంబునుపాంతంబున నప్పరమపురుషచరమధాతూత్సృష్టి యొనర్చి హృష్టాత్మ కాఁ గలయది యత్తెఱంగున నేతావత్కాలంబున నమ్మహేశ్వరమహాతేజంబు కుమారస్వరూపంబునఁ బరిణామంబు నొందఁ గలయది నిర్జరులారా యంతట నక్కుమారుండు త్రిలోకగురు వైనయమ్మహేశ్వరువలనఁ గృతాస్త్రుండై దృఢవిక్రముండును సమధీతాశేషవిద్యావిశేషుండును నగుచు మీకు సేనాని కాఁగలఁ డేతత్కార్యసంసిద్ధికి నాదికా

రణం బైనపార్వతీసంసర్గంబు శంభునకుఁ గలుగఁజేయుప్రయత్నంబున నుండుం
డతం డీసమయంబున విరక్తాత్ముం డై వర్తించుచున్నవాఁ డన్నిటలలోచనునకు
రాగం బుత్పాదించుటకు రతిప్రాణవల్లభుని నియోగింపవలయు విబుధోత్త
ములారా యింక నిచ్చటఁ దడయ నేల మీమీనివాసంబుల కరుగుం డని
యాజ్ఞాపించి యవ్విరించి యంతర్ధానంబు నొందిన బృందారకులు స్వర్గంబునకు
వచ్చి తమతమమందిరంబుల నుండి రంత. 75

క. నిజకార్యసిద్ధికొఱ కయ్యజరాధీశ్వరుఁడు దలఁచె ♦ నాత్మాబ్జమునన్
భుజబలసంపద్విజిత,త్రిజగద్వీశ్వరు సుమేరు♦ధీరున్ మారున్. 76

వ. ఇట్లుఁ దలఁచుటయుఁ దత్క్షణంబ. 77

సీ. కమనీయపుండ్రేక్షు♦కార్ముకరుచిరమై, భవ్యకోమలకరా♦బ్జంబు దనర
విశ్రుతశౌర్యార♦విందాదిబాణపం,చకమునఁ దక్షిణ♦కరము మెఱయఁ
బుష్పబాణావళీ♦పూర్ణతూణీరముల్, చరమభాగంబున ♦ మురువు చూప
సర్వలోకానీక♦సౌందర్యసముదాయ,సారసంపన్నశ♦రీర మమర

గీ. సేనల కధీశ్వరుం డైన♦శీతకిరణు
తోడఁ బ్రతిపద ముచితోక్తు♦లాడుకొనుచుఁ
దనకు నత్యంతమిత్రుఁ డై ♦తగువసంతు
మొగము గనుఁగొని నవ్వుచు ♦ ముదముతోడ. 78

గీ. పెనుపు మెఱసి రాగాభిఖ్య♦పీఠమర్దు
తోడఁ బరిహాసనంబుఁ దో♦డ్తోడఁ జేయు
చును వధూబృందబలయుక్తుఁ♦డును సరోజ
లోచనాలోకసాయకుఁ ♦ డగుచు మఱియు. 79

సీ. కమనీయసంఫుల్ల♦కర్ణికారాభమై, ఘనమనోహరదేహ♦కాంతి మెఱయ
మందమరున్మహా♦స్యందనారూఢుఁ డై, మహితతఃపామయ♦మాయతోడఁ
త్రైలోక్యసంవస♦త్తరుణీపురుషమోహ,సంపాదనోత్కంఠ ♦ చాలఁ దనరఁ
దాపసప్రవరని♦తాంతతపస్సిద్ధి, కాదివిఘ్నం బన ♦ నతిశయిల్లి

గీ. ప్రకటశాంబరీసారవి♦క్రమవిశేషుఁ, డగుచు రతిదేవితోఁ గూడి ♦ యమరనాథు
ననుపమాస్థానమంటపం♦బునకు వచ్చె, శంబరారి సంతోషిత♦శంబధారి. 80

ఆ. వచ్చి మదనుఁ డపుడు ♦ వాసవునకు నభి,వందనంబు చేసె ♦ సుందరాత్మ
హస్తకలితసుమమ♦యాశుగనిర్గత,పుష్పరసము లచటి♦భూమిఁ దడుప. 81

క. ఆసమయంబున నొకమహి,తాసనమున నధివసించె ♦ నమరాధిపతి
ప్రభూసంజ్ఞానుజ్ఞాతుం,డై సూనశిలీముఖుండు ♦ హాస్యముతోడన్. 82

గీ. కార్యసిద్ధిపరత్వంబు ♦ గలిగియున్న,వాఁడు గావున నప్పుడు ♦ వాసవుండు
స్మరముఖాంబుజమున సుప్ర♦సన్ననిజవి,లోచనసహస్రమునిచె న♦లోలముగను.

వ. ఇట్లత్యాదరంబున. 84

గీ. యథాగపద్యంబుగాఁ దన♦యాసనమున, నమరనాథుండు దృష్టిస♦హస్ర మునుప
దాన సూచితమైనత♦ద్వాత్సలత్వ, మెన్నుచు వినీతి నిట్లని ♦ విన్నవించె. 85

సీ. దేవవల్లభ త్రిలో♦కీవీరలక్ష్మిని,వాసశౌర్యోద్దండ♦బాహుదండ
మండితవిక్రమా♦ఖండప్రతాపసం,తప్తమహావీర♦ధైర్యకాండ
జంభాసురేంద్రయో♦షాగర్వహారివి,భ్రాజన్నిశాతవ♦జ్రప్రచండ
ఖండనోగ్రపులోమ♦చండదోర్మండల,ఘనదర్పఫణివిహం♦గప్రకాండ

గీ. దేవదేవరసాహస్ర♦దృష్టు లిపుడు, సుప్రసన్నత నొక్కట ♦ సూటి గాఁగఁ
గరుణ నాయందు నుంచిన♦కారణంబుఁ,దెలుపు మెట్టికార్యంబైనఁ ♦ దీర్చువాఁడ.

ఉ. ఎంతయశక్యమైన భవ♦దీప్సితమైనప్రయోజనంబు దు
ర్దాంతత నిర్వహింపఁగ సు♦ధాశనవల్లభ నేన చాలుదున్
దాంతులు తాపసాఢ్యులు ని♦తాంతవిరక్తులునైన మోహవి
భ్రాంతులు గాక యుందురె ♦ వాసవ నే ధను వెక్కువెట్టినన్. 87

క. పామరత నెవ్వరైనఁ ద,పోమాహాత్మ్యమున నీప్రభుత్వము వడయం
గామింతురు మదిలోపల, నామనుజుల మోహపఱుతు ♦ నశ్రమలీలన్. 88

గీ. పృథివి జయసాధనంబులు ♦ రెండెకద సు,రేంద్ర నీకు దంభోళియు ♦ నేను నరయఁ
దాపసులకు దంభోళి దాఁ ♦ దలఁగిపోవు, నట్టివారల నే గెల్తు ♦ నశ్రమమున. 89

గీ. మచ్ఛరాసననిర్ముక్త♦మార్గణములు, మఘవ సిద్ధార్థములు గాక ♦ మగుడ వెందుఁ
బాకశాసన విను నాదు♦బాణములకుఁ, గన నసాధ్యంబు లేదు లో♦కత్రయమున. 90

గీ. మౌర్ఖ్యమున వధూవృత్తాంత♦మాత్రవిముఖు, లగుచు ఘోరతపస్థితు ♦ లైనవారి
దేవ కావింతు నంగనా♦దృష్టిపాశ,బద్ధులై తన్నిరీక్షణ♦పరులు గాఁగ. 91

సీ. ధూర్తదైత్యులు చండ♦దోర్దండతేజులై, నీరాజ్యము హరింపఁ ♦ గోరి వేగ
నీతోడఁ గలహింప ♦ నేతెంచిననైన, వారు రణోద్వృత్తి ♦ వదలి యస్త్ర
శస్త్రప్రసంగముల్ ♦ చాలించి యూరక, స్త్రీసంగమాసక్తి♦చేత మరలి
యంతఃపురస్త్రీసు♦ఖాధీనహృదయులై, కుటిలాలకంబు భ్రూ♦కుటియుతంబు

గీ. వేపమానాధర మసహ్య ♦ కోపపాట,లము శశేత్యాదినిష్ఠురా ♦ లాపముఖర
మణిచపలవీక్షణం బౌత ♦ దాననంబు, గనుచు నాచేత నిహతులు ♦ గాఁగఁ గలరు.

వ. మహేంద్రా లోకత్రయంబున నెచ్చటనే నద్భుతసౌందర్యనిధి యైనయొకానొక మందగమన భవదీయదృష్టిగోచర యైనఁ దదీయరూపవిభ్రమవిలాసకిలికించితలోలుపమానసుండ వై తత్సాంగత్యంబుఁ గోరి నీవు ప్రార్థించిన నయ్యేలనాఁగ పరమపాతివ్రత్యమదోద్ధత యై నీదువాంఛఁ గేలిచేసి నిన్నుఁ దృణీకరించి భవత్ప్రార్థనావచనం బుల్లంఘించినట్లైన నట్టిదాని మత్కరపంకజగృహీతపుండ్రేక్షుకోదండవినిర్గతపుష్పమార్గణంబు లనలజ్వాలాచూడాలంబు లై పీడించునట్లుఁగా నస్మద్బలంబు లైనకోకిలకులంబులపలుకులు సకలజనశ్రుతిసుఖంబు లై యచ్చెలువకుఁ గర్ణకఠోరంబు లగునట్లుగా మత్స్యందనరూపం బైనమలయానిలంబు శైత్యమాంద్యసౌరభ్యంబుల సకలచేతనానీకంబులకు సుఖప్రదం బై యక్కమలలోచనకు గ్రీష్మోష్ణకిరణాతపంబుకరణి సంతాపకరం బగునట్లుగా మద్ఘోటకశుకనిరాఘాటధాటీహేషానిర్ఘోషంబులు సమస్తరసికజనమనోహరంబు లై యమ్మానినికి సముచితధైర్యప్రకారభేదకంబు లగునట్లుగా మత్సేనాని యైనచంద్రునిసాంద్రచంద్రిక నిఖిలలోకాహ్లాదకం బై యామృగాక్షికి దవానలకీలలీల వేఁడిమి చూపునట్లుగా మన్మిత్రుం డైనచైత్రుని విజృంభణం బశేషజంతువిశేషతోషకం బై యామంజుభాషకు నభిమానశోషకం బగునట్లుగా నస్మన్మాయాబలంబున నిట్టు లఘటనాఘటననిర్వహణకుశలుండ నై యత్తరుణి పూర్వగృహీతదురాగ్రహంబు దొఱఁగి భవదేకశరణ యై నీయందు బద్ధానురాగ యై యుండునట్లు చేసి మత్సామర్థ్యంబు ప్రకటించి దేవరచేత మెచ్చు వడసెద మఱియు నెం డైన దుష్కరం బైనకార్యంబు గల్గిన శీఘ్రంబ యనుజ్ఞ యిమ్ము సత్వరంబుగా నరిగి యట్టిది సాధించెద. 93

సీ. సురదైత్యదానవ ♦ నరదివ్యమునియోగి,చారణగంధర్వ ♦ సాధ్యయక్ష
కిన్నరఖగసిద్ధ ♦ కింపురుషోరగ,గరుడవిద్యాధర ♦ గణములందుఁ
బలుకులు వేయేల ♦ పరమేష్ఠియందును, విశ్రుతమహిముఁ డౌ ♦ విష్ణునందు
వర్ణనీయప్రభా ♦ వజ్వలితుం డై య,సాధ్యదోర్బలుఁ డైన ♦ శంభునందు

గీ. మచ్ఛరాసననిర్ముక్త ♦ మార్గణాగ్ర, మమరనాథ యప్రతిహత ♦ మని యెఱుంగు
మట్లు గావున వేగ నా ♦ కాన తిచ్చి, భవదభీష్టంబు సాధింపఁ ♦ బంపు నన్ను. 94

గీ. నీయనుగ్రహసూచక ♦ నేత్రనివహ, మిపుడు ప్రేరేచుచున్న దిం ♦ పెసఁగ నన్ను
నట్లుగావున నాజ్ఞ యి ♦ మ్మనుచుఁ బలుక, విని సహస్రాక్షుఁ డలరి యా ♦ తనికి ననియె.

క. జగదేకమహావీరుఁడ, వగణితధృతి విష్ణుఁ డిష్ణ♦యంతటికంటెన్
మిగులంగఁ జేయ సమర్థుఁడ, వగు పెంపుగుము నీదుశౌర్య ♦ మలవియె పొగడన్. 96
క. శత్రుజి సురలకు నొక్కఁడు,హత్తరికార్యంబు గల్గె ♦ నది నీచేతన్
సత్త్వముగఁ గృతమై ఫలసం,పత్తిం గనుఁ గాక నిఖిల♦భద్రకరంబై. 97
గీ. నీవు దక్కఁగ నెవ్వని ♦ నిర్వహింప, నన్యుఁ డొకరుఁడు లేఁ డెందు ♦ నరసి చూడ
మతిఁ దలంపఁగ నీవెంద♦హితుఁడు దక్క, నంబుజవికాసకుం డన్యుఁ ♦ డరయఁ గలఁడె.
క. ఈసురలు తారకునిచే, గాసిపడి తదీయవధముఁ ♦ గాంక్షించెద ర
మ్యాసురుఁడు వీర్యరాశి మ,హాసమరవిచక్షణుం డ♦నల్పుం డెందున్. 99
క. త్రైలోక్యకంటకుం డా,ఖిలుఁ డటు లగుట వాని♦పై రడఁగింపన్
జాలిన సేనానిం బడయ, నాలోచనఁ జేసి శక్ర♦యత్నంబునకున్. 100
క. కారణ మగు హైమవతీ,మేరుశరాసనులకూట♦మికి యత్నంబున్
బ్రారంభించుటనికి నినుఁ, గోరి తలంచితిమి నీవు ♦ కుశలుండ వౌటన్. 101
గీ. అమ్మహేశ్వరుఁ డిపుడు మ♦హాతపంబు, సేయుచున్నవాఁ డాతని♦చెంత శైల
కన్యక తదీయసాంగత్య♦కాంక్ష నున్న,యది మదన తద్వశంవద ♦ యగుచు భక్తి.102
క. అయ్యిరువురకుం గూటమి, చయ్యనఁ గావించితేని ♦ సకలస్వర్గం
బియ్యవసరమున బ్రదుకుం, గయ్యంబునఁ దారకుండు ♦ గర్వము దొఱఁగున్. 103
క. అని సురనాథుఁడు వలికిన, విని రతినాథుండు గాఢ♦వినయంబున నా
తనితో నట్ల యగుం గా, కనుచుఁ బ్రణామంబు చేసె ♦ నంచితభక్తిన్. 104
క. అతిదుష్కరకార్యం బని, మతిఁ దలఁపక చేయఁ బూను♦మదనుధృతికి హ
ర్షితహృదయుఁ డగుచు వాస్తోష్పతి లేచి కవుంగిలించె ♦ బాహుల నతనిన్. 105
వ. ఇవ్విధంబున సహస్రాక్షుం డలరువిల్తుని సంభావించి సన్మానపూర్వకంబుగా వీడుకొల్పిన నతం డమరావతినుండి స్థాణ్వాశ్రమంబున కభిముఖుండై కదలిచనుసమయంబున.
ఆ. అశనిపాతమునకు ♦ నలికినకైవడి, భయము నొంది మోము ♦ పల్లటిల్ల
గద్గదస్వరమున ♦ గడగడ వడఁకుచుఁ, బలికె రతివధూటి ♦ భర్తతోడ. 107
మ. అవిచార్యం బని యెంచుకేని మదిలో ♦ నాలోచనం బాచరిం
ప వశీరాత్ముల మర్త్యులం గెలుచుచో♦ప్పా యీమహాకార్యమున్
సవిశేషంబుగ నిర్వహించు టిది య♦న్యాయంబు శక్యంబె యో
గివరేణ్యున్ జగదీశ్వరున్ బశుపతిన్ ♦ గెల్వంగ నీ కారయన్. 108
సీ. త్రిభువనంబులనైనఁ ♦ దీవ్రతపోనల,జ్వాలల దహియింపఁ ♦ జాలునట్టి
పశుపతి యెక్కడ ♦ పరికింప వేశల,దోస్సారయుతుఁడవై ♦ దుర్బలుఁ డగు

విరహులఁ బీడించి ♦ వీరుండ ననుచు గర్వించునీ వెక్కడ ♦ వినుము తెలియ
శలభంబు వేచ్చె ప్రజ్వలితదీపాగ్రింబు, భక్షించి నెమ్మది ♦ బ్రదికెనేని
గీ. సంధకారసమూహ మయ్యంబుజాప్తు, నాక్రమించిన యేని మహావిషంబు
నాసి మశకంబు జీవించెనేని నీవు, గెలువఁ గలవు ప్రభావసంజ్వలితు హరుని. 109
గీ. అంధకునికంటె మఱి కాలయమునికంటెఁ, ద్రిపురపతు లైన దానవాధిపులకంటె
నరసి చూచినఁ బ్రబలుండవా సుమాస్త్ర, శివునిపై నేల దండెత్తి ♦ చెడితె నీవు
గీ. వీరమానిత్వగర్వంబు ♦ విడువలేక, మతి చెడి మహేంద్రుచేత మోహితుఁడ వగుచు
నివ్విధమున దుర్వ్యవసాయ ♦ మీహసేయ, నగునె సర్వవినాశకం ♦ బదియ కాదె. 111
వ. ప్రాణేశ్వరా! నీవు ప్రతిక్రియాశూన్యంబును స్వాత్మమాత్రవినాశకంబును నైన యీదు
ర్వ్యవసాయంబు వాసవదురుపదేశమోహితుండ వై యవలంబించినవాఁడవు బృందా
రకు లందఱు అతిధూర్తులు దమకార్యసిద్ధికొఱకు ఋజుబుద్ధి వైననిన్ను సంకటంబునం
బడఁద్రోయఁ జూచెద రది యె ట్లనిన. 112
గీ. ఆత్మమందిరాగతుఁ డగునతిథిచేత, దుష్టసర్పంబుఁ జంపింపఁ ♦ దొడఁగినట్లు
పరునిసుతుచేత నేటిలోఁ ♦ దరసినట్లు, సురలు హరుమీఁద నినుఁ బంపఁ ♦ జూచి రిపుడు.
క. తెఱగంటుల కే మైనను, గొఱఁత గలదె నీవు చెడినఁ ♦ గుసుమాయుధ నీ
తెఱవ నగునేను నీచెడు, కెఱిఁగి భవద్విరహదుఃఖ ♦ మెట్లు సహింతున్. 114
క. కష్టము కష్టతరం బతి,కష్టం బతికష్టతరము ♦ ఘననియమమహో
త్కృష్టు మహాదేవుని నతి,ధృష్టుఁడవై నీవు దొడరఁ ♦ దివురుట తలఁపన్. 115
వ. అని యివ్విధంబున. 116
గీ. ధీవిశాల యారతిదేవి ♦ దెలుపునట్టి,యుక్తియుక్తంబు లైనహితోక్తు లెల్ల
విని మరుఁడు చిత్తమున భీతిఁగొనియు బయలి, కెఱుకపడ నీక ధీరత ♦ నింతి కనియె.
గీ. ఔనె పాపిష్ఠురాల యి ♦ ట్లాడఁ దగునె, ధూర్జటి దలంప నా కిప్డు ♦ దుర్జయుండె
యవనిలోపల నెంతమహాత్ము లైనఁ, గలరె మద్బాణమూర్ఛితు ♦ లగానివారు. 118
క. ఓసి! జితేంద్రియులకు న,గ్రేసరుఁడు వసిష్ఠమునివరేణ్యుఁడు నాచే
గాసింబడి పుల్కసక,న్యాసక్తుఁడు గాఁడె జగము ♦ లన్నియు నెఱుఁగన్. 119
క. గురుపత్నీసాంగత్యము, హరిణాంకుఁడు సలుపఁడే మదాశుగహతి మే
న్విరవిర వోవఁగ నంతఃకరణమునకుఁ బాపభయము ♦ గడు దూరముగన్. 120
సీ. అత్యంతజారుఁడై ♦ యరవిందనయనుండు, గోపభామలతోడఁ ♦ గూడు టెల్ల
నఖిలజగత్స్రష్ట ♦ యగుబ్రహ్మ దోషమం చెంచక కూఁతు రమించు టెల్ల
ఘనతపోధనుఁ డైన ♦ గౌతమునిల్లాలు, పురుహూతుచే గాసిఁ ♦ బొందు టెల్ల

నాదిత్యుఁ డశ్వమై ♦ యాఁచుగుఱ్ఱముతోడ, సంతుష్టిగాఁ గ్రీడ ♦ సలుపు టెల్ల
గీ. దండకం డనుభూమిపా♦లుండు మానిని,కన్యకామణి బలిమిని ♦ గవయు టెల్ల
కపికులశ్రేష్ఠుఁ డగువాలి ♦ కడఁగి యనుజు,భార్యఁ బొందుట యెల్ల నా♦పటిమఁ గాదె.
గీ. బ్రహ్మకుఁ బ్రపౌత్త్రుఁ డై నట్టి♦పంక్తికంఠుఁ, డఖిలవిజ్ఞానశేవధి ♦ యయ్యు నాదు
మార్గణంబుల సంభిన్న♦మర్ముఁ డగుచు, నపహరింపఁడె రాముభా♦ర్యను మృగాక్షి.
ఉత్సాహ. కాంత విను మదీయబాణ♦గాఢవాతకంపిత
స్వాంతు లై యసంఖ్యు లగుమ♦హాత్మ లంగనారతిన్
భ్రాంతు లగుచు నుండ నింత♦బలియుఁ డైననన్ను గో
రంత యైన భర్గకోటి ♦ కైన మిగుల శక్యమే. 123
గీ. మత్తకాశిని వినుమమీ ♦ రిత్తభయము, గలుగదు పరాభవము నాకు ♦ జలజగంధి
స్వప్నమున నైన మచ్చౌర్య♦సారమునకు, భంగ ముదయించునే పద్మ♦పత్రనేత్ర. 124
క. అని మఱి వివిధమున న,వ్వనితతనువుఁ దనదుహస్త♦వనజమునఁ బ్రియం
బున నివురుచుఁ దచ్చిత్తం,బున ధైర్యము గలుగునట్లు ♦ బోధ యొనర్చెన్. 125
వ. అప్పుడు. 126
క. రతిదేవి చెప్పినట్టుల, యతనిహితముఁ గోరి చెప్పి ♦ యాతనికోప
స్థితియు వచనధార్ష్ట్యముఁ గని, ధృతి లేక వసంతుఁ డపుడు ♦ తెలివిన్ మగిడెన్. 127
వ. అయ్యవసరంబున. 128
సీ. భూరిసారం బైన♦పుండ్రేక్షుకోదండ,దండాగ్రమున సము♦ద్దండలీల
భృంగావళీమౌర్వి ♦ శృంగారభంగిఁ బొ,సంగించి యలఘుభు♦జాబలమున
దారుణంబుగ గుణ♦ధ్వని సేయుటయుఁ దదీ,యస్ఫారవిస్ఫార ♦ మతిశయముగ
రతిసుఖపరవశ♦రమణీమణీరతి,మణితధ్వనివిశేష♦మహిత మగుచు
గీ. మొరసె దివి నంత మహాదహం♦కరణరూప,పర్వతారూఢుఁ డై భుజా♦స్ఫాలనంబు
సలిపె మదనుండు తద్ధ్వని ♦ శయసరోజ,కంకణధ్వని యొక్కటఁ ♦ గలసి మ్రోయ.129
వ. ఇత్తెఱంగున సన్నద్ధుం డై సపరివారంబుగాఁ గదలి యక్కుసుమబాణుండు కైలాస
ప్రత్యంతశైలసమీపంబున విరాజితం బైనస్థాణ్వాశ్రమంబు ప్రవేశించి దర్పాంధుండు
గావున మహేశ్వరజిగీషాపరాయణుం డై తనకు సన్మిత్రుం డైనచైత్రుం బిలిచి
యాయాశ్రమవనం బకాండోజ్జృంభితం బగునట్లుగాఁ జేయు మని యానతిచ్చిన
నవ్వసంతుఁ డతనియాజ్ఞ యవలంబించి స్వస్వరూపం బనేకరూపం బగునట్లుగా
నొనరించి యవ్వనంబునఁ బ్రతివృక్షంబునందును విజృంభింపఁ జేసిన. 130

గీ. రవిజదిగ్వ్రాతపతితజీ♦ర్ణచ్ఛదంబు, లైనలతికానికుంజంబు ♦ లపుడు దనరె
మసృణమేచకకాంతిసం♦పద పొసంగి, శాణశోధితహరినీల♦సదనము లన. 131

గీ. పండుటాకులు రాలంగఁ ♦ గాండశేష, లగుచు లతలు గన్పట్టె భూ♦షాంబరములు
కపటమున ధూర్తనాయకు ♦ లపహరింప, వరుస నిలిచినముగ్ధసుం♦దరులపగిది. 132

గీ. ఇంచుకించుకగా నంకు♦రించినట్టి,చివ్వరు గనుపట్టెఁగాఁ గాంతిఁ ♦ జెన్నుమీఱె
సరవిఁ బొడ లెల్ల మాధవ♦సంగమమునఁ, బులకితాంగు లౌవనరమా♦లలన లనఁగ.

గీ. అసమమోజ్జృంభి యై చైత్రుఁ ♦ డఖిలవృక్ష,తతుల నెనసినకతన న♦ద్భుతము గాఁగ
నక్రమోన్మేషతావాప్తి ♦ నవి దనర్చెఁ, బుష్పపల్లవసంపత్ప్ర♦పూర్ణ లగుచు. 134

గీ. మొదలఁ జిగిరించి కోరకం♦బులఁ దనర్చి
పుష్పములచేత రంజిల్లు♦భూరుహంబు
లపు డకాండవిజృంభిమ♦ధ్వాగమమున
క్షణములోఁ బల్లవములఁ బు♦ష్పములఁ జేర్చె. 135

క. దర్పాంధనయనుఁ డగుకం,దర్పమహారాజుశాస♦నంబునఁ జైత్రుం
డేర్పడ నటవిన్ యౌవన,దర్పిత యగుమగువవోలెఁ ♦ దనరఁగఁ జేసెన్. 136

ఆ. మొదలనుండి తుట్ట♦తుదదాఁకఁ జిగురుల,గుంపుచేత నాద♦రింపఁబడి ప్ర
సూనసాయకునివి♦మానంబు లనఁగఁ గం,కేళిభూరుహములు ♦ చాల మెఱసె. 137

గీ. వసుసఁ బల్లవితాశోక♦తరుచయంబు,మీఁద నర్తించుచున్నతు♦మ్మెదలగుంపు
లలరువిల్తుప్రతాపాగ్ని♦వలన వెడలు,గాఢధూమాంకురము లనఁ ♦ గానిపించె. 138

గీ. కలువకంటులమృదుపాద♦జలజతాడ
నంబునఁ దలిర్చు టతిలాఘ♦వం బటంచు
లలితముగ ము న్నశోకజా♦లములు పల్ల
వములఁ బుష్పంబులఁ దనర్చెఁ ♦ బ్రమదమునను. 139

క. బాలాస్వయమాలింగన,వేళ విరు లొసంగు టేమి♦వింత యని తదీ
యాలింగనమునకున్ మును, తాలిమిఁ గురవకము విరు లు♦దారత నొసఁగెన్. 140

క. తనపై నిట్టూర్పు వుచ్చిన,వెనుకన్ న్యాయంబు గాదు ♦ విరు లొసఁగుట యం
గనల కని తలఁచి యంతకు,మును కలుగఁగ సిందువార♦ములు విరు లొసఁగెన్.141

క. పాటలగంధులమేలిమి,పాట విని యొసంగు టెంత♦పని యని మునుమున్
బోటులకు మెచ్చి యొసఁగెన్, బాటవమునఁ బ్రేంకణంబు ♦ పరువంపువిరుల్. 142

క. మగువ తనుఁ జేరి యల్లన, నగినం దా నలరు టధిక♦నైచ్య మనుచు నిం
పుగ నగవునకున్ మునుపుగ, సొగసుగ సురపొన్న యలరెఁ ♦ జోద్యము గాఁగన్.

క. కలికి ధనంజయ నేమేఁ, బలికిన విరు లిచ్చు చేమి♦పని యని మునుము
న్నలఘుతరోత్కర్ణికారము. పొలుపుగఁ బుష్పము లొసంగె ♦ భూరిముదమునన్. 144

క. వనజాక్షులు చూచినమా, త్రనె పూచుట తమకు వెలితి♦నన మని వారల్
గనుఁగొనుటకుఁ బూర్వంబుగ, ననిచెం దిలకములు ముదము♦నన్ శీఘ్రమునన్. 145

క. ప్రమదలు మధుపూరితవ, క్త్రములన్ నమమీఁద నుమియఁ ♦ దాము వెసఁ బ్రసూ
నములఁ గొసంగుట యిది యు, క్రమ మని తమయంతఁ బూచె ♦ రహి వకుళంబుల్.

క. కని చేపట్టినవెనుకన్, బనుపడి పూయుటయుఁ దమము♦పటిమకు న్యూనం
బని మును మాకందంబులు, ననబోఁడులకున్ ముదంబు♦నన్ ఘన లొసఁగెన్. 147

క. స్త్రీముఖరాగమున కలఁక, గా మా కేమి పని ముందు♦గా మే మలరన్
సామజగమనలు మముఁ గని, తా మలయుమ టనుచు నలరె ♦ ధరఁ జంపకముల్. 148

గీ. సూనసాయకుఁ డనుయజ♦మానుఁ డపుడు, పల్లవితరోహితాశోక♦పావకమున
నతివిరక్తమానసధైర్య♦హవ్యరాజిఁ, బూనిక గ్రహించి వేల్చె న♦ద్భుతము గాఁగ.

క. శ్రీమహితతపోవనల, క్ష్మీమణిమయసౌధభంగిఁ ♦ జెలఁగెఁ గిసలయో
ద్దామము లై కంకేళీ,భూమిరుహము లపుడు చిత్ర♦ముగ నెల్లెడలన్. 150

క. నూతనమదిరాగంధ, స్ఫీతమరందము వహించి ♦ పృథుకేసరభూ
జాతసుమమంజరీసం,ఘాతంబులు దనరె సాంద్ర♦గహనాంతములన్. 151

క. వకుళప్రసూనపటలీ,మకరందరసాతిపాన♦మత్తభ్రమరీ
నికరము నర్తనగాన, ప్రకటితసమ్మోద మగుచు ♦ వనమున నొప్పెన్. 152

క. మందమరుత్సంచార,స్పందితవనలక్ష్మి లపుడు ♦ చాల మధుఝరీ
సందర్భజాతమదమున, నందముగా రవము సేయు♦నటు లొప్పెసఁగెన్. 153

గీ. భృంగసతులకుఁ బానప్ర♦సంగవేళ, సరసపానపాత్రంబుల♦కరణి నొప్పె
వకుళపుష్పంబు లభిరామవికసనంబు, లగుచు మాధ్వీకభరితంబు ♦ లై వనమున. 154

క. మాకందకిసలయంబులు, సౌకర్యము గాఁగ మెసవి ♦ సంతస మొదవన్
గోకిలములు పంచమరా,గాకలితము లయ్యెఁ బ్రతివ♦నాంతములందున్. 155

క. తుంగతపోనిష్ఠుం డగు,గంగాధరు గెలువఁ బోవు♦కామునియెదురన్
మంగళకాహళరీతిం జెలంగెన్ గోకిలరవంబు ♦ లలితం బగుచున్. 156

క. మలయసమీరణవిచలిత,తళతళితపల్లవాసి♦ధారలచేతన్
లలితసహకారనివహము, వలరాజుభటాలివోలె ♦ వనమునఁ దనరెన్. 157

గీ. చండికానాథు గెలువఁగా ♦ దండువోవు, మదనసైన్యపరాగంబు♦మాడ్కిఁ దోఁచె
నందముగ మింటఁ దరుణమా♦కందపుష్ప,ధూళిపాళిక యప్పు డ♦ద్భుతము గాఁగ.

ఆ. మూఁడులోకములును ♦ బుష్పధన్వునిరాజ్య, మయ్యె నిప్పు డనుచు ♦ నడరి చాటు
చైత్రసఖునిఘనయ♦శఃకాహళార్భటి, వోలెఁ బికరవంబు ♦ బోరుకలఁగె. 159

గీ. చారుచంపకశాఖ లు♦దారపుష్ప,గుచ్ఛభారవినమ్రలై ♦ కొమరు మిగిలెఁ
బీనకుచభారవినమిత ♦ లైనయట్టి,పూర్ణయౌవన లగువిరి♦బోఁడులట్లు. 160

గీ. భ్రమరకాంతలు మోదమొ♦ప్పంగఁ బ్రియాళి,పుష్పరసపానమత్తలై ♦ పుష్పధన్వు
జయముఁ గొనియాడఁ బాటలువాడు♦చంద మొనరె, నతిలలితగానసంపద ♦ నతిశయిల్లె. 161

క. సమదపికాలాపంబులు, భ్రమరీఝంకృతు లపార♦పంచాస్త్రధను
స్సమహితమౌర్వీటంకా,రము లొక్కటఁ గలసి కడు మొ♦రసె నెల్లెడలన్.

గీ. వనములోపల నపు డచే♦తనము లయ్యుఁ, దరుపరంబులు మధుయోగ♦దర్పితాత్మ
సారమున గుచ్ఛవక్షోజ♦భారనమ్రి, తములతికాలతాంగులఁ ♦ గౌఁగిలించె. 163

క. కామోపభోగములకై, కాముకు లాత్మాకృతులను ♦ గైసేయుక్రియన్
భూమిజము లపుడు నూత్నవి,భామహిమం దనరెఁ జిత్ర♦భంగిఁ గనంగన్. 164

ఆ. సకలజంతుచిత్త♦సముదయమదకారి, యైనమాధవుఁడు వ♦నాంతరమునఁ
జేరి యంతటను వి♦జృంభింపుచుండ స,ర్వంబుఁ గ్రొత్త యగుచు ♦ రహి వహించె. 165

సీ. ప్రతిపర్వతంబును ♦ భాసిల్లెఁ గుంజముల్, ప్రతికుంజమును లత ♦ ల్పరిఢవిల్లెఁ
బ్రతిలతంబును బుష్ప♦వితతులు గనుపట్టెఁ, బ్రతిపుష్పమును రస♦ప్రవహ మొదవెఁ
బ్రతిమకరందప్ర♦వాహంబు శీతల,శుభసౌరభచ్ఛటల్ ♦ సొంపునొందెఁ
బ్రతిసౌరభంబును ♦ బరమసమ్మదనృత్త,ములు గల్గె మదభృంగ♦లలనలకును

గీ. లక్ష్యముగఁ జూడఁ బ్రతిభృంగ♦లలనమును గ,లస్వనంబులు విసఁబడె ♦ లలితముగను
దీపితం బయ్యె నపుడు ప్ర♦తిస్వనమును, జేశలనుజాతలయము ప్రస్ఫీత మగుచు. 166

క. ప్రతిలయముల్ గమలాక్షుల,మతి లీనం బయ్యెఁ బ్రతిక♦మలదళనేత్రీ
వితతియును రాగవృత్తులు, ప్రహితము లయ్యెన్ శ్రుతిస్వ♦భావమహుపతన్. 167

క. ప్రతిరాగము రతి దేహ,పతిబాహుతాండవంబు♦ప్రతిభఁ జెలంగెన్
బ్రతితాండవమును గీతవి,తతిబంధవసంతగీతి♦తతి చెలువందెన్. 168

క. ప్రతిగీతియుఁ గృశమధ్యల,కతులిత్రడోలావిఖేల♦నాదులు గలిగెన్
రతిపతియానతి నాబుతు,పతి నిజతేజంబు నచటఁ ♦ బ్రసరించుటచేన్. 169

వ. మఱియుఁ బల్లవితాశోకసముదాయంబునందుఁ బ్రజ్వలన్మూర్తియై కోకిలకులంబునందు హుంకారకారియై యిందిందిరబృందంబులం దమందగానప్రవీణుండై మలయమారుతాంకూరవారంబులందు ఘూర్ణమానుండై సుమనఃపరాగశ్రేణులయం దాకాశోత్ప తననిపుణుండై యనూనమాధ్వీవితానంబులయందు వృష్టిప్రదుండై ధరణీరుహశా

ఖానికురంబంబులయందు నాట్యకుశలుండై యుత్ఫుల్లప్రసూననికరంబులైనసిందువారతరుప్రకరంబులయం దుద్గతహాసనుండై పుష్పితహేమపుష్పభూరుహస్తోమంబులయందుఁ బ్రౌఢాతపసంస్థితుండై ప్రఫుల్లకుసుమవిసరకర్ణికారకదంబంబులయందుఁ బీతాంబరశోభితుండై స్ఫురత్కింశుకపాళులయందు నఖక్షతాన్వితుండై యివ్విధంబున నానావిధనిజాకారుండై వసంతుండు విజృంభింపుచుండ సకలజంతుజాలంబులు ప్రమత్తంబులభంగి విపరీతశృంగారంబులైనయాకారంబులఁ బ్రవర్తిల్లుచుండె నత్తఱి నైనసమస్తమునీంద్రులు నకాలసముదితస్ఫూర్తి యగుమాధవునిశుంభత్సరంభసంపదచేతఁ బరాధీనులై నిష్ఠితుకరాగకల్లోలంబులఁ బ్రవ్యక్తవికృతులై విశ్వంబెల్ల స్త్రీమయం బగునట్లుగా నాలోకింపుచు నితస్తతఃప్రవృత్తకిన్నరీస్వరమూర్ఛనాదులయం దత్యంతాసక్తులై మహేశ్వరాజ్ఞాభయకంపితస్వాంతు లయ్యు మందమందంబుగా నాలకింపుచుండిరి స్వప్నంబునందును సుందరీవార్తాశ్రవణపరాఙ్ముఖం బగుతన్మానసంబు మదనవికారాయత్తంబైనకారణంబున గళితధ్యానధారణంబై నష్టనియమయమంబై విభ్రష్టసమాధియై యుండె నప్పుడు స్థాణ్వాశ్రమగతు లగుగణాధిపతులు నతిమదోద్ధతులై వసంతపుష్పసంభారంబాహ్లాదంబున మాటిమాటికి నాఘ్రాణింపుచు బహువిధంబు లగుగానంబు లాచరించుచు నొకళ్లొకళ్లతో నపస్తుతప్రసంగోక్తులు పలుకుచు మహాదేవునివలనివెఱపు మఱపుదగులఁ దమతమయిచ్చకువచ్చినచెయ్వులు సేయుచు నానావిధపుష్పధూళిపాళులచేత భస్మోద్ధూళనకార్యంబు సలుపుచు మధుమత్తులై నృత్యంబు లాచరించుచుండిరి మఱియు జరాయుజాండజస్వేదజోద్భిజ్జంబులైనజంతుజాలంబులలో నెద్దియైన మదనోన్మాదంబున వర్తించనియది యెట్టిది వెదకిచూచిన లేదయ్యె నిట్లు మారవికారపారవశ్యంబున సైవరివృత్తిప్రవర్తకంబులైన. 170

మ. గణబృందంబుల నందికేశ్వరుఁడు చక్కం జూచి యిట్లుండఁ గా
రణ మేమో యని వారితో ననియె సంత్రాసంబు వోనాడి దు
ర్గుణభూయిష్ఠులు గాఁగ మీరుఁ దగునే గోత్రాశతాంగుఁ హరుఁ
ఫణిభూషుఁ మదిలోఁ దలంప కిటు లున్మాదాంతరంగంబుతోఁ. 171

క. అసమయమున నిట్లున్మాదసమీరితభాషణములు దగునే మీకుఁ
బొసఁగునె యీచాపల్యము, పస గలదే దుష్టచేష్టవలన జనులకుఁ. 172

క. హాకష్టతరం బిదని, శ్రీకంఠుఁడు మనపరిభుండు శివుఁ డిప్పుడు ధ్యా
నైకపరాయణుఁడై నియమాకరుఁడై త్యక్తవాసనౌఘవికృతియై. 173

గీ. నిస్తరంగసాగరలీల ♦ నిశ్చలుండు నగుచు, నిర్మలబ్రహ్మనిష్ఠుండై ♦ నెఱిఁ దపంబు
సలుపుచున్నాఁడు తత్తప♦స్స్థానమునకు, విఘ్నము నుంకఁ గూడునే ♦ వెఱ్ఱులార.
క. తికమకగొను కిఁక నైనను, బ్రకటితధృతి నిర్వికార♦భావంబులతో
నకుటిలత నుండుఁ డని గణ,నికరములకు నాజ్ఞ యిచ్చె ♦ నిర్భయుఁ డగుచున్. 175
వ. ఇవ్విధంబున. 176
క. నాసాగ్రనిహితతర్జని, యై సర్వేశ్వరపదాశ్రిత♦తా శేషగణా
గ్రేసరుఁడు నంది సభ్రుకు,టీసంరంభంబుగాఁ గ♦టిరవహుంకృతిచేన్. 177
క. ఆజ్ఞ యొసంగ నపరస,ర్వజ్ఞుం డగుపతనియాజ్ఞ ♦ వడి మీఱఁ గతి
ప్రాజ్ఞతఁ దత్సమయప్రా,ప్తాజ్ఞత దిగనాడి తొంటి♦యాకారముతోన్. 178
వ. సకలగణబృందంబు లుండె నంత నమ్మహాత్ముని హుంకారమాత్రంబునఁ బూర్వ విధాకారచిత్తస్వాస్థ్యంబు గలుగుట కేవలగణయూథంబులకే కాదు తత్తపోవనస్థ సమస్తస్థావరజంగమప్రాణికోటులకును గల్గె నెట్లనిన. 179
సీ. శాఖాప్రైకములకు ♦ మూకత్వము ఘటిల్లె, నిష్కంపవృత్తులై ♦ నిలిచెఁ దరులు
మృగములు సంచార ♦ మొదలి నిద్రఁ బొందె, భృంగనినాదముల్ ♦ పెంపు దక్కెఁ
గలరవకలరవం♦బులు డిందుపడె మంద,పవనంబు లన్నోటు ♦ వాసి పోయె
వల్లీచయంబు చా♦పల్యంబు దిగనాడెఁ, దరఁగలసందడి ♦ దక్కెఁ గొలఁకు
ఆ. లేమి సెప్ప నప్పు ♦ డామహావనము చి,త్రార్పితంబుకరణి ♦ నధికనిభృత
మయ్యె నందికేశ్వ♦రాజ్ఞామహత్వంబు, నభినుతింపఁ దరమె ♦ యజునకైన. 180
వ. ఇత్తెఱంగున శివభక్తప్రధానుం డగుశైలాదిశాసనంబున భీతంబయ్యును వచ్చరాచరసంఘంబు మధుపరిపూర్ణవనస్థితంబు గావున మదసంభరితంబై యుండె నప్పుడు సకలచేతనానీకంబులచిత్తంబులు మత్తంబులై శృంగారక్రీడనోన్ముఖంబులై ప్రదీప్తమన్మథానలంబులై కామకల్లోలసంఘట్టితంబులై ప్రవర్తిల్లుచుండ మకరధ్వజుండు దనప్రాణేశ్వరి యైనరతీదేవితోఁ గూడ స్థాణ్వాశ్రమంబుఁ బ్రవేశించి యచ్చట దర్పాతిరేకంబున మత్తశుండాలంబుపోలిక సుందరమందగమనంబున సంచరించుచు మాయికులలోనఁ బరమమాయికుండు గావున నంతనంత మెలంగుగణాధ్యక్షులనిరీక్షణంబులు వంచించి ద్రాక్షామల్లికాదిలతికానికుంజంబులలో మాటిమాటికి నిజరూపంబు మాటుచుఁ దక్కరుండుఁబోలెఁ బ్రచ్ఛన్నసంచారుండై యోగీశ్వరేశ్వరుండైనయమ్మహేశ్వరు గెలువ నవకాశం బరయుచుఁ జొచ్చి వచ్చి యచ్చట నొక్క నిబిడం బైనమాధవీనికుంజంబు ప్రవేశించుసమయంబునఁ దదీయవామలోచనంబు పలుమాఱు నదరె నతం డది దుర్నిమిత్తంబుగా శంకించి యొక్కింత మనంబునం గలం

సుమండకక్షాణంబ సంపాతంబునకనీకం బై పార్వతీదేవిదక్షిణనేత్రంబు మందమారుతాం
దోళితం బగుచువిందంబుచందంబున బెక్కుమాఱులు చలించె నంత లతాంతబా
ణుండు నితాంతసాంద్రప్రసన్నసముదాయసమాచ్ఛాదితసకలదిఙ్ముఖం బై నయమ్మాధ
వీమంటపంబు తనకు నెలవ నిమ్ముగా భావించి యందు నిల్చి చూడ్కి యట నిగి
డించి యచ్చటికి నాతిదూరంబున. 181

క. సుమకోరకకిసలయకిసలయ,సముదయములచే నితాంత♦సమ్మదకర మై
సముదిత కేతకల మగు నొక,నమేరుతరువాసమున మొదలు♦ఁగఁ సమభూమిన్. 182

శా. కాంచెన్ బంచశిలీముఖుం డపుడు సాం♦గవ్యాఘ్రచర్మంబుపైఁ
జంచత్త్రిజ్వలదగ్నిపోలికఁ దప♦స్యాసక్తుఁ గూర్చుండి ని
ష్పంచాచాంబరమధ్యభాస్వదవివ♦స్వత్పూష్ణసాదృశ్యుఁ డై
ప్రాంచద్వీచులు లేనివార్ధిపగిదిన్ ♦ భాసిల్లువిశ్వేశ్వరున్. 183

వ. మఱియు నివాతనిహితనిశ్చలరూపదీపప్రతీకాశుండును మహాప్రకాశుండును నిరు
ద్ధసకలేంద్రియపరిచారుండును నిబద్ధసమస్తద్వారుండును నిగృహీతచిత్తచాపల్యుం
డును సుగృహీతసమాధికల్యుండును బద్ధపద్మాసనాసీనుండును నిజాంకన్యస్తకరద్వ
యభాసమానుండును గురుబుద్ధిమానసావిచార్యుండును వాఙ్మానసాతీతచర్యుండును వేద
వాదకృతాన్వేషుండును నిర్వికారశాంతివేషుండును విశ్వాతిశయమహోజస్కుండును
నపరిమితయశస్కుండును బ్రదీప్తసుషుమ్నాభిధాననాడికాంతరస్థితతేజోలోకావలోకన
నిరతుండును మానాహంకారవిరతుండును ద్వైతవ్యుత్పత్తికథామాత్రరహితుండును
నిశ్చలాకృతిమహితుండును యుగపదుత్ప్రేక్షితానేకసహస్రసహస్రాంశుసమాననిజదేహ
పరిభూతతేజస్సమూహాకలితభువనప్రకరుండును నహంతేదంతాద్వయైక్యానుభవతత్ప
రుండును మఱియు నచింత్యుండును నపరిజ్ఞేయుండును నద్వయోల్లాసవాసితుండును
జన్మాత్రదృష్టియు నగుచు నాకాశంబు నెల్ల శోషింపం జేయుపోల్కిఁ బ్రద్వేషుల నెల్ల
నొక్కమాత్రలో నుద్వృత్తుగా నుమాడ్కిఁ దనరుచుఁ బ్రళయకాలమార్తాండసదృశ
ప్రచండుం డై కృపాశాంతముఖాంబుజుం డై యుండియు. 184

క. పరమవ్యోమనిరంతర,పరమానందైక్యలబ్ధిఁ ♦ బరఁగినపగిదిన్
బరితోషపూరితాంతరం,గరణంబునఁ దన్నుఁ దాన ♦ కనుఁగొను దేవున్. 185

క. కతిపయదినముల విశ్వము, నతులితతేజమున నడఁచి ♦ యంతట దానిన్
వితతముగఁ బూర్వవిధమున, నతినిపుణతఁ జేయుకరణి ♦ నమరెడువానిన్. 186

సీ. అంతకంతకు నెక్కు ♦ డై ననుహాతపో,వహ్నికి నేకాధి♦పత్యుఁ డగుచు
సులభస్వతంత్రతే♦జోబృందమున నస్వ,తంత్రజగత్త్రయ♦ద్రావణంబు

సేయువాఁడును బోలెఁ ♦ జెలువొందువాని హృ,ద్వికృతిశూన్యుం డయి ♦ నెలయువాని
నఖిలమోహనుఁ డైన♦యలవసంతునిచర్య, నంటక యతినిష్ఠ ♦ నమరువాని
గీ. శాంతు లగువారిలోపల ♦ శాంతతముఁడు, భీషణులలోన నత్యంతభీషణుండు
భూరిగంభీరు లగువట్టివారిలోఁ, బరమగంభీరుఁ డని యెన్నఁ♦బడినవాని. 187
క. అన్యాగోచరమహిముఁ డ,నన్యాకలితాష్టవిధమ♦హైశ్వర్యాఢ్యుం
డన్యాదర్శితసంయముఁ, డన్యాయవిదూరుఁ డగుచు ♦ నలరెనువానిన్. 188
గీ. చిత్రతరముగ నొకకళా♦మాత్ర మైన, బాహ్యదృష్టి లే కాంతర♦భవ్యదృష్టి
గలుగుపరమేశ్వరుని నీల♦కంఠు భర్గుఁ, జూచి భయవిహ్వలుం డయ్యె♦సూనశరుఁడు.
వ. ఇట్లు మహాదేవసందర్శనమాత్రసముద్భూతభయశంకాశృంఖలానిబద్ధుం డై యాక
సాలకిసలయసన్నద్ధునకుఁ దక్షణంబున. 190
చ. వెలవెలఁబారె మో మధిక♦విస్మృతి యయ్యె మనంబు దేహముల్
బులకిత మయ్యెఁ గంపమును ♦ బుట్టె రసజ్ఞ నితాంతశుష్క మై
బలముఁ దొఱంగె ధైర్యము వి♦పర్యయ మొందె భయంబుచే విని
శ్చలత వహించె దృష్టి కర♦సారసవిచ్యుత మయ్యెఁ జాపముల్. 191
వ. ఇత్తెఱంగున విభ్రాంతచిత్తుండై చిత్తసంభవుం డెద్దియును జేయునది లేక ముహూ
ర్తమాత్రంబు వివశుండై తనబలంబున దన్నును నిజపాణివిస్రస్తం బైనసబాణబాణా
సనంబును నెఱుంగక మహామోహనిశ్వాసేశ్వరజిహీర్షాప్రత్యవాయంబు మహాపాశరూ
పం బై తన్ను బంధించెనో యన నితాంతకర్దమపతితుం డైనభంగి నిట్టట్టుఁ గదల
నేరక యూఁబట యనునది యెఱుఁగక గాఢతపోనిష్ఠుం డైనయమ్మహేశ్వరుసన్ని
నంబునఁ బుట్టినభయంబున మూర్ఛితుండపోలె నిశ్చేష్టితుం డై యశనితాడితునికరణిఁ
జూపట్టి మహాదేవతేజంబునఁ దద్దయు నభిభవంబు నొందినపగిది వివర్ణుండై మఱియు.
క. దీప్తోగ్రతదీయతప,స్తప్తుండును బోలె గుండె ♦ దడదడ మనఁగాఁ
దప్తాంబరీషమధ్య,క్షిప్త తిలకణంబుభంగిఁ ♦ జేష్టడి మఱియున్. 193
వ. అత్యంతవిహ్వలుండై విగళితసమస్తచాతుర్యుండును విరహితధైర్యుండును వివర్జిత
వీరవాదుండును భయకంపితపాదుండును నిరస్తయుద్ధసంకల్పుండును దూరతోన్యస్త
వాసవజల్పుండును నగుచుఁ దన్నుఁ బ్రాణమాత్రావశేషునిఁగాఁ దలంచుచుండె నంత
కుమున్న రతీదేవియు నతనియట్ల మనంబు గలంగఁ బాణీశ్వరునిసాహసచేష్టితం
బునకు దుఃఖించుచుఁ గన్నుల బాష్పకణంబులు దొరుఁగ దీర్ఘోష్ణనిశ్వాసంబులు సలు
పుచు సంయమరాశి యైనయమ్మహేశుని తేజంబు విభ్రాజమానంబై సకలదిగ్వ్యా
పకం బై తనచూపులకు మిఱుమిట్లు గొలుపుటవలన నార్తి నొంది వాఙ్మనఃకాయం

బుల భర్తృవిజయంబ కోరుచు భయపాశబద్ధాంతరంగియుఁ బ్రకంపితాంగియు విస్రస్తోత్తరీయముక్తాహారకలాపయు నతిగద్గదదీనస్వరయు నై యూరక నిలిచి చూచుచుండె నివ్విధంబునఁ బ్రసంఖ్యానపరుండై నయాత్రిపురహరునిమహాతపస్సంరంభంబు చూచి మున్నెన్నఁడు గెలువఁబడని వచ్చినరతిపంచబాణు లతిసాధ్వసాకులితప్రాణులై యుండిరని చెప్పి హయగ్రీవుండు వెండియు నగస్త్యున కిట్లనియె. 194

శా. అంతం దమ్మరుఁడైనపంచశరుశౌర్యంబుల్ యథాపూర్వ మ
త్యంతంబుల్ ప్రబలంగఁ జేయుటకునై తా వచ్చెనో నాఁగ వా
సంతానేకలతాంతభూషితతనూసౌందర్యలావణ్య యై
యెంతే వేడుక వచ్చె శైలసుత సద్వేషాసనేవాఢ్యయై. 195

వ. ఇవ్విధంబున. 196

సీ. పంచనాయకసార్వభౌమసామ్రాజ్యము,హాలక్ష్మి ప్రత్యక్ష మైనయట్లు
లాభరణావళీశోభితతనుకాంతి, శృంగారరస మతివృద్ధి నొందఁ
జేయుచుఁ జారుకైశికభరోపరిబద్ధ,మాలతీసురభిళమాల్య మమర
హాగనుము త్రెవ్వుఁజేరుచుక్కకై వడి సిందు,వారకోరక మురుప్రభఁ దలిర్ప
గీ. నర్ధహారిణాంకు నెకసక్కె మాడునట్టి,యలికతలమున సిందూరతిలకభాతి
నలఘుకాశ్మీరపాటలం బై తనర్చు,లలితకంకేళిపుష్పదళంబు మెఱయ. 197

క. ఎలదేఁటిగములు గంధప్రలోభమున వెంట రాఁగ భాసిలి శ్రవణం
బులకు విభూషణ మై సప్తలాకుసుమగుచ్ఛకము లుదారరుచిఁ దగన్. 198

గీ. నిజకపోలతలంబుల నెరసినట్టి, చారుకంకేళిపుష్పగుచ్ఛప్రకాండ
విచ్యుతపరాగము లకాండవిలసిత మగు,రమ్యహాలారుణిమభాతి రాజిలంగ. 199

క. రసికద్విరేఫగణములు, వసంతసుమసౌరభంబు వదలి తనదుని
శ్వసితపరిమళము లానఁగ, ననదృశగతి వెంట నంటి యరుదేరంగన్. 200

క. సురుచిరపల్లవకోమల,కరకమలగృహీతరక్తకమలము తద్బా
హురుచిబృంహీకృత మగు,కరణిం గనుపట్టి యళిముఖర మై మెఱయన్. 201

గీ. స్థూలముక్తాకతకాంతుల గేలిసేయు,భూరిధవళాంబు లగుసిందువారకోర
కములచే భూషితం బయి కనకకుంభ,సన్నిభమనోహరయుగళంబు పేర్మిఁ దనర.

క. శృంగారభుజయుగంబున,సంగదరూపంబు లగుచు నామోదఝరీ
సంగతకైతకదళములు, భృంగద్యుతిగౌరవంబు ప్రాపింపంగన్. 203

క. విలసితసుగంధభరమున, నెలదేఁటులమోహపఱిచి యింపు గులుకుచున్
లలిత మగువకుళదామము, నలువుగఁ గాంచీవిభూషణం బై మెఱయన్. 204

క. తిమిరమునఁ బ్రికాశిల్లెను, సుమహితతారాగణముల♦సొబగునఁ ధమ్మి
ల్లమున బహుళవాసంతిక,సుమసముదాయము లుదార♦శోభ వహింపన్. 205

క. భూషణస్థానముల నెల్లఁ ♦ బుష్పరచిత,లలితభూషణములచే న♦లంకరించె
మదనునిప్రధానమంత్రి యౌ♦మాధవుఁడు గృ,తార్థుఁగాఁ జేయుచును భాసు♦రాంగలీల.

క. తనయట్ల సఖిమణులును, వనపుష్పాభరణ లై య♦వారితభక్తిన్
దన వెంటఁ గొల్చి రా వ,చ్చె నగాత్మజ నిత్యశంభు♦సేవావిధికిన్. 207

క. ఆసుదతి స్వభావమున మ,హాసౌందర్యనిధి యగుట ♦ నపుడు సముద్య
ద్వాసంతికకుసుమవిభూ,షాసంగతి నధికశోభఁ ♦ జాలఁగ నొప్పెన్. 208

వ. అప్పుడు. 209

మ. అడవిన్ జీఁకటిఁ ద్రోవ దప్పి యసహా♦యత్వంబునన్ భీతిచే
జడుఁడై పోవఁగలేనివానికి మదిన్ ♦ సంతోష ముప్పొంగఁ గాఁ
గడు వేగంబున సూర్యబింబ మెదురన్ ♦ గాన్పించుచందాన ముం
గడఁ బుష్పాస్త్రున కద్రినందనశుభా♦కారంబు గాన్పించినన్. 210

గీ. భవ్యశృంగారసీమ రూ♦పంబు దాల్చి,లలితతరపరమానంద♦లహరి రాగ
మునకుఁ బోషక యుత్కంఠ ♦ కునికిపట్టు, తనరుతారుణ్యమునకు సం♦స్థాన మగుచు.

క. వెలసిననగసమ్రాట్కు,ల,కలశాంబునిధానచంద్ర♦కళ యగుగౌరీ
జలజాక్షిం గని యెప్పటి,బలమున సన్నద్ధుఁ డయ్యె ♦ భావజుఁ డపుడున్. 212

వ. ఇవ్విధంబున. 213

సీ. వాడినసస్యంబు ♦ వర్షధారాళిచేఁ, బసిమితోఁ గాంతిని ♦ బ్రబలినట్లు
ప్రాణసంశయకరా♦త్యంతరోగార్తుండు, జీవనౌషధలబ్ధిఁ ♦ జెలఁగినట్లు
సంజ్ఞారహితుఁ డైన♦జనుఁడు సంజీవన,కరణిచే చైతన్యంబుఁ ♦ గాంచినట్టు
లతిదరిద్రుం డనా♦యాసలభ్యం బైన,నిక్షేపమునఁ బుష్టి ♦ నెగడినట్లు

గీ. భర్గసేవార్థమై వచ్చు♦పర్వతేంద్ర,తనయయద్భుతసౌందర్య♦ఘనతఁ గాంచి
తనదుపూనిక యొనగూర్తు ♦ ననుచుఁ దలఁచి,యుల్లమున సంతసిల్లెఁ జి♦త్తోద్భవుండు.

క. వనితామణి యగునంబిక, దనకున్ జయసాధనము గ ♦ దైవతగణవం
దనయోగ్యు భర్గు గెలిచెద, ననియెడుదుర్బుద్ధి వాఁడమె ♦ నజ్జాస్త్రునకున్. 215

వ. ఇత్తెఱంగున ధైర్యోత్సాహసమన్వితుం డై యతం డంతకుముందర భయంబున నిజహస్తవిస్రస్తంబు లగుశరశరాసనంబులు మగుడ ధరించి నిశ్శంకశంకరజిగీషాయత్తచిత్తుం డయ్యె వెండియుఁ జంచచ్చంచలాచంచరీకమాలికామంజుతరళాలోకనపుంజం బైనపార్వతీవదనకంజంబు గనుంగొనుమకరకేతనునకు మున్ను పొడవడఁగినబాహు

నీరస్థంబు కరిమ్మక్షుల గ్రమక్రమంబునఁ బ్రమృద్ధం బయ్యె నప్పు డమ్మహనీయానుభావ
యచ్చటికి కట్లు వచ్చి మహోత్సవసమయంబునఁ దన్నేత్రంబులకు వినోదపాత్రం
బుగా నరికి నానుకగా నప్పించునది యై యేకాగ్రదృష్టి గలిగి యంతకుమున్న
విచిత్రరచనాశ్లేషసమగ్రంబు గాఁగ. 216

మ. అతిదై చిత్రి మహాప్రయత్నమున సా♦హాయ్యం బపేక్షింపక
ప్రతిమాకారం బగుశిల్పనైపుణిని బు♦ష్పశ్రేణిచే హంసవం
శతిహారం బొనరించి శోభనిమాల♦పద్మంబు రంజిల్లఁ జే
యుచు లంపుల్ మది హెచ్చఁ బచ్చనిసరే♦బోత్కంఠ దీపింపఁగన్. 217

సీ. నిరుణకేత్పహాసమండిత♦ద్వారిభూమి, యందెఁ గనుఁగొని డెంద మా♦నంద మొంద
నిందువేషక నదిరఁ బ్రా♦ర్థించె మృదుల,మధుమధురభాషణముల న♦మ్మంజుభాష.

గీ. ఓమహాభాగ నంది మా♦స్వామివారి, కెఱుకసేయుము నారాక ♦ హితమితాక్ష
రంబుగా యుక్త మగునమ♦యంబు వేచి, నీవె యవసరజ్ఞుండవు ♦ నిపుణమతివి.

గీ. నిత్యసేవార్థ మిచ్చట ♦ నిఖిలనాథు,దర్శనముఁ గోరి యిట్లున్న♦దాన నేను
ననఘుచరితె తత్కింకరి ♦ నైననాదు, మనవిఁ దెల్పుము శివునకు ♦ వినయఫణితి.

సీ. భాగీరథీస్వర్ణ♦పద్మసంభవము లై, జా నొందుబీజకో♦శములు దెచ్చి
ఖరకిరణాతప♦పరిశోషితంబులు, గావించి శితసూచి♦కాముఖమున
మ్మృదువుగా వేధన♦క్రియ లెస్సగాఁ జేసి, రమ్యంబు గాఁగ సూ♦త్రమున గ్రుచ్చి
యధికసూక్ష్మము మనో♦హరము శాస్త్రోక్తసం,ఖ్యాన్వితం బైనయా♦యంబుజాక్ష

గీ. మాలికావలయం బిప్డు ♦ నీలకంఠ,రుచకు నుపఢౌకనము చేసి ♦ ప్రణతి యాచ
రించి మగుడ నెప్పటియట్ల ♦ ప్రీతితోడ, వత్తు వేగమ వినిపింప♦వలయు నీవు. 221

క. స్వామికి సమీపవర్తిను, లౌమహనీయులకు నెల్ల ♦ నగ్రణివి గదా
యామహిమాఢ్యనిసత్కరు,ణామహిమకు పాత్ర గాఁగ ♦ ననుఁ జేయఁ దగున్. 222

మ. అని ప్రార్థించిన నంది హేమమయవే♦త్రాంచత్కరుం డౌచుఁ జ
య్యన నట్లయ్యెడుఁ గాక యంచు గిరిశా♦భ్యర్ణప్రదేశంబు మె
ల్లన జేరం జనునంతలోపలన నీ♦లగ్రీవుఁడుం దాఁ జిరం
తనసుధ్యానసమాధి యై యితరచిం♦తాశూన్యచిత్తంబుతోన్. 223

వ. అతినిష్ఠ నుండి యప్పుడు. 224

గీ. అక్షయము నద్వయంబును ♦ నై నయాత్మ,తత్త్వమున లీన మై యున్న ♦ తనదుమాన
సమ్ము మెల్లన మగిడించి ♦ సమధిక మగు,ధ్యాన ముడిగి విశ్రమమునఁ ♦ దనరె హరుఁడు.

సీ. నాల్గురేకులు గల్గు♦నలినంబుకడనుండి, యూర్ధ్వభాగమునకు ♦ నుద్గమించు
పవనంబువలనఁ బూ♦ర్వము నభస్థితుఁ డయి, వెనుక ధ్యానసమాధి♦విరతుఁ డగుచు
భూమిసమాసీనుఁ ♦ డామహాదేవుని,పదునాల్గుజగముల♦భారమునకు
సమధికం బైనభా♦రము గల్గినమహాత్ము, భరియింప యోగిహృ♦త్పద్మ మొకఁడు
గీ. దక్క నాదివరాహంబు ♦దండశూక,పతియు దిగ్గజములు కుల♦పర్వతంబు
లాదికూర్మ మశక్తంబు ♦లయ్యె నప్పు,డెన్నఁ దరమె యెవ్వరికి యో♦గీంద్రుమహిమ.
వ. అప్పుడు. 227
పంచచామరము. శిలాదనందనుండు శంభుఁ ♦ జేరి భక్తితో హిమా
చలాత్మజాత నిత్యసేవ ♦ సల్ప వచ్చి ద్వారదే
హళీసమీపభూమి నిల్చి ♦ యస్మదాగమంబు స
ర్వలోకనాథు లైనస్వామి♦వారితోడఁ దెల్పుమా. 228
క. అని నాతోఁ జెప్పిన నే,నును దేవరవారికడఁ జ♦నువు గల్గుటచే
వినయమున విన్నవించితి, ననుజ్ఞ దయసేయఁ దగుఁ ద♦దాగమమునకున్. 229
క. దేవరకు నుపాయనముగ, దేవనదీకాంచనాబ్జ♦దీపితమృదుబీ
జావళికృతాక్షశుభమా,లావలయముఁ దెచ్చినది నె♦లఁత యతిభక్తిన్. 230
వ. అని విన్నవించిన. 231
శా. ఆసర్వేశుఁడు నందికేశ్వరునిమా ♦ టాలించి కించిచ్చల
ద్భ్రూసంజ్ఞన్ దయతో ననుజ్ఞ యొసఁగన్ ♦ బూర్ణత్వరన్ నంది యు
ల్లాసస్ఫూర్తిని దోడితెచ్చి శివుమ్రో♦లన్నిల్పె సాకార యా
నాసూనాయుధమాయయో యన సురూ♦పాధిక్య యానంబికన్. 232
వ. ఇత్తెఱంగున. 233
మ. పదమంజీరఝుళంఝుళజ్ఝటులు ను♦స్ఫారంబుగా మ్రోయ ను
న్మదవేదండమనోజ్ఞయాన మలరన్ ♦ భూమిభృత్తనూజాత వ
చ్చి దయాంభోనిధి యైనశంకరునకున్ ♦ జేసెన్ నమస్కార మిం
పొదవన్ గొప్పున జాజిక్రొవ్విరులు లీ♦లోదారతన్ జాఱఁగన్. 234
వ. ఇట్లు పర్వతరాజనందన సభయంబును సభక్తికంబును సవ్రీడంబును గా నిందుధరున
కభివందనం బాచరించి ఝణంఝణితభూషణవిశేష యై లేచి నవరత్నఖచితతప్తస్వ
ర్ణమయరమణీయకరభూషణఘులఘులాత్కారసహితంబుగా నూతనప్రవాళకోమలప్ర
వాళలతికాభిరూప్యసద్మంబు లగుకరపద్మంబులు గదియించి యంజలిపుటంబు నిటలత
టంబున ఘటియించునప్పుడు మీనకేతనకేతనపటాంచలంబు తెఱంగున రంగుమీఱి

[illegible]రమ్యవనాంతరం [illegible] సాకసా[illegible]స్వయప్రకాశాభిరామం బై తారుణ్యసరో జక్రీడాకుతూహలతరంగితాంతరంగం బగుచు ఘనాంగవిహంగయుగళంబుపోలిక వక్షో రుహద్వంద్వంబు ప్రస్ఫుటం బైన చనుసిగ్గు దొలుక చెలువున జగరకుఁజూపులు గులుక [illegible] జిలుక నలికఫలకంబున నలకంబులు బెళుకఁ గంకణంబులు సునాదం బులుగాఁ బలుక నచ్చిలుకలకొలికి మోము వాంచి కరపల్లవంబున వేగంబ యుత్తరీ యంబు సవరించి మాపడి మాటుసేయుచు మహాదేవునిమెదుర నిల్చినఁ బంచశరుం డు మున్న సమయాన్వేషణతత్పరుం డై యున్నవాఁడు గావున నదియ సమయం బుగాఁ గొని [illegible]. 235

క. మొ[illegible]ంబుఁ మదనుఁడు, కఱకంపని గెలువ నాత్మఁ ♦ గాంక్షించి వడిన్
జె[illegible] బలుమింట నలరుఁ, జుఱుకులకోరి యరింబోసెఁ ♦ జోద్యము గాఁగన్. 236

వ. ఇవ్విధంబునఁ బుండ్రేక్షుకోదండంబున దండి యగుగండుఁదుమ్మెదనారిసడుమ దైర్య విద్రావణనామధేయం బైనయొక్కపుష్పబాణంబు సంధించి కటకాముఖసుందరం బై నకరంబున నాకర్ణాంతంబుగాఁ దిగిచి ముష్టిపీడితలస్తకం బై నయితరహస్తంబు నిజపురఃప్రసారితం బగుచుండ లక్ష్యప్రవృత్తైకాగ్రదర్శనంబున సావధానుం డై ధను స్సంధానితసాయకసంస్థానంబు పరిశోధించుచుఁ బ్రత్యాలీఢప్రకారంబున జానుసంకు చద్దక్షిణచరణుం డై పురఃప్రసారితవామచరణాగ్రపరిపీడితమహీతలుం డై తిర్యగ్గ్రీవ వృత్తహారంబును ధనురాకర్షణవిశాలంబును సమున్నతశాలియు నై నయురస్స్థలంబునఁ జూపట్టి శరమోక్షణోద్యోగకుతుకంబున నప్పరమేశ్వరుఁ దప్పక కనుంగొనుచుండె నప్పుడు. 237

క. చంద్రోదయావసరమున, సంద్రం బుప్పొంగినట్లు ♦ స్వాంతాబ్జమునన్
సాంద్రముగ రాగపూర మ,మంద్రత నుప్పొంగెఁ, జంద్ర♦మకుటునకుఁ గడున్. 238

క. ఆగంగాధరుఁ డాంతర,యోగంబున కంతరంగి♦యును నతినిష్ఠా
ప్రాగల్భ్యుఁడు నై యుండియు, రాగోర్మివిఘట్టితాంత♦రంగుం డయ్యెన్. 239

క. నెలతాలుపుమే నత్తఱి, నిలుపునకుఁ జెమర్చెఁ బాణి♦నీ రేజమునన్
విలసిల్లునక్షమాలిక, చెలువుమెఱసి జాఱి పడె బు♦సీమధ్యమునన్. 240

క. ఏమేని బలుక వచ్చిన, నో మఱు పుదయించి పలుకఁ ♦ జొప్పడమిఁ జల
త్కోమలదళసచ్ఛదముగ, నామహనీయుండు విస్మ♦యమునొందె మదిన్. 241

గీ. కంపితాంగుళి ప్రస్వేద♦కణయుతంబు, నై సహస్తాంబుజమున న♦య్యభవుఁ డపుడు
భస్మమండిక పలుమాఱు ♦ పట్టిపట్టి, చూచెఁ బసిలేసిపని గాఁగఁ ♦ జోద్యముగను.

ఆ. ఏమి చెప్పవచ్చు ♦ నామహేశ్వరుఁ డప్డు, తన్నుఁ దా నెఱుంగఁ ♦ దలఁపు లేక
యుండి మాటిమాటి ♦ కుత్కలికాబద్ధ,రంగనాహితుని తె♦ఱంగు నొందె. 243

క. చంచలవిలోచనము చల,వంచద్భ్రూలతలు మంద♦హాసరుచిం జె
న్మించుగిరికన్యమోమును, నుంచెఁ దనదుదృష్టి నభవుఁ ♦ డుత్కలికమెయిన్. 244

ఉ. అప్పరమేశ్వరుండు దను ♦ నచ్చపుఁబ్రేమ నపూర్వరీతిగా
నప్పుడు చూచుచూడ్కులకు ♦ నవ్వసుధాధరకన్య యవ్విభుం
దప్పక సానురాగమునఁ ♦ దానును గన్గొన స్వేదజాలకం
బుప్పతిలంగ మేనఁ బుల♦కోత్కరముల్ దను వెల్ల ముంపఁగన్. 245

ఆ. దైవకల్పిత మయి ♦ తనయందు శివునకు, సాభిలాషదృష్టి ♦ సంధిలుటకు
నతికృతార్థ మయ్యె ♦ వితతమద్భాగ్యసా,మ్రాజ్య మనుచు నలరె ♦ గ్రావతనయ.

సీ. తను సాభిలాషచి♦త్తతఁ గనుంగొను శంభు, నధికభక్తిఁ బ్రణామ ♦ మాచరించు
నంజలి ఫాలంబు♦నందుఁ గీలించు దో,ర్మూలప్రభాళి ప్ర♦స్ఫుటము గాఁగఁ
బయ్యెద జాఱ సం♦భ్రమమునఁ గుచకుట్మ,లముల మాటుఁ బటాంచ♦లంబుచేత
శర్వతపోవిఘ్న♦సంత్రాసరాగమం,దాక్షప్రమోదంబు ♦ లైక్య మొంది
గీ. తనదుమానసవారిజా♦తముఁ జలింపఁ,జేయు శారదపూర్ణిమా♦శీతకిరణ
సోదరం బైనమోము వం♦చుచును బెళుకుఁ,జూపుఁదూపుల శివునినొం♦చుచును గిరిజ.

క. మత్తుం డగుచిత్తజుఁ డను,క్రొత్తయుపాధ్యాయుఁ డపుడు ♦ రూఢిఁ గఱప ను
ద్వృత్తిన్ నిగూఢభావము, లత్తఱిఁ బ్రకటించె గిరిజ ♦ యాశివుమ్రోలన్. 248

మ. అనురాగంబున మాటిమాటికి గిరీ♦శాకారసౌందర్యముల్
గనుచున్ గాంత వృషధ్వజుండు దను ను♦త్కంఠన్ గనుంగొన్నయం
తన తాఁ జూడనియట్ల లజ్జయును సం♦త్రాసంబు చిత్తంబునన్
బెనఁగన్ మో మటు ద్రిప్పు సస్మితముగా ♦ మేనన్ గగుర్పారఁగన్. 249

క. నవవిలుకానికి జయసా,ధన మగుమేన్పులక భూషి♦తంబుగ భూభృ
త్తనయ బహుభావముల శం,భునిమదిఁ గరఁగించెఁ జోద్య♦ముగ క్షణమాత్రన్.

వ. మఱియును. 251

ఉ. కన్నుల లజ్జదేరఁగ మొ♦గంబున లేనగ వంకురింప వే
డ్కన్నులతాల్పుమ్రోల నుప♦ఢౌకనరీతిఁ బ్రసూనరాజిచే
ము న్నొనరించి చెన్నలరు♦ముద్దులు గుల్కమరాళయుగ్మమున్
సన్నుతలీల యన్నలిన♦చారువిలోచన నిల్చెఁ బొల్పుగన్. 252

మ. ఇట్లై పుణ్యము నాత్మ మెచ్చి తనసాం♦ద్యంబు వీక్షించుచుం
భవుఁడున్ మెచ్చఁగు కానుకగాఁగఁ గరకాం♦భోజాతబీజావళిన్
పసనిర్మించినయక్షమాలిక మహో♦వ్యత్రిప్తితో మ్రోల నుం
చి నతిన్ జేసె నెలంత భక్తియుత యై ♦ చేదోయిఁ గీలించుచున్. 253

ఉ. ఆపపారాలు నాస్కగ సమ♦మంచితభక్తి నొసంగుమాలికన్
రాజధరుండు చూచి మది ♦ రంజిలి దాని సముల్లవిస్మృతం
బౌ జపకాండ్ మప్పు హృద♦యంబునఁ దోఁచిన దాని మానసో
ద్వేజకహేతు వారయఁగ ♦ వేగమ బుద్ధిఁ దలంచి వేడుకన్. 254

క. ప్రాంచద్ధృతి యగుసక్కలి, కంచితపతిమోహమునందుఁ ♦ గీలొక్కని రక్తిన్
మించిం దృక్త్రితయము మరలించె సదాశివుఁడు ధైర్య♦లీల వెలయఁగన్. 255

క. వర్ణాగ్రేసరుఁ డగునా, పర్యత్నాలుండు దనదు♦భావము రాకా
శశ్వదయక్లోష్క తజల, రాశ్యాభత నొందుకత మ♦రయఁగాఁ దోడఁగెన్. 256

ఉత్సాహ. కారణంబు లేక యీయ♦కాండధైర్యవిప్లవం
బేరికైనఁ జేయ శక్య♦మే మదీయవిషయ మం
చారజన్యధీరమహా ♦ యఖిలదిక్కులందు సం
చార మందఁ జేసె దృష్టి♦సంఘు మధికసత్వరన్. 257

వ. ఇట్లమ్మహాదేవుండు నిజతపఃప్రత్యూహకృద్దిదృక్షాపరాయణుం డై దిగ్వీక్షణంబు సలుపుచుఁ దనదు దక్షిణభాగంబున ననతిదూరంబున నొక్కమాధవీమంటపమధ్యంబున. 258

సీ. మంజీలితపుండ్రేక్షు♦కాండాసనంబున, మహితభృంగాత్మక♦మౌర్విఁ గూర్చి
భువనమోహక మైన♦పుష్పబాణము వేక్క, సంధించి బలదుర్మ♦దాంధుఁ డగుచు
సవిఁ ప్రత్యాలీఢ♦సంస్థానచరణుఁ డై, యనుపమసౌందర్య♦ఘనతతోడ
వెనుకవెక్కు సభయా♦న్వితచిత్త యై గడ,గడ వడంకుచు రతి♦కాంత నిలువఁ
గీ, గడఁకఁ దను నేయ గమకించు♦కదనశూరు, మేరునగధీరు దుష్టవిచారు రాజ
కీరపటివారు సుందరా♦కారు మారుఁ, జూచి యఖిలేశ్వరుండు మదిఁ ♦ జోద్య మందె.

వ. ఇట్లాశ్చర్యంబు నొంది యమ్మహాత్ముండు తనయాత్మ నిద్దురాత్ముం డె కదా మదీయసమాధినియమభంగం బొనర్చినవాఁ డని మనంబునఁ గోపానలంబు సముత్థితం బగుటయు- 260

క. భ్రుకుటీబంధమును భయానకదృష్టియుఁ దనదు మోము♦నం గన్పడఁగా
సకలజగదీశుఁ డబ్జారికళాధరుఁ డపుడు దుర్ని♦రీక్ష్యుం డయ్యెన్. 261

క. ఆసమయంబున మేరున, రాసనముఖరోషచిహ్న ♦ లంబిక గని సం
త్రాసమునఁ గంపితాంగము, తో సన్నుతసన్న జరిగె ♦ దూరము గాఁగన్. 262

వ. అప్పుడు. 263

క. భీష్మగిరీశనిటలస్థమ, హోష్మలనేత్రంబువలన ♦ నుత్థిత మగుచున్
గ్రీష్మర్తుపనాభ బర్హి, శ్శుష్మోగ్రజ్వాల పర్వె ♦ సూనాస్త్రుపయిన్. 264

వ. అట్టియెడ. 265

క. కోపం సంహర సంహర, కోప మిదానీం త వాస్తు ♦ కుశలం కోపా
టోపవికారో మాస్తు భ, యాపహ శంభో యటంచు ♦ నమరులు భీతిన్. 266

చ. పలికినపల్కు లప్పుడు న♦భంబున నుచ్చతరంబు గాఁగ సం
కులముగ సర్వభూతముల♦కుం దెలియ న్వినవచ్చునంతలో
పలన మహేశ్వరోగ్రతర♦ఫాలవిలోచనకుండనిర్గత
జ్వలనశిఖాంకురంబు సుమ♦సాయకు నీఱుగఁ జేసె క్రేల్మిడిన్. 267

ఆ. అతనిపనికి సాక్షు ♦ లై వచ్చి యచ్చట, నర్థిఁ జూచుచుండు♦నమరు లెల్ల
హరునికోపదృష్టి ♦ నతిభీతు లై పలా, యనముఁ బొంది రప్పు ♦ డతిజవమున. 268

క. ఆదారుణకర్మము దా, నాదటఁ గన్గొనఁగ లేక ♦ యంబిక మది నెం
తో దరము మేనఁ గంపముఁ, బొదుకొన న్మూసె నేత్ర♦పద్మద్వయమున్. 269

క. వెఱపున సఖు లిరువురుఁ ద, త్తఱపడి తనుఁ గౌఁగిలింపఁ ♦ దానును గను ని
వ్వెఱ నొంది నిల్చెఁ గన్నులు, దెఱవక నగరాజతనయ ♦ ధృతి దక్కి మదిన్.

వ. వదంపడి తనమనంబున. 271

ఆ. అమ్మచెల్ల యట్టి♦యద్భుతసంరంభ, మేను మున్ను చూచి ♦ యెఱుఁగ ననుచుఁ
గరి మురంబునందుఁ ♦ గదియించి గడగడ, వడఁకుచుండె శైల♦వరతనూజ. 272

వ. ఇవ్విధంబున. 273

క. హరసంరంభప్రాభవ, నిరీక్షణభయార్త యైన♦నిజసుతకడకున్
ద్వరితముగ వచ్చి హిమభూ, ధరవరుఁ డాదరముతోడఁ ♦ దగ ని ట్లనియెన్. 274

శా. చింతం జెందఁగ నేల తల్లి ధరలో ♦ శ్రేయంబు లెన్నంగ న
త్యంతంబున్ బహువిఘ్నముల్ బహుతరా♦యాసంబు ల ట్లౌట నీ
స్వాంతాంభోజమునం దలంచినపనిన్ ♦ సర్వేశ్వరుం డెప్పుడో
సంతోషంబుగ నాచరించుఁ గరుణన్ ♦ స్వాంతంబుగా వేడ్కతోన్. 275

క. సుత విను మహానుభావుల, మతు లోకులకంటె విరులకంటె ♦ మార్దవయుతముల్
శతకోటికంటె నొకతఱి, నతినిష్ఠురతరము లేల ♦ యరుదంద మదిన్. 276

గీ. అక్షిభయంకరమైనయ♦య్యలికనేత్రుం, భ్రుకుటికుటిల మహాముఖు మేడ ♦ పుష్పసదృశ
కోమలాంగి వాని వేడ ♦ కొమ్మ యెట్లు, నీవు సహియించితివి దాని ♦ నిశ్చలధృతి.
సీ. శ్రావ్య మిమ్మ్మ పోదము మన♦ఘనవనమునకు, నచట నీచేతఁ బూజిత ♦ లై ప్రసన్ను
లగుచు గృహదేవతలు నీకు♦నక్షమవరంబు, వేగ మొసఁగూర్పఁగల రేల ♦ జాగుసేయ.
క. అని లజ్జాభయములచే,న నిమీలితనేత్రి యైన♦తనయ నిజాంసం
బున నుంచి వేఁడ హిమగిరి, ఘనభవనంబునకు నత్యు♦దారతఁ జనియెన్. 279
సీ. నిటలనేత్రాగ్నికీలాక♦నిప్రదగ్ధ, కామమలయజభూజ మై ♦ క్షణములోన
కేలిచే నీలకంధరు♦నీలకంఠ, రంబు వసనభంబున ♦ దవ♦చ్ఛనము నొందె. 280
వ. ఇత్తెఱంగున. 281
క. తపమునకు ముఖ్యవిఘ్నము, చపలవిలోచనలతోడి♦సంగతి యని య
న్నిపురాంతకుఁ డిఁకఁ జెవ్వఁ, డపు డచ్చట లేచి యిష్ట ♦ మగునెడ కరిగెన్. 282
క. ఈశాపరాధశంకా,వేశితచిత్తమున సకల♦విబుధులు ప్రతిబ
ద్ధాశాస్యు లగుచు నాత్మని,వేశములకుఁ జనిరి సభయ♦విస్మయు లగుచున్. 283
క. కుసుమంబులతోఁ గిసలయ, విసరంబులతోడ నపుడు ♦ వింతగ నెంతో
పస చెడి కను శోషించెన్, వసంతుఁ డవ్వనమునన్ శి♦వక్రోధమునన్. 284
క చిలుకలు గొరువంకలు గో,యిలలున్ దుమ్మెదలు నప్పు ♦ డిం పగురీతిన్
బలుకక నివ్వెఱపడి మూఁ,గలపోలిక నుండె మేను ♦ గడగడ వడఁకన్. 285
వ. ఆలోన. 286
క. పురసంహారానలస్థిత,సరోషదృగ్దహనభస్మ♦సాత్కృతసుమన
స్సరవీరాగ్రిమమూర్ఛా,పరవశ యై రతివధూటి ♦ భగ్నహృదయతన్. 287
క. మొదలికి మఱికి గూలెడి,కదళిక్రియన్ భూమిమీఁదఁ ♦ గను వడిఁ బడి క్రొం
బొదలెడు గదలక మెదలక, మది నేమియు నెఱుఁగ లేక ♦ భ్రాన్పడి యుండెన్. 288
చ. తెలివి యొకింతసేపునకుఁ ♦ దెప్పిఱి లేచి కడిందిచింతచే
మఱిమఱి క్రొన్ను మూర్ఛలను ♦ భ్రాన్పుచున్ మగుడంగఁ దేఱుచున్
మఱుఁగుచుఁ గంకణధ్వని స♦మగ్రము గాఁగ నురంబు చేతులన్
జఱచుచుఁ గైశికమ్ము తన♦సంతసుమానసు లుర్విఁ గప్పఁగన్. 289
గీ. ధూర్జటీమానసాగ్ని రంబు♦తోడ దైన్య, మాకృతి వహించినట్లు మ♦హార్తి నొంది
భస్మమాత్రావశిష్టుఁ డౌ♦భర్తఁ జేరి, మొలుఁగు గుత్తుకఁ దగులంగ ♦ నిట్టు లనియె.
తరువోజ. హానాథ మన్మథ ♦ హామనోనాథ, హామహాసౌందర్య ♦ హామేరుధైర్య
సూననిర్జితలోక ♦ సులభవివేక, సూనృతాలాప భా♦సురబలాటోప

మానవతీమాన♦మథనప్రవీణ, మహితతపోవిఘ్న♦మాయాధురీణ
యేను దెల్పినయట్టి♦హితవచనంబు, లేమియు వినక నీ ♦ వి ట్లైతి విచట. 291

క. నీసౌందర్యాధిక్యము, నీసౌజన్యాతిశయము ♦ నీశౌర్యంబున్
నీసరసవాక్చమత్కృతి, నీసాంగత్యంబు నాథ ♦ నే నెటు మఱతున్. 292

గీ. అకట యత్యంతదీన న♦నాథశరణ, నార్త నగునన్ను విడిచి యెం ♦ దరిగె దనఘ
యనుచు జాలు గదంగదన ♦ నతికరుణము, గాఁగ విలపించుచును మహా♦క్రందనంబు.

క. సలుపుచు నేలం బొరలుచుఁ, గలఁగుచు దుఃఖించునిజన♦ఖప్రియ దాఁ
దలఁపించె బ్రహ్మశాపము,కలిమి వసంతుండు వనట ♦ గదిరినమదితోన్. 294

క. తరుణీమణి తనపతికిం, బరమాప్తుం డగునసంతు♦భాషణములచేఁ
బరమేష్ఠిశాపపద్ధతి, స్మరుఁ డడఁగుటఁ దెలిసి మఱియు ♦ జైత్రునివలనన్. 295

గీ. అమలజగదంబికాప్రసా♦దమున భావి,కాలపతి దేహలాభను♦క్రమము విదిత
మాటచేఁగొంతయూఱట ♦ యాత్మనొలయ,నుచితగతిఁ బ్రతీక్షించుచు♦నువిదయుండె.

క. అని హయవదనుఁడు దెల్పిన, మనమున సంతోష మంది ♦ మానివరుం డా
ఘనుఁ గనుఁగొని వెండియు ని,ట్లను వినయం బానసమున ♦ కాభరణముగన్. 297

సీ. దేవవందిత హయ♦గ్రీవ మహాప్రాజ్ఞ, సర్వవిద్యామహా♦జలనిధాన
యడిగెద నొక్కటి ♦ యంభోజసంభవుం, డేమికారణమునఁ ♦ గామదేవు
నతిపరాక్రమవంతు ♦ నలిగి శపించె న,క్కథ సవిస్తరముగాఁ ♦ గరుణతోడఁ
దెలుపఁగ వలయు సం♦దేహంబు లేకుండ, ననినఁ దురంగాస్యుఁ ♦ డాదరమునఁ

ఆ. బలికె మానివర్య ♦ బ్రహ్మశాపవిధంబు, విస్తరింతు నీకు ♦ వినుము వేడ్కఁ
బూర్వకల్పవేళ ♦ భువిఁ జాక్షుసాఖ్యమ,న్వంతరమున నిరువు ♦ రసురవరులు. 298

క. సుందోపసుందు లనువా, రందఱికిం బెను దపో బ♦లాధికు లగుచున్
బృందారకగణములఁ బా,ఱం ద్రోలిరి భుజబలమున మెఱ♦యఁ బలుమాఱున్. 299

గీ. లోకకంటకు లగుచు న♦వ్యాతశాస,నాదిసురలకు నోర్వశ♦క్యంబు గాని
విక్రమోద్రేకమున విశ్వ ♦మాక్రమించి, రసురవీరులు సౌభ్రాత్ర ♦ మతిశయముగ.

శా. మాయామాయుద్ధవిశారదుల్ సమదశుం♦భద్విక్రముల్ ప్రస్ఫురద్దై
తేయుల్ భూరిబలుల్ కృపారహితు లై ♦ దేవాదులం గిట్టి య
న్యాయప్రక్రియ బాధపెట్టి జగతిన్ ♦ యజ్ఞక్రియాఘంబు స్వా
ధ్యాయంబున్ జపమున్ దపంబులును దే♦వార్చావిధుల్ సున్నగన్. 301

మ. సకలాశాంతతి లోగ దోరత నిజా♦జ్ఞాచక్ర మత్యంతమున్
బ్రకటస్ఫూర్తిఁ బ్రవర్తిలన్ సురవధూ♦రాజిన్ జెఱల్వట్టి నూ

ఇక బృందారకభూజముల్ వెఱికి చం◆ద్రద్యావసశాతాగ్నిబా
ఘను లై వైవసమందిరంబులు వృథా◆దర్పాంధులై కూల్చుచున్. 302

మ. బలమున్ దేజము కర్కశత్వ మతిద◆ర్పంబున్ మదంబున్ దపో
బలమున్ గర్వము నిర్దయత్వము నసం◆భ్యత్వంబు తుల్యంబుగా
ఖలు వైతేయయువంబు బాధపఱుపన్ ◆ గాసిల్లి మేరూపరి
స్థలి నింద్రాదులు గూడి మంతనము ల◆త్యంతంబుగాఁ జేయుచున్. 303

క. దైత్యోపఘోపాయం బాదిత్యులు మదిఁ గోరి యంత ◆ దేవజ్యేష్ఠున్
బ్రత్యుత్పాదిముఖాంబుజు, నత్యున్నతు శరణుచొత్తు ◆ మని నిశ్చితులై. 304

వ. అచ్చోటు గదలి వేదఘోషనినాదితంబును మూర్తిమద్వివిధాధ్వరతపస్యాసంయు తంబును శతానందరాజవాహ్యరాజహంసవంశోద్భూతధవళచ్ఛదసంభారచారువి హారంగమనిగంతిరసరోవరంబును సావిత్రీగాయత్రీసరస్వతీనామదేవతాత్రయభాసు రంబును సావయవసమస్తవేదసకలాగమసేవితంబును సాకారశోభితసప్తకోటిసుమహా మంత్రసృష్టిపరివారితంబును నగుచు మఱియుఁ గృష్ణాజినోత్తరీయులు జటాధరు లు వేదపూతసాంద్రశ్మశ్రుసుందరముఖాంభోజు లగుకర్దమమరీచికశ్యపాదిమునిబి డౌజులకు దండకమండలుమండితహస్తులు సర్వలోకప్రశస్తులు పరబ్రహ్మానుసంధా ననిరతు లశేషసంగవిరతులు నగుప్రజ్ఞాసాంద్రు లైనసనకాదియోగీంద్రులకు నధి ష్ఠానంబై యశేషైశ్వర్యప్రభాసమానం బైనబ్రహ్మలోకంబుఁ జేరి యం దపరిమిత శోభాసుంచరం బైనయరవిందసంభవుమందిరంబుద్వారదేశంబున నిల్చి తమరాక దౌవారికముఖంబునఁ బరమేష్ఠికిఁ దేటపఱిచి తదనుజ్ఞాతులై యమ్మహాత్ముం డున్నయాస్థానమంటపంబుఁ దఱిసి యచ్చట గవ్యూతిమాత్రదీర్ఘవిచిత్రసహస్రపత్ర రమణీయంబును గోశమాత్రాయతకర్ణికామహనీయంబును నర్ధక్రోశమాత్రకేస రోచ్చాయసుందరంబును స్థూలనాళమనోహరంబును నై నిత్యంబును మార్తాం డసాన్నిధ్యంబువలన నదావికసితముఖం బగుపద్మసింహాసనంబున నాసీనుండై చతురాననసముద్భూతవేదాదిసకలవిద్యాసమాజుండును బింగళశ్మశ్రువిరాజితవద నాంభోజుండును సీషత్కపిలనేత్రుండును విద్రుమాతామ్రగాత్రుండును మహా యోగీంద్రసర్వతోనిరంతరస్తూయమానుండును జటామకుటభాసమానుండును సమీపస్థితపక్షిద్వితయభాసురకైలాసవిలాసాపహాసిమహోత్తుంగదేహనిజవా హనరాజహంససేవితుండును త్రిభువనసీరూపగంధర్వపురీనిర్మాణప్రవీణకటాక్షాను భావితుండును నగుచు నతిప్రసన్నంబును శాంతంబును గారుణ్యసాంద్రంబును సకలజగత్సముదయకృతోపకారం బైనయాకారంబునఁ దేజరిల్లి నిర్మలస్తుతిస–

స్తులును బద్ధాంజలిపుటులు నై మూర్తిమంతు లైనచతుర్దశవిద్యలు సేవింప నజరుండును ననామయుండును నమాయుండును దయామయుండును విశ్వనిర్మాతయు నైనయవ్విధాతం గని సర్వసుపర్వులు పునఃపునఃప్రణామంబు లాచరించుచు భక్తియుక్తంబుగా ననేకస్తుతు లొనరించి యంజలిపుటంబులు నిటలతటంబుల ఘటియించి యి ట్లని విన్నవించిరి. 305

సీ. అరవిందసంభవ ♦ యఖిలజగత్సృష్టి, నగునీవు కరుణ నిం♦డార మమ్ము
నరసి ప్రోచుచు నుండ ♦ ననఘాత్మ యింతకాలము సుఖస్థితి సంత♦సమున నుంటి
మిపుడు దుర్దాంతులు ♦ కపటశీలురు దురా,చారపరాయణుల్ ♦ క్రూరబుద్ధు
లుగ్రవిక్రములు సుం♦దోపసుందాఖ్యు లౌ,దానవవరు లన్న♦దమ్ము లడరి

ఆ. సాహసమున మించి ♦ సచరాచరము లైన,మూఁడులోకములకు ♦ భూరిబాధ
సేయుచున్నవార ♦ లీయెడఁ దద్వధో,పాయ మీవు దలఁప♦వలయు వేగ. 306

ఆ. ఇట్లు సేయ కిపు డు♦పేక్ష చేసితివేని, నడఁగు సకలనిర్జ♦రాధికార
ములు సమస్తలోక♦ములు నశించు మహాను,భావ యట్టు లగుటఁ♦గావు మమ్ము.

క. అని సురలు విన్నవించిన, విని శతధృతి మందహాస♦విలసన్ముఖుఁ డై
యనిమిషులఁ జూచి పలికె ద,శనకాంతులు వదనపంక♦జము భూషింపన్. 308

క. సుందోపసుందకృతబా,ధం దల్లడపడి సమస్త♦దైవతగణముల్
గుంది యిటు రాక నాదుమ,దిం దెలిసితి నిట్లు మీరు ♦ దెలుపకముందే. 309

క. వారల వధింప శక్తుం,డీరేడుజగంబులందు ♦ నెవ్వాఁడును లేఁ
డీరీతి నరసి చూచిన, వారలె వారల వధింప♦వలసినవారల్. 310

ఆ. వారు నన్నుఁ గూర్చి ♦ దారుణ మగుతప, మధికనిష్ఠతోడ ♦ ననుపమముగ
నాచరించి రద్భు♦తావహు లై పూర్వ,మఖిలలోకములు భ♦యంబు నొంద.

శా. అత్యాశ్చర్యతదీయనిష్ఠకు మదిన్ ♦ హర్షించి నే నంతటన్
దైత్యశ్రేష్ఠులముంగట న్నిలిచి మీ♦తాత్పర్యముల్ దెల్పుఁ డేఁ
బ్రీత్యుత్కర్షముతో ఘటింతు ననఁ దృ♦ష్టి న్వారు భక్త్యాదరా
న్నత్యష్టాంగయుతప్రణామము మహా♦నందంబుతోఁ జేయుచున్. 312

గీ. స్వామి మాయభీష్టం బిప్డు ♦ సంఘటింపఁ, గరుణ మీమానసంబునఁ♦గలిగె నేని
విన్నవించెద మర్థితో ♦ వినఁగవలయు,సావధానంబుగ మహాను♦భావ నీవు. 313

గీ. అన్నదమ్ముల మగుమాకు ♦ నెన్నఁటికిని,జలజసంభవ వైరంబు ♦ గలుగ దెచటఁ
దలఁప నట్లౌట మాకు మా♦వలనఁ దప్పఁ,గీడు రాకుండ మముఁ గటా♦క్షింపవలయు.

క. అని వేఁడిన వారలఁ గనుఁగొని యే నిట్లంటి మీరు ♦ గోరినవరముల్
ఘనకృపతో నిచ్చితి మీ, కనిశము సమృద్ధియుతుల ♦ రై మనవలయున్. 315
ఆ. మిము జయించువాఁడు ♦ మీకంటె నన్యుండు, గలుగ నేరఁ డీజ ♦ గత్త్రయమునఁ
బహుభుజాబలమునఁ ♦ బ్రౌఢవిక్రమమున, మీకు సములు మీరె ♦ లోకములను.
క. అని యాజ్ఞాపించితి నో, యనిమిషవరులార యట్టు ♦ లగుట నిపుడు నా
కును హరిహరేంద్రప్రముఖ్యుల,కును శక్యము గాదు వారిఁ ♦ గూల్పఁగ నాజిన్.
క. అయ్యసురులమారణమున, కియ్యెడ నదుపాయ మొకటి ♦ యేను దలఁచితిన్
గ్రియ్యాక డయ్యాక వారల, నయ్యమపురమునకుఁ బనుప ♦ నను వగుదానిన్.
వ. అది యెయ్యది యనిన. 319
శా. చాతుర్యంబున సర్వలోకవనితా ♦ సౌందర్యసారాంశముల్
ప్రీతిం గైకొని దాని నొక్కవనితం ♦ బెంపొందఁ బుట్టింతు న
ద్దైతేయోత్తము లానెలంతఁ గని యు ♦ ద్యన్మోహవిభ్రాంతు లై
భ్రాతృస్నేహము వీడి యొండొరులఁ జం ♦ పం జొత్తు రాలంబులోన్. 320
వ. అని పలికి వారలం గనుంగొనుచుండఁ దత్క్షణంబ. 321
క. సరసిజభవుండు త్రిభువన,తరుణీరత్నములచక్కఁ ♦ దనములలోనన్
వరుసఁ దిలమాత్రములు గొని, యరుదుగ నిర్మించె నొక్క ♦ యలికులవేణిన్. 322
సీ. దానఁ జేసి తిలోత్త ♦ మానామధేయంబు, గాంచినయక్కన్య ♦ కాలలామ
వర్ణితదీప్తలా ♦ వణ్యపూర్ణాంగి యై, సవిలాసపాదసం ♦ చార యగుచు
లోచనాంభోరుహా ♦ గోచర యైనంతఁ, బురుషాంతరంగముల్ ♦ గరఁగుచుండ
నాగేంద్రకుంభపీ ♦ నస్తనద్వంద్వన,మన్మధ్యవల్లరీ ♦ మహిత మగుచు
గీ. సరసశారదపూర్ణిమా ♦ చంద్రబింబ,ముఖ్యదాయాద యైనట్టి ♦ మోమునందు
లలిత మై చిఱునవ్వువె ♦ న్నెల రహింప, ననిలచలితనీలోత్పలా ♦ భాక్షు లలర. 323
క. అనుపమసౌందర్యము లై, తనరునిజాంగములయద్భు ♦ తప్రభ చేతన్
గనకమణిభూషణంబుల, ననువుగ భూషించు చమ్మ ♦ హాద్యుతిమతి యై. 324
సీ. లావణ్యసంపద ♦ లలితవిద్యున్మయం, బవలోకనముల చే ♦ నబ్జమయము
దంతాభచేత జ్యో ♦ త్స్నామయంబును నీల,కచభారమునఁ బింఛి ♦ కామయంబు
పల్లవమృదుపాణి ♦ పాదాబ్జనఖమండ,లంబున నక్షమా ♦ లామయంబు
దంతహాసంబునఁ ♦ గుందపుష్పమయంబు, తనువునఁ బరిశుద్ధ ♦ కనకమయము
గీ. నైనరూపంబు గల్గున ♦ య్యతివయందు
దృష్టి నిల్పి మనోభవ ♦ తీవ్రబాణ

బాధితమనోంబుజాతుఁ డై • పద్మజాతుఁ
డభిలషించెఁ దద్రతము మో•హాంధుఁ డగుచు. 325

గీ. కలశసంభవ యే మని • పలుకవచ్చుఁ, గనఁగ లేఁడు ధర్మాధర్మ•కార్యగతుల
నెంతవాఁ డైన నతిధైర్య•వంతుఁ డైన, నవని నత్యంతకామాంధుఁ • డైనవాఁడు.

క. సుత యైన జనని యైనను, మఱిఁ దలఁపఁగ భగిని యైన • మదనుఁడు ధను వా
తతముగఁ జేసినయంతన, ధృతి నిలుప నశక్య మెంత•ధీరున కైనన్. 327

క. వనజభవుని కవ్వనితం, గనుఁగొనుసమయమున మదన•కాండనిహతిచే
నెనిమిదిచూపులు జంబా,లనిమగ్నములట్ల రూప•లగ్నము లయ్యెన్. 328

గీ. మదనుఁ డనునర్తకుండు నె•మ్మది నటింపఁ, జేయ విధిదృష్టిటీసము•దాయ మప్పు
డెలమి మిగుల నర్తించె న•జ్జలజవదన,లలితగాత్ర మన్ రంగస్థ•లంబునందు. 329

క. తా నిర్మించినకాంతన్, దా నుపభోగింపఁ దనకుఁ • దగ దనక వచో
మానవతీవిభుఁ డయ్య,బ్జాసనుఁ బట్టుకొనఁ దలఁచె • నాశ్చర్యముగన్. 330

క. తను బలిమిఁ బట్టఁ దివిరెడు,వనజోద్భవుతలఁ పెఱింగి • వనితామణి చ
య్యన హరిణీరూపంబునఁ, గనుకని ఘనభీతిఁ బఱచెఁ • గడు దూరముగన్. 331

ఆ. తాను హరిణవేష • మూని గ్రక్కున బ్రహ్మ, దానిఁ గూడఁ జనె న•నూనమోహ
చలితహృదయుఁ డగుచు • సర్వసుపర్వుల,యెదుర లజ్జ వదలి • హీనవృత్తి. 332

శా. ఈరీతిన్ మదనాస్త్రబాధ మదిలో • నింతైన నన్యాయ మం.
చారూఢిం దెలియంగ లేక సుతపై • నాసక్తుఁ డౌపద్మజున్
వారింపంగ నశక్యు లైన దివిజ•వ్రాతంబు నీక్షించి తాఁ
గైరాతాకృతిఁ బూనె శంభుఁడు జగ•త్కల్యాణసంధాయి యై. 333

సీ. విసువక తనవెంట • వేదము ల్నాలుగు, శునకంబు లై భక్తి • ననుసరింపఁ
బింఛావతంస మై • పృథులగుంజాభర,ణాఢ్య మై నిజదేహ•యష్టి మెఱయఁ
గటితటాచ్ఛాదక•కమనీయమార్దవ,నవ్యశార్దూలాజి•నంబు దనరఁ
గేల నొక్కశరంబు • గీలించి త్రిప్పుచు, సజ్య మై యొకకేలఁ • జాప మమర

గీ. శరశరాసనహస్తు లై • శబరవేష,ధారు లై ప్రమథేశ్వరుల్ • దన్నుఁ గొలువఁ
దలఁప నతిభీషణంబు న•త్యంతసుందరంబు నై తత్కిరాతవే•షంబు వెలసె. 334

వ. మఱియును. 335

సీ. కరిదంతనిర్మిత•కంకణవాదికా,మహిత మై హస్త యు•గ్మంబు దనరఁ
గోమలధవళగుం•జామణిహారముల్, స్తనమండలమున న•ర్తనము సలుప

నతిమనోహరపల్ల♦వాబద్ధపటము కటీతటంబునఁ గను ♦ శీవి మెఱయ
రమణీయమృదులదూ♦ర్వాదళశ్యామల,తనులతాకాంతు లం♦దముగ మెఱయ
గీ, పంచశాఖోప్పసఁ బింఛపు♦దండ మొప్ప, నలికతలమునఁ గరిమద♦తిలక మలర
నఖులు వేసవే ల్తునయట్లు ♦ శబరకాంత,లగుచుఁ దనచుట్టుఁ గొల్వ న♦త్యద్భుతముగ.

క. స్వేచ్ఛాకిరాతియై తను, నచ్ఛాంబుజనయన త్రిజగ♦దంబిక గొలువన్
స్వచ్ఛందకిరాతుఁడు శివుఁ, డిచ్ఛాహారిణంబువేఁట ♦ కేతెంచె వడిన్. 337

వ. ఇట్లు డగ్గఱి. 338

క. మోహమునఁ దనదుసుత యని, యూహింపక పొందఁ గోరి ♦ యువతిఁ గదియునా
సాహసకర్ముని విధిఁ గని, యాహరుఁ డస్త్రంబు వింట ♦ నమరిచె వేగన్. 339

శా. ఈరీతిన్ దను నేయఁ బూని త్వరతో ♦ నేతెంచురుద్రున్ మృషా
కైరాతాద్భుతవేషుఁ గన్గొని యొడ ♦ ల్గంపింపఁగా భీతితో
నారుక్మాచలధన్విపాదముల ను♦ద్యద్భక్తిమై వ్రాలి యో
కారుణ్యాత్మ మహాపరాధిఁ గుమతిన్ ♦ గామాంధు న న్గావవే. 340

వ. అని దీనవచనంబులు వల్కుచు మఱియును. 341

సీ. ఖండితవేదండ♦పుండరీకాసుర,తాండవలోల మా♦ఖండలాది
బృందారకమునీంద్ర♦సందోహవందిత,సుందరపాదార♦విందయుగళ
మమరాపగాభుజం♦గమజటాభారాస్థి,హిమకరాలంకృత♦విమలవాళి
మంబరకేశ మా♦శాంబర మింద్రనీ,లాంబుదోపమగళం ♦ సాంబదేవ
గీ, మాదృశాశ్రితసముదయం ♦ మాదృశాతి,దీనజనవత్సలం భవా♦దీనవప్ర
మోచనం సూర్యసోమాగ్ని♦లోచనం స,దాశివం త్వాం ముదాహం స♦దా భజామి.

వ. అని వెండియు. 343

గీ. పరమపూరుష నీమహా♦బాణమునకు, నంధకాసురుఁడును త్రిపు♦రాధిపతులు
సంతకుఁడు లక్ష్య మగుఁ గాక ♦ యింతకంటె,నరసి చూచిన లోకంబు♦లందుఁగలదె.

క. ఓపరమేశ్వర నాపైఁ, గోపింప కనుగ్రహించి ♦ గొబ్బున యుష్మ
చ్చాపంబున సంధించిన,కోపం బుపసంహరింపు ♦ ప్రోద్యద్దయతోన్. 345

గీ. అని భయార్తుఁడై ప్రార్థించు♦నవ్విరించిఁ, గాంచి కాంచనగిరిధన్వుఁ ♦ డంచితదయ
మించ వింట సంధించిన♦మేటిశరము, నపుడ యుపసంహరించె దే♦వాలి మెచ్చ.

క. గతమదనవికారుం డగు,శతధృతిఁ గని సంతసమున ♦ శర్వుం డంత
ర్హితుఁ డయ్యెఁ బూర్వరూపత, నతివ యజునిపాదములకు ♦ నప్పుడు మ్రొక్కెన్.

వ. ఇత్తెఱంగునఁ దిలోత్తమ స్వస్వరూపధరుం డై ప్రసన్నచిత్తుం డైనయన్నలినగర్భునకుఁ బ్రణామం బాచరించి దేవా దేవర కభీష్టంబును నాకుఁ జేయ శక్యంబును నైనకార్యం బేమేనియుఁ గల్గినయేని నప్పనికి నన్ను నియమింపుము మీయనుగ్రహంబున నే నది నిర్వహించి మీస్వాంతంబునకు సంతసం బొనర్చెద నని విన్నవించిన నవ్విరించి యమ్మించుఁబోఁడి నాదరించి దేవతలం బిలిచి దీనికి హితంబుగా భవత్సౌందర్యమోహితు లగుసుందోపసుందుల కన్యోన్యకలహంబుఁ బుట్టించి నెట్టన వారు గీటడఁగునట్లుగాఁ జేయు మని యాజ్ఞాపించిన నవ్వాలుఁగంటి సకలదేవపురస్కృత యగుచు నచ్చటఁ గదలి భూలోకంబునకు వచ్చి సుందోపసుందులు నివసించి యున్నపురంబు డగ్గఱి యొక్కమనోహరం బైనబాహ్యోద్యానంబునఁ గాంచనడోలిక నధిరోహించి యక్కలకంఠి కలకంఠంబుల సిగ్గుపఱుచుమధురనాదంబున గానంబుసేయుచు గాంధారమధ్యమషడ్జంబు లనునుత్తమగ్రామత్రయంబు యథాకాలంబుగాఁ బ్రకటించుచు నాకంపితస్ఫురితహతప్రత్యాహతంబు లనువాదనభేదంబుల యథావసరంబుగా విపంచి వాయించుచు సర్వసంఘట్టకారణంబు లైనమూర్ఛనలచేత జగజ్జనంబుల మోహింపంజేయుచు రాగాలాపప్రవర్తిని యగుచు వీణచేఁ గలనిస్వనంబులు పలికించునన్నెలంతం గని యుద్యానవనపాలకు లెల్ల విస్మితచిత్తులై సంభ్రమంబుగాఁ బఱతెంచి సుందోపసుందులకుఁ దద్వృత్తాంతం బంతయు విన్నవించి మఱియు ని ట్లనిరి. 348

క. భూలోకములోఁ గద్రూ,భూలోక ములోన నదితి♦భూలోకములో
నాలీలావతి కెన యగు,బాలామణి గలదె యెన్ని♦భంగుల నరయన్. 349

క. అని చెప్పిననప్పలుకులు, విని వా రొండొరులఁ గడవ ♦ వే వచ్చి ఘనా
ఘనవేణిచెలువుఁ గనుఁగొని, మనసిజనిర్మథ్యమాన♦మానసు లగుచున్. 350

క. తనతనభోగ్యం బని యవ్వనితారూపంబునం ద♦వారణనిజలో
చనములు లగ్నంబులు గా, ననిమిషు లై యుండి రప్పు ♦ డసురశ్రేష్ఠుల్. 351

వ. ఇవ్విధంబున నత్యంతమోహవిభ్రాంతు లై యాత్మైకభోగార్థం బన్నెలంతయందు స్వస్వబుద్ధిఁ బ్రతిష్ఠించుచు నంతకంతకు భ్రాతృస్నేహంబు వదలి తమలోఁ దాము గలహింపఁ దొడంగి రప్పుడు సుందుం డుపసుందున కి ట్లనియె. 352

గీ. అగ్రజునిభార్య యిది దీని ♦ నంటఁ దగునె, వత్స యుపసుంద నీ కది ♦ వావి గాదు
పితృసమానుండు జ్యేష్ఠుండు♦ పృథివిలోన, నతనిభామిని తల్లి యౌ ♦ నరసి చూడ.

గీ. మాతృసన్నిభ మైనయా♦మగువయందు, శిష్టబుద్ధి వై సాపేక్ష♦దృష్టి మాను
మనిన నత్యంతకోపర♦క్తాత్ముఁ డగుచు, నన్నుఁ గనుఁగొని యుపసుందుఁ♦డనియెనిట్లు.

క. నీకంటె మున్ను చూచితి, నీకోమలి నిదియ నాకు ♦ నిం పగునిల్లా
లీకంజాతవిలోచన, నీకుం గోడ లగు ధర్మ♦నిష్ఠఁ దలంపన్. 355

క. అనుజులఁ దనుజులయట్టుల, మనమునఁ దలపోయ వారి♦మగువలు గోడం
డ్రనుజుండ నీకు నే న్వనజానన గోడ లగు ధ్రు♦వంబుగఁ జూడన్. 356

ఆ. కలదె నీదుమదికిఁ ♦ దెలియనిధర్మంబు, మగువ దీని నంట ♦ న గును నీకుఁ
దలఁచి చూడ నిట్టి♦ధర్మవిరోధంబు, సేయ దుష్టు డవరె ♦ క్షితిజనములు. 357

క. అని యన్యోన్యముఁ బరుషవ,చనముల భర్జించి యుద్ధ♦సన్నాహముతో
దనుజుం డగ్రజుఁడును మా,ర్కొని పెనఁగిరి మారుఁ డెంతక్రూరుఁడో తలఁపన్.

క. సాహసవృత్తిఁ గచాకచి, బాహాబాహిన్ గఠోర♦పాదాపాదిన్
దేహము డాఁపక పోరిరి, హాహా యని చూప ల్లెల్ల ♦ నాశ్చర్యపడన్. 359

క. భ్రాతృస్నేహము వదలి య,రాతులవలెఁ బోరి నిజక♦రపాలిఁశుగదా
ఘాతములఁ గూలి రిరువురు,దై తేయులు సురలుఁ సమ్మ♦దంబునఁ దేలన్. 360

పంచచామరము. తిలోత్తమావధూటి యంత ♦ దేవకార్యమీక్రియన్
ఫలింపఁ జేసి క్రమ్మఱంగ ♦ బ్రహ్మపాలి కేగ న
న్నలంత గారవించి కూర్మి ♦ నీరజాసనుండు పు
ష్కలంబు లౌవరంబు లిచ్చె ♦ సంతసంబు హెచ్చఁగన్. 361

వ. ఇత్తెఱంగున. 362

గీ. అప్సరోభావమును నన♦న్యాభిరూప్య,మును సమస్తామరాంగనా♦ముఖ్యతయును
దేవలోకనిర్వృతియు రా♦జీవగర్భుఁ, డిచ్చి వీడ్కొల్పె దివికి న♦మ్మచ్చెకంటి. 363

ఆ. ఇది మదీయదుహిత ♦ యీయింతిరూపంబు,నంద నామనంబు ♦ సాభిలాష
మగుట కేమి హేతు ♦ వగునొక్కొ యత్యంత,పాతకుండు మరుఁడె ♦ హేతు వరయ.

క. నాయంతవాని నిటు మో,హాయత్తునిఁ జేయుక డుదు♦రాచారుఁడు వీఁ
డేయెడ మహాంతరాయ మ,మేయతపమునలుపుసంయ♦మిప్రవరులకున్. 365

క. ఎట్టిమహాత్ముల నైనన్, నెట్టన యొకయొఱకటమున ♦ నెఱిఁ బడఁద్రోచున్
గట్టిఁడిబలితెపురట్టడి, గట్టుగ శాపాగ్నిచేతఁ ♦ గాల్తున్ వీనిన్. 366

వ. అని నిశ్చయించి యత్యంతకోపంబున. 367

క. తలఁచినయంతన యెదుటన్, నిలిచినయమ్మదనుఁ జూచి ♦ నీరజ గర్భుం
డలుక మనంబున రెట్టిగ, జలజాస్త్రున కిట్టు లనియె ♦ సత్వరఘణితిన్. 368

క. ఓరిమదాంధ దురాత్మక, క్రూరాచారప్రవర్తి♦కుఁడ వై మత్పు
త్రీరూపముపై నాకుం, గోరికఁ గలిగించి తిట్లు ♦ గూడునె చేయన్. 369

క. ఈకర్మమునకు ఫలము౯, శ్రీకంఠలలాటనేత్ర♦శిఖికీలాద
గ్ధాకారుఁడవు గాఁగల, వోకామ యటంచు శాప ♦ మొసఁగెం బెలుచ౯. 370

క. ధృతిదూలి యంత మదనుఁడు, రతిదేవియు మ్రొక్కి యత్తఱి ♦ బ్రార్థించిరి కం
పితతను లై యిట్లని యో, శతధృతి నీ విచ్చినట్టి♦శాపంబునకు౯. 371

ఆ. అవధి యిది యటంచు ♦ నానతి యీవలె, ననుచు విన్నవించె ♦ నబ్జభవుఁడు
కరుణతోడఁ బల్కెఁ ♦ గాముని గనుఁగొని, యెపుడు శివుఁడు నిన్ను ♦ నేపుమాపు.

క. అప్పుడు భండుం డనువాఁ, డుప్పతిలి జగంబు నెల్ల ♦ నొగి బాధింపం
దప్పక తద్బలమునకుఁ గ్ర,కుప్పాలకు లాదిగా ది♦గులుఁ జెంది సురల్. 373

శా. ఆయుగ్రాసురు నాజిఁ గూల్పఁగ మహా ♦ యాగంబు గావించి యా
గీయప్రజ్వలదగ్నికుండవిలస♦త్కీలావళి౯ విక్రమా
జేయ౯ శ్రీలలితాభిధానకలిత౯ ♦ జిచ్ఛక్తిఁ బుట్టింతు రా
మాయోపాయుని నాజగజ్జనని తా ♦ మర్దించు నాలంబులో౯. 374

వ. మఱియును. 375

క. కామేశ్వరాంకగత యై, యామహనీయానుభావ ♦ యప్పుడు నిన్ను౯
వే మగుడం గలిగించును, నామాటలు నీదుమదిని ♦ నమ్ముము మదనా. 376

ఆ. అని ప్రసన్నుఁ డైన♦యజునివాక్యము విని, శాపమునకు మది వి♦షాద మొదవ
నాత్మమందిరమున ♦ కరిగి భార్యయుఁ దాను, నుచితవర్తనమున ♦ నుండె మరుఁడు.

క. ఆశాపదోషమునఁ జూ,వే శర్వలలాటనేత్ర♦వితతాగ్నిశిఖ౯
నాశంబు నొందె మరుఁడు దు,రాశయుఁ డై మిడుతభంగి ♦ నతిదర్పితుఁ డై. 378

క. హరి కైన హరున కైనను, బరమేష్ఠి కైన లోక♦పాలుర కైన౯
బరికింపఁగ భోక్తవ్య మ,పరిహార్యము శాపవిధము ♦ పరమమునీంద్రా. 379

క. నీ వడిగినశాపక్రమ, మావనజజునాజ్ఞ నాశ ♦ మందినయారా
జీవాస్త్రునికథ తెల్లమి,గా వినిపించితి నిరస్త♦కల్మష నీకు౯. 380

వ. ఇంక నేమి వినవలయు నెఱింగింపు మని మహానుభావుం డైనహయగ్రీవుండు దయా
ళుం డై పలుకుటయు. 381

ఆశ్వాసాంతము.

చ. కరధృతశూల మానిజన♦కామితపాల చరాచరావన
స్థిరతరహేల దేవవర♦సిద్ధకృతస్తవలోల దైత్యసం
హరణమహోగ్రఖేల కరు♦ణామృతసంప్లుతభక్తజాల భా
స్కరశశివహ్నిలోచన భ♦వజ్జనతాభవపాశమోచనా. 382

క. శ్రుతిరథతురంగ ధరణీ,శతాంగ రవిశశిరథాంగ ♦ శరధినిషంగా
వితతజటాధృతగంగా, రతిపతిమదభంగ సదయ♦రమ్యాపాంగా. 383

స్రగ్విణి. గోత్రజాపీనవ♦క్షోజకుంభస్థలీ, చిత్రపత్రావళీ♦శిల్పవిద్యాధరా
గాత్రశోభాతిధి♦క్కారితాంభోజభూ,పత్రభాషాసితా♦భ్రమ్యసద్భూరుహా. 384

గద్యము.

ఇది శ్రీభవానీశంకరకరుణాకటాక్షవీక్షాసుధారసాసారపరిసారణసులబ్ధ
కవితావైభవాపస్తంబసూత్ర పరాశరగోత్రవిలస దాతుకూరివంశ
సంభవ వాయ్యనామాత్యపౌత్రాదిమూర్తినామసత్కవిపుత్ర
సకల సుకవిజనవిధేయ పాపయ నామధేయ
ప్రణీతంబైన లలితాంబోపాఖ్యానం
బనుమహాప్రబంధంబునందు
ద్వితీయాశ్వాసము.

---





ఓమ్.

శ్రీసద్గురుచరణారవిందాభ్యాంనమః.

శ్రీ

# లలితాంబోపాఖ్యానము.

## తృతీయాశ్వాసము.



మత్కరుణావైభవ
ధామ నిజకటాక్షలేశ ♦ ధన్యాయితపో
లోమీమానవతీగీ
ర్వామాహృదయేశ ధాన్య ♦ వాట్యమరేశా. 1

వ. అవధరింపుము. 2

క. భూసుతుఁ డగస్త్యముని యశ్వాననుఁ గన్గొని కరుణం బ్రి ♦ యంబునఁ బల్కెన్
సూనశరునికథ తెల్లమిగా నీదయ వింటి ముదము ♦ గడలుకొనంగన్. 3

గీ. సర్వవాగీశ్వరేశ్వర ♦ సర్వవంద్య, సర్వదేవగణస్తుతై ♦ శ్వర్యచరిత
దేవ యొక్కటి మీచేతఁ ♦ దెలియ వేడ్క, యగుచునున్నది యది విను ♦ మశ్వవదన.

క. నీవు దెలిపితివి లలితా, దేవేశ్వరి భండదైత్యుఁ ♦ దెగటార్చుట మున్
భావింప భండుఁ డనువాఁ, డేవిధమునఁ బుట్టె దీని ♦ నెఱిఁగింపు దయన్. 5

వ. అనిన విని కుంభసంభవునకు దయాంభోరాశి యగుహయగ్రీవుం డిట్లనియె. 6

క. ఎచ్చోటఁ బచ్చవిల్తుఁడు, చిచ్చుఱకంటిదొరనుదుటి ♦ చిచ్చున సమసెన్
వెచ్చెర నచ్చోటఁ బొడమె, నచ్చెరువుగ నొక్కదైత్యుఁ ♦ డత్యుద్ధతుఁడై. 7

సీ. సకలదిక్కులును ధూ ♦ సరత వహించె దిగ్దాహంబు పర్వె ను ♦ ద్దామభంగి
వఱపులు వికృతంపు ♦ టఱపులతోఁ బేర్చె, వింతగా భువి రక్త ♦ వృష్టి గురిసెఁ

గమునఁ జోద్యముగ భూమి ♦ గడగడ వడఁకె నుల్కలు రాలె నభ్రంబు♦వలన నుర్వి
మాటిమాటికిఁ బ్రతి♦మలు రోదనము సల్పెఁ, గులపర్వతంబులు ♦ చలన మొందె
ఆ. నేఁడు చెప్ప నిట్లు ♦ శ్యామమై పోయెసో.త్పాతసముదయంబు ♦ ప్రకట మయ్యె
సకలజంతుమాన♦సంబులు మాలిన్య, మొందెఁ దనుజనాథు♦నుదయవేళ. 8

క. పంతుఁ డనుపేర విఖ్యాతుండై యద్దనుజుఁ డతుల♦దోర్బలమున బ్ర
హ్మాండము వడఁకఁగఁ జేయుచు, గండమిగిలి యాతనాఖ్య♦ఖడ్గధరుండై. 9

సీ. అశనిసన్నిభకఠో♦రాంగంబు పాతాళ,కర్దమశ్యామల♦కాంతి మెఱయఁ
బ్రళయకాలాభ్రల♦పాథోధరధ్వాన,మేదురతరసింహ♦నాద మడరఁ
జర్మాస్థిశేషాతి♦శుష్కశరీరాకృతి, బహుసిరాసముదయ♦ప్రకటనముగ
నతిభయంకరఖది♦రాంగారసదృశమై, దృగ్దీప్తిసంఘంబు ♦ దిశలఁ బర్వ
గీ. నాత్మసృష్టిపాతమున స♦మస్తజగము, వరుస నొక్కట దహియించు♦వాఁడ పోలె
దండిమస్మకభస్మోత్థ♦పండనాము,దైత్యుఁ డత్యుగ్రుఁ డై యద్భు♦తంబు గాఁగ. 10

క. ఆభీలరథారూఢుం,డై భీషణ మగుచుఁ జంద్ర♦హాసము మెఱయన్
దా భువనత్రియజంతుమ,హాభయదాకారుఁ డగుచు ♦ నతులబలుం డై. 11

ఆ. ఉన్నఁ జూచి యతని♦యొద్దకు నేతెంచి, కౌఁగిలించి చిత్ర♦కర్మ యపుడు
తద్బలంబునకు నితాంత♦సంతోషసం,భరితహృదయుఁ డగుచుఁ ♦ బలికె నిట్లు. 12

క. ఓదానవమాణవక మ,హాదేవు భజింపు మాతఁ ♦ డఖిలైశ్వర్యం
బాదరించున నీ కొసఁగు ద,యోదధి యద్దేవుఁ డని హి♦తోక్తిఁ దెలుపుచున్. 13

క. ఆతని కుపదేశించెన్, బ్రీతిన్ శతరుద్రియంబు ♦ దృఢతరభక్తిన్
దైతేయుండును వదుదిత,రీతి జపించెన్ బ్రణామ♦కృతికుశలుం డై. 14

క. శతవారము లీక్రియ నా,శతరుద్రజపంబు సలుప ♦ సంతుష్టమన
స్కశతపత్త్రుండై పశుపతి, యతనికిఁ బ్రత్యక్షమయ్యె ♦ నంచితకరుణన్. 15

గీ. ఇట్లు ప్రత్యక్ష మైనబా♦లేందుమౌళి, కతులభక్తిఁ బ్రణామంబు ♦ లాచరించి
యసురబాలకుఁ డంజలి ♦ నొసలఁ జేర్చి, వరముఁ దగ వేఁడె వినయసం♦భరితుఁ డగుచు.

క. బలిమి న్నను మాఱొక్కనుకొ,తు్రిలబలములలోన సగము ♦ రూఢిగ నన్నున్
దొలుతన పొందెడునట్లుగ, నలఘుకరుణ నొసఁగవలయు ♦ నాగమవేద్యా. 17

క. నాయందు నిత్యప్రయోజన
మై యడఁగఁగ వలయు నలుక ♦ నడరించుతఱిన్
యాయుధసముదయము మదీ
యాయుధచయ మవితథ మయి ♦ యడఁగఁగ వలయున్. 18

క. అని వేఁడిన నట్లగుఁ గా, కని యప్పరమేశ్వరుఁడు మ♦హాదరమున నా
తనికి వర మిచ్చి వెండియు, మనమున నొక్కింత దలఁచి ♦ మగుడఁగ బలికెన్. 19

క. నీ వఱువదివేలేండ్లు మ,హావిభవము మెఱసి విక్ర♦మాభీలుఁడ వై
వావిరి రాజ్య మొనర్పుము, దేవారులతోడ నధిక♦తేజోయుక్తిన్.

వ. అని యద్దానవునకు నవధి నిర్దేశించిన. 21

క. దండిబలంబున నితఁ డుద్దండుం డని వానిఁ జూచి ♦ ధాత వెఱపుతో
భండితి భండితి యనుటను, భండుం డనుపేర నతఁడు ♦ ప్రథితుం డయ్యెన్. 22

గీ. అసుర వేఁడినవరము ల♦త్యంతకరుణ, నొసఁగి మఱియు దివ్యాస్త్రంబు♦ లసదృశమగు
శస్త్రసముదాయమును నిచ్చి♦సకలమునుల,తోడ సంతృప్తుఁడయ్యె♦ధూర్జటియును.

గీ. అతఁడు పుట్టినపిమ్మట ♦ నచటఁ బుట్టె, దైత్యుఁడు విశుక్రనాముఁ డ♦ద్దానవేంద్రుఁ
డగ్రజునిఁ బోలునాచార♦మాకృతియును, దక్కుఁగుణములు గల్గి యు♦ద్దాముఁ డయ్యె.

ఆ. వాని ననుసరించి ♦ వరుసతో జన్మించి, ధర విషంగుఁ డనెడు♦దైత్యవరుఁడు
పూర్వజద్వయంబు♦పోలిక లెల్లను, బుణికి పుచ్చుకొన్న♦పోల్కి మెఱసె. 25

క. ఆయనుజు లిద్దఱును దనుఁ, బాయక సేవింప మెఱసె♦ ♦ భండాసురుఁ డ
త్యాయత్తపాపలోభన,మాయుక్తకఠోరతరమ♦హాలోభమునన్. 26

క. అసురులముప్పది వెనుకన్, ద్రిసహస్రాక్షౌహిణీక♦దేవవిరోధుల్
విసువక పుట్టిరి మన్మథ,భసితమువలనన్ సమగ్ర♦బాహాబలు లై. 27

సీ. నకనకమని వెన్ను♦నంటినకడుపులు, చాల లోఁ తైనక♦పోలయుగము
గంభీరకూపసం♦కాశనేత్రంబులు, విరిసిననిడుపల్ల♦వెంట్రుకలును
సరవి నిమ్నోన్నత♦స్థలసంభవంబు లౌ,దారుణతరవక్త్ర♦దంతములును
గండెనచాయ ధి♦క్కారించుమేనులు, ఘనదీర్ఘహ్రస్వసన్ని♦భాననములు

గీ, వహ్నికీలాసమానజ♦టాచయంబుఁ, జంద్రవిప్పలఁ బోలెడు♦వేంద్రములు లగు
చూపులును గల్గి యుద్ధతా♦టోపు లగుచుఁ, దానవులు వొల్చి రగ్రజ♦త్రయముభాతి.

చ. అనుపమితప్రతాపు లగు♦నయ్యసుర ల్దమకుర్ బ్రభుండుగా
మనసిజభస్మసంభవున♦మస్తసురాహితపూర్వజాతుఁ డై
తనరినభండదైత్యుని వి♦దాంతతతో నభిషేచనాదికం
బొనరఁగఁ జేసి కొల్చిరి స♦హోదరయుక్తుని నన్నిశాచరుల్. 29

వ. ఇవ్విధంబున. 30

శా. ప్రాగంభోనిధితీరసంస్థితమహేం♦ద్రక్ష్మాధరప్రాంతభూ
భాగప్రాంచితశూన్యకాఖ్యపురవి♦భ్రాజత్ప్రభుత్వాఢ్యుఁ డై

భోగత్యాగము లత్యుదారములు గా ♦ బొల్పొందెఁ గూర్మిరాజ్ఞచే
నాగోత్తారిముఖామరుల్దలఁక భం♦డాఖ్యాసురుం డుగ్రుఁడై. 31

వ. అప్పుడు. 32

సీ. అరసాతలగభీ♦రాభీలపరిఘంబు, సలలితాభ్రంకష♦సాలచయము
శత్రుదుర్వారోగ్ర♦శస్త్రాస్త్రసముదయం, బమితదర్పితచతు♦రంగబలము
కవచప్రవీణర♦క్షశ్శూరదుస్సాధ్య, మప్సరస్సదృశసీ♦మంతినీక
మస్తాపదమయూంచి♦తాత్యుచ్చమణిసౌధ, మతిమధురోదకా♦బ్జాకరంబు

గీ, జగతిఁ బొలుపొందె సర్వర్తు♦చయకిసలయ,పుష్పఫలభరితోద్యాన♦భూరుహంబు
భండదైత్యభుజా♦బలపాలితంబు, శూన్యకం బుర్వరాజిత♦శూన్యకంబు. 33

గీ. అన్యదుస్సాధ్య మైనయా♦శూన్యకాఖ్య,పురము నిజరాజధానిగా ♦ నెఱిమఁ గాంచె
భండదైత్యుండు నిజభుజా♦మండలాగ్ర,దండితారాతివిప్ర♦కాండుఁ డగుచు. 34

వ. మఱియును. 35

సీ. మూర్తమైనట్టిస♦మ్మోహినీవిద్య నాఁ, దనరుసమ్మోహిని ♦ యనునెలంత
సుముఖప్రభాజిత♦కుముదినీసఖ యైన,కుముదిని యనుపుష్ప♦కోమలాంగి
వర్ణితచారులా♦వణ్యచిత్రాంగి యౌ,చిత్రాంగియనుపద్మ♦పత్రనేత్ర
త్రిజగతీసుందరీ♦విజయసౌందర్య యౌ,సుందరి యనియెడు♦కుందరదన

గీ, దనకు భార్యలుగా భండ♦దైత్యనాథుఁ, డప్సరస్త్రీసనాథుఁ డౌ♦నమరనాథు
నతిశయించుచు భోగభా♦గ్యాభివృద్ధి, వఱలవర్తిల్లె నిచ్ఛాను♦వర్తి యగుచు. 36

వ. ఇత్తెఱంగున నత్యంతప్రభావు లై. 37

క. క్షితిధరసన్నిభకాయులు, జితకాశులు భండదైత్య♦శేఖరముఖ్యుల్
శితికంఠపూజ భార్గవ,మతమున నొనరించి రమిత♦మహితనియము లై. 38

వ. అనసమయంబున. 39

సీ. ఏయింటఁ జూడ స్వా♦ధ్యాయప్రవీణులై,త్యార్చకపఠితసాం♦గాంగవసుంబు
లేవాడఁ గన రాజ♦సూయాశ్వమేధాది,మఖకర్త లగుదైత్య♦మండలేంద్రు
లేగృహంబున విన ♦ నింపుగా న్యాయమీ,మాంసాదిశాస్త్రశుం♦భత్ప్రసంగ
మేమందిరంబున ♦ నెలమిఁ గన్గొనఁ ధను,ర్విద్యారహస్యవి♦ద్వేదివితతు

గీ, లందముగ సర్వసంపద ♦ లధికవృద్ధి, జెంద నంతానుకూల ప్రాఁ డ ♦ చుండవశోమ
రాజ్యమైనరించెఁ బుత్రపౌ♦త్రప్రపౌత్ర,వంతుఁ డై శూన్యకాభిఖ్య♦పట్టణమున.

వ. ఇట్లు నిరాఘాటంబుగా రాజ్యంబు సేయుచు. 41

క. ఒకనాఁడు దానవేంద్రుఁడు, ప్రకటపరాక్రముఁడు దనదు పాలికి ననుజ
ద్వికముఁ బిలిపించి ప్రేమా,ధికదృష్టిం జూచి పలికె దృఢనిశ్చయుఁడై. 42

క. ఓయనుజులార మనదే వల,పోయఁగ శత్రువులు యాగభోక్తలు మనకున్
వే యేల మనల వంచన, సేయఁగ నన్వేషణంబు సేయుదు రెపుడున్. 43

మ. అతిధూర్త్తు ల్పరివంచనాపరులు మాయాచంచురుల్ నూతన
స్థిరచిత్తు ల్గుటిలు ల్దురాత్మకులు పాపిష్ఠుల్ మదాంధుల్ శత
క్రతుముఖ్యామరు లెల్లప్రొద్దు మనకున్ బ్రత్యర్థు లీవిష్టప
త్రితయం బిందు నిరాజ్య మట్లగుట బాధింపం దగున్ వారలన్. 44

చ. ఇది సమయంబు నిర్జరుల నేపడఁగించుట కెట్టు లన్న న
మ్మదనుఁడు మున్ జగంబున సమగ్రబలుం డయి యున్నవాఁడు పెం
పొదవఁగ సంభవించి మహిమోన్నతిఁ గంటిమె యిప్డు దాసుమ
ప్రదరుఁడు రూపడంగ మన ప్రాభవసంపద పర్వె నెల్లెడన్. 45

గీ. మనల సాధింపఁగా నయ్యమర్త్యు లిప్పు, డించువిల్కాని మరలఁ గల్గించు వెరవు
వెదకుచున్నవా రీలోన వేగ వారి, దుర్బలులఁ జేయ వలయును ద్ధురత మీరు. 46

వ. భ్రాతృవరులారా మద్భాగ్యవశంబున మీనకేతనుండు వృషభకేతననేత్రానలంబున దగ్ధుం డయ్యె దానం జేసి ప్రబలుల మైన మమ్మలం జూచి చూపోపక బృందారకులు కందర్పుని మగుడం బుట్టించు ప్రయత్నంబు దలంచిరి వారితలంపు సాగకుండ వారల హతవీర్యులం జేసిన మనరాజ్యంబు సుస్థిరం బగు నట్లగుట భువనత్రయమర్దనంబు మన కవశ్యకర్తవ్యంబు స్వర్గలోకంబు సాధింప నేన చాలుదు మీ రిరువురు సైన్యసమేతుల రై భూలోకంబును బాతాళలోకంబును నిర్దయంబుగా మర్దించి రండు మన మీరూపంబులతో దండెత్తి పోయిన దేవతలు మనతోఁ గలహింప వత్తురు వారలు గనుఁగొనకుండ వాయురూపంబునఁ బ్రాణులయందుం బ్రవేశించి తొలుత రసంబు శోషింపం జేసి యనంతరంబ శుక్లశోషణం బొనరించినట్లయిన సర్వదేహులతేజంబులు శుక్లాశ్రితంబులు గావున సంతతి నశింపం గలయది యిత్తెఱంగున భూమిరసంబును జలజస్థలజంబు లైన స్థావరజంగమంబులలోనిరసంబును హరించి జగత్త్రయంబు నిస్సారంబుఁ జేయుద మని యగ్రజుండు పలికిన ననుజన్ములు తద్వాక్యంబు లాకర్ణించి బద్ధాంజలు లగుచు నతనికి నమస్కరించి సాధువాదంబుల నభినందించి రంత వారలు ముప్పురును లోకనాశనతత్పరు లగుచుం బ్రత్యేకంబ సహస్రాక్షౌహిణీబలాన్వితు లై వెడలి రప్పుడు స్వర్గంబున నిర్జరభయానకం[illegible] లనేకంబులు దోఁచిన ననిమిషులు మనంబులు గలంగ శకించుచుం[illegible]

స్వీయంబైనయక్షౌహిణీసహస్రంబుతోడ నదృశ్యుండై వాయురూపంబున సుపర్వాలయంబుఁ బ్రవేశించి తద్రసశోషణంబు గావించిన వారలు ప్రమ్లానవదనులు వినష్టోత్సాహులును నత్యంతాలసులును వీర్యనాశనసంప్రాప్తక్లీబభావులును నగుచు స్వాంగనలయందును నప్సరోగణంబులయందును భోగేచ్ఛ లేక సకలకార్యంబులయందును నిరుద్యోగులై యుండి రంత దుర్దాంతులైనభండాసురసైనికులు దేవసుందరులయం దావేశించి సురతద్రవసంక్షయం బొనరించి తద్దేహలావణ్యముఖవిలాసావలోకనతాత్పర్యంబులకు వైరూప్యంబు సంపాదించినం దొక్కతియేనియు బురుషాపేక్ష గలిగినయది గనంబడకుండె నివ్విధంబున బహుక్లేశాపన్న లగువేల్పుటన్నులు దైత్యోపహృతిసారంబైనసుధారసంబు పానంబుసేయుచుండియు మదలేశంబు నొందకుండిరి శారీరరసశోషణంబునం జేసి వారలజాతకుంభకుంభసముజ్జ్వలఫత్రోత్తుంగపీనపయోధరంబు లర్కాతపశుష్కంబులైనయర్కఫలంబులుంబోలెఁ గనుపట్టి నిండుచందురుం గ్రేణిసేయుతన్ముఖంబులు హారిముఖంబులు వోలెం గాంతిహీనంబు లయ్యె నంత రాక్షసోపద్రవనిమిత్తంబున నందనోద్యానవృక్షంబులు కిసలయప్రసూనఫలోత్పత్తిరహితంబులును భృంగాంగనాసంచారశూన్యంబులును దూరతోపాస్తశుకపికనినాదంబులును బ్రణష్టసౌరభంబులు నగుచుం జూడ వింతలై యుండె నిట్లు త్రిదివంబునం గలిగినచరాచరంబులరసంబు నిజసత్త్వంబున శోషింపం జేసి మాయావియైనభండదానవేంద్రుండు మగుడ సహసంబున ససైన్యంబుగా నిజపురంబుఁ బ్రవేశించి సుఖంబుండె నాసమయంబున. 47

శా. అభండాసురరాజు నెమ్మనము మహా◆హంకారుఁ డత్యుగ్రశౌ
ర్యాఢ్యుండు విశుక్రనాముఁడు సహ◆స్రాక్షౌహిణీయుక్తుఁడై
తా భూలోకచరాచరాంగముల ను◆ద్యచ్ఛక్తిమైఁ జొచ్చి భూ
తాభాతిన్ దదదృశ్యదేహుఁ డయి య◆త్యంతాద్భుతప్రక్రియన్. 48

శా. మర్త్యక్షోణి యమ్మహాసురుఁడు దో◆ర్దృప్తిఁ దద్రసంబు న్మహా
మర్మజ్ఞుం డగుచున్ హరింప నరులుం◆ బశ్వాదులున్ వృక్షముల్
దార్మన్యంబును జూప వైకృతములన్◆ దౌర్బల్యముం గన్పడన్
శర్మం బేమియు స్వప్నమందయినఁ గాం◆చన్ లేక దైన్యంబునన్. 49

వ. అత్యంతజడంబు లగునాకారంబులతో విభ్రష్టకాంతులై యుండి రప్పుడు. 50

క. తమతమకృత్యంబుల నుద్యమరాహిత్యంబుఁ జెంది ◆ తద్దయుఁ గృశులై
రమణీరమణులు క్రీడావిముఖత్వము నొంది రధిక◆విస్మితమతులై. 51

క. సురతవిముఖు లై నారీనరులు పరస్పరవిలోకనప్రీతియు లే
క రజోధూసరులు సిరాపరిణద్ధకళేబరులు నభాగ్యులు నగుచున్. 52

వ. పుత్రసంతానవర్జితులు నాత్మమాత్రావశేషితులు నై వట్టిమ్రాకులుఁబోలె జడను వడి యుండిరి స్త్రీపురుషసంభోగహేతువు లైన రక్తశుక్లంబు లెల్లఁ దత్తైనికాపహృతంబు లైనకారణంబున నెచ్చటనేని నెవ్వరి కైనను సౌహార్దంబును స్మితపూర్వాభిభాషణంబును లేకయుండె నివ్విధంబున సకలజంతువులకు వృద్ధికరంబు లైన శుక్లశోణితంబులు నశించుటం జేసి ప్రాణులకు నకాండవిప్లవం బై భోగంబులకు భోగ్యవస్తువులకు సంక్షయంబు వాటిల్లిన సూత్రపాంచాలికలరీతి నిర్వికారు లై యెవ్వతె మొగంబుఁ గనుంగొని భ్రూలతానర్తనంబును వివిధంబు లగు విలాసంబులును ప్రియానువ్రతయుఁ బ్రియానురాగమునవిషయం బైన సంభ్రమంబులును లేకయుండె నెచ్చోట నాట్యస్థలంబు నైనను సంగీతనాట్యప్రసంగంబులును సౌభాగ్యలక్షణంబులును మాంత్రికాకార్యంబులును బద్మినీముఖ్యజాతిచతుష్టయశుభావవర్ణనంబులును లేకయుండె నిట్లు శూన్యప్రాయం బైనభూలోకంబున నేపట్టణంబునం గనిన గృహంబులు గర్తశాల్యభూరుహధుత్తూరతరుతృణసంవృతంబు లై కంకగృధ్రోలూకవృకజంబుకాదిక్రూరపక్షిమృగాక్రాంతంబు లై పాడుపడియుండె నుద్యానవనంబులు పల్లవప్రసూనఫలపర్ణరహితంబులును శుకశారికాపికమధువ్రతవియుతంబులు నయ్యెం బద్మాకరంబు లుత్పలకుముదోత్పలమృణాళమరాళనిర్మలజలహీనంబు లై చూడ వింత యగుచుండె నరణ్యంబు లెల్ల సమంతదుగ్ధాకరీరశాఖోటవిషదారుమయంబు లై శుష్కీభూతపుణ్యపాదపంబు లై కనిపించె నన్నంబు మొదలైన భోజ్యవస్తువులు భుక్తం బయ్యును విషంబురీతి దేహదౌర్బల్యజనకం బై యుండె భోజ్యంబులయం దెవ్వరికిని రుచి పుట్టదయ్యెఁ బురుషులు శ్మశ్రుశూన్యముఖులును శస్త్రయుద్ధపరాఙ్ముఖులును గ్లీబభావోన్ముఖులు నై చూపట్టెరి భూమి రక్తాంకురవిహీనయు విగతసస్యయు సర్వతోభిషకభూయిష్ఠయుఁ బుణ్యజంతువివర్జితయుఁ బాషాణసైకతశేషయు లతాకుంజవివర్జితయుఁ బుష్పఫలాదిశూన్యమహాద్రుమయు నై విక్రమార్కప్రయుక్తవిశ్వకర్మనిదాఘదౌర్ఘ్యంబున బాధిత యగుచుండె నట్టియెడ. 53

క. వేయక్షౌహిణులబలము, పాయక తనుఁ గొల్చి రాఁగఁ బన్నగవిజిగీ
షాయత్తమతి విషంగుం, డాయహిలోకంబుమీఁద నరిగెఁ బెంచన్. 54

వ. ఇవ్విధంబున దుర్మదాభిమానుం డగు విషంగుండు పాతాళలోకంబునకుఁ జని యచ్చట నివసించి యున్నసిద్ధదంపతులయందును బలిప్రముఖదానవమిథునంబులయందును వాసుకిప్రధానపన్నగద్వంద్వంబులయందును దదదృశ్యశరీరుం డై ప్రవేశించి నిజసై

నిఖిలుం డాతని నవరసశోషణంబు గావించిన వార లందఱు నన్యోన్యసంగమరహి తులై విస్సంతోషస్వభావులును దుఃఖసూత్రపరాయణులును బరస్పరనిరపేక్షులును కార్యనివృత్తులును నిష్కారణజాతక్రోధులును బరిభూతవైరవ్యాకులులు నగుచు ధర్మార్థకామంబు లనువర్గత్రయంబు రసవిహీనం బగుటంజేసి రసనాశనం బెప్పుడు సం భవించె నప్పటినుండి త్రివర్గవిముక్తులై రిత్తేలంగున భండాసురుండు దానును ననంతసైన్యయుతుండు జగత్త్రియంబు నాక్రమించి రసంబు గ్రహించినకతంబునఁ బ్రాణుల యందు నుండెడికాంతియు నుత్సాహంబును విక్రమంబును ధర్మంబును దయయుఁ బ్రీతి యుఁ బరితోషంబును శస్త్రాస్త్రనైపుణియు శాస్త్రపటిమయుఁ గావ్యనాట్యగీతహాస్యా దులును నశించె దానవులయందును స్నేహశోషణంబువలన ధూమాయమానం బై యావకంబు పూతాత్మారకశక్తులచేత నైనం బ్రజ్వరిల్లకయుండె నిట్లు చరాచరం బులు నీరసంబులై సమానదుఃఖంబు లయ్యె నెట్లన సమస్తంబునకుఁ బరమగతి యును గాంతిప్రదంబును నగురసంబే పరబ్రహ్మం బనియును రసం బవలంబించి యఖి లప్రపంచం బానందించు ననియును దద్రహితుం డై యెవ్వండు జీవించు ననియు ననేకశ్రుతులు దెలుపుటంజేసి ప్రాణాత్మకంబును బ్రాణదంబును నై రసంబు పరివర్తిల్లు నదియ వీర్యం బని చెప్పంబడు నట్టివీర్యంబుఁ దొలంగుటం జేసి సూర్యుండును సంధకా రావృతుండై నీహారచ్ఛన్నుండపోలె మాలిన్యాక్రాంతం బైనదర్పణంబువిధంబునం గనుపట్టెఁ జంద్రుండును బూర్ణతిథులయందును గళాహీనుం డగుచుఁ గానిపించెఁ దార కాగణంబులును మలినత్వంబు భజించె నప్పుడు శైలరాజనందనయు వీతరాగయు విస్రస్తభూషణయు నగుచు మహానియమంబున నత్యంతదారుణం బగుతపం బొన రించుచుండె మన్మథభార్య యైనరతీదేవియు నిజపతినేశ్వరుండు పునర్జీవితుండు గాఁ గలం డనుగగనవాణీవసంతులవచనంబు ప్రమాణీకరించి ప్రాణపరిత్యాగంబు సలుపక యొక్కానొకప్రదేశంబునం దపంబు సేయుటకై చనియెఁ జైత్రుండును నిజమిత్రుం డగుమన్మథునినిధనంబునకు దుఃఖించుచు నతనిపునశ్శరీరధారణంబు ప్రతీక్షించుచుండె నని చెప్పి హయగ్రీవునకు నగస్త్యమహామునీంద్రుం డిట్లనియె. 55

గీ. భండదైత్యునిజన్మంబు బలిమిఁ డైన, యతనిచే మూఁడులోకముల్ వెతలఁ బడుట నువిఁ బ్రిజ్ఞావిసర్గత స్మరుఁడు వగుచు, విసుతిఁ గాంచిననీచేత విదిత మయ్యె. 56

క. అతిబలుఁ డతఁ డెవ్వనివి, శ్రుతబలమున గీటడంగెఁ జోద్యం బగుని కృత విన వేడుక యయ్యెడు, వితతకరుణఁ దెలియఁ జెప్పవే హయవదనా. 57

వ. అని ప్రార్థించిన నద్దేవుం డాదరభరితుండై యిట్లని చెప్పం దొడంగె బ్రహ్మాదు లైనప్రజాపతులును మన్వాదు లైనమహాజనులును నింద్రాదు లైనబృందారకశ్రే

ష్ఠులును బ్రహ్మాదాదులైనదానవోత్తములును హవ్యవాహనాదిదిక్పాలకులును మఱియుఁ జారణసిద్ధగుహ్యకాదులును దురాత్ముం డైనభండాసురునిచేతఁ బీడ్యమానులై సజవీర్యశోషణంబున నిస్సత్త్వులును శస్త్రాస్త్రవ్యాపారమునం దసమర్థులు నగుట నత్యంతబలాఢ్యుం డగునయ్యసురు నోర్వం దమకు శక్తి గలుగమి దెలిసి యింక నేమి సేయుద మని దుఃఖమలినాంతరంగులై. 58

క. క్షీరాబ్ధిశాయి యగుదను,జారాతి ననాదినిధను నంబుజనాభున్
శౌరి శరణుచొచ్చిరి బృం,దారకు లతిభీతికంపితమనోంబుజులై. 59

గీ. చాతకంబులు మేఘగర్జనమువలన, నెలమిఁ గనురీతి దేవతల్ జలజనేత్రుఁ
గాంచి మదిలోన నూఱటఁ గాంచి సంస్తుతించి రద్దేవదేవుని దివ్యమహిమ. 60

వ. అమ్మహాత్ముం డంతకుముందు లతాంతాయుధశాంతివలన లక్ష్మీసీమంతినీవతంసంబునందును బరాఙ్ముఖుండై సుషుప్తియోగానందంబు నొందియుండి విబుధసముదయకృతబహువిధస్తోత్రసంతానంబులం బ్రబోధితుండై దేవ లగుసుపర్వులం గనుంగొని విజ్ఞానదృష్టిచేతం దదాగమనకారణంబు దెలిసి ప్రభవిష్ణుం డగువిష్ణుండు వారలకి ట్లనియె. 61

క. సురలార మీకుఁ గుశలమె, పరికింపఁగ మీకు నెట్లు ప్రమదము గల్గున్
బరుస భవన్ముఖములసిత, యరయఁగ మీకుశలభంగ మట్టు సూచించెన్. 62

సీ. మానసీయోష్మాయమాణ మహామీభవ్య,దోస్సార మురివడ్డ దుస్సహంబు
నిస్సారముగఁ దోఁచె నేత్రపద్మంబులు, బాష్పసద్మంబులై ప్రభఁ దొఱఁగె
విక్రమసంపద విశ్రాంతి గనుపట్టెఁ, గాంతిశూన్యం బయ్యెఁ గాయసమితి
చింతావశంబులై చిత్తముల్ ధృతిదప్పె, నతిభయభ్రాంతుల రైతి రిపుడు

గీ, వేషభాషలు ధైర్యముల్ విడువఁబడుట, వింతవారలవలె నిసుమంత మైనఁ
దొంటిపోలిక లేక వేఁదుఱులపగిదిఁ, గలిగి యున్నారు భాగ్యసంక్షయమువలన. 63

వ. మీ రలి ట్లాటకుఁ గారణంబు వినుండు సుఖస్వరూపకుండును భగవంతుండును నానందసాగరుండును నైనమహేశ్వరుం డుపేక్షించినమన్మథాత్మకం బగుమహాపీఠంబు మదనవ్యాపత్తిసంభవుండును నత్యంతమాయావియు నదృశ్యదేహుండును నైనభండాసురునిచేత నాశింపంబడినది దాసం జేసి మీతేజంబులును యదుత్పన్నంబు లగు కాంత్యాదిగుణంబులును నశించినవి యంతియ కాదు యాతుధానవనితాగర్భపాతనంబును నతినిపాతనంబును నైనయాపురుహూతునిచేతిదంభోళి దేహోపఘాతంబు వలన నిర్విషభుజంగంబుఁ బోలెఁ జూపట్టె ననుపమశక్తి యైనయాహుతాశనునిశక్తి నిశ్శక్తి యై కనిపించె నీదండధరునిప్రచండకాలదండంబు ప్రశాంతతేజోమండలంబై

యున్నయది యత్యుగ్రిం బై నయీనై ప్రతిమండలాగ్రంబు వికుంఠితాగ్రంబుకరణిఁ పోఁచుచున్నది. ఈపాశపాణిపాశంబు తేజోనాశంబున మృణాళంబులీలం గానిపించె నీసమీరాస్యునిదుర్నివారణం బై కేతనంబు తేజఃప్రతిఘాతనంబునొందె నీయక్షనాథుని యక్షీణం బగుగదాదండంబు ప్రక్షీణకాంతి యైనది. ఈశూలహస్తునిత్రిశూలంబు శాంతకీలంబై పొలుపుదొఱఁగె రాహుగ్రస్తం బై నచంద్రమండలంబుపోలిక మీముఖ మండలంబు తద్దయు మలినీకృతం బైనది యట్లు గావున దుష్టాత్మం డై నభండ దానవుం డదృశ్యదేహుండై మిమ్ముం బీడించు టెఱుంగుదు సర్వప్రాణులగాత్రంబులు నతని యదృశ్యంబు లైనయాయుధంబులచేఁ గీలితంబులై వేదనలం బొందుచున్న యవి నిక్కమనవారికి జెప్ప వేల మదీయమానసంబును లక్ష్మీధరణీదేవులయందును నైరాశ్యంబు గల్గి యున్నది బ్రహ్మాండకోశంబునందు గల్గినదేవతిర్యఙ్మనుష్యస్థావర రూపంబులలో నొక్కటియైనం దద్బాణసంపాతమూర్ఛితంబు గానిది లేక యున్నది.

చ. కమలజుఁ డై హరిరుద్రుఁడును ♦ గారణమూర్తుల మై మహాండమ
ధ్యమున వసించి లోకముల ♦ సన్నుతిఁ జేయుచు నర్థిఁ బ్రోచుచుం
బొరిఁగొనుచుంటి మిట్టిఘన♦భూరిబలాఢ్యుల మైన మమ్ము ను
ద్ధురుఁ డగుభండదైత్యుఁ డతి♦దోర్బలసంపద గాసిఁ బెట్టెడున్. 65

వ. అట్లు గావున. 66

సీ. కలఁడు లోకపురుషుండు ♦ లలితచిద్ఘనమూర్తి, కమలజాండాతీతుఁ ♦ డమితమహిముఁ
డజ్ఞానహరుఁడు మ♦హాశంభుఁ డనువాఁడు, సతత మాతఁడు పరా♦శక్తితోడఁ
గలసి వినోదించుఁ ♦ గందర్పనాశోత్థ,భండదానవకృతో♦పద్రవంబుఁ
బొరయఁ డెన్నఁడుఁ బరా♦త్పరుఁడు సద్రూపి ని,రాలంబుఁ డవికారుఁ ♦ డై నకతన

గీ. నతని నద్దేవునిమహాప్ర♦సాదమునన, భస్మజాసురమర్దనో♦పాయసిద్ధి
గలుగు మీ కవశ్యం బటు♦గాన నింద్ర,ముఖులు న ద్దేవు సంస్తుతిం♦తము వినీతి. 67

శా. సంతుష్టుం డయి యమ్మహామహుఁడు యు♦ష్మద్వాంఛితంబుల్ దయా
స్వాంతుండై ఘటియించు నిక్కమని యా♦వాణీశ్వరుండున్ శచీ
కాంతుండున్ మొదలై ననిర్జరులతోఁ ♦ గంజాతగర్భాండమున్
ద్వ్యంతాంబుల్ దహరీకంబుగా నరిగెఁ బ♦ద్మాక్షుండు కార్యార్థియై. 68

వ. అప్పుడు. 69

మ. భగవంతుం డగుకై టభాంతకుఁడు దే♦వజ్యేష్ఠుఁ డింద్రాదు లా
దిగధీశానులు దిగ్గజాష్టకము నెం♦తే వేగ రప్పించి యా

జగదండోపరిభిత్తి భేదన మొగిన్ ♦ సల్పన్ నియోగించుచున్
నగభిద్వజ్రకఠోరదంతముల స♦న్నాగేంద్రముల్ బల్విడిన్. 70

మ. వెస నాజ్జబ్దము లుద్ధతిం బొదువ ను♦ర్వీభృత్ప్రతీకాశసా
రసజాతాండకఠోరభిత్తి కసరం♦ధ్రిం జైనఁ దత్సంధి న
ర్వసుపర్వోత్తము లేఁగి కన్గొనిరి త♦ద్బాహ్యప్రదేశంబునం
దసమాలంబనము న్నిరంజన మమే♦యం బౌచిదాకాశమున్. 71

వ. మఱియును. 72

క. క్షితిసలిలహుతాశనమా,రుతసంయోగంబు లేక ♦ ప్రోద్యద్ద్యుతి యా
వితతచిదాకాశంబున, నతులతదాకాశరూపి♦యై తగువానిన్. 73

గీ. శ్రీమహాశంభునాథు మ♦హామహిమునిఁ, బ్రస్తుతించిరి విబుధులు ♦ భయముభక్తి
ముదము వినయంబు నమమనోం♦బుజములందు,నంతకంతకు విస్తార♦మగుచు నుండ.

గీ. జననరహితుని నిర్మలు ♦ శాంతరూపు, నద్వితీయు మాయాతీతు ♦ నాదిదేవు
సగుణజన్యవికారుని ♦ స్వప్రకాశు, శ్రీమహాశంభు నాశ్రయిం♦చెదము భక్తి. 75

గీ. తెలియ శక్యంబు గా దెల్ల♦దేవతలకు, ధ్యాన మొనరింప యోగుల ♦ కలవి గాదు
పలుక లేరు వేదజ్ఞు లె♦వ్వాని నట్టి,శ్రీమహాశంభు నాశ్రయిం♦చెదము భక్తి. 76

గీ. సత్తు గాదు చర్చింప న♦సత్తు గాదు, తలఁప సదసత్తు గా దెన్న ♦ ద్వయము గాదు
తెలియఁ గా దద్వయంబు య♦త్తేజ మట్టి,శ్రీమహాశంభు నాశ్రయిం♦చెదము భక్తి.

గీ. తనుఁ దెలియఁ దానె శక్తుఁడై ♦ తనకుఁ దానె
కలిగి తనయంతఁ బ్రభు వైన♦యలఘుమహిమ
గరిమఁ దనకంటె వే ఱొంటు ♦ గానఁబడని
శ్రీమహాశంభు నాశ్రయిం♦చెదము భక్తి. 78

గీ. తెలియువాఁడును దెలివియుఁ ♦ దెలియఁ దగిన
వస్తువును ననుత్రిపుటి యె♦వ్వానిఁ జెంద
దెచట నైనను నట్టిలో♦కేశ్వ రేశు
శ్రీమహాశంభు నాశ్రయిం♦చెదము భక్తి. 79

గీ. మహితధర్మంబుచే నధ♦ర్మంబుచేతఁ, దద్విపాకసుఖాసుఖ♦ద్వయముచేత
నరయ నేమహాత్మునిపదం ♦ బంట దట్టి,శ్రీమహాశంభు నాశ్రయిం♦చెదము భక్తి.

గీ. బ్రహ్మవాదుల కెల్లను ♦ బ్రహ్మ మగుచు, సౌరులకు నెల్ల భాస్కరా♦కారుఁ డగుచు
సౌగతుల కెల్ల మహితవి♦జ్ఞాన మైన,శ్రీమహాశంభు నాశ్రయిం♦చెదము భక్తి. 81

సీ. అరసి చూడ లో♦కాయతికుల కెల్ల, నెలమి స్వభావమై ♦ వెలయువాని
క్షణికుల కెల్లను ♦ క్షణరూపుఁ డగువానిఁ, బ్రకటంబుగా మాధ్య♦మికుల కెల్ల
శూన్యస్వరూపుఁడై ♦ శోభఁగొందువాని సాంఖ్యుల కెల్లఁ బురుషాఖ్య ♦ వెలయువాని
శబ్దవేత్తల కెల్ల ♦ శబ్దాత్ముఁ డగువాని, వైద్యుల కెల్ల వై♦శ్వానరాత్ముఁ
గీ. డైనవాని యోగుల కెల్ల ♦ నంతరాత్మ, యగుచు వెలుఁగొందువాని ద♦యాళు వైన
వారి కెల్లను ధర్మమై ♦న మగువాని, శ్రీమహాశంభు నాశ్రయిం♦చెదము భక్తి. 83
సీ. శైవులు శివుఁ డని ♦ భావించుచుండంగఁ, బాంచరాత్రులు విష్ణుఁ ♦ డంచుఁ దలఁపఁ
గాణసంఘము విశ్వ♦కర్మ యంచు భజింప, సరవిఁ గర్మఠు లుపా♦స్య మని కొల్వ
నెలమిఁ ద్విప్రులు వహ్ని♦నిలయుఁ డం చూహింపఁ, జండాఖ్యుఁ డనియుగ్ర♦సమితి వొగడఁ
గామేశ్వరుం డని ♦ కాముకు ల్దలపోయ, బ్రతిమాగతుఁ డని య♦ల్పమతు లెన్న
గీ. రాజరా జంచు నిధివిదు ♦ ల్పూజ సేయ, నందఱకుఁ దత్తదనురూప ♦ మగుఫలంబుఁ
గూర్మి దయసేయువాని ని♦గూఢమహిము, శ్రీమహాశంభు నాశ్రయిం♦చెదము భక్తి.
గీ. భువనముల కెల్ల నాద్యంత♦భూతుఁ డగుచుఁ
దనకు నాద్యంతములు లేక ♦ తనరు వాని
నింతటికి నీశుఁడై తా ని♦రీశుఁ డైన
శ్రీమహాశంభు నాశ్రయిం♦చెదము భక్తి. 84
వ. అని మఱియును. 85
క. సదయహృదయ నినుఁ గనుఁగొన, మదిఁ దలఁప నశక్య మెట్టి♦మహనీయులకున్
ముదమున మముఁ బ్రోవఁగ మా, యెదురన్ సాక్షాత్కరింప♦వే పరమేశా. 86
క. మదయుతవిపరీతాచా, రదుష్టభండాదిదైత్య♦రాట్త్రయబాధన్
బెదరి యిట వచ్చితిమి మా, యెదురన్ సాక్షాత్కరింప♦వే పరమేశా. 87
గీ. నీరసుల మాట వారితో ♦ నీరసమున, దోడర లేక దుర్బలులమై ♦ డింది భంగ
మొంది యిట వచ్చితిమి మమ్ము ♦ నుద్ధరింపఁ, ద్రిభువనేశ్వర సాక్షాత్క♦రింపవలయు.
గీ. పరులచే బాధపడి నిన్ను ♦ శరణు వొందు, మమ్ము రక్షింపకున్న నీ♦మహిత మైన
యశమునకు హాని గాదె య♦ట్లౌటఁ గరుణఁ, ద్రిభువనేశ్వర సాక్షాత్క♦రింప వలయు.
మ. అని యిబ్భంగి సరోజలోచనుఁడు న♦య్యంభోజగర్భుండు న
య్యనిమేషాధిపుఁడున్ మహావినయభ♦క్త్యన్వితు లై సంస్తుతిం
చిన సంతుష్టమనోంబుజాతుఁ డగుచున్ ♦ శ్రీశంభునాథుండు న
య్యన విష్ణ్వాదికదేవతాప్రతతికిన్ ♦ సాక్షాత్కరించెన్ గృపన్. 90
వ. అప్పుడు. 91

సీ. సజలనీలాంబుద • శ్యామలద్యుతితోడ, రవిసోమవహ్నినే • త్రములతోడ
శూలకపాలభా • సురకరద్వయితోడ, స్మయమానవదనాంబు • జంబుతోడ
మహనీయకంఠభా • సమగ్రసంపదతోడఁ, గరుణాలసత్కటా • క్షములతోడ
నయుతభాస్కరమండ • లాభతేజముతోడ, భువనమోహన మైన • మూర్తితోడఁ
గీ. జంద్రికాశీతలాకార • చంద్రసదృశ, యక్షమాలికాపుస్తక • హస్త మైన
శ్రీపరాశక్తితోడ భా • సిల్లుశంభు, నాథుఁ గాంచిరి సురలు మ • నంబు లలర. 92
ఉత్సాహ. భుక్తిముక్తిదు లసమస్త • మూలకారణుల్ పరా
శక్తిశంభునాథనామ • శాశ్వతాద్యదంపతుల్
వ్యక్త మాకృపాసమృద్ధి • నఖిలదేవతలకు స
ద్భక్తి దర్శనోత్సవప్ర • దాన మాచరించినన్. 93
వ. వారలు సంతోషవిస్మయరసాక్రాంతస్వాంతు లగుచునుండి యప్పుడు. 94
క. స్మితఫుల్లముఖాంబుజుఁడై, యతిలోకుఁడు శంభునాథుఁ • డమరులఁ గరుణా
తతదృష్టిఁ జూచి సాదర, మతి నిట్లని పలికె నమృత • మధురము గాఁగన్. 95
క. అమరవరులార భవదా, గమనంబును లోకనాశ • కరు లగుభండ
ప్రముఖులు మిముఁ బఱచినదౌ, ష్ట్యము నెఱుఁగుదు నేనుఁ బ్రస్ఫు • టముగ నఖిలమున్.
వ. సువ్రతులారా సావధానులరై వినుండు చెప్పెద లోకంబులకు మహాప్రళయంబును గామప్రళయంబును నవాంతరప్రళయంబును ననుభేదంబులఁ బ్రళయంబు త్రివిధం బయి ప్రత్యండంబును బ్రతికల్పంబునుంగా నిత్యంబును నావర్తించుచున్నయది ప్రళయోద్ధారకు లైన దేవశ్రేష్ఠులు మువ్వురు గలరు వార లెవ్వ రనిన మహాప్రళయంబునకు నుద్ధారకుండనై నేను వర్తిల్లుదు నవాంతరప్రళయంబునకుఁ గమలసంభవుం డుద్ధర్త యై యున్నవాఁడు కామప్రళయంబునకు లలితాపరమేశ్వరి యుద్ధారకత్వంబు వహించి యున్నయది యమ్మహాభాగ సకలబ్రహ్మాండంబులందును సమస్తకల్పంబులందును లోకసంరక్షణార్థం బావిర్భావంబు నొందుచుండు నట్లుగావున మదీయాంశం బైనమహేశ్వరునిరోషానలంబున మన్మథుండు దగ్ధుం డైనకారణంబున నిప్పుడు ప్రవర్తిల్లుచున్నయది గామప్రళయంబు దీనియందు మదనభస్మప్రోత్థితు లైనభండాది దానవులచేత లోకం బాకులం బై వినష్టంబును నిస్సారంబును మృతప్రాయంబును నై యున్నయది యట్లౌట నూతనసృష్టికల్పనంబునకు లలితామహాదేవి నుత్పాదించు ప్రయత్నం బొనరింప వలయు నని పలికిన సురోత్తము లాసర్వోత్తమున కిట్లనిరి.
క. పరమేశ యెట్లు లలితా, పరమేశ్వరి యుదయ మొందు • భవ్యాత్మిక య
క్కరుణానిధి యెచ్చట నవ, తరించుఁ గరణీయ మెద్ది • తలఁపఁగ మాకున్. 98

సీ. సర్వేశ శ్రీమహా♦శంభునాథ మహాత్మ, విదితసర్వోపాయ ♦ విబుధగేయ
విస్పష్టముగ నిది ♦ వివరింప వలయును, మా కనిన మహాశంభుఁ ♦ డాదరమునఁ
బలికె నోసురలార ♦ తెలిపెద వినుఁడు మీ, రవధానమున నమ్మ♦హానుభావ
యవతరించుటకై మ♦హాహోమవిధియుక్త, మైనమహాయాగ ♦ మధికయత్న

గీ. మమర నావశ్యకముగఁ జే♦యంగవలయు, దాన సర్వకార్యంబులుఁ ♦ దగ ఫలించుఁ
దత్క్రియార్థమై వలయుసా♦ధనసమూజ, మెల్ల వినిపింతు భవదీయ♦హితముఁ గోరి.

వ. ఇప్పుడు కర్తవ్యం బైనయమ్మహాయాగంబునందు వాయురూపధారి నై నేను హోతనగుదు మదీయం బైనచిదగ్ని యగ్ని యగు సామాన్యాగ్ని హవ్యవాహనుం డనంబను శేష్యసర్వజలపూరం బైనసప్తమహాపారావారంబు హోమకుండంబు తద్వ్యతిరేకం బైనసాగరవట్కం బభిఘారంబు పంచసర్గంబులు పశువులు సృష్టిపంచకలక్షణంబు మీకెఱింగించెద మానససృష్టి ప్రథమ యగు జరాయుజసృష్టి ద్వితీయయై చెల్లు నండజసృష్టి తృతీయయై ప్రవర్తిల్లు స్వేదజసృష్టి చతుర్థయై పరఁగు నుద్భిదసృష్టి పంచమ యనంబడు నీపంచవిధసృష్టి పురోడాశం బగు సృష్టిపంచకవ్యతిరిక్తంబు లైన భూపర్వతసలిలమారుతాభ్రంబులచే హవ్యకల్పనం బగు నగ్నియు మదీయం బైన చిదాకాశవహ్నియం దేకీభవించు నివ్విధంబున మహాయాగంబు ప్రవర్తించుచున్న సమయంబునఁ బ్రజ్వలితాగ్ని యైనహోమాగ్నియందు సమగ్రయత్నంబున మచ్ఛక్తిప్రేరితు లై మీరలు ప్రవేశింపవలయు ననంతరంబ సకలవస్తువులు వేల్వంబడుచుండ నిర్మలం బై యూర్ధ్వాండోల్లంఘి యైనతేజంబువలన శ్రీచక్రరాజనామధేయమహాస్యందనారూఢయు విద్యుత్కోటిసదృశాకృతియు సమస్తసౌందర్యనిధియు నైనశ్రీలలితాపరమేశ్వరి వెలువడి సిస్మితోన్ముఖశాలిని యై యాత్మాంశంబువలనఁ బుంరూపంబుఁ గావించుఁ గామరాజాహ్వయం బై ప్రణవరూపం బైనయాపరబ్రహ్మంబు తత్పతి యగు నాదంపతులవలనం బిమ్మట నెప్పటియట్ల విశ్వసృష్టి యొనర్పంబడు నద్దేవీప్రసాదమాహాత్మ్యంబువలన జగత్త్రియంబు సర్వంబును నవనవాకారం బై తొల్లిటికంటె నతిసుందరంబు గాఁ గలయది యమ్మహానుభావ భావజోజ్జీవనయై తత్పరయై పుండ్రేక్షుశరాసనంబును బుష్పబాణపంచకంబును బాశాంకుశంబులు ననునస్త్రచతుష్టయంబు స్మరణమాత్రంబున సృజియించి యయ్యాయుధంబులచే భండాసురసంహారం బనాయాసంబునం గావింపం గలయది మఱియు నమ్మహనీయ కామేశ్వరముఖావలోకనంబువలనఁ బంచబాణుని మగుడ బ్రదికించుఁ జిదగ్నియందు హవ్యంబు లై త్యక్తప్రాణశరీరు లైనయీసకలదేవతలకు నూతనదేహంబు లశ్రమలీల నవ్విశ్వేశ్వరి సంపాదించునది. గావున నిత్తెఱం

గున నమ్మహాయాగంబు సేయ మీ కందఱకు నభీష్టం బగునేని నత్ప్రియత్నం బొన రించెద నిట్లు సేయకున్న బ్రహ్మాండదానవ... శైనమీకుం బ్రాణమాత్రంబు శేషించినది యదియు నంతకంతకు నాశంబు నొందంగలయది మీరు నశించుట వలన జగదండనాశం బగుటకు సందియంబు గలదె యట్లగుట నీయత్నం బొనరించి యమ్మహాదేవిం గలిగింప వలయు నని శంభునాథుం డానతిచ్చినం దద్వచనంబు లాకర్ణించి దివిజులు సంతుష్టాంతరంగులై పునఃపునఃప్రణామంబు లాచరించి దేవా యట్లయ్యెడుం గాక దేవరదివ్యచిత్తంబునఁ నెద్దిసేయ నవధరించితి రదియె కర్తవ్యం బయ్యెడు దీనికి విచారం బేల యీయఖిలవిబుధులును భవదీయచిదగ్నియందు హవ్య త్వంబు నొంది విప్లుష్టదేహులై నూతనతనూవిరాజితులై కృతార్థు లౌదురు గాక యీ మహాక్రతువునం దెయ్యది కర్తవ్యంబు దాని నెఱింగి చేయుటకు మహాహోత వైననీవే సమర్థుండవు గావున నేమియు నెఱుంగనిమాకు శక్యం బగునె విశ్వంబునకు నెయ్యది హితం బదియ నిర్వహింపవలయు నని గీర్వాణులు విన్నవించిన శంభునా థుం డంగీకరించి పరాశక్తితోడ నంతర్ధానంబు నొందె నప్పు డానిర్జరులు ప్రహృష్టాం తఃకరణులై దిగ్దంతావళవిషాణప్రభిన్నబ్రహ్మాండభాండకర్పరద్వారమార్గంబున మగుడి వచ్చి తద్రంధ్రంబు మహాపర్వతంబుల నాచ్ఛాదించి యుచితప్రకారంబులం దమతమ గృహంబులకుం జని రంత మహాదేవుం డగుశంభునాథుండు లోకోపకారంబుగాఁ బరాశక్తిసమన్వితుండై మహాయాగం బొనరింప నిశ్చయించి బ్రహ్మాండబహిర్గతచి దాకాశమయజ్ఞానగ్రహణంబుచేసి సనాతనం బైనసూక్ష్మరూపంబున మహాండమ ధ్యంబు ప్రవేశించె నని హయగ్రీవుండు చెప్పిన నగస్త్యమహామునీంద్రుం డి ట్లనియె. 100

సీ. అజ్ఞానహర మహా ప్రాజ్ఞ హయగ్రీవ, దేవ నీవిప్పుడు ♦ తెలిపినట్టి
యతిచిత్ర మైనమ♦హాయాగవిధి యెట్టి, దది సేయ నేఫల ♦ మందుఁ గర్త
మది యెద్ది సంశ్రూయ♦మాణమై జనులకు, నఖిలసుఖప్రదం ♦ బగుచునుండు
నట్టియీకథ విన ♦ నతికుతూహల మయ్యె, విస్తరింపుము దయా♦న్వితహృదయ

గీ. యనుచు వేఁడిన హయవక్త్రుఁ ♦ డాదరమున, ననఘ తెల్పెద విను మహా♦యాగవిధము
సర్వపాపఘ్న మొకసారి ♦ చదువ విన్న, రాజసూయాఖ్యమఖసహ♦స్రఫలదంబు. 101

సీ. అసదృశమహిమాఢ్యుఁ ♦ డగుశంభునాథుండు, వితతమై భాండప్ర♦విష్టుఁ డగుచు
మహాత్తయై తాను మహా♦మోదోద్యోగమున నుండి, సర్వేశి యగుపరా♦శక్తి యజ్ఞ
పత్నియై విలసిల్లఁ ♦ బరమరహస్యమహా,లలితామహావిద్యఁ ♦ దలపుఁ జేర్చి
యుచ్చరింపుచుఁ బ్రజ♦వోగ్రవిప్తస్కంధ,పవమానమయుఁడై య♦పారమహిమ

ఆ, గాజిలంగ శ్రీప♦రాశక్తి దాఁ గ్రియా,శక్తి యగుచుఁ దనదు♦శక్తి వృద్ధిఁ
బొందునట్లు ♦ సేయ ♦ మూఁడులోకంబులు, గంప మొందఁ జేసె ♦ ఘనబలమున. 102

వ. ఇవ్విధంబున. 103

మ. ప్రళయారంభమహాపవమానమూర్తి యగుచున్ ♦ శ్రీశంభునాథుండు సం
స్థితితోఁ దత్సాహముతో జగత్త్రియము సం♦భ్రాంతంబుఁ గావించి య
శ్లథసారంబున హోమకుండవిహిత♦స్థానక్రియాంచన్మనో
జ్ఞుఁడై సప్తమవార్ధిశోషిలంగ సం♦రంభించె నుగ్రాకృతిన్. 104

క. ఆజలధి శాంభవానల, తేజంబున నింక యధిక♦దీర్ఘశ్వభ్రం
బై జలజంతురహితమై, యాజిహ్మగలోకనిమ్న♦మై కనుపట్టెన్. 105

క. ఆసాగరగర్తాంతర, మాసర్వేశ్వరుఁ డొనర్చె ♦ నధ్వరకుండం
బాసన్నాహము గని నా,నాసురసముదాయములు మ♦నంబుల మెచ్చన్. 106

గీ. శ్రీమహాశంభుఁ డుద్భిద♦స్తోమ మెల్ల, నాల్గుభాగము ల్గాఁగ నొ♦నర్చి యప్పు
డందులో నొక్కభాగ మ♦య్యంబురాశి,గర్తమధ్యమమున రాశి ♦ గాఁగ నిలిపి. 107

క. శ్రీసింహాసనవిద్యా,భాసురజపశాలి యగుచుఁ ♦ బటుహుంకారం
బాసర్వజ్ఞుఁ డొనర్చె మ,హాసంరావముగ నద్భు♦తావహలీలన్. 108

క. ఆలీలానాదముచే, మూలాధారమున నుండి ♦ మూర్ధావధిగా
నీలగ్రీవునిసంవి,త్కీలి గనుఁ బ్రజ్వరిలె ను♦దీర్ణతరంబై. 109

గీ. ఆచిదగ్నిని నిజఫాల♦లోచనంబు,వలన వెడలించె నప్పుడు ♦ వామదేవుఁ
డదియు సాగరగర్తకుం♦డాంతరస్థ,తరులతాగుల్మరాశి దా ♦ నెరవుకొనియె. 110

వ. ఇత్తెఱంగున. 111

చ. దరికొని చిద్ధుతాశనుఁ డు♦దగ్రతఁ గుండమునిండియుంచుదాఁ
క రుచిరకీలసంచయము ♦ గాఢముగా విలసిల్లుచుండ ని
ప్పరుసున విద్యచేఁ బరమ♦పావన మైనచిదగ్ని నమ్మహా
పురుషుఁడు సంప్రమోదమునఁ ♦ బూనికమైఁ బ్రణయించి వెండియున్. 112

సీ. తారకాపుష్పబృం♦దములచేఁ దత్కుండ, మర్చించి యష్టమూ♦ర్త్యన్వితముగ
నాచిత్కృశానుని ♦ నాత్మలో భావించి, పూజించి మఱియు ష♦ణ్మూర్తి నతని
నభ్యర్చనము చేసి ♦ యంతటమూర్తిత్ర,యాత్మకుం డై నయ♦య్యాశ్రయాశు
విధివత్సపర్యలు ♦ విదితంబుగా సల్పి, తనకిరియాపటిమకు ♦ ననిమిషులును

గీ, మునులు మనముల నరుదంది ♦ వినుతిసేయ
మహితసంస్కార మొనరించె ♦ మాననీయ

సంవిదగ్ని నా శ్రీమహా • శంభునాథుం
డిత్తెఱంగున ద్రిభువన • హితముఁ గోరి. 113

వ. అయ్యగ్నిదేవుమూర్తిభేదంబులు వివరించెద జాతవేదసుండును హవ్యవాహనుండును సశ్వోదరుండును వైశ్వానరుండును గౌమారతేజుండును దేవముఖుండును ననునామధేయంబులం దదీయమూర్త్యష్టకంబు ప్రవర్తిల్లు మఱియు సహస్రార్చియు స్వస్తిపూర్ణుండును నుత్తిష్ఠపురుషుండును ధూమవ్యాపియు సప్తజిహ్వుండును ధనుర్ధరుండును ననునభిధానంబులం దన్మూర్తిషట్కంబు ప్రకాశించు వెండియు వైశ్వానరుం డుత్తిష్ఠపురుషుండు చిత్త్రింగణుం డనునాహ్వయంబులం దన్మూర్తిత్రియంబు విరాజమానం బగు నివ్విధంబున బహుమూర్తి యైనచిత్పావకుని నర్చించి యమ్మహానుభావుండు గ్రమ్మఱ హిరణ్యయుఁ గనకయుఁ గర్తయుఁ గృష్ణయు సుప్రభయు నతిరక్తయు బహురూపయు నను నాఖ్యలు గలతదీయజిహ్వాసప్తకంబుఁ బ్రత్యేకంబ పూజించి పుష్కలావర్తకమేఘస్వరూప యగుదర్వి గ్రహించి హోమంబు సేయ నుద్యుక్తుం డయ్యె నప్పుడు. 114

సీ. శంభునాథసమీరప్ర • చండవేగ, దారుణప్రేరితాంభోద • దర్వి యరిగి
యధికచిత్రంబుగా ఘృతో • దధిసమస్త, మఱది పానంబు సేసి వె • ల్వడినయంత. 115

ఆ. ఏమి చెప్ప నప్పుడు • హోమకుండంబునఁ
గొండలంతలేసి • గొప్ప లగుచు
నెడము లేక దుమికె • ఘృతధార లయుతముల్
నియుతములును మఱియుఁ • బ్రయుతములును. 116

క. ఘృతధారాతతి యిట్లవిరతముగ దుముకఁగఁ జిదగ్ని • ప్రస్ఫీతంబై
శతయోజనపర్యంతము, వితతోర్ధ్వజ్వాల లగుచు • విస్తృత మయ్యెన్. 117

క. ఈవిధమున శ్రీలలితా, దేవేశ్వరితేజ మఖిల • దిక్పరిపూరం
బై వెలయు ననినక్రియఁ జిత్పావకతేజంబు వర్వె • దశదిశలందున్. 118

ఉ. వెండియు శంభునాథుఁ డతి • విశ్రుతుఁ డుద్భిదతుర్యభాగ మ
క్కుండమునందు నిల్పి విధి • కోవిదుఁడై దధిసాగరంబు ను
ద్దండమహాబలంబున ను • దారబలాహకరూపదర్విచే
నింప గ్రహించి వేల్చె నతి • నిర్మల మాజ్వలితానలంబునన్. 119

క. సకలదధివార్ధిహోమము, ప్రకటముగ నొనర్ప జ్ఞాన • పావకలీలా
ప్రకరం బిన్నూఱామడ, యకుటిలగతి నెగసె మింట • నద్భుతకరమై. 120

వ. మఱియును. 121

క. ఆలోకనాఖ్యుఁ డుద్భి,జ్జాలచతుర్థాంశ మవుడు ♦ సంవిత్కీలి
జ్వాలానికరము పై నిడి, కేలన్ వారిధుదర్వి ♦ గీలించి వెసన్. 122

క. ఇక్షురసోదను సర్వం, బాక్షణమ గ్రహించి సంవి♦దర్చిన్ వేల్చెన్
బ్రక్షీణలోకసంత్రా,ణక్షమమహిముండు శంభు♦నాథుఁడు నియతిన్. 123

గీ. శాంభవసమీరణాహూతేక్షు♦నారివార్ధి, యగుట ముదమునఁ దేలి నా♦ట్యంబు సలుపు
నోజఁ జిత్స్వశిఖ్నిమనున్నాళు♦ యోజనంబు,లూర్ధ్వముగఁ బ్రజ్వలించెను♦ హోత్కటగతి.

ఉ. అంతట శంభునాథుఁడు మ♦హామహిమాఢ్యుఁడు మధ్యసాగరం
బంతయు మేఘుదర్వి గొని ♦ యంచితచిచ్ఛిఖియందు వేల్వన
త్యంతమునం బుసం బొడలి ♦ యప్డు చతుశ్శతయోజనంబు లా
క్రాంతనభోంతరార్చి యయి ♦ గాఢము గాఁగఁ దదగ్ని వర్ధిలెన్. 125

మ. అవశిష్టోద్భిదభాగమవ్విభుఁడు జ్ఞా♦నాగ్నిం దగ న్నిల్పి యా
లవణాంభోనిధివారిపూర మవలీ♦లన్ సర్వము న్మేఘుద
ర్వివహేన్యంబునఁ బూని దీప్త మగుసం♦విద్వహ్నిలో వేల్వ భై
రవమై మోగిసె ఛటచ్ఛటచ్ఛటమహా♦రావం బుదగ్రంబుగన్. 126

క. ఆరవమున భండాదిమ,హారాక్షససమితి గుండె ♦ లవిసె మఱియు నా
క్షీరపయోధిన్ శంభుఁడు, వారిదదర్విన్ గ్రహించె ♦ వడి సకలంబున్. 127

క. గ్రహియించి ప్రజ్వలజ్జ్ఞా,నహుతాశనునందు వేల్వ ♦ ననుచిదనుజద
ర్పహాపవిభిన్నస్ఫాటిక,మహీధరము నెనసె నతఁడు ♦ మహితధవళిమన్. 128

క. జలనిధు లీక్రియ నన్నియు, స్థలశేషము లగుచునుండ ♦ శంభుండు మహా
నలమున సమస్తలోకం,బులఁ గ్రమమున వేల్వఁ దనదు♦బుద్ధిఁ దలంచెన్. 129

క. తలఁచి తనయనుపమం బగు,బలమున నీయఖిలభూమి♦భారము హేలా
విలసితుఁడై తాల్చి మహా,బలరూపము నొంది యధిక♦పటువేగమునన్. 130

సీ. అశ్రీమవృత్తి శేషాదిమహానాగ,చయముల నెల్ల న♦చ్ఛటికిఁ దేర
నాశంభునాథుమ♦హావాయువేగస,మాకృతులై ఫణా♦మణిఘృణితతి
వియదంతరము నెల్ల ♦ వెలుఁగంగఁ జేయుచుఁ, బ్రాంజలు లగుచు న♦త్యంతహర్ష
తాంతఃకరణులై య♦నంతవాసుకితక్ష,కర్కోటకాదినా♦గప్రధాను

ఆ. లాచిదాశ్రయాశు♦నందుఁ బ్రవేశించి, రిట్లు సర్పగణము ♦ నెల్ల వేల్చి
యామహానుభావుఁ డష్ట♦దిగ్గజముల, నోజఁ దెచ్చెఁ దనమ♦హాజవమున. 131

వ. ఇవ్విధంబున నిమేషమాత్రంబున హరిద్దంతావళాష్టకంబు నశ్రమంబునం దెచ్చి. 132

మ. మదశోభార్ద్రికటస్థలం బయినయమ్మాతంగయూథంబు నా
సదయాంతఃకరణంబునం దచ్చెరువు చిహ్నమ్మయశిక్షం సంప్రీతి వేల్వంగ స
మ్ముద మొప్పం బరిఫుల్లహల్లకసరిస్ఫూర్జత్సరోవారియం
దుదకక్రీడలు సల్పి సల్లలరె సద్యుద్దండవేదండముల్. 133

సీ. పరమేశ్వరుం డంత భారతవర్షస్థజనులఁ దద్రాజన్యసముదయముల
వరుస భద్రాశ్వాదివర్షనివాసులఁ బ్రాచ్యుల మఱియు నుదీచ్యజనుల
మధ్యదేశీయుల మహితతేజస్కులౌ నుత్తరకురుదేశయుక్తనరుల
సకలదేశమనుష్యసంఘంబులను సమస్తద్వీపగతమానుషపవిత్రతుల

గీ. నిజమహావేగమున మహనీయమహిముఁడై నయమ్మహాత్ముండు దెచ్చి జ్ఞానవహ్ని
యంచితప్రభఁ బ్రజ్వలించుచుండ, నందు హోమంబు గావించె నద్భుతముగ.

క. ఈలీలనాగలోకము, భూలోకము నిర్భుజంగమును నిర్మర్త్యం
బై లోచనగోచరముగ, నాలోకేశ్వరుఁడు మఱియు నవహితమతియై. 135

క. జ్యోతిశ్చక్రగతగ్రహజాతముల సతారకముగ సకలజగత్ప్ర
ద్యోతకతేజోమూర్తుల, నాతతమతిఁ బ్రజ్వరిలఁ జిదగ్నిం వేల్చెన్. 136

వ. మఱియును. 137

మ. కరుణాంభోనిధి శంభునాథుఁ డపు డాకర్షింప నింద్రాదు లా
సురలున్ దేవముఖాదిదిక్పతులు యక్షుల్ చారణుల్ సిద్ధకి
న్నరులున్ సాధ్యులు గుహ్యకుల్ ఖచరులున్ గంధర్వులున్ భూతకిం
పురుషుల్ లోనగుదేవజాతు లమితామోదాత్ములై వేడుకన్. 138

వ. సుస్నాతులై ధౌతవస్త్రంబులు ధరియించి నానాభూషణభూషితులగుచు నంజలిపుటంబులు ఫాలభాగంబునం జేర్చి సంతోషహాసవికసితవదనాంబుజులై తమతమవాహనంబులనధిరోహించి స్వీయంబులైనయస్త్రశస్త్రంబులతోడ సపరిచ్ఛదులై భండాసురదూషితనిజవిగ్రహవిమోచనకుతూహలంబునం జనుదెంచి శంభునాథహూయమానులై సంవిత్పావకప్రదేశం బొనరించిరి వెండియు నమ్మహాత్ముండు ద్వాదశాదిత్యులనెన మంత్రమువసువులఁ దమతమపారిషదులై నగణనాయకులతోఁ గూడిన చంద్రార్ధకిరీటోజ్జ్వలులైనయేకాదశరుద్రుల నాశ్వినేయులఁ బితృగణంబులఁ జిదగ్నియందు వేల్చె నాసమయంబున. 139

సీ. సనకాదియోగీంద్రసంఘంబుతోడ విష్వక్సేనముఖపారిషదులతోడ
ననుపమద్యుతిసుదర్శనపాంచజన్యాదిసుమహితపంచాయుధములతోడఁ

జరితటిత్ప్రభ మైన♦శ్రీదేవితోడ స్ఫురత్కాంతి యాధరా♦రమణితోడ
సాహాయ్యకలితాను♦చరసమాజముతోడ, భూరిసౌందర్య మా♦మూర్తితోడ
గీ, సుసమందస్మితముఖాంబు♦జంబుతోడఁ, బుండరీకాక్షుఁ డత్యంత♦ముదము మీఱ
నచ్చటికి వచ్చి లోకశు♦భాభికాంక్షఁ, జిత్కృశానుసరోవర♦స్థితిఁ దనర్చె. 140
వ. మఱియును. 141
సీ. సంగతులై నంది♦భృంగిమహాకాళ,ముఖగణేశులు ముదం♦బున భజింప
ఘననీలసదృశమై ♦ గళకాంతి మెఱయంగ, గంగావతంసోత్త♦మాంగ మమరఁ
జూడామణీకృత♦శుభ్రమయూఖుఁడై, యహిభూషణాఢ్యస♦ర్వాంగుఁ డగుచు
భస్మానులేపశో♦భారమ్యదేహుఁడై, చేతుల శూలాది♦హేతు లలర
గీ, సంతసమున మహేశుఁ డ♦చ్చటికి వచ్చి, భవ్యనిజమూర్తి భేదరూ♦పమున మెఱయు
శంభునాథాఖ్యచేత దృ♦ష్టస్వరూపుఁ, డగుచు జ్ఞానాగ్నిలోఁ జొచ్చె ♦ సద్భుతముఁగ.
క. కమలజనిర్దిష్టములై, ప్రమదంబున నప్పు డప్స♦రఃప్రమదార
త్నము లఱువదికోటులు చి,ద్విమలధనంజయునియందు ♦ వేడుకఁ జొచ్చెన్. 143
గీ. అపుడు తారకప్రముఖదు♦రాత్మకులును, భండముఖ్యమహాఖల♦ప్రకరములును
దత్క్రియానింద సేయుచుఁ ♦దమనెలవుల, నొగిఁ బ్రమత్తులై యూరక♦యుండి రంత.
సీ. తనతో సమానులై ♦ తనరుమరీచిము,ఖ్యప్రజాపతులు ద ♦ న్ననుసరింప
సంతుష్టహృదయులై ♦ సత్యలోకనివాసు ♦ లగుతాపసశ్రేష్ఠు ♦ లర్థిఁ గొలువ
స్మయమానవక్త్రితా♦మరసచతుష్టయ,కృతచతుర్వేదసం♦స్తుతులు వినుచు
విదితానుభావసా♦విత్రియు గాయత్రి,యును సరస్వతియును ♦ దను భజింప
ఆ, రాజవాహ్య మైన♦రాజమరాళంబు,వెంటఁ దత్కులోత్థ♦విహగచయము
తెల్ల రాఁగ నచటి ♦ కెలమితోఁ జనుదెంచి, ధాత యాచిదగ్నిఁ ♦ దఱియఁ జొచ్చె.
వ. ఇవ్విధంబున మహాజ్వాలాజాలలంఘితసకలాశుం డగుసంవిద్ధుతాశనునందు మాన
సోద్భిజ్జజరాయుజాండజస్వేదజజంతుజాలంబుల వేల్చి మహాహోత యైన శ్రీశంభు
నాథమాంత్రికుండు నిష్పాదపమనుష్యాదిక యైనకేవలభూమియు మహావాయు
రూపంబున మహాయాగహోత యైనతానునుం దక్క సర్వంబును జిన్మయవీతి
హోత్రునందు హుతం బై నయనంతరంబ సమస్తదర్శనంబుల నఖిలవిద్యల నిఖిలమ
తంబులను గ్రమంబున నయ్యగ్నియందు హోమంబు గావించె నిత్తెఱంగున నమ్మహే
శ్వరునిచేత నెల్లవస్తువులు వేల్వంబడుచుండ నూర్ధ్వాండభిత్తిపర్యంతం బయ్యు
షర్బుధుండు ప్రజ్వలత్కీలాకరాళుం డగుచు వ్యాపించుచుండం బరమాత్మయుఁ జిన్మ
యుండును నిత్యహోతయు నై నయాశంభునాథుండు శ్రీపరాశక్తిసహితుండై

యిత్తెఱంగున మహాయాగంబు నిర్వర్తించి వాయురూపంబు పరిత్యజించి స్వస్వరూప
ధారియై చిదగ్నిస్థిత యైన శ్రీలలితామహాదేవిం గారికాష్టకపాఠంబున నాహ్వానంబు
సేయం దలంచి. 146

క. అశ్లక్ష్ణమహిముఁ డనవ,ద్యశ్లోకుఁడు శంభునాథుఁ ♦ డద్భుతచరితుం
డశ్లథనిష్ఠుండై య,ష్టశ్లోకిఁ బఠించె నపుడు ♦ సరసమృదూక్తిన్. 147

గీ. విశ్వ మెల్లను నీవయై ♦ విశ్వమునకు, నాత్మ వగుచు విశ్వప్రపం♦చాధినేత్రి
వైన శ్రీలలితామహే♦శాని జ్ఞాన,వహ్ని నావిర్భవింపఁగా ♦ వలయు నీవు. 148

క. పరమానందప్రద వై, పరమానందస్వరూప♦భాసిత వగుచున్
బరఁగినలలితాపరమే,శ్వరి సంవిజ్జాతవేదు♦వలన వెడలుమా. 149

క. జ్ఞాతృజ్ఞానజ్ఞేయము, లాతతమతిఁ దలఁప నీవ ♦ యఖిలజ్ఞాన
ద్యోతనవు నీవ లలితా,ఖ్యాతమహేశాని సంవి♦దగ్ని వెడలుమా. 150

గీ. కాళికాభద్రకాళికా♦ఖ్యలు వహించి, సర్వలోకసంహారంబు ♦ సలుపునట్టి
శ్రీమహాలలితాదేవి ♦ చిత్స్వరూప,దహనమధ్యంబు వెడలి స♦త్వరత రమ్ము. 151

గీ. లోకసంత్రాణరసికవై ♦ లోకములకు, మంగళప్రదవై సర్వ♦మంగళాఖ్య
వైనలలితామహేశ్వరి ♦ జ్ఞానవీతి,హోత్రువలన నావిర్భావ ♦ మొందు మిపుడు.

గీ. విశ్వమునకు నాయిక వయి ♦ విశ్వసృష్టి,పారతంత్ర్యంబు వహియించు♦భవ్యమూర్తి
విశ్వపరిపూర్ణలలితామ♦హేశ్వరీ చి,దగ్ని నుదయింప నిప్పుడ ♦ యవసరంబు. 153

క. జ్ఞానబృహద్భానుసుహుత,నానావిధసృష్టిసుజన♦నైపుణ్యయుతా
నూనాకృతి శ్రీలలితే,శానీ చిద్వహ్ని వెడలి ♦ చనుదెమ్ము వెసన్. 154

ఆ. భండతారకాది♦బహుదైత్యపీడితం, బైనజగము ముదము♦నందఁ జేయఁ
దలఁచి వేగమ లలి♦తాపరమేశ్వరి, యీచిదగ్ని వెడలి ♦ యేగుదెమ్ము. 155

సీ. అని శంభునాథుండు ♦ హర్షితచిత్తుఁడై, కారికాష్టకపాఠ♦కలనచేతఁ
బ్రార్థించుచుండఁ జి♦త్పావకకుండమ,ధ్యంబున నత్యద్భు♦తంబు గాఁగ
నావిర్భవించె వి♦శ్వాధినాయిక లలి,తామహాదేవి యు♦ద్యత్సహస్ర
మార్తాండబింబోప♦మానమహాప్రభా,భాసమానాంగియై ♦ పరమహిత

ఆ. మైనయమ్మహాత్ముఁ ♦ డానందపరవశ,స్వాంతుఁ డగుచు మహిత♦వైదికార్థ
భావగర్భితప్ర♦భావసంపన్నము, లైనసంస్తవంబు ♦ లర్థిఁ జేయ. 156

వ. అట్లావిర్భవించి యాలలితాపరమేశ్వరి చతుర్యోజనవిస్తారంబును దశయోజనోన్న
తంబును నవపర్వసమన్వితంబును దేజోమయసర్వరూపంబును ఋగ్వేదాదిచతురా
మ్నాయమహారథాంగంబును ధర్మాదిచతుర్విధపురుషార్థమహానీయతురంగంబును
నానందపతాకాయుక్తంబును దప్తజాంబూనదోజ్జ్వలనంబును సర్వాగ్రసంస్థితంబై

తదాసనంబును మేరుప్రస్థరూపాఖ్యంబును నయిన శ్రీచక్రరాజాఖ్యమహాస్యందనం
బారోహించి మొదలఁ దనకుఁ దాన యాచిదగ్నికుండంబువలన నుద్గమించి
యనంతరంబ సృష్టి యొనర్ప నుద్యోగించి స్వస్వరూపంబుచేత శ్రీకామేశ్వ
రాభిధానుం డైనయొక్కమహాపురుషుని సృజియించి జగత్సర్గంబునకై యమ్మ
హాత్మునిం దనకుం బతిగా నంగీకరించి మహాకాముకాగ్రేసరుం డైనయక్కామేశ్వ
రునిచేత సమాలింగితయై యద్దేవి యిచ్ఛామాత్రంబున మహాస్త్రచతుష్టయంబు
నిర్మించి యారాగస్వరూపం బైనపాశంబును గ్రోధాకారం బైనయంకుశంబును
మనోరూపం బైనయిక్షుశరాసనంబును శబ్దాదివిషయపంచకాత్మకం బైనపుష్పబాణ
పంచకంబును దనహస్తచతుష్టయంబున వెలుంగ మణిమయమకుటతటఘటితశుభ్రాం
శురేఖావిరాజమానయుఁ బీనస్తనభారమంథరయు సదాషోడశవర్షవయస్కయు మం
దస్మితముఖారవిందయు సకలాభరణశోభాఢ్యయు సర్వాంగసౌందర్యమహావిభవయు
నగుచు నమృతసమ్మితంబు లైనకరుణాకటాక్షవీక్షణంబులచేతఁ ద్రైలోక్యంబు సమ
స్తంబును సరసంబుఁ జేయుకరణిం గనుంగొనుచు నిజరూపదర్శనప్రహృష్టశ్రీశంభునాథ
కృతవేదార్థగూఢబహువిధస్తోత్రపూర్వకపౌనఃపున్యప్రార్థనాసంతుష్టాంతరంగియై యా
త్మరూపంబు స్త్రీపురుషవ్యవస్థచేత బ్రహ్మవిష్ణుమహేశ్వరపురందరాదిదేవతాభేదం
బుల ననేకరూపంబులుగాఁ జేయ నుపక్రమించి షడ్గుణైశ్వర్యసంపన్నయుఁ బరమానంద
స్వరూపిణియు నైనయప్పరమేశ్వరి సోమాత్మకం బైనతనవామనేత్రంబువలన బ్రహ్మ
లక్ష్ములను సూర్యరూపం బైనతనదక్షిణనేత్రంబువలన విష్ణుభవానులను వహ్నిరూ
పం బైనతనలలాటనేత్రంబువలన రుద్రవాగ్దేవులను సృజియించెఁ దత్కారణంబున
బ్రహ్మలక్ష్ములు విద్యుత్కాంతు లైరి విష్ణుభవానులు నీలమేఘద్యుతు లైరి
శర్వవాగ్దేవతలు శుద్ధకర్పూరనిర్మలాకృతు లైరి మఱియు వార లన్యోన్యవినిమయం
బుగా భర్తృభార్యాత్వం బంగీకరించి రెట్లనిన లక్ష్మీదేవి శ్రీమహావిష్ణువునకు
భార్య యయ్యె భవానీదేవి రుద్రునకుఁ గుటుంబిని యయ్యె సరస్వతీదేవి బ్రహ్మ
దేవునకుఁ బత్ని యయ్యె నిట్లు సకళత్రులై యాసుచరిత్రులు మువ్వురుం బ్రణతు
లైనవారలం గనుంగొని యయ్యంబిక జగంబుల నిర్మింపం గ్రమంబున నంబు
జాసనునిఁ బుండరీకాక్షునిఁ గాలకంఠుని నాజ్ఞాపించిన నాలలితాదేవికిఁ బ్రాథమికసం
భవు లైనయమ్మహాపురుషులు సంప్రాప్తనూతననిజవిగ్రహులై తదాజ్ఞ వహించి
తమతమనెలవులకుం జని నిజాధికారంబు లొనర్చుచు సుఖంబుండి రాలోకేశ్వరిప్రా
దుర్భావంబున సకలప్రపంచంబును బరమానందనిర్భరం బై యభినవభంగిం గను
పట్టె నని యిట్లు హయగ్రీవుండు దెలిపిన నగస్త్యమహామునీంద్రుఁ డి ట్లనియె. 157

క. ఓగంధర్వాస్య మహా,భాగ మహాప్రాజ్ఞ నీకృ♦పన్ నేను మహా
యాగవిధ మెల్ల వింటిన్, యోగీశ్వర యింక నొకటి ♦ యున్నది వినఁగన్. 158

క. లలితాపరమేశ్వరి జగ,ముల నెట్లు సృజించె మగుడ ♦ మోదముతోడన్
దెలుపు మనిన హయవదనుం, డలరి యతని కిట్లు లనియె ♦ నతిమధురోక్తిన్. 159

సీ. విను మగస్త్యమునీంద్ర ♦ విశదంబుగా నీకు, వినిపింతు నీ వడి♦గినయదంత
మాచిత్కృశానునం ♦ దావిర్భవించి యా,లలితామహాదేవి ♦ యలఘుమహిమ
సకలలోకంబులఁ ♦ బ్రకటంబుగాఁ దొంటి,యట్టుల నిర్మించె ♦ నెట్టు లనినఁ
గైశికంబున నంధ♦కారంబుఁ గల్పించె, నేత్రత్రయమున వి♦చిత్రరీతిఁ

గీ, జంద్రసూర్యకృశానుల ♦ జనన మొందఁ, జేసె ఫాలముక్తావళి♦చేత సకల
తారగల సృజించె పాళీవ♦తంసమాక్తికములచేఁ జేసె రవిముఖ♦గ్రహనవకము. 160

క. ఆలలితాపరమేశ్వరి, భ్రూలతికాయుగ్మకమునఁ ♦ బొరిఁ గల్పించెన్
మే లగునాజ్ఞాచక్రము, నోలి జగద్ధితము దండ♦నోపాయంబున్. 161

క. నిశ్వాసపవనముల న,య్యీశ్వరి గలుగంగఁ జేసె ♦ ఋక్ప్రముఖం బౌ
శాశ్వత వేదచతుష్క మ,నశ్వరనిజమహిమచేత ♦ నతిచోద్యముగన్. 162

గీ. ఆజగన్మాత మధురవా♦క్యములచేతఁ, గావ్యముల నాట్యముల నలం♦కారములను
వరుస నిర్మించె జిహ్వచే ♦ వాణి నుదయ,మొందఁ జేసె నద్దేవి సా♦నందముగను. 163

వ. మఱియును. 164

సీ. అద్దేవి చుబుకంబు♦నం దుద్భవము నొందె, వేదాంగషట్కంబు ♦ విశ్రుతముగ
ధర్మశాస్త్రపురాణ♦తర్కమీమాంసలు, కర్ణోర్ధ్వరేఖచేఁ ♦ గలిగె నప్పు
డాయురాగమధను♦రాగమంబులు కంఠ,మధ్యమరేఖ సం♦భవము నొందె
సంగీతమును శిల్ప♦శాస్త్రంబు కంఠాధ,రాంచితరేఖ జ♦న్మించి మించెఁ

ఆ, బుట్టెఁ గంఠకూప♦భూమిఁ జతుష్షష్టి,విద్య లెల్ల లోక♦విదితభంగి
నంగదేశమున నె♦సంగె ఛందము లద్భు,తానుభావ యైన ♦ యంబ కెలమి. 165

వ. వెండియు. 166

సీ. దోర్మూలములఁ బుష్ప♦కార్ముక వేదంబు, గురుపయోధరములఁ ♦ గులధరములు
పార్శ్వయుగ్మమున నం♦బరమును దిశలు మా,నసనరోజమున నా♦నందశక్తి
బాహాచతుష్టయిఁ ♦ బాశాష్టకంబు రో,మావళిచే ననం♦తాదిఫణుల
రూపింప హస్తాంగు♦ళీపంచకంబునఁ, బంచబాణుని బాణ♦పంచకంబు

గీ, కరయుగాంగుళీనఖదశ♦కంబుచేత, మత్స్యకూర్మవరాహాది♦మాధవావ
తారదశకంబు నిర్మించె ♦ భూరిమహిమ, నాజగజ్జనయిత్రి పు♦ష్పాభగాత్రి. 167

వ. మఱియు నమ్మహాదేవి కరకమలయుగళారుణిమవలనఁ బ్రాతస్సాయంసంధ్యలును ముఖంబువలన నింద్రాగ్నులును బ్రాణంబులవలన వాయువును నాభివలన నంతరిక్షంబును శీర్షంబువలన స్వర్గంబును బాదంబులవలన భూమియు వీక్షణంబులవలన ధర్మాధర్మంబులును మందహాసంబువలనఁ బరమానందంబును నాభికుండంబువలనఁ బురుషుండును నాభిమూలంబువలనఁ బ్రకృతియు నితంబంబువలన మహత్తత్త్వంబును నూరుమూలంబువలన నహంకారంబును జానువులవలనఁ బంచతన్మాత్రలును జంఘలవలనఁ బంచభూతంబులును గుల్ఫంబులవలన సప్తసముద్రంబులును బార్ష్ణిభాగంబువలనఁ జక్రవాళపర్వంబును బాదతలంబువలన రసాతలంబును రోమజాలంబువలన నోషధాగమేషాదికంబును సంభవించె వెండియు నయ్యంబికముఖంబువలన బ్రాహ్మణు లుదయించి వేదాదివిద్యలఁ బ్రసిద్ధి వహించిరి బాహుదేశంబులవలన క్షత్రియు లుద్భవించి క్షాత్రజీవులై ప్రవర్తిల్లుచుండిరి యూరువులవలన వణిజులు జన్మించి కృతోరుద్యోగాసనులై లాభసంపన్నులైరి పాదంబులవలన శూద్రులు సంభవించి పాదసంచారక్షములై ద్విజశుశ్రూషకు లగుచుండిరి క్రమ్మఱ నమ్మహానుభావ తనరోమకూపంబువలన సమస్తంబైనయుద్భిజ్జాలంబును స్వేదబిందువులవలన స్వేదజసముదాయంబును మధ్యంబువలన జరాయుజజంతుసంఘాతంబును గుల్ఫపిండంబులవలన నండజకులంబును గల్పించి మఱియు నాసికావివరంబులవలన నాసత్యులను దంతకాంతివలనం గీర్తికాంతను బరమానందసంపదవలనఁ బుష్టిని గండస్థలంబులవలనఁ గాంతిని నిర్మించె నివ్విధంబున నద్భుతశక్తియైనయాపరాశక్తిహృదయంబువలన నకలంకశశాంకప్రభయు సమస్తమాతృకాస్వరూపయుఁ దార్తీయరూపిణియు నైనబాలాశక్తి సముత్పన్నయయ్యె నాలలితామహాదేవిబుద్ధివలన వీణాశుకపాణియు సంగీతయోగినియు నైనశ్యామలాపరమేశ్వరి సంజాతయయ్యె నమ్మహారాజ్ఞియహంకారంబువలన మేఘశ్యామలవిగ్రహయు వరాహవక్త్రసముజ్జ్వలయు నైనమహావార్తాళికాదేవి జనియించె నమ్మహేశ్వరిమందస్మితంబువలన దానసలిలార్ద్రగండస్థలుండును సిద్ధలక్ష్మీశోభితమహాత్సంగప్రదేశుండును బాలమార్తాండసమానదేహద్యుతియు నైనవిఘ్నేశ్వరుం డవతరించె నాసింహాసనేశ్వరిమట్చక్రనిలయంబువలన నామ్నాయషట్కం బుద్గమించె నమ్మహాభాగక్రీడావిశేషంబువలన నక్షరత్రయాత్మికయైనబాలాదేవి వొడమె నాలోకేశ్వరియంకుశంబువలన సంపత్కరీమహాదేవియుఁ బాశంబువలన నశ్వారూఢాదేవియుఁ దాలుదేశంబువలన నకులేశ్వరీరశ్మిమాలికలతోడఁ ద్రిపదాత్మికయైన గాయత్రియు నోజోవిశేషంబువలనఁ గుండలీశక్తియుఁ ద్వాదశాతువులవలన దేవ

యోనివిశేషంబులతోఁగూడ దేవతలును రక్తధాతువువలనఁ బ్రాణశక్తియు మాంసధాతువువలన మహాబలంబును మేదంబువలన భూతిసన్నతులును నస్థిసముదాయంబువలన శత్రుశిక్షణార్థంబులైన యంకుశప్రముఖాయుధంబులును మజ్జవలన యజ్ఞవిద్యాగుహ్యవిద్యాస్వాత్మవిద్య లనువిద్యాత్రయంబును బరిశుద్ధం బైనరజంబువలన నమృతమధ్యంబులును నవయవసౌందర్యంబువలన లక్ష్మియుఁ గటాక్షంబువలన మదనుండును బాదంబులవలన మహీతలంబును బాదగుల్ఫంబులవలనఁ బాతాళంబును జంఘలవలన రసాతలంబును జానువులవలన మహాతలంబును నూరువులవలన సుతలంబును నూరుమూలంబువలన వితలంబును నితంబంబువలన నతలంబును జఘనంబువలన భూలోకంబును మధ్యంబువలన భువోలోకంబును స్తనయుగ్మంబువలన సువర్లోకంబును బాహుయుగ్మంబువలన మహర్లోకంబును నంసదేశంబువలన జనలోకంబును గర్ణంబులవలనఁ దపోలోకంబును శిరంబువలనసత్యలోకంబును నెదవెడునట్లు విచిత్రక్రీడ సల్పి యాజగన్మాత త్రైలోక్యమోహనం బనుచక్రంబును దానం జెప్పంబడినయణిమాద్యష్టకంబును బ్రాహ్మ్యాదులను సముద్రంబులను మూలాధారంబువలన సృజియించి తదధిష్ఠానదేవత యైనత్రిపురాంబికం దనయంశంబునం గల్పించినం బ్రకటాభిధానంబు గలవార లంతఱు మహాచిదగ్నిసంభూతంబై మహనీయతేజఃపుంజం బైనశ్రీచక్రరాజరథంబునందలి నవమపర్వంబు నాశ్రయించి రంత నమ్మహేశాని సర్వాశాపూరణం బను చక్రంబు నిర్మించి యందుఁ గామాకర్షణి మొదలగుగుప్తాఖ్య లైనదేవతల స్వాధిష్ఠానంబువలన నుత్పాదించి చంద్రకళామయి యైనత్రిపురేశిం గలిగించి తదధిష్ఠానదేవతం జేసె నద్దేవులందఱుఁ జక్రరాజస్యందనాష్టమపర్వంబు నాశ్రయించి రయ్యీశ్వరి మఱియు మణిపూరంబువలన సర్వసంక్షోభణం బనుచక్రంబును దద్గతం బైనగుప్తతరాభిధానదేవీసముదయంబును దదధిష్ఠానదేవత యైన త్రిపురసుందరిని గల్పించె దేదీప్యమానదేహద్యుతు లైనయద్దేవతలు లలితాధిష్ఠితం బైనచక్రరాజరథేంద్రంబుసప్తమపర్వంబు నాశ్రయించి రవ్విచిత్రచరిత్ర యనాహతచక్రంబువలన సర్వసౌభాగ్యదం బనుచక్రంబును దద్గత లైనసంప్రదాయాభిధానచతుర్దశదేవతలును బురవాసినీనామధేయ లైనతదధిష్ఠానదేవతలను వెలయించిన దేవీసమానప్రభ లైనయద్దేవులు శ్రీచక్రరాజశతాంగంబు షష్ఠపర్వంబు నాశ్రయించి రమ్మహేశ్వరి యాజ్ఞాచక్రంబువలన సర్వార్థసాధకం బను చక్రంబును నచటనివసించుకులోత్తరాభిధాన లైనదేవులను దదధిష్ఠానదేవత యైనత్రిపురశ్రీ యనుదేవతను సృజియించిన రాకాశశాంకసుందరాకృతు లైన

హా దేవతలు తదాజ్ఞచేతఁ జక్రరాజరథోత్తమంబునందలిపంచమపర్వంబు నాశ్ర యించి రయ్యీశాని విశుద్ధచక్రంబువలన సర్వరక్షాకరం బనుచక్రంబును బ్రక టాజస్కులై నవిగర్భయోగినులని యెడితత్రత్యదేవతలను దదధిష్ఠానదేవత యైన త్రిపురమాలిని యనుదేవిని గల్పనఁ జేసిన వారప్పరమేశ్వరీభ్రూసంజ్ఞాజ్ఞాపితా నుగ్రహంబువలనఁ దచ్చక్రరాజరథోత్తమంబుచతుర్థపర్వంబు నాశ్రయించి రనం తరంబ యాసర్వలోకేశ్వరి సహస్రారంబువలన సర్వరోగహరం బనుచక్రంబును నచ్చట నిల్చినరహస్యయోగిను లనం బ్రసిద్ధలైనవాగధిదేవతలను త్రిపురాసిద్ధ యనునామంబునఁ బ్రథిత యైనతదధిష్ఠానదేవతను నిర్మాణంబు చేసిన బాలమా ర్తాండసదృశప్రభలైనయాసర్వదేవత లద్దేవియాజ్ఞచేఁ జక్రరాజరథంబుతృతీ యపర్వంబు నాశ్రయించిరి మఱియు నాజగద్రక్షణి ద్వాదశారచక్రంబువలన సర్వసిద్ధికరాఖ్యం బైనచక్రంబును నందు నిల్చినకామేశీప్రముఖంబులైనయతి రహస్యాభిధానదేవీసమూహంబును దదధిష్ఠానదేవత యైనత్రిపురాంబయు నుం బొడమిరి జ్వలత్కాలానలసమానప్రభలైనయద్దేవతలు చక్రరాజ రథంబుద్వితీయపర్వంబు నాశ్రయించిరి పదంపడి మహానందమహాహ్లాదధి యైన శ్రీలలితాదేవి దనవలన సర్వానందమయంబును బిందుపీఠంబును మహాపీఠం బును ననునామధేయంబులు గలప్రథమచక్రంబుఁ బుట్టించి యందుఁ దదధిష్ఠాన దేవతయై పరాపరరహస్యయు మహాచక్రేశ్వరియు మహాత్రిపురసుందరియు నను నాహ్వయంబులచేత వితత యైనతాను నిలిచి చక్రరాజరథేంద్రంబు మధ్యమ పర్వంబున నధివసించె నిప్పాధంబున నవవిధచక్రనిర్మాణంబుఁ జేసి. 168

మ. వివిధోత్పాదనశక్తిధుర్య యగునావిశ్వాంబ మార్తాండభై
రవుఁ బుట్టించె హృదంతరిక్షమున నుగ్రస్ఫారతన్మండలో
ద్భవ మయ్యెం దిథిచక్ర మంత నది యుత్పాదించె దీప్తంబులై
భువిఁ బెంపొందినషోడశస్వరములన్ భూరిప్రభావంబునన్. 169

గీ. తత్స్వరంబులవలన నుద్భవము నొంది, రనఘకామేశ్వరీదేవి యాది గాఁగఁ
గలుగుదేవులు జగదంబికాసమాన,మూర్తులు దదంశసహితలై మోదమునను.

వ. వారలు నిత్యలును దిథినిత్యాసమాఖ్యలును దత్తత్తిథ్యభిమానవతులు నగుచు సర్వానందమయనామంబునం బ్రసిద్ధం బైనయాప్రథమచక్రంబునందుఁ బంచద శస్థానంబు లాశ్రయించి శతాంగమధ్యమపర్వంబునందు నిల్చిరి మఱియు నమ్మ హేశ్వరి హృదయంబున శిరంబున శిఖను గవచంబున లోచనత్రయంబున నిజా స్త్రంబున షడంగదేవతల నుత్పాదించిన నమ్మహానుభాగ లుజ్జ్వలత్కాలాగ్ని

తేజస్క లగుచు నద్దేవినాల్గుదిక్కులను హాళియు నాగ్నేయంబు నీశాన్యం
బును నైరృత్యంబును వాయవ్యంబును ననుపట్ఠానంబులయందును దీప్తాయుధ
హస్త లగుచు భండాసురవధోద్యుక్తయై యున్నయప్పరమేశ్వరిం బరులశస్త్రా
స్త్రంబులవలనం గావఁ గలవారలై సావధానలై యుండి రివ్విధంబున నిజరథో
త్తమంబునందు శక్తిమయచక్రంబుఁ గల్పించి లలితామహాదేవి తనప్రియభర్త
యైనకామేశ్వరున కిట్లనియె. 171

సీ. ప్రాణనాయక విను ♦ భండాసురవధంబు, మదిలోనఁ గోరి యా♦త్రిదశు లెల్ల
నధికయత్నముతో మ♦హాయాగమున సంవి,దగ్నిఁ బ్రవేశించి ♦ రద్భుతముగ
నది గారణంబుగా ♦ నప్పనికై మన, ముదయించితిమి జగ♦ద్విదితముగను
సుమనోహితంబుగా ♦ సమరదుర్జయుఁ డైన,యమ్మహాదానవు ♦ నాజిలోన

గీ. హతము సేయుట కర్తవ్య ♦ మనఘ మనకు
నట్లు గావున మత్సంగ♦మానుభావ
మున మహాదయశివచక్ర♦ముఁ సృజింప
వలయు మత్ప్రార్థనము సల్పు ♦ మలఘుమహిమ. 172

సీ. అని యిట్లు లలితామ♦హాదేవి పలుకంగ, నమ్మహాకామేశ్వ♦రాభిధానుఁ
డపు డాస్యహుంకార ♦ మడరింప నాథచ,క్రం బుదయించెఁ జి♦త్రంబు గాఁగ
నదియు దివ్యౌఘసి♦ద్ధౌఘమర్త్యౌఘభే,దములఁ ద్రిధావిభ♦క్తత్వ మొందె
వారలు కామదే♦వప్రతిమానభవ్యాకారు లసురసం♦హరణచణులు

గీ. ప్రోజ్జ్వలచ్ఛస్త్రపాణులు ♦ భూరిమహిము, లీడ్యయశులు పరేశమి♦త్రేశముఖ్యు
లనఘు లఱువదిమువ్వుర♦య్యంబ కపుడు, సంప్రదాయకరు ల్నాఁ బ్ర♦శస్తి గనిరి.

వ. అమ్మహాత్ములు కామేశ్వరస్వామిభ్రూసంజ్ఞం బడసి యత్యంతమోదంబున సర్వా
నందమయాహ్వయం బైనచక్రంబు పశ్చాద్భాగంబు నాశ్రయించి రంత నాలలి
తామహాదేవి నిజమధ్యహుంకారంబువలన జనియించినశ్యామలావారాహులలో
పల నాద్య యైనప్రధానమంత్రిస్థానీయ యైనశ్యామలాదేవి నమృతరసంబున
నభిషేకం బొనరించి సర్వశక్తిరాజ్యంబున కధీశ్వరిం జేసి ప్రధానత్వద్యోతనార్థం
బమ్మహనీయకు స్వహస్తాంగుళిసంస్థితం బైనముద్రాంగుళీయకంబు దయచేసిన
నద్దేవి నమస్కారపూర్వకంబుగా నది గ్రహించె వెండియు రెండవది యై భుజా
ర్జితప్రరాక్రమ యైనవారాహికిం బుణ్యతీర్థోదకంబుల నభిషేకమహోత్సవం
బాచరించి దండనాథగా నియమించి తనకనుబొమలవలన హలముసలంబుల
నుత్పాదించి యమ్మహేశ్వరి యామహాయుధంబులు రెండు నమ్మహాభాగ

క్రోసంగ నదిగారణంబున నవ్వారాహావక్త్రి సర్వశక్తిరాజ్యంబునం దాజ్ఞాచక్రవర్తిని యగుచు దుష్టసంహారిణియు శిష్టపరిపాలినియు నను పొగడ్త వహించె నయ్యవసరంబున మంత్రనాథానామ దేవీద్వయంబునకు సంగ్రామార్థంబుగా నాలలితాపరమేశ్వరి స్వకీయం బైనచక్రరాజరథంబువలన రథయుగళంబుఁ గల్పించి భండదనుజసంహారార్థమై సమర్పించిన నయ్యిరువురు నమ్మహాస్యందనంబులయందు యథార్హంబు లైనపర్వంబులం దప్పరమేశ్వరీస్వయంస్థాపిత లై తేజరిల్లిరి తద్రథనామధేయంబులు వినుము చెప్పెద దండనాథ యైనక్రోడముఖికి నివాసరథంబు కిరిచక్రం బని చెప్పంబడు మంత్రిణి యైనశ్యామలాదేవిమహారథంబు గీతిచక్రం బని పలుకంబడు నిత్తెఱంగున భండాసురవధోద్యుక్త యై యాజగదీశ్వరి విధానత్రయం బాచరించి క్రమ్మఱం దనమనంబున నిట్లని విచారించె. 174

గీ. ఆదురాత్ముండు దలఁప మ♦హాబలుండు
దుర్జయుండు సురాసురా♦దులకు నైనఁ
దద్వధంబున కై మహో♦త్సాహలీల
నెలమి బహుయోగినుల సృజి♦యింతు ననుచు. 175

క. అలఘుతరమనోజ్ఞంబునఁ, దలఁచి మహామహిమ కెల్లఁ ♦ దానక మగునా
లలితాపరమేశ్వరి యా, బలియుం డగుదనుజుమీఁది♦పటుకోపమునన్. 176

గీ. గాఢహుంకార మొనరింపఁ♦గాఁ దదీయ, భూరినినదంబువలన ను♦ద్భూత మయ్యె
సత్వరస్ఫూర్తి మైఁ జతు♦ష్షష్టికోటి, సంఖ్య మైనట్టియోగినీ♦సముదయంబు. 177

క. తావత్సంఖ్యాకం బై, దేవీహుంకారనినద♦దివ్యమహిమచే
నావిర్భవించె వింతగ, నావేళన్ భైరవౌఘ ♦ మతిభయదం బై. 178

చ. మఱియు ననేకశక్తులు స♦మస్తవిభూషణభూషితాంగు లై
మెఱయుచు విస్ఫురన్మణిస♦మిద్ధవిమానము లెక్కి చేతులం
దఱు చగుదారుణ ప్రహర♦ణంబులు ప్రస్ఫుటదీప్తి నొప్పఁగాఁ
గొఱలుచు దైత్యరక్తములు ♦ గ్రోలుట కర్థి జనించి రాధ్వనిన్. 179

సీ. నిర్ఘాతభీషణ♦నిర్ఘోష మగునమ్మ, హాయోగినీప్రక♦రాట్టహాస
విసరంబు మిశ్రమై ♦ విశ్వ మెల్లను నిండె, నామహామహనీయ ♦ లంద ఱపుడు
బద్ధాంజలిప్రవి♦భాసమానాలిక, స్థాన లై చక్రర♦థస్థ యైన
యమ్మహాదేవికి ♦ నతిభక్తిఁ బ్రణమిల్లి, రంత వారలఁ జూచి ♦ యఖిలజనని

గీ. పరమసంతుష్టహృదయ యై ♦ భండదైత్య
ఖండనములోనఁ దనచేతఁ ♦ బడినవానిఁ

గాఁ దలంచుచు నుత్సాహ♦గరిమఁ బూని
ప్రేమ వారి సంభావించి ♦ పేర్చెఁ గడిమి. 180

వ. అని చెప్పి. 181

## ఆశ్వాసాంతము.

శా. లీలాకల్పితసర్వలోకవిబుధా♦లీసంస్తుతాంచత్కృపా
వాలాలోకచరాచరావనకళా♦పారీణకాలానల
జ్వాలాహాలభయార్తనిర్జరసమూ♦హత్రాణకృష్ణాప్రతీ
రాళిందస్థలభాసమానవిహృతీ ♦ యత్యంతరమ్యాకృతీ. 182

క. భానుసుధాభానుబృహ,ద్భానువిలోచన దురంత♦పాతకబిభ్య
ద్దీనాదీనవిమోచన, ధేనుగణాధీశవాహ ♦ దీప్తోత్సాహ. 183

మాలిని. సదయహృదయపద్మా ♦ సన్మనోబ్జాతసద్మా
మదనవిజయఖేలా ♦ మానసాతీతలీలా
ప్రదరజలజనేత్రా ♦ పావనస్తోత్రపాత్రా
కదనవిజితదైత్యా ♦ క్రౌంచశైలేంద్రదైత్యా. 184

## గద్యము.

ఇది శ్రీభవానీశంకరకరుణాకటాక్షవీక్షాసుధారసాసారప్రసారణసులబ్ధ
కవితావైభవాపస్తంబసూత్ర పరాశరగోత్రవిలస దాతుకూరివంశ
సంభ వాయ్యనామాత్యపౌత్రాదిమూర్తినామసత్కవిపుత్ర
సకలసుకవిజనవిధేయ పాపయనామధేయ
ప్రణీతం బైన లలితాంబోపాఖ్యానం
బనుమహాప్రబంధంబునందుఁ
దృతీయాశ్వాసము.





ఓమ్.

శ్రీసద్గురుచరణారవిందాభ్యాంనమః.

శ్రీ

# లలితాంబోపాఖ్యానము.



మత్తుపాంశైలసు
తామానసరాజహంస ♦ తరుణతరసుధా
ధామావతంస దృగ్జిత
కామా శ్రీధాన్యవాటి♦కాపురధామా. 1

వ. అవధరింపుము నిరంతరకరుణాస్వభావుండు మహానుభావుండును నగునశ్వగ్రీవుండు
వెండియు మేధాసాంద్రుం డగునగస్త్యమహామునీంద్రున కిట్లనియె. 2

క. భండాసురు నిర్జింప న,ఖండపరాక్రమముతో స♦కలశక్తిచమూ
మండలి గొలువ వెడలె న్నుద్దండత నాభువనజనని ♦ దైత్యులు బెదర౯. 3

సీ. ముల్లోకముల గుండె♦ము లైనయాదుష్ట,దానవుఁ బరిమార్పఁ ♦ దలఁపుఁ జేసి
లలితామహాదేవి ♦ యెలమి ని ట్లరుగంగ, నవుడు సప్తాంభోధు ♦ లద్భుతముగ
మర్దలాకారముల్ ♦ మహిమ మీఱ ధరించి, నభ మెల్ల నాత్మని♦నాదపూర్ణ
ముగ మ్రోయుచుండ దం♦డిగ శక్తిసేనలో, మురజముల్ డిండిమం♦బులు మృదంగ

గీ. ములును ఢక్కలు నిస్సాణ♦ములును ఝర్ఝ
రములు యవమధ్యముష్టిమ♦ధ్యములు గోము
ఖములు పణవంబు లర్ధచం♦ద్రములు ఝల్ల
రులు హుడుక్కలు హుంకార♦ములును మఱియు. ౪

సీ. కాకతుండము లూర్ధ్వకంబు లంకృంబులు, నాలింగ్యములు ఘంట లానకములు
తంపాటచర్చరీ తాళసంఘంబులు, బర్బరంబులు హుడుక్కవాఘటములు
మొదలైన వాద్యౌఘములు మహారవపూర్ణ,భువనసంఘంబులై బోరుకలిగె
సమరోత్సవోద్యోగ శక్తిచమూతాక్షి,తంబులై యతివిచిత్రంబు గాఁగ
గీ. నలువురిూఱ నపుడు లలితామహాదేవి,యంకుశమున నుదయ మందినట్టి
శౌర్యరాశి యైన సంపత్కరీదేవి, వెడలె వమితశక్తివితతితోడ. 5
శా. మాతంగంబులు ఘోటకంబులును శుంభత్స్యందనౌఘంబు పా
దాతంబుల్ బహుకోటిసంఖ్యలు మహోత్సాహంబునం గొల్చి రా
బాత్రితర్భాస్కరమండలాంచితవిభా పాటచ్చరాంగచ్ఛవిన్
దై తేయు ల్భయమంద సంగరకళా దక్షుప్రితాపాఢ్య యై. 6
మ. రణకేళీరసితం బుదగ్రమదవి భ్రాజత్కపోలంబు స
న్మణిభూషాఢ్యము నీలభూధరసమా నప్రోచ్ఛ్రితాంగంబు నౌ
రణకోలాహలనామసామజము సాం ద్రప్రీతితో నెక్కి యా
గుణవారాన్నిధి సంపదీశ్వరి మహా ఘోరాజికిం బూనఁగన్. 7
చ. తమతమవాహనంబుల నుదగ్రత నెక్కి యనేకశక్తిసై
న్యములు నిజాయుధప్రభ లనంతమణిప్రభ ధిక్కరింపఁగా
సమధిక కేతుబద్ధపట జాతమహానిలచాలితాభ్రసం
ఘము లగుచున్ వడిం జనియె గ్రక్కున నమ్మహనీయవెండియున్. 8
ఉ. ఆలలితాంగి వజ్రమయ మైనమహాకవచంబు భూధర
స్థూలకఠోరవృత్తతర సుందరతత్కుచయుగ్మచూచుకా
స్ఫాలితమై యుదారరుచిఁ జాలఁగ నొప్పె సుమేరుశైలలీ
లాలసమానశృంగయుగ లగ్నశరజ్జలదంబుపోలికన్. 9
గీ. అమ్మహాదేవిహస్తపద్మంబునందు, మెఱుపుపోలికఁ దళతళ మెఱయుచున్న
ఖడ్గలత చాలఁ గుపితుఁ డౌ కాలయముని,భ్రుకుటిగతిశత్రుభయదవిస్ఫూర్తి యయ్యె.
ఉ. భండనభూమి రక్కసుల భంగము నొందఁగఁ జేయ నేగున
య్యండజయాన వెంబడి మహాభయదంబుగఁ గోటిమత్తవే
దండము లుద్ధతిం జనియె నత్యయకాలసమీరచాలితో
ద్దండకులావనీధరక దంబముపోలిక నద్భుతాకృతిన్. 11
క. ఈవిధమున నాసంపద్దేవి ససైన్యముగ నడచె దివిజులఁ బ్రోవన్
భావమునఁ దలఁచి లలితాదేవిమనఃపద్మ మలరు దితిజులు బెదరన్. 12

వ. మఱియును. 13

క. ఆయంబికకరధృతపా,శాయుధమునఁ బుట్టినట్టి ♦ యశ్వారూఢా
నాయిక యాజానేయ,ప్రాయం బగుబలముతోడఁ ♦ బటుగతి నరిగెన్. 14

క. ఖురపుద్దాలవిదారిత,ధరణీతల మగుచు హేషి ♦ తతరంగితమై
యరుదుగ నశ్వారూఢా,హరిసైన్యము నడచె నప్డు ♦ డమరులు మెచ్చన్. 15

సీ. ఆరట్టకాంభోజ ♦ పారసీకావంతి,సింధుఘోట్టాణదే ♦ శీయములును
బర్వతసంభవ ♦ ప్రాగ్దేశభవవనా,యుజఘట్టపురటంక ♦ ణోద్భవములు
శాకలదేశ్యవా ♦ ల్మీకీయయవనసం,జాతగాంధర్వకై ♦ రాతవములు
ప్రాంతదేశోద్భవ ♦ బాహ్లీకదేశజా,జానేయభవవన ♦ సంభవములు

ఆ. మొదలుగాఁగఁ గల్గు ♦ ముఖ్యజాత్యశ్వంబు, లతివినీతములు మ ♦ హాజవములు
యుద్ధకర్కశంబు ♦ లిద్ధసుస్థిరచిత్త,ములు జితశ్రమంబు ♦ లలఘుమతులు. 16

గీ. స్వామిచిత్తపరిజ్ఞాన ♦ శక్తియుతము, లమితయుద్ధసహిష్ణువు ♦ లఖిలభవ్య
లక్షణోపేతములు సుప ♦ రీక్షితములు, లలితసంశిక్షితార్థపు ♦ లాయితములు. 17

సీ. రాజితపంచధా ♦ రాశిక్షితంబులు, సుందరతరఫాల ♦ శుక్తియుతము
లసదృశశ్వేతశు ♦ క్తిసమన్వితంబులు, దేవపద్మాంకిత ♦ దీపితములు
సుమహితార్థస్వస్తి ♦ శుక్తిసంపన్నముల్, దేవమణిప్రభా ♦ భావితములు
వ్రణనీమోరుదే ♦ వస్వస్తికాఢ్యముల్, పుంస్వరవంతముల్ ♦ పుష్పగంధు

గీ. లఖిలశాస్త్రోక్తశుభలక్ష ♦ ణాన్వితములు, విజయరాజ్యప్రదంబులు ♦ విజితపవన
జవము లగుఘోటకంబులు ♦ సంఖ్య కధిక,ముగ మహోద్ధతి నద్దేవిఁ ♦ బొదివి నడిచె.

వ. అప్పుడు. 19

క. అపరాజితనామంబై, విపక్షదృగ్భయద మగుచు ♦ వేగపరాభూ
తపవనమానస మగునొక, యపరిమితసులక్షణాఢ్య ♦ మగుఘోటకమున్. 20

సీ. చారుఖలీనోల్ల ♦ సన్మనోజ్ఞాననం, బతిశయప్రాంశుదే ♦ హాంచితంబు
పార్శ్వద్వయవికీర్ణ ♦ భాసురకేసరం, బధికతేజోవిభ ♦ వాన్వితంబు
స్థూలవాలానిలో ♦ చ్చాలితాంభోదంబు, మణికింకిణీనాద ♦ మహితజంఘ
మాస్కందితాదిధా ♦ రాత్రిప్రవీణంబు, చామరవ్యాజప ♦ క్షతియుతంబు

గీ. శాతఖురకోణతాడిత ♦ క్ష్మాతలస్వ,రూపవాద్యధ్వనిజ్ఞప్త ♦ దీపితాజి
విజయభాగ్య మనుక్షణ ♦ వితతహేష, మమితభ్రాంతమనోహరం ♦ బై నదాని. 21

క. హేషాఘోషమిషంబున, దోషాచరబలము నెల్ల ♦ దూలించుటకై
భీషణహుంకారములు జి,గీషన్ జేయుచును గడిమిఁ ♦ గేరెడుదానిన్. 22

క. భావ మిగులొత్త నెక్కి మ, హావైచక్షణ్య మమర • నశ్వారూఢా
దేవి హయారోహకళా,ప్రావీణ్యము చూపఁజెల్లఁ • బ్రస్తుతిసేయన్. 23

క. ఒకకరమునఁ బాశము వే,ఱొకహస్తమునందు శ్వేత • మొకచేత నరి
ప్రకరభయదాంకుశము మఱి,యొకకేల ఖలీన మమర • నుద్ధతలీలన్. 24

క. తరుణాదిత్యసమాన,స్ఫురదురునిజదేహకాంతి • పొలు పమరంగాఁ
దురగము నృత్తముసేసిన,కరణిం గతిలాఘవము ప్ర•కాశముసేయన్. 25

ఆ. సంతసమునఁ దనదు•శక్తిసైన్యంబులు, జయజయధ్వనిఁ బ్ర•శస్తిఁ బొగడ
బలసి కొలిచి రాఁగ • లలితామహాదేవి, యంతరంగ మలర • నరికి వెడలె. 26

గీ. అప్పు డర్ణవనినదంబు • నపలపించు,దండనాథామహాదేవ్య•దగ్రగమన
భేరికాజాతభూరిగం•భీరరవము, బధిరులుగఁ జేసె సర్వప్ర•పంచజనుల. 27

గీ. అతికఠోరంబు లైనవ•జ్రాశుగముల, సకలదిక్కులు భేదింప • శక్తు లైన
శక్తు లొకకొంద ఱద్భుత•శక్తిమతులు, తీవ్రవిక్రాంతి నరిగి ర•ద్దేవివెంట. 28

గీ. దండనాయికసేనముం•దర మహోగ్ర,ఖడ్గఖేటకహస్త లై • కడిమి మెఱసి
చండశక్తులు కొందఱు • సరభసముగ, నడచి రహితులు గడగడ • వడఁకుచుండ.

క. కరధృతహాటకవేత్రో,త్కరతాడనశతముచేత • దండాధ్యక్షా
వరసేనాసంబాధము, సరవిని వారించె శక్తి•శతము తదాజ్ఞన్. 30

గీ. అపుడు మహిషాంకితములు మృ•గాంకితములు
మఱియు సింహాంకితంబు లై • మెఱయునట్టి
ప్రాంశుకేతువు లొని సైన్య•భర్త్రి యెదుర
నెలమిఁ గొందఱుశక్తులు •జ్వలతఁ జనిరి. 31

మహాస్రగ్ధర. ధవళాంశుప్రఖ్యమై సుం•దరమణిమయకా•ర్తస్వరోద్భాసిదండ
చ్ఛవిసంపద్వ్యస్తతామి•స్రమయి గగనని•స్సంఖ్యతారావళీరా
ణ్ణివహోద్యద్భ్రాంతిదంబై • నిరుపమబలని•ర్ణిద్రతద్దండనాథా
ధవళచ్ఛత్రవ్రజం బు•ద్ధతి మెఱసె మహో•త్తాలశక్త్యుద్ధతంబై. 32

క. రోదోంతరపూర్ణంబై, మేదురతరవజ్రకాంతి • మెచ్చనికాంతిన్
బాదుకొని మెఱసెఁ గోదండము,శ్రీదేవిబలంబునన్ బ్ర•కీర్ణకకోటుల్. 33

ఉ. కొండల నైనఁ గట్టకడ•కోటనె మీటఁగఁ జాలువార లు
ద్దండత దృష్టిమాత్రమున • దైత్యులఁ గాల్పఁగ నోపువారు మా
ర్తాండనవాంశువిద్యుదుప•మాంచితజూటమువారు చండచం
చ్చండములు నాదిగాఁ గలుగు•శాత్రవభైరవు లైనభైరవుల్. 34

క. వేసుక దండనాథా,నాసీరమునందు మెఱసి ♦ నడిచిరి తేజో
భాసురతఁ జూచినంత మ,హాసురసంఘములగుండె ♦ లవియఁ బటుగతిన్. 35.

సీ. కిటిముఖీదేవి యా ♦ కృతివంటి యాకృతు, లయ్యంబ ధరియించు ♦ నట్టిభూష
ణములవంటివి భూష ♦ ణము లమ్మహాదేవి,యాయుధంబులవంటి ♦ యాయుధంబు
లమ్మహాసియమ ♦ హావాహనమువంటి,వాహనంబులు గల్గి ♦ వాఁడికోఱ
ఆ, లొరసి విస్ఫులింగ ♦ యూథంబు మింటికి, నెగయఁగాఁ దమాల ♦ నీలదేహ
లధికకపిలనేత్ర ♦ లైన వేవురుసూక,రాస్యశక్తు లప్పు ♦ డద్భుతముగ. 36

క. మహిభృన్నిభకాయము లగు,మహిషంబుల నెక్కి శత్రు ♦ మర్దనవాంఛన్
బహులతరకహకహార్భటు, లహితుల భయమందఁ జేయ ♦ నరిగిరి వేడ్కన్. 37

ఉ. అంత వరాహవక్త్రి వెస ♦ నక్కిరిచక్రసమాఖ్య మైనదు
ర్దాంతరథంబు డిగ్గి యతి ♦ దారుణవేగబలప్రసిద్ధ మై
క్రాంతమునన్ వసించునిజ ♦ వాహన మామృగరాజు నెక్కి న
త్యంతముదంబునన్ జయజ ♦ యధ్వని సేయుచు సేన లుబ్బఁగన్. 38

వ. అయ్యవసరంబున. 39

సీ. భాసురసంచల ♦ త్కేసరమండలం, బతిశయవివృతదీ ♦ ప్తాననంబు
వికటభయంకర ♦ ప్రకటితావయవంబు, లోలద్విశంకట ♦ లోచనంబు
దంష్ట్రికాఘట్టనో ♦ ద్యన్మహాధ్వనిబధి,రీకృతనిఖిలహ ♦ రిన్ముఖంబు
నై యాదికూర్మపృ ♦ ష్ఠాస్థికర్పరతుల్య, మగునిజనఖసమూ ♦ హంబుచేత
గీ, సకలభూమిచక్రమును ర ♦ సాతలంబు, గాఁగ విదళించుపోలికఁ ♦ గడు రహించి
యోజనత్రయోత్సేధ మై ♦ యొప్పు వజ్ర,ఘోషనామసింహంబు స ♦ క్రోధ మగుచు.

సీ. ఆదండనాథామ ♦ హాదేవి యీరీతి, హర్యక్షవాహన ♦ యై మహోగ్ర
కోపంబు విక్రమా ♦ టోపంబు దీపింప, దైత్యులఁ ద్రుంప ను ♦ త్సాహలీల
నరుగఁగఁ గనుఁగొని ♦ యఖిలలోకంబులు, గడగడ వడఁకె న ♦ వ్వసుమ మహోగ్ర
విబుధులు భీతిచే ♦ విభ్రాంతచిత్తులై, తలఁచి రిట్లనుచు నీ ♦ దండనాథ
గీ, యలిగి విశ్వంబు మ్రింగునో ♦ యట్లు గాక, ముసలఘాతంబుచే సర్వ ♦ భూమి ప్రక్క
లించునో శేక బిట్టు గ ♦ లంచునో స,మస్తవార్ధుల హాలహాతి ♦ నంచు మదిని. 41

గీ. తలఁచి దూరదూరంబుగాఁ ♦ దమవిమాన, రాజములతోడ నిల్చి సం ♦ త్రాసవృత్తి
నఖిలనిర్జరుల్ భక్తి న ♦ య్యమకు మ్రొక్కి,మోడ్పుగేలుఁగవల్ ఫాల ♦ ముల ఘటించి.

క. ఆదేవికి ముదముగఁ ద,ద్ద్వాదశనామములఁ బెక్కు ♦ వారము లధికా
హ్లాదమునఁ గీర్తించిరి, యాదైవతవరులు నభము ♦ నం దుండి తగన్. 43

క. అని చెప్పిన మాని హనుమానును గనుఁగొని దండనాథ♦నామంబులు స
జ్జనహితములు పంద్రెం డని, వినిపించితి వనఘ వాని ♦ విశదము గాఁగన్. 44

క. వినఁ గోరెద నని వేఁడిన, ననిమిషగణవంద్యమానుఁ ♦ డనుకద్దేవ్యం
డనుపమశీలుం డగున,మ్మునిఁ గనుఁగొని యిట్టు లనియె ♦ మోద మెలర్పన్. 45

క. ఆదేవిభవ్యనామ,ద్వాదశకము వినుము చెప్పె♦దన్ దీనిమహా
హ్లాదమున వినినమాత్రన, యాదేవేశ్వరి ప్రసన్న ♦ యై రక్షించున్. 46

వ. అని చెప్పి పంచమి యనునామంబు మొదలుగా దండిన్ని యనునామధేయంబు తుద
గాఁ గలద్వాదశనామంబు లుపన్యసించి యోమునినరేణ్య యీనామద్వాదశ
కాఖ్యం బైనవజ్రపంజరంబునకును సురక్షితుం డైనవాఁడు నెట్టిసంకటంబులయందైన
దుఃఖలేశంబు వొందదు సర్వసుఖంబులు సులభంబుగాఁ బొందు నిన్నామంబులచేత
దేవతలు దివినుండి యాదేవిం బలుమాఱుఁ గీర్తించిన వారి ననుగ్రహించుటకొఱకు
నమ్మహాసేన సేనాసమేతంబుగా నడచె నంత. 47

సీ. సంగరయాత్రాప్ర♦సంగసూచకమహా,కాహళధ్వాన మా♦కసము నిండ
సరసశృంగారర♦సప్రాయభూషణ,సహితలై శాడ్వల♦శ్యామ లగుచు
వల్లకీమధురస♦ద్వాదనశీలలై, శక్తిసేనలు మహా♦భక్తిఁ గొలువ
నేత్రోత్సవముగ నై ♦చిత్రితో సుందర,గాత్రలు గొంద ఱు♦త్కలిక నాడ

గీ. మత్తకోకిలవాణులు ♦ మఱియుఁ గొంద, ఱమితసంప్రీతిఁ గర్ణామృ♦తముగఁ బాడ
నధికమధుపానరక్తాక్షు ♦ లగుచు వంది,మాగధులలీలఁ గొందఱు ♦మహిమఁ బొగడ.

ఉ. కొందఱు రాజహంసములఁ ♦ గొందఱు మత్తశిఖావళంబులన్
గొందఱు కోకిలంబులను ♦ గొంద ఱొగిన్ నకులోత్తమంబులన్
గొందఱు ఘోటకంబుల న♦కుంఠిత నెక్కి యుదారలీల ని
య్యందఱు శ్యామలన్ దనకు ♦ హర్షముతోడ నమస్కరించుచున్. 49

క. ముందర ముందరఁ జన మఱి,కొందఱు వేణువులు గేలఁ ♦ గొని మధురముగా
సుందరరాగచమత్కృతు, లందముగాఁ జూపి కెలఁకు♦లం దరుదేరన్. 50

క. వీణామృదంగశోభిత,పాణు లగుచుఁ గొంద ఱబ్జ♦పత్రనిభాక్షుల్
రాణించుగానకర్మధు,రీణతతోఁ దనదుక్రేవఁ ♦ బ్రీతిన్ జనఁగన్. 51

సీ. గాంగేయశైలసం♦కాశమహోత్తుంగ, మగుగేయచక్రశ♦తాంగ మెక్కి
బాలమార్తాండప్ర♦భావిడంబమనోజ్ఞకవచంబు గుత్తంబు ♦గాఁ దొడిగి
శీతాంశుఁ దెగడి కిం♦చిత్స్వేదకణికాభి,రామమై ముఖతామ♦రసము దనర
శక్తిసైన్యముల నీ♦షచ్చలద్భ్రూవల్లి,చే వీక్షించి ♦ భావ మలర

గీ. భవ్యపింఛత్రికోణాత♦పత్ర మనెడు,బిరు దనన్యసామాన్య మా♦పేర్మిఁ దెలుప
నంబుదోపమశ్యామది♦వ్యాంగ మమర, శ్యామలాదేవి వెడలె ను♦ద్దామలీల. 52

వ. అప్పుడు. 53

క. మదఘూర్ణమానలోచన, మదనాగేంద్రోపమాన♦మహితగమనయున్
మదదైత్యమథన యగున,మ్మదవతిఁ గని శక్తిసైన్య♦మండలి యలరెన్. 54

గీ. మంత్రినాయిక యైనయా♦మాననీయ, కపుడు ప్రణమిల్లి వినుతించి ♦ రమరులెల్ల
మింటఁ దమవిమానంబుల♦మీఁద నిలిచి, యామహాదేవిఁ బదియాఱు♦నామములను.

వ. అన్నామంబు లుపన్యసించెద సావధానంబుగా విను మని యమ్మహాత్ముండు సంగీతయోగినీప్రముఖంబు లైనషోడశనామంబులు వక్కాణించి వీనిచేత నెవ్వఁడేని శరీరధారి యాపరిధానేశ్వరి నొకసారియైనం గొనియాడు నతనివశంబున నీత్రైలోక్యంబు సమస్తంబు నుండుటకు సందేహంబు లే దమ్మంత్రనాథకరుణాకటాక్షవీక్షణం బెచ్చటనేనిఁ బ్రసరించు నచ్చటనెల్ల శక్తిసైన్యంబు సకలంబును నిశ్శంకం బై పరివర్తించు వేయు నేల శ్రీమల్లలితాపరమేశ్వరియావద్రాజ్యతంత్రంబును నిఖిలశక్తిసేనాప్రవర్తనంబును దద్వశగతం బై యుండు నది యట్లుండె నంత నాసంగీతయోగినీహస్తవారిజాతవిరాజితరాజకీరపోతంబుముఖంబువలన ధనుర్వేదంబు పురుషరూపంబున వెడలి సజ్యం బైనశరాసనంబు ధరియించి చతుర్బాహుశోభితుండును ద్రిశిరస్కుండును ద్రిలోచనుండును నగుచు నవ్వీరుం డమ్మంత్రిణీదేవికి నమస్కరించి భక్తియుక్తంబుగా నిట్లని విన్నవించె. 56

క. భండాసురు వధియింప న,ఖండభుజాబలముతో శు♦కప్రియ నీ వు
ద్దండత నేగెదు గావున, భండనమున నీకు నేను ♦ బాసట యగుదున్. 57

వ. అని మఱియును. 58

గీ. చిత్రజీవ మన్ పేరఁ బ్ర♦సిద్ధ మగుచు, ననుపమము సుమహత్తర ♦ మైనయట్టి
యీశరాసన మెలమితో ♦ నీవు దాల్చి, రాక్షసుల సంహరింపు మ♦శ్రాంతవృత్తి.

ఆ. నన్ననుగ్రహించి ♦ నాయిచ్చునక్షయ,బాణకనకచిత్ర♦తూణయుగళ
మెలమితో ధరించి ♦ ఖలు లగుదైత్యుల, సంహరింపఁ బొమ్ము ♦ సచివనాథ. 60

మ. అని సాష్టాంగకృతప్రణామవిధియై ♦ యప్పూరుషుం డిచ్చు కాం
చనచాపంబు సువర్ణతూణయుగముం ♦ సంప్రీతచిత్తాబ్జయై
కొని వేగన్ ధను వెక్కుపెట్టి గుణని♦ర్ఘోషంబు రోదోంతరం
బున నించెన్ నిజహస్తకంకణరవం♦బుల్ దానికిం దోడ్పడన్. 61

క. ఆరవము విన్నయంత సు,రారులమానసము లెల్ల ♦ నవియం జొచ్చెన్
భూరిముదము నొందెన్ బృం,దారకహృదయాబ్జములు ని♦తాంతము గాఁగన్.

గీ. యంత్రిణియుఁ దంత్రిణియు ననునాహ్వయములు,గలుగునద్దేవిపరిచారి♦కలుముదమున
వరుస శుకమును వీణయు ♦ శిరమునందుఁ, బూని పరిచర్య సేయుచుఁ ♦ బోయి రపుడు.

గీ. ఆశుకప్రియ చిత్రజీ♦వాఖ్యచాప,భూషితాత్మీయహస్త మై ♦ పొలుపు దాల్చెఁ
బాకశాసనకార్ముక♦ప్రభలతోడ, మెఱయుచున్న కాదంబిని♦ తెఱఁగు నొంది. 64

క. కాళీకటాక్షతీక్ష్ణం, బై లోలద్భుజగసదృశ ♦ మగుచు మెఱసె నా
త్త్రైలోకార్చితపదవల, కేలన్ శితశరము వహ్ని♦కీలాభం బై. 65

వ. అప్పుడు. 66

సీ. సజలధారాధర♦శ్యామలతనుకాంతి, నిఖిలదిక్కులయందు ♦ నిండఁ బర్వ
భాసమానమహోగ్ర♦బాణబాణాసన,సహితంబులై కరా♦బ్జములు దనరఁ
గిలకిలార్భటులఁ దై♦త్యులగుండె లవియంగ, ఘనమోదమున సుర♦ ల్గనుఁగొనంగ
శక్తివాహినిభుజా♦శక్తి గన్పడ సహ,స్రాక్షౌహిణీసంఖ్య ♦ కగ్గలముగ

గీ, గేయచక్రరథారూఢ ♦ యై యమేయ,దీప్తిఁ జెన్నొందుశ్యామలా♦దేవి వెనుక
భాగమున భీమవిక్రమ♦ప్రక్రమమున, నగుచు నద్దేవి యలరంగ ♦ నడచె ననికి. 67

వ. అయ్యవసరంబున. 68

సీ. అలచక్రరాజమ♦హారథనాయిక, యైనశ్రీలలితాంబ ♦ యఖిలవంద్య
యేకకాలోద్యత్ప్ర♦భాకరసాహస్ర,మండలశోభాస♦మాన మైన
నిజదివ్యదేహకాం♦తిప్రవాహము సర్వ,దిక్పూర్ణమై చాలఁ ♦ దేజరిల్ల
వ్యోమమండల మెల్ల ♦ సోమమండలమయం,బుగ వదనప్రభల్ ♦ పొలుపుమీఱ

గీ, బ్రజ్వలత్పావకాభ మై ♦ పరిఘవిల్లు,నంకుశంబు భుజంగంబు ♦ ననుకరించు
పాశము ప్రదీప్త కుసుమాస్త్ర♦పంచకంబు, నైక్షవశరాసనము చేతు♦లందు మెఱయ.

క. విశదప్రభాతిధవళిత,దశదిశ మై మౌక్తికప్ర♦తానాంచిత మై
దశయోజనోచ్చమై యస,దృశమణికాండ మగుఛత్ర♦బృందము దనరన్. 70

గీ. రత్నమయహేమదండవి♦రాజితంబు, శారదశశాంకచంద్రికా♦సదృశ మైన
చామరచతుష్టయము దాల్చి♦సవినయముగ, నెలమి విజయాదిపరిచారి♦కలునలువురు.

క. నలువంకలఁ గరకంకణ,కలనిక్వణములు సెలఁగఁ♦గాఁ గడు భక్తిన్
మెలఁపున వీవఁగఁ బ్రాభవ,కలితమహావిభవ మతుల♦గతిఁ దనరారన్. 72

గీ. మహిత మాశక్తిచక్రసా♦మ్రాజ్యపదవి, నెలమి మిగులుమహారాజ్య♦లలితచిహ్న
శతముచే శక్తిసైన్యంబు ♦ సకలమును వి,భూషితం బయిముదమునఁ♦బొదలుచుండ.

క. సంగీతవాద్యరచనా, మంగళపాత్రములఁ దనదు♦మహితవిభవ ము
ప్పొంగుచు సమయులు భక్తిస్ఫు,సంగతులై మింట నిలిచి ♦ సన్నుతిసేయన్. 74

క. వాచామగోచరంబై, ధీచతురతచేత నైనఁ ♦ దెలియ నశక్యం
బై చెలఁగు శక్తిరాజ్య,శ్రీచే నభిమానయుక్తి ♦ చెన్నలరెఁ దగన్. 75

చ. నిజహృదయాబ్జసుస్థిరవి♦నిర్మలభక్తిరసైకసూచకాం
బుజభవపద్మనేత్రఫణి♦భూషణవాసవముఖ్యదేవతా
వ్రజరచితార్ఘ్యగూఢమధు♦రస్తవతోషితదివ్యమానసాం
బుజ యగుచున్ దయారసవి♦భూషితభవ్యకటాక్షవీక్షయై. 76

క. ఫాలఘటితాంజలిప్రక,రాలోకితవినయలసద♦హంపూర్వికతో
లీలఁ దనుఁ గొల్వ వచ్చిన,యాలేఖోత్తముల సంప్ర♦హర్షితఁ గనుచున్. 77

మ. సుమనస్సాయకపంచకంబువలనన్ ♦ సొంపొంద జన్మించి వి
శ్వము విద్యుత్సదృశాత్మదేహసుషమా♦విస్తారపూర్ణంబుగా
నమితప్రౌఢి నొనర్చుచున్ దనరురం♦భాద్యప్సరఃస్త్రీసమా
జము లుద్యజ్జయమంగళార్థసుమలా♦జ ల్మీఁద వర్షింపఁగన్. 78

మ. కమనీయాకృతులై మనోజ్ఞతమసం♦గ్రామార్హవేషాఢ్యలై
ప్రభమదుగ్రాయుధదీప్తిసంఘవిజిత♦బ్రధ్నాంశుసంఘాతలై
యమితైశ్వర్యము గల్గి నిత్య లగుభ♦క్త్యన్వితకామేశ్వరీ
ప్రముఖ ల్పావనపాదపద్మయుగళ♦ప్రాంతంబునన్ గొల్వఁగన్. 79

గీ. అమితకాంతియై పదియోజ♦నములపొడవు, గలుగు కేతన మభ్రమం♦డలము నొరయ
నావరణశక్తిసహిత మై ♦ యమరుచక్ర,రాజరథమున మెఱసి యా♦రాజ్ఞి నడచె. 80

వ. ఇవ్విధంబున. 81

క. ప్రధనోత్సుకసర్వజగ,త్ప్రథితపరాక్రమసుపర్వ♦పాలనలీలా
శ్లథలీలఁ జక్రనాయిక, రథగతయై యరుగునవస♦రంబున విబుధుల్. 82

గీ. జయజయధ్వనితోడఁ బ్ర♦స్తవనరూప,పంచవింశతినామప్ర♦పంచఫణితి
వినుతి గావించి రెలమి న♦వేదవేద్య, నఖిలజగదాద్య నమితమం♦త్రానువాద్య. 83

వ. అనిన విని కుంభసంభవుం డవ్వాజిగ్రీవున కిట్లనియె. 84

మ. ప్రతతప్రాభవ నంబికన్ సకలపా♦పఘ్నంబు లౌ పంచవిం
శతినామంబుల నిర్జరేంద్రులు మదిన్ ♦ సంతోష ముప్పొంగ సం
స్తుతి గావించి రటంచుఁ జెల్పితివి మం♦త్రోక్తి తద్వయంబున్ గృతా
ర్థత నొందింపు తదాహ్వయవ్రజసుధా♦ప్రీత్యగ్రపానక్రియన్. 85

క. అని యతిముదమునఁ దను వేఁ, డినకలశోద్భవమహాద్విజ• శ్రేష్ఠుని గ
న్గొని యతనికిఁ గ్ణ[illegible]నిసా,యు[illegible]గ హయవదనదేవుఁ • డధికప్రీతిన్. 86

వ. సింహాసనేశ్వరీప్రముఖంబు లైనతదీయభవ్యదివ్యనామంబులు వేర్వేఱ నయ్యగస్త్య మునీంద్రునకుఁ దెల్పి యద్దేవుండు మఱియు నిట్లను నివి యమ్మహాదేవిపంచవింశతి నామంబులు వీని నెవ్వరేని మహాభాగ యైన శ్రీలలితాపరమేశ్వరిం గొనియాడుదు రట్టివారు లష్టైశ్వర్యంబులును సౌభాగ్యంబును మహనీయయశంబునుం బొందుదు రవ్విధంబునఁ బ్రచండసంరంభంబున శక్తిసైన్యంబుల నడపించుచు భండాసురునిమీఁది క్రోధంబున నమ్మహారాజ్ఞి సమరంబునకు వెడలె నని చెప్పిన గంధర్వవదనునకు వింధ్యగర్వాపహారి యి ట్లనియె. 87

గీ. చక్రరాజమహారథ•సర్వపర్వ, సంశ్రితప్రకటాముఖ్య•సకలదేవ
తాభిధానసంఖ్యాంగశో•భాయుధముల, వాజివదన యెఱింగింప•వలయుఁ గరుణ. 88

క. అని యడిగినఁ గలశోద్భవుఁ, గని తురగగ్రీవుఁ డతుల•కారుణ్యమునన్
విను మని చెప్పఁ దొడంగెన్, ఘనతరమృదుమధురమధుర•గంభీరముగన్. 89

వ. శ్రీచక్రరాజరథోత్తమంబునవమపర్వంబు నాశ్రయించి యణిమాదిసర్వకామాంత లైన సిద్ధిదేవతలు పదుండ్రు చతుర్బాహుశోభితలును జపాకుసుమభాసురతనుద్యుతులు నగుచుఁ జింతామణికపాలత్రిశూలకజ్జలపాత్రంబులు ధరియించి దయాభరితాంతరంగలై యోగిబృందనిషేవితలై వర్తింతురు మఱియుఁ దత్పర్వంబునూర్ధ్వభాగంబున బ్రాహ్మ్యాద్యష్టశక్తులు బాహుద్వయవిరాజమానలును శోణకాంతిసుందరవిగ్రహలును నరుణాంబరలును గపాలోత్పలపాణులు నై యుందురు కొందఱు మహాత్ము లద్దేవుల బ్రహ్మాదిదేవతలశరీరకాంతులు వానిశరీరకాంతులు తదీయాయుధంబులు వానియాయుధంబులు తత్తచ్చిహ్నంబులు గలవారిగా ధ్యానంబుసేయుదురు మఱియు నచ్చోటికి నుపరిభాగంబున ముద్రాదేవతలు పదుగురు ముద్రాదిరచనాయుక్తంబులై కమలకోమలకాంతిప్రశస్తంబు లైనహస్తంబుల ఖడ్గఖేటంబులు ధరియించి దాడిమీపుష్ప సదృశాకృతులును బీతాంబరశోభమానలును మదఘూర్ణితరక్తనయనలును జతుర్భుజ విరాజమానలు నై నివసింతురు వారు సర్వసంక్షోభిణీప్రముఖప్రత్యేకనామంబులతోఁ సిద్ధిబ్రాహ్మ్యాదిముద్రలతోఁగూడఁ బ్రకటాభిధానశక్తు లన విఖ్యాతలై భండాసుర సంహారంబు సేయుటకై యుత్సహించుచుందురు. 90

క. అనవద్యాష్టమపర్వం, బున గుప్తాభిఖ్యలై ప్ర•భూతమహత్వం
బున షోడశశక్తులు గల, రని మఱి వినిపించితిని మ•హర్షిప్రవరా. 91

వ. వారలు కామాకర్షిణీప్రభృతిప్రత్యేకనామధేయంబులఁ బ్రఖ్యాతలై చంద్రషోడశకళాస్వరూపలై ప్రవాళలతాసంకాశదేహలును మదపరిహసితాననలును జతుర్బాహుసమన్వితలును నేత్రత్రయవిభ్రాజమానలును జంద్రార్ధోజ్జ్వలకిరీటలును నగుచు ధనుర్బాణంబులుఁ జర్మకృపాణంబులును ధరియించి భండాసురవధోద్యోగంబునఁ బ్రవర్తిల్లుదురు. 92

గీ. అలఘుదీప్తినాయంతన జ్వలితదీప, భాతిఁ జొన్నొందునష్టమ పర్వసీమ
నమర వసియించి గుప్తతరాభిధాన, శక్తు లుండుదు రమితతేజస్కలగుచు. 93

వ. అయ్యనమంత్రము దేవత లనంగకుసుమాదిప్రత్యేకనామంబులం బొగడొంది నాలుగుహస్తంబుల నిక్షుచాపంబును పుష్పబాణంబులును బుష్పకందుకంబులును గువలయంబును ధరియించి యుదగ్రవిక్రమశాలినులును జపాప్రసూనభాసురదేహలును నగుచు భండాసురుగుఱించి మహాక్రోధజ్వలితలై లలితానివేశంబున వర్తిల్లుదురు. 94

ఆ. అరథోత్తమంబునా ఆవపర్వంబు, నందు సంప్రదాయ లనుప్రసిద్ధ
సంజ్ఞ గలిగి సర్వసంక్షోభిణీముఖ్య, శక్తు లుండుదురు ప్రశస్తలీల. 95

క. వారలు వేణీకృతకచ, భారలు సిందూరతిలకభాస్వద్వదనాం
భోరుహలు ప్రళయవహ్నిశి, ఖారోచిస్తుల్యకాంతికమనీయాంగుల్. 96

వ. ఆపదునలువురు తీక్ష్ణస్వభావలై వహ్నిమయంబులైనధనుర్బాణకృపాణఖేటంబులు హస్తచతుష్టయంబున ధరియించి లలితామహాదేవియాజ్ఞాశక్తు లనఁ బ్రఖ్యాతిఁ గని కామభస్మసముద్భవుండైనభండాసురుఁ దలంచి క్రోధఘూర్ణమానహృదయలై యుండుదురు. 97

గీ. భవ్యతద్రథపంచమ పర్వ మెనసి, తేజరిల్లుదు రలకులోత్తీర్ణ లనెడు
శక్తు లసురేంద్రమీఁదిరోషమునఁ జేసి, మోముఁదమ్ములఁ గనుబొమ ల్ముడివడంగ.

వ. వారలు పదుండ్రు శుద్ధస్ఫటికసంకాశలును బరశుపాశగదాఘంటాశోభితచతుర్బాహలును దయాపూరితహృదయలు నై సర్వసిద్ధిప్రదాదిప్రత్యేకనామంబులఁ బొగడ్త వహింతురు. 99

క. స్యందనచతుర్థపర్వము, నందు నిలుతు రమలమూర్తి కాసుభగతనూ
సుందరకాంతులు భండపు, రందరవిద్వేషిసంహరణసత్వరలై. 100

వ. ఆపదుగురుశక్తులు నిగర్భయోగినీనామంబున వెలయుదురు వారు సర్వజ్ఞాదిప్రత్యేకనామంబులతో దశారదేవత లన విఖ్యాతలై తమచతుర్భుజంబుల వజ్రశక్తితోమరచక్రంబులు వెలుంగ విలసిల్లుదురు. 101

ఆ. యోగివర రహస్య♦యోగినీసంఖ్యతా,శక్తు లాశ్రయించి ♦ చక్రరాజ
రథవరంబునందు ♦ రమ్యమహామూఁడవ,పర్వ మలరు దీప్తి♦భరిత మగుచు. 102

వ. అయ్యెనమండ్రువాగధీశ్వరులు వశిన్యాదిప్రత్యేకనామధేయంబులతో రక్తాశోకప్రసూనసంకాశలును ధనుర్బాణవీణాపుస్తకపాణులును గవచచ్ఛన్నసర్వాంగులు నై భండాసురసంహారమృత్యుదేవతలపోలిక మెఱయుదురు. 103

క. పర్వె రథవరము రెండవ, పర్వంబున నిలుతు రమర♦పరిపంథిభుజా
గర్వహరణసంక్రీడా,ధూర్వహ లై మువ్వు రమిత♦దోర్బలశౌర్యల్. 104

వ. వార లతిరహస్యయోగినీనామంబులఁ బ్రఖ్యాతలై కామేశీప్రముఖప్రత్యేకనామంబులు వహియించి యష్టబాహుశోభితలై చాపబాణంబులును జ్ఞానపాత్రమాతులుంగంబులును ఫలకచంద్రహాసంబులును ఘంటానాగపాశంబులును ధరియించి మదిరారసపానమత్తలై యుండుదు రమ్మహాభాగలు లలితాసమమాహాత్మ్యలును లలితాసమతేజోవిరాజితలును నై యమ్మహారాజ్ఞికి నిత్యంబు నంతరంగ లనఁ బ్రసిద్ధ లగుదురు.

క. ఆరథమధ్యమపర్వస,మారోహణలీలఁ దనరి ♦ యలతిథినిత్యా
చారుతరసంజ్ఞ గలయతి,ధీరలు పదియేవు రెలమి ♦ దీపింతు రొగిన్. 106

వ. వారు కాలస్వరూప లగుటఁజేసి యెప్పుడును విశ్వంబు వ్యాపించి కామేశీప్రభృతిప్రత్యేకనామంబులఁ బ్రసిద్ధలై యాకృతుల నాయుధంబుల దేవీసమానలై ప్రతియుగంబును జగదుపకారంబు సలుపుచుండుదురు భండాసురాదిదైత్యులమీఁదిక్రోధంబున భ్రుకుటీభీషణవదన లై నయద్దేవులందఱు నిత్యంబును దన్ను సేవింపుచుండ నానందమయమహాపీఠంబున నాసీనయై యప్పరమేశ్వరి దైత్యరాజసంహారకార్యంబు నిరతిశయసంరంభంబున వెడలె నని చెప్పి మఱియు ని ట్లనియె. 107

గీ. మంత్రిణీదేవి యెక్కిన♦మాననీయ,గేయచక్రరథంబునఁ ♦ గీర్తనీయ
పర్వసప్తకమునఁ గను♦పట్టి యెలమి, నుండుశక్తులఁ జెప్పెద ♦ యోగివర్య. 108

వ. ఆరథోత్తమంబుప్రథమపర్వంబునసమ విలసిల్లుమణిమయపీఠమధ్యంబున శ్రీదేవికి నత్యంతప్రేమాస్పద యగునాసంగీతయోగిని నివసించియుండుఁ దద్ద్వితీయపర్వంబునఁ దత్త్వాదు లైనమువ్వురుశక్తులు వీణాకార్ముకపాణులును దమాలశ్యామలకోమలాకృతులును దానవమర్దనప్రవీణలు నై సంరంభంబున నిల్తురు గేయచక్రరథేంద్రంబు తృతీయపర్వంబు నాశ్రయించి మన్మథబాణదేవతలు ద్రావిణీప్రముఖపంచశక్తులు ప్రదీప్తబాణకార్ముకపాణులై రాజింతురు మఱియు నప్పర్వంబుదిగువభాగంబునఁ గామరాజాదిప్రత్యేకనామంబులఁ దై త్రైలోక్యసమ్మోహనులును మృగమదతిలకవిలసత్ఫాలభాగులును ముక్తామయవిభూషణులును గవచచ్ఛన్నసర్వాంగులును బలాశ్రప

నవకోట్యర్కసంకాశశరీరకాంతులును నైనపంచకాములు భండాసురవధార్థులై యుద్ధి వహింతు రయ్యావరణంబునాల్గవపర్వంబునఁ బూర్వోక్త లైనబ్రాహ్మ్యాద్యష్టమాతృకలు వెలుంగుదురు తత్పూర్వాధఃప్రదేశంబున లక్ష్మ్యాద్యష్టశక్తులు మహాబలుం డైనభం డాసురుఁగుఱించి క్రోధతామ్రాక్షు లగుచు దీపింతురు వెండియుఁ దద్రథపంచమప ర్వంబున వామాదు లైనషోడశశక్తులు కురువిందమణిప్రభలును లోకసంక్షోభణాలం పటులును మహాభయసంగరసన్నాహులును వజ్రమయకవచచ్ఛన్నదేహులును గఠోరా ట్టహాసులును జతురాననవిరాజితవజ్రదండశతఘ్నీముసుంఠికాయుధలు నగుచు విజృం భింతు రాశోత్తాంగంబునాఱవపర్వంబున సితాంగాదు లైనయష్టభైరవులు నీలాంగు లును బ్రహ్మకపాలపానపాత్రధారులు నై శస్త్రభీషణులు నై నర్తింతు రాస్యందనంబు సప్తమపర్వంబున మాతంగీప్రభృతిపంచశక్తులు ధనుర్బాణపాణులై యుల్లసిల్లుదురు తత్పూర్వాధోభాగంబున గణపతిక్షేత్రపాలాదు లైనయెనమండ్రు దేవతలు శస్త్రాస్త్ర పాణులై సకలలోకవిద్వేషులై చండపరాక్రముం డైనభండాసురునిమీఁదికోపంబున నుద్దీపించుచుండురు తత్రత్యులై యింద్రుండు మొదలుగాఁగలచక్రనాయకు లైన పదుండ్రు దేవతలు శక్తిస్వరూపులై వజ్రాదినిజసాధనంబులు ధరియించి నిత్యంబును భక్తిపరాయణులై మంత్రనాయికం గొలుచుచు విశ్వకంటకు లైనభండాసురాది దుర్దాంతదైత్యుల నడంప వేగిరించుచుండుదు రాశ్యామలాదేవి తమతలంచినకా ర్యంబు శ్రీమహారాజ్ఞితో విజ్ఞాపనంబుచేసి తదాజ్ఞచేతఁ దత్కార్యంబు సఫలంబు సేయు నని మనంబునఁ గోరి దిక్పాలకులు తద్రథసంశ్రియం బెప్పుడు వదల కుండుదు రది యట్టిద కాదె లోకంబునఁ బ్రయోజనార్థు లైనభృత్యులమనవి ప్రధానముఖం బున రాజవిదితంబై సాఫల్యంబు నొందు నట్లు గాని నాఁడు కార్యసిద్ధి దుర్లభం బగుఁ గావున వీర లందఱకు నిరతిశయతేజోమహాజ్వాలయు నప్రధృష్యప్రభావయు నైనయాశ్రీదేవి ననుసరించి స్వస్వకామ్యంబులఁ బడయుసామర్థ్యం బెట్లు గలుగు నట్లగుట నమ్మహాదేవికి నత్యంతప్రియ యగుసంగీతనాయిక సర్వకార్యంబులయం దును దద్వచనంబు నించుకయైన నుల్లఘింపక యాలలితామహాదేవి గావించుసకల శక్తిసామ్రాజ్యంబున సకలప్రయోజనంబులయందును గరణంబునకు నకరణంబునకు నన్యథాకరణంబునకు బ్రాగల్భ్యంబు గలిగియుండు దానంజేసి దిక్పాలకాదు లమ్మ హేశ్వరికిఁ బ్రధానభూత యగునాశ్యామలాదేవిని సేవించుచుండుదు రివ్విధంబున శ్రీచక్రరాజరథోత్తమంబుసర్వపర్వంబులఁ గలిగినదేవతలనామంబులు నాయుధంబులు నీకుఁ దెల్పితి గేయచక్రరథేంద్రంబునం గలపర్వదేవతల నట్ల వినిపించితి నెవ్వరేని నభక్తికంబుగా నీపర్వదేవతానామంబు లాకర్ణింతు రన్నరులు సర్వపాపవినిర్ముక్తులై

రణంబున ననాయాసంబుగా శత్రుల జయింతు రని చెప్పి హయగ్రీవుండు వెండియు
నయ్యగస్త్యమహామునీంద్రున కిట్లనియె. 109

సీ. సంయమీశ్వర కిరి♦చక్రరథంబునందుల, సర్వపర్వంబుల ♦ సంచితముగ
నిలిచినయట్టిశ♦క్తుల నీకు వినిపింతుఁ, దదభిధానములు మో♦దంబుతోడ
వినినయంతన భూమి♦జన మాజి జయ మొందు, సల్లొట విను మది♦కాదరమునఁ
బరిబింమసంజ్ఞ చేఁ ♦ బరఁగినప్రథమప,ర్వంబున సజలనీ♦లాంబుదంబు

గీ. కాంతిఁ జెన్నొందు దేహంబు ♦ కదనశౌర్య,రాక్షసులఁ బట్టి చెండు ని♦ర్ఘాతతుల్య
పోత్రిమును బాలచంద్రునిఁ ♦ బోలుదంష్ట్రి,కావిలాసము శత్రుభీ♦కరము గాఁగ.

వ. మఱియు సకలజగత్కంటకదుర్జనవారిత ఘస్మరి యగుచు నానావిధాస్త్రజ్వాలాజాలంబుల జయలక్ష్మీనృత్తంబు జరిగించుచుఁ గిరిచక్రరథేంద్రంబునకు నలంకారంబై వార్తాళికాసమాఖ్యచేఁ జెన్నొందుచు వారాహీదేవి విలసిల్లు ద్వితీయపర్వంబు నాశ్రయించి జృంభిన్యాదు లైనదేవతలు మువ్వురు ప్రఫుల్లదాడిమీకుసుమసంకాశలై ప్రజ్వలన్మాణిక్యకంకణంబు లైననిజపాణిపంకజంబుల హలముసలంబులును హాలాపాత్రనాగపాశంబులును ధరియించి తమచూపు లనియెడుతీవ్రజ్వాలల దైత్యసైనికుల దహించువారలుంబోలెఁ బొలిచి యాసూకరాస్య ననిశంబును సేవించుచుండుదురు తృతీయపర్వసంశ్రిత లై యంధిన్యాదిదేవత లేవురు సద్దేవీమంత్రకృతాస్పదలై తమకఠోరాట్టహాసంబున భువనత్రయంబు భేదించుచు స్త్రీరూపంబులం దాల్చినకల్పాంతాగ్నికీలలుంబోలెఁ బ్రజ్వరిల్లుచు భండాసురసకలసైనికశరీరనిర్గళితశోణితప్రవాహంబు లెప్పు డెప్పుడు చవిచూతు మని నాలుకలు గ్రోలుచు నుద్దండపరాక్రమ లైనయాదండనాథాదేవి ననవరతంబును భజియింపుచుండుదురు కిరిచక్రరథంబుచతుర్థపర్వంబున నివసించి పంచమ్యష్టమీవర్జిత లైనబ్రాహ్మ్యాదిదేవత లార్వురు షట్చక్రంబులఁ బ్రజ్వలజ్జ్వాలారూపంబులతోఁ దమమహావిక్రమప్రవాహంబున దానవుల మ్రింగువారలుంబోలె దండనాథాజ్ఞ వహించి వర్తింతురు తత్పర్వాధోభాగంబున సంతతము నిలిచి యాకిన్యాదిసప్తదేవతలు చండదోర్దండవిక్రమలై సర్వభూతంబుల గ్రసించువారలుంబోలె సర్వమేదినియుఁ బిడిచి పిప్పిచేయువారలుంబోలె దీపించుచు విరోధులచర్మరక్తమాంసాదిసప్తధాతువుల నిశ్శేషంబుగాఁ బానంబు సేయంగలవారై కఠోరసింహనాదంబుల దశదిశలు పూరించుచు నుపాసకులకు నణిమాద్యష్టైశ్వర్యంబుల నొసంగుచు వారలయశేషవిపత్కాండంబుల ఖండించుచు దుష్టదైత్యుల మోహనోన్మాదనాదులఁ జిక్కుపఱుచుచు సర్వధాతుసంస్థితలై ధాతునాథ లనఁ

ప్రఖ్యాత లగుచుఁ దరంగమాలికలచేత నభ్రంకషంబులైన సప్తసముద్రంబులనైన నర్ధక్షణంబునఁ బీల్చఁగలవారలై రథాంగంబులువోలె నుద్వృత్తంబులై భయంకరంబు లగువిలోచనంబులు గల్గి తమయేలికసానికిం దమకు వైదికాచారప్రవర్తకులను నింద్రాదిదేవతలను యజ్ఞంబులకు ద్రోహంబుసేయుదుష్టదైత్యుల మొనవ సమర్థలై నిత్యంబును దండనాయిక యైనపోత్రిణీదేవిం గొల్చుచుందురు తత్పరోభయపార్శ్వంబుల నిలిచి క్రోధినీస్తంభినీనామంబులు గలదేవత లిరువురు సురవిరోధివరూథినీకీలాలహాలామదోద్ధతలై సదాఘూర్ణమానలోచనలై సర్వదాప్రహసితవదనలై చలద్రణితమణికంకణంబులైనకరకమలంబులఁ జామరంబులు ధరియించి వారలం గొల్చుచుందురు కిరిచక్రరథేంద్రంబుపార్శ్వద్వయంబునఁ గృతావాసంబై హాలముసలాఖ్యంబైనయాయుధద్వయంబు దేవతారూపంబై స్వస్వరూపంబైన యాయుధద్వంద్వంబు స్వకీయకిరీటద్వయంబున ధరించి జగత్కంటకుల సంహరించుచు దేవతలు మనంబునం గొనియాడ వెలుంగుచుండు నాసాధనద్వితయంబునఁ గాదె యావారాహీదేవి యింక సంగ్రామంబున విషంగు వధియింపఁగలయది మఱియుఁ దత్పర్వాగ్రభాగంబున దండనాథయెదుర మహాభయంకరసింహనాదఘూర్ణితగగనతలుండును దంష్ట్రాచతుష్టయకటకటాత్కారబధిరీకృతదిశాముఖుండును జతుర్వక్త్రుండును ద్విలోచనుండును శూలఖడ్గప్రేతపాశధారియు దీప్తవిగ్రహుండును నైనచండోద్దండుం డనుపురుషుం డద్దేవి నెప్పుడు నాశ్రయించుచుఁ దదాజ్ఞ వర్తించుచుండు రథపంచమపర్వంబున నధివసించి వార్తాళికాద్యష్టదేవత లష్టదిక్ప్రశస్త లష్టపర్వతసంపాతక్రూరాశనిమహాస్వన లష్టనాగవిస్ఫురద్భూషణ లనష్టబలచేతస్కలు ప్రభూతభుజాప్రతాపనిహతదైత్యసేనలు పోత్రిణీదేవి నిత్యంబునుం గొలువుసేయుచుందురు తత్పర్వవామభాగంబున నెప్పుడుఁ బాయక దండనాయిక రాజవాహ్యంబైనకాసరశ్రేష్ఠంబు ధూసరాకారంబును గ్రోశార్ధాయతశృంగద్వయంబును గ్రోశపరిమితవిగ్రహంబును ఖడ్గప్రతీకాశనిశాతరోమస్తోమసంవృతశరీరంబును గాలదండోపమానవాలదండభయంకరంబును నంజనాచలసానుదేశసంకాశవికటోన్నతచరమభాగంబును మహానీలపర్వతసదృశస్కందమండలంబును మహోల్ముకలనిశ్వాసపరంపరాసంక్షోభితమహార్ణవంబును నిష్ఠురఖురకుద్దాలవిక్షిప్తభూమ్యకలావర్తమేఘంబును నై నిజఘుర్ఘురధ్వనివ్యాజంబునఁ గాలాంతకునియాపవాహ్యమహిషంబు నపహసించుచు వర్తించుఁ దత్పర్వంబునధోభాగంబున నుచ్చస్థానకృతనివాసులై యింద్రాద్యష్టదేవతలు మొదలైనదేవజాతులు దమకార్యసిద్ధి శ్రీమహారాజ్ఞికి విజ్ఞాపనంబు సేయించుకొఱకు లోకసంరక్షాసంపాదనం బొనరించుకొఱకును వచ్చియుందురు. వారల వేలువేలుఁ

జెప్పెద వినుము మహేంద్రుండును నలువదినాలుగుకోటులయచ్చరలును సిద్ధులు నగ్నియు సాధ్యులు విశ్వేదేవులు విశ్వకర్మయు యముండును మాతృకలును సపరివారులై నరుద్రులును రక్షోధ్యక్షుండై ననైరృతియుఁ దదీయులై నబహురాక్షసులు మిత్రనామదేవతలును సదాగానవిశారదులైన విశ్వావసుప్రభృతిగంధర్వులును భూతగణంబులును వరుణుండును వసువులును విద్యాధరులును కిన్నరులును వాయుదేవుండును జైత్రరథం బనుకుబేరోద్యానంబు నిర్మించినచిత్రరథుం డనుగంధర్వుండును దుంబురునారదాదులును యక్షులును సోముండును యక్షేశ్వరుండును దేవతలును షడ్గుణైశ్వర్యసంపన్నుండై లక్ష్మీవల్లభుండైనగోవిందుండును శూలహస్తుండై సర్వలోకరక్షకుండైనయీశానుండును బ్రహ్మదేవుండును వైద్యవిద్యావిశారదులైన యశ్వినీనందనులును భగవంతుండైనధన్వంతరియు గండస్థలీనిస్సరద్దానధారాసార సర్వదాసంతర్పితచంచరీకులైనయనేకగణనాయకులును మొదలైనబహుదేవతలు పూర్వాదిదిక్కులయందుఁ గృతనివాసులై భాసిల్లుదురు వీరలలోపల నింద్రదనుజేంద్రవాయుదిశలాశ్రయించి జృంభిన్యాదులు మువ్వురు తదధిష్ఠానదేవతలై వర్తింతురు పర్వప్రాంతంబునఁ గపాలగదాధారియై యూర్ధ్వకేశుండును మహోన్నతశరీరుండును సాగరకర్దమోపమశ్యాములుండును వజ్రోపమానకహకహార్భటివినిర్భిన్నబ్రహ్మాండభాండుండును నైనక్షేత్రపాలుండు డమరునామకవాద్యనినాదంబున రోదసీకుహరంబు భేదించుచు ఫణాత్రయశోభితంబైననాగపాశంబు కరంబున ధరియించి నిత్యంబును వరాహవక్త్ర నత్యంతభక్తి సేవించుచుండుఁ దత్సమీపంబున నమ్మహాదేవికి వాహనంబైనసింహశ్రేష్ఠంబు వర్తించు నెద్దాని నారోహించి యాదండినీదేవి భండాసురుఁ జెండివైవ వేడుకపడుచుండు నట్టితద్వాహనసింహలక్షణంబులు మున్ను నీకు నాచేతఁ దెలుపంబడియెం గదా మఱియుఁ దత్పర్వంబునధోభాగంబున దండనాయికాసమానకాంతివేషలై తదనురూపంబుగా హలముసలభీషణహస్తలును జంద్రరేఖావిరాజితకుంతలభారలు నైనవేవురుసూకరాస్యలు నిలిచి శ్రీమహారాజ్ఞియెడ శ్యామలాదేవియెడ నిజస్వామిని యైనవారాహియెడ ద్రోహంబు దలఁచినవారలరక్తంబునం బూర్ణంబు లగుకపాలంబులు గొని స్వభక్తద్రోహులవ్రేవులు మాలికలుగాఁ గైకొని స్వగోష్ఠీనిరాసకులైనదుర్జనులనిరంతరగళచ్ఛోణితధారంబులైనశిరోమాలికాహారంబులు ధరియించి యాకిటీశ్వరిని సేవింపుచుండుదురు . వారలనామంబులు వారాహీసహస్రనామాధ్యాయంబున ముందరం జెప్పంబడియెడు నద్దేవులసమీపంబునఁ బోత్రిణీదేవివాహనంబైనకృష్ణసారంబు క్రోశచతుర్థభాగాయతంబులైనశృంగంబులును దచ్చతుర్థభాగాయతంబైనముఖంబును క్రోశప్రమాణపాదంబులును

సర్వకాలంబును మీఁదికి నెగయుచున్నవాలంబును నతిధవళం బైనయుదరంబును మహాహుంకారవ్యాజంబున వాయువాహనహారిణంబు నిరసించుమహాజవంబునుం గలిగి విలసిల్లు వెండియు నప్పర్వంబున మద్యసాగరంబు దేవతారూపంబు వహించి హస్తంబున మాణిక్యపర్వతసంకాశం బైనమాంసకబళంబు వెలుంగఁ గాంచనాంభోజమాలికలు వక్షస్థలంబున విరాజిల్ల రక్తారవిందహస్త యైనమదశక్తిచేత నెప్పుడు నాలింగితుం డై మదవిఘూర్ణితలోచనుం డై యుండు శ్రీమహారాజ్ఞికి భండదైత్యుతోడిసంగ్రామంబు ప్రవర్తిల్లుచుండ శక్తు లెప్పు డెప్పుడు యుద్ధఖేదంబు నొంది డప్పిఁ జెందుదు రప్పు డప్పు డెల్ల నాహాలాసముద్రపురుషుండు గౌడప్రముఖవివిధమద్యవిశేషరూపంబుల వారలశ్రమం బపనయింపంగలవాఁ డయ్యద్భుతవృత్తంబు కథాక్రమంబున నింక నాచేత వినంగలవాఁడవు తత్పర్వంబుదిగువభాగంబున నెనిమిదిదిక్కులయందు నూర్ధ్వాధోభాగంబులయందును హేతువాదు లైనమహాభైరవశ్రేష్ఠులు పదుండ్రు సందీప్తశస్త్రతేజోనిరాకృతమధ్యందినమార్తాండు లై మహాప్రళయకాలంబున శక్తిసేనానాయికయాజ్ఞచేత సర్వప్రపంచంబును భక్షింపఁగలవారు వారు తీక్ష్ణప్రకృతులు నిశాతదంష్ట్రాఘర్షణరణన్ముఖులు త్రిశూలాగ్రనిర్భిన్నమహామేఘసముదాయులు వార లొక్కరొక్కరు కోటికోటిభటులతోఁ గూడి వర్తింతు రివ్విధంబున దండనాయిక యారోహించినకిరిచక్రనామమహాస్యందనసర్వపర్వస్థం బైనజృంభిన్యాదిదేవతాసమూహంబు నిప్పుడు నీకు సవిశేషంబుగా నెఱింగించితి నీశక్తు లాయోధనరంగంబున ననేకరక్షస్సమాజంబుల వధియించి తచ్ఛరీరనిర్గళితశోణితప్రవాహపానం బాచరించి యానందించుచు వర్తింపఁ గలవా రిత్తెఱంగునఁ బర్వస్థదేవతాగణబహుపథత్రాణం బై సర్వజగత్త్రాణనార్థంబుగా నారథశ్రేష్ఠంబు దుష్టజనప్రాణసంచాలనప్రవీణం బై సమధికతేజోమహోజ్జ్వలం బగుచుఁ దరలె నప్పుడు.

గీ. చక్రరాజరథేంద్ర మెచ్చటఁ జరించు, నచట గేయచక్రము మహోద్ధతి నటించు
గేయచక్ర మేస్థలమునఁ గేళి సల్పు, నాస్థలంబునఁ గిరిచక్రి మడరి నడచు.

మ. బలపాథోనిధు లైనయట్టిలలితాంబాశ్యామలాక్రోడవ
క్త్రీ లధిష్ఠించినయారథత్రయము దుర్వారోద్ధతిన్ శక్తిసే
నలమధ్యంబునఁ జూడ నొప్పె విబుధానందప్రదం బై మహో
జ్జ్వలమై యొక్కట మూఁడులోకములు సంచారంబునం బొల్చె నాన్. 113

మ. సుర లాశ్చర్యరసాంతరంగు లగుచున్ జూడన్ మహామేరుమం
దరవింధ్యంబులు మూఁడు వేడుక మెయిన్ సంచారము ల్సల్ప స

త్వరత స్వచ్ఛనో నాఁగఁ దద్రథము ల♦త్యంతప్రభాఢ్యంబులై
వరుసం గానఁగ నయ్యె నప్పు డహిత♦వ్రాతంబు భీతిల్లఁగన్. 114

గీ. శక్తిసైన్యంబు నసమ ను♦త్సాహ మెసఁగ, నారథ్యతయు ముద్దాము♦మై చనంగఁ
బ్రళయకాలాంబుధిధ్వని♦ప్రతినిధి యయి, తద్రథాంగనిర్ఘోష మెం♦తయుఁ జెలంగె.

క. ధారుణి తద్రథచక్రవి,దారితయై కంప మొందెఁ ♦ దత్సమయమునన్
జారుతరభీషణములై, యారథముల బలసి నడచె ♦ నఖిలబలములున్. 116

వ. ఆలలితాంబిక యధిరోహించినచక్రరాజాఖ్యరథోత్తమంబునకు నశ్వచోదనవిద్యా
ప్రవీణు లైనయిరాదేవియుఁ ద్రిపురభైరవియు సంహారభైరవుండును రక్తయోగినీ
వల్లభుండును సారసుండును జాముండికయు నను నార్వురుసారథులు గలరు గేయ
చక్రరథేంద్రంబునకు హసంతిక యను దేవత సారథి యగుఁ గిరిచక్రరథరాజంబునకు
స్తంభినీదేవి సారథి యని చెప్పంబడు లలితామహాదేవిరథశ్రేష్ఠంబు దశయోజనో
న్నతంబు గీతిచక్రరథసత్తమంబు సప్తయోజనోచ్ఛ్రాయంబు కిరిచక్రరథవరేణ్యంబు
షడ్యోజనోత్సేధంబు మఱియు నమ్మహారాజ్ఞీస్యందనంబున ననన్యసామాన్యచి
హ్నంబై శక్తిసామ్రాజ్యసూచకం బైనమహాముక్తాతపత్రంబు దశయోజనవిస్తృ
తంబై ప్రకాశించుఁ దక్కినరథద్వంద్వంబునందును సామాన్యంబు లైనయాతప
త్రంబులు విలసిల్లు నివ్విధంబున సర్వశక్తిమహేశ్వరియు మహాసామ్రాజ్యపదారూ
ఢయు భువనేశ్వరియు నగు నాలలితాపరమేశ్వరి భండాసురుని నిర్జింప నరుగునవస
రంబున. 117

క. ధరణీచక్రము దిర్దిర, దిరిగెన్ శరనిధులు గలఁగె ♦ దిక్కులు మొఱసెన్
గిరు లూటాడెన్ భూతో,త్కరములహృదయములు భీతి♦కలితము లయ్యెన్. 118

వ. మఱియును. 119

సీ. సురదుందుభులు మింట ♦ నొరిది బోరున మ్రోసె, విబుధపాదపపుష్ప♦వృష్టిగురిసె
దేవగాయకులు వి♦శ్వావసుప్రభృతిగం,ధర్వులుఁ దుంబురు♦నారదులును
భారతీదేవియుఁ ♦ బరమహర్షోత్ఫుల్ల, ముఖపద్మ లగుచుఁ బ్ర♦స్ఫురితపులక
భూషితదేహులై ♦ పొరిఁబొరి విజయమం,గళపద్యములు పటు♦గానఫణితిఁ

గీ. బాడుచును సంతసంబునఁ ♦ బ్రతిపదంబు, నాడుచుఁ ద్రిలోకజనని వి♦శ్వాధినేత్రి
దేవి జయ జయ జయ లలి♦తే మదంబి,కే యనుచు సంస్తుతించి ర♦మేయభక్తి.

శా. ఆదేవేశ్వరి కప్పు డంచితతప♦స్యానిష్ఠితాత్ముల్ వసి
ష్ఠాదుల్ సప్తమహాబుధుల్ విజయవృ♦ద్ధ్యాశంసకం బౌచితిన్

శ్వేదప్రస్ఫుటమంత్రజాలమున సం♦వృద్ధిం బ్రకల్పించి రా
మోదం బొప్పఁ గృశానుకీలకు మహా♦భూర్యాజ్యధారల్ బలెన్. 121

శా. ఉద్గీతిన్ బహువేదమంత్రముల మా♦నీంద్రుల్ బ్రశంసింప దో
షాకంభానుకసంఘనిర్మథనలీ♦లాయత్తయై యాత్రిలో
కీరక్షాపరతంత్ర తత్పరము న♦క్షీణోద్ధతిన్ డాయ దు
ర్వ్యాక్రోద్యప్రథయానయై యరిగె వృ♦ష్యచ్ఛక్తిసైన్యంబుతోన్. 122

వ. అని చెప్పి హయగ్రీవుండు మఱియు నిట్లనియె. 123

సీ. లలితామహాదేవి♦కలహయాత్రాఘోరి, కారావ మతిశయో♦దార మగుచు
క్రోడోంతరంబున ♦ మేదురంబై మ్రోసియు, నత్యుచ్చమైనత♦దారవంబు
విని మహార్ణవతీర♦మున మహేంద్రాభిఖ్య, పర్వతోపాంతవి♦భ్రాజమాన
మగుచు దురాశయుం ♦ డైనభండాసురు,నకు రాజధానియై ♦ సకలలోక

గీ, విదితమై శతయోజన♦విస్తృత మయి, వెలయుశూన్యకపట్టణ♦తిలకమున వ
సించియున్నట్టిసర్వా♦రాతించరులును, మును తదాగమనముఁ గొంత ♦ వినుటఁజేసి.

గీ. దేవకార్యార్థ మమ్మహా♦దేవి దమ్ము, సంహరింపంగఁ దలఁచి యు♦త్సాహ మెసఁగ
సమరదుర్జయ మగుశక్తి♦సైన్యరాజి, గొలువ రాఁబోలు నని యాత్మఁ♦దలఁకి రపుడు.

క. శతయోజనవిస్తృత మగు,దితిజపురం బపుడు ధూమ♦తిమిరచయసమా
వృత మయ్యె మఱియు బహువిధ,వితతోత్పాతములు పుట్టె ♦ విను మప్పురిలోన్.

సీ. నిష్కారణముగ మం♦దిరకుడ్యములు గూలె, నాగి మహోల్కలు మింట♦నుండిరాలెఁ
దొలుత నే సకలభూ♦వలయంబు గంపించె, నూరక పౌరుల♦యుల్ల మవిసెఁ
గేతనాగ్రంబులఁ ♦ గృధ్రకాకాదు ల,ర్కాభిముఖ్యంబుగా ♦ నఱవఁ జొచ్చె
నభముననుండి యం♦తర్ధానగతభూత,సముదాయ మతిపరు♦షములు పల్కె

గీ, భూమివివరంబునందుఁ బ్ర♦భూతవహ్ని,కీల లుదయించెఁ జదల నా♦భీలముగను
ధూమకేతువు లొప్పడమె నుద్దామభంగి, సకలదిక్కుల దానవ♦సమితి బెదర. 127

వ. మఱియును. 128

సీ. ఆకస్మికంబుగా ♦ నసురకాంతామణీ,భూషణమాల్యముల్ ♦ భూమిఁ దొరఁగె
దర్పణఖడ్గకే♦తనవర్మమణిభూష,ణాంబరంబులు మలి♦నంబు లయ్యెఁ
జంద్రశాలలయందు ♦ సౌధపఙ్క్తులయందుఁ, గేళికామందిర♦పాళులందు
స్వస్తికశుద్ధాంత♦సర్వతోభద్రనం,ద్యావర్తపిచ్ఛంద♦కాదులందు

గీ, నాగరసమూహములచే వి♦నంగఁబడియెఁ
బరుషతరభూతసంఘాత♦భాషితములు

గగనమునుండి యతిభయం♦కరముగాఁగ
బహుళకబంధంబు లవనిపైఁ ♦ బడియె నపుడు. 129

గీ. వేదికామధ్యములయందు ♦ విస్మయముగ, సోనవానగాఁ గురిసెను ♦ శోణితంబు
భూమిపై రాలె ఘనఘూమ♦ధూమలంబు, లగుచుఁ గేశోండ్రకంబు♦లత్యద్భుతముగ.

వ. అంత. 131

క. భూమాభౌమోత్పాత,స్తోమముఁ గని తత్పురౌక♦సులు చకితమన
స్తామరసంబులతోడఁ ద్రి,యామాచరచక్రవర్తి ♦ కఖిలముఁ దెలుపన్. 132

శా. ఆయుత్పాతసముద్భవంబు విని భం♦డాదిత్యవిద్వేషి గాం
గేయాద్రిప్రతిమానధైర్యుఁ డగుటన్ ♦ గీర్వాణధైర్యాపనో
దాయత్తుం డగుటన్ బ్రచండపటుబా♦హాశౌర్యుఁ డౌటన్ స్ఫుర
న్మాయోపాయసమర్థుఁ డౌట మదిఁ జొ♦న్పండయ్యె దీనత్వమున్. 133

వ. ఇట్లు ధైర్యం బవలంబించి కర్తవ్యచింతాపరుం డై. 134

మ. దనుజశ్రేష్ఠుఁడు రత్నకాంచనమయో♦ద్యద్రూప మై యేకయో
జనవిస్తారత నొప్పుమంత్రసదనా♦స్థానంబుఁ జేరంగఁ జ
య్యన నేతెంచి యమాత్యసోదరబలా♦ధ్యక్షాదులన్ దోడితెం
డనుచున్ వే పడవాళ్లఁ బంపి దృఢమం♦త్రాలోచనోత్కంఠుఁ డై. 135

మ. సురశైలేంద్రముమూర్తిభేద మన సం♦శోభిల్లుచున్ నైకర
త్నరుచిస్తోమవిచిత్రితం బయి మహా♦న్నత్యంబునం బొల్చుభా
స్వరసింహాసనసత్తమంబుపయి దే♦వద్వేషి గూర్చుండె వి
స్ఫురదంచన్మకుటాగ్రదీప్తమణిరో♦చుల్ దిక్కులం బర్వఁగన్. 136

మ. అపు డాదానవభర్తసోదరులు బా♦హాశౌర్యసంతప్తవి
ష్టపసందోహు లుదీర్ణు లగ్రజనిదే♦శస్ఫూర్తినిర్వాహకా
ర్యపటిష్ఠాత్మకు లవ్విశుక్రుఁడు విషం♦గాభిఖ్యుఁడున్ వచ్చి య
న్నపదాంభోజము లాత్మఫాలు లొరయన్ ♦ దండప్రణామం బొగిన్. 137

క. కావించి కృతాంజలు లై, యావిబుధద్వేషివర్యు♦నంతికభూమిన్
భావ మలరఁ గూర్చుండిరి, సేవాపరు లగుచు నతని♦చిత్త మెలర్పన్. 138

క. అనుజద్వయసంయుతుఁ డై, దనుజేంద్రుం డున్నయంతఁ ♦ దచ్ఛాసనశ
క్తి ననేకదండనాయకు, లనుపమబలు లరుగుదెంచి ♦ రతివిభవమునన్. 139

గీ. సంఖ్య గలుగ దొక్కొక్కని♦సైన్యమునకు, నప్పు డచటికి వచ్చిన♦యాతుధాన
దండనాథులలోన నుద్దండబాహు,బలులు వా రంద ఱతనికిఁ ♦ బ్రాణసములు. 140

గీ. ఆమహాసురుల్ దమతమ♦నామధేయ, ముగ్గడించుచు నారాక్ష♦సోత్తమునకు
నపుడు దండప్రణామంబు♦ లాచరించి, రధికభయభక్తియుతమాన♦సాబ్జు లగుచు.

క. వారల నాదరలసదతి,ధీరకవీనికము లైన♦దృగ్వారవ్యా
పారముల గారవించి యు,దారధృతిన్ గొంతసే ప♦తం బున్నంతన్. 142

క. క్రూరాత్ముః డగువిశుక్రుం, డారజనిచరాగ్రగణ్యుఁ♦ డగునగ్రజుతో
భూరివిషయమున మతిశాం,భోరాశిగభీరనాద♦ముగ ని ట్లనియెన్. 143

సీ. భవదీయదోర్దండ♦పటువిక్రమంబున, నత్యంతపరిపీడి♦తాత్ము లగుచుఁ
గ్రూరబుద్ధులు దురా♦చారులు పామరు,లైననిర్జరులు దై♦న్యంబు నొంది
కడు విషాదమున ర♦క్షకుని నెవ్వని నెందుఁ, బడయలే కుజ్జ్వల♦త్పావకప్ర
దీప్తకీలలయందు♦ దేహము ల్వదలి రం,తట దైవవశమునఁ♦ దత్కృశాను

గీ, కీలజాలంబులో నొక♦బాల యుదయ,మందె యనుపమబలవిక్ర♦మాఢ్య యగుచుఁ
బూర్వనష్టామరుల నెల్ల♦ భూరిమహిమ, మరల సృజియించెనఁట రాత్రి♦చరలలామ.

క. వారలు దనుఁ బ్రేరేపఁగ, నీరాత్రించరుల నెల్ల♦ నేపడఁచుటకై
భూరిబలగర్వమున న,న్నారీమణి వచ్చెనఁట య♦నంతబలముతోన్. 145

శా. శంకాతంకము లేక స్త్రీబలముతో♦ సంగ్రామసోత్కంఠ యై
పంకేజాక్షి యొకర్తు సంగరకళా♦పారీణదోర్విక్రమా
హంకారంబునఁ జేర్చునిద్దనుజయూ♦థాధ్యక్షులన్ గెల్చెనన్
సంకోచింపక పల్లవంబు సుదృఢా♦శ్మంబున్ బగుల్చుం గదా. 146

క. నవ్వులకే కల్పించిరో, యెవ్వరయిన నిట్టివార్త♦ లెఱుఁగము మనతోఁ
బువ్వుంబోఁడి యొకర్తుఁట, చివ్వకుఁ జనుదెంచునఁట యి♦సీ యే మందున్. 14[7]

ఆ. కాలమహిమచేత♦నో లేక దైవంబు, చిత్రభంగిచేతఁ♦ జేయుపనులొ
కాక యిట్టివింత♦ గలదె మున్నెన్నఁడు, వినఁగ వీడ యయ్యె♦ విబుధవైరి. 148

సీ. శక్రాదిదివిజు ల♦స్మత్సైన్యనాసీర,భటులఁ జూచినమాత్రఁ♦ బఱవఁ జొచ్చి
రబ్జగర్భుఁడు మద్బ♦లాయుధనిర్భిన్న,విక్రమవిముఖుఁడై♦ విముఖుఁ డయ్యె
చక్రహస్తునిసుద♦ర్శనము నివ్విధమున, వైముఖ్యము భజించె♦ వాఁడి దఱిఁగి
శూలంబుతోఁ గూడఁ♦ గాలకంధరుఁడు సం,త్రస్తమనస్కుఁడై♦ దైన్య మొందె

గీ, దేవ తక్కినవారలఁ♦ దెలుపనేల, యఖిలదిక్పతులును బలా♦యనము నొంది
రనవలోకితమర్మభే♦దనసుతీక్ష్ణ,మచ్ఛరార్దితు లై దైత్య♦మండలేంద్ర. 149

గీ. ఇవ్విధమున నప్రతిహతి♦ నేపుమిగిలి
దైవతాసాధ్యచటులదో♦ర్దర్పు లగుచు

మనల గెలువంగఁ గొందఱు ♦ మగువలఁ గొని
యొకమగువ వచ్చునఁట యిచ్చ♦టికి మహాత్మ. 150

గీ. వచ్చెఁ గాకేమి మన మిట్లు ♦ వనిత యనుచు, నరకుగొనకుండుటకు నీతి♦తెరువు గాదు
స్వల్పుఁ డని పోవ విడువరు ♦ శత్రు నెందు, నవనిలోపల విజిగీషు ♦ లైనవారు. 151

క. కావున సత్వరముగ నో, దేవ భవత్సుభటసంహ♦తిం బనుపుము ద
ర్పావేశంబునఁ గానని, యావనితం బట్టి తేర ♦ నక్రమలీలన్. 152

క. భూరిబలయుతులు దానవ, వీరులు భవదాజ్ఞ నేగి ♦ విద్విడ్బలదు
ర్వారు లయి నీదుసన్నిధి, కారమణిన్ బట్టి తెత్తు ♦ రసురవరేణ్యా. 153

ఆ. అమరరిపుల గెల్వ ♦ నరుదెంచుమానిని, నెలమిఁ గొప్పు వట్టి ♦ యీడ్చి తెచ్చి
యానెలంత నీదు♦నంతఃపురస్త్రీల, పనులు సేయునట్లు ♦ పనుపు మధిప. 154

క. నీకుఁ గలభటులలోపల, నేకైకభటుండె చాలు ♦ నిజ్జగముల బి
ట్టాకులత నొందఁ జేయఁగ, నీకొలఁదికి సాక్షి నీదు♦హృదయంబె కదా. 155

మ. అని యిబ్భంగి విశుక్రుఁ డగ్రజునిఁ గ్రో♦ధావేశ మొందించువా
క్యనికాయంబులు పల్కుచున్నయెడఁ గా♦ర్యజ్ఞానదక్షుండు శౌ
ర్యనిధానంబు మహాబలుం డగువిషం♦గాఖ్యానుజుం డన్నతో
ననియెన్ సాంత్వనరీతి నాతనిమదో♦ద్ధత్యంబు వారించుచున్. 156

సీ. క్రూరారిసేనావి♦దారణపారీణ, దేవ నీ కిప్పుడు ♦ దెలుపఁ జాలు
కార్యవేదిత్వంబు ♦ గలదె మాబోటుల, కఖిలకార్యజ్ఞుండ ♦ వధిప నీవు
నీ వెఱుంగనిరాజ♦నీతి వేఱొక్కచోటఁ, గలుగునే బాల్యచా♦పలమువలనఁ
జనువు మిక్కిలి గాఁగ ♦ ననఘ నీసన్నిధి, గలుగుటవలనఁ గొం♦కక కడంగి

గీ. నాకుఁ దోఁచినమాటలు ♦ మీకుఁ దెలుప
వలయు ననువాంఛ వొడమె నో♦యలఘుశౌర్య
సూనృతము లైన నన్నృతము ♦ లైన మదిని
గినియ కనువాక్యములు చిత్త♦గించవలయు. 157

గీ. అఖిలకార్యంబులును విచా♦రాశ్రయంబు, లనఘతర సువిచారిత ♦ మైనకార్య
మెందు సకలశుభంబుల ♦ నొందఁ జేయఁ, గర్త యని చెప్పుదురు నీతి♦కాండవిదులు.

క. దనుజవర పనుల కాలో, చనమె పరమగతి యగున్ వి♦చారింపక చే
సినకార్యము మూలముతో, న నశించున్ సత్య మని వి♦నంబడు సభలన్. 159

సీ. భూరమణుఁడు గూఢ♦చారులఁ బంపఁగా, వలయు శాత్రవబలా♦వాసములకు
జయసిద్ధి దనమాన♦సమున సంకల్పించె, నేని నాలస్యంబు ♦ లేనిమతిని

దెలియంగ వలయు వా♦రలవాక్యములచేత, నరిమహీపతులబ♦లాబలములు
చారదృష్టుల నెల్ల♦జగముఁ జూచుచు దృఢప్రజ్ఞుఁడై శంకిత♦భావుఁ డగుచు
గీ. ధీరు లెన్న నిశ్శంకితా♦కారుఁ డగుచుఁ
దత్తదర్హకాలంబులఁ ♦ దజ్ఞజనము
లెంచ షడుపాయములఁ బ్రయో♦గించురాజు
జయము నొందుట కెంత సం♦దియము లేదు. 160

క. తెంపున మూఢుండు విచా,రింపక పని చేసి పిదప ♦ ధృతిచెడి పేరుం
బెంపును గోల్పడి పోవు ని,లింపభయదకేళి విజయ♦లీలాలోలా. 161

సీ. అరులఁ దిర్యగ్జాతు ♦ లని యెన్నఁగా రాదు, స్త్రీ లంచుఁ గడు నిషే♦ధించరాదు
క్షుద్రు లంచుఁ దలంచి ♦ చులుక సేయఁగ రాదు, శక్తి యెచ్చో నైన ♦ సంభవించు
మత్స్యంబుచేత సో♦మకదానవుఁడు ద్రుంగె, నలపందిచే హిర♦ణ్యాక్షుఁ డీల్గె
స్తంభసంభవనృకే♦సరిచే నడఁగె లోక,కంటకుండు హిరణ్య♦కశిపుఁ డాజి
గీ. నరులచే వానరులచేత ♦ నామమడఁగి, రసమబలు లైనదశముఖా♦ద్యసురవరులు
బాలకునిచేత బలి పద♦భ్రష్టుఁ డయ్యె, శక్తియె తలంపవలయుఁ బో ♦ జనపతులకు.

క. మును చండిక యనియెడునొక,ఘనమాయోజ్జృంభిణి యగు♦కామినిచే శుం
భనిశుంభమహిషధూమ్రాక్ష,ప్రముఖబహుదైత్యవీరు ♦ లడఁగరె పోరన్. 163

వ. అట్లు గావున. 164

క. స్త్రీ యని యవమానంబున్, జేయఁగరా దచట విజయ♦సిద్ధికి మూలం
బేయెడఁ జూచిన శక్తియ, యీయర్థమునం దసత్య ♦ మింతయుఁ గలదే. 165

క. ఏపట్లఁ దలఁచి చూచిన, స్త్రీపుల్లింగములయందుఁ ♦ జెందునె భయముల్
రూపింప వానిచేతన్, జూపట్టినశక్తిమహిమ ♦ శోధింపఁ దగున్. 166

గీ. ఇచ్చవచ్చినచోటుల ♦ నెల్ల నిలుచు, శక్తి సకలసాంసారిక♦జనులయందుఁ
గావున మరాళ యైనయ♦క్కాంతతలఁపు, దెలిసి తదుదంత మెల్లను ♦ దెలియ వలయు.

శా. ఆచంద్రానన యెట్లు పుట్టెనొ తదీ♦యాచార మేరీతియో
యేచోట న్నివసించియుండునొకొ యా♦యేణాక్షి తద్విక్రమ
ప్రాచుర్యం బెటువంటి దచ్చెలువ కె♦వ్వారైన యుద్ధక్రియా
వైచిత్రిం దగి తోడు వచ్చిరొకొ యా♦వామాక్షిపే రెద్దియో. 168

క. దేవా యింతయుఁ దెలియం,గా వలయున్ మనకు ననుచు ♦ ఘననీతికళా
ప్రావీణ్యుఁ డగువిషంగుం, డావిబుధద్వేషితోడ ♦ నతివినయమునన్. 169

చ. తెలిపిన భ్రూకుటిప్రకట♦దీపితదారుణవక్త్రపద్మునిఁ డై
యలఘుతరావహేళనదు♦రాగ్రహశోషకషాయితాక్షుఁ డై
పలికె సురారివల్లభుఁడు ♦ భానుఁ బెద్దగఁ జేసి యోరి నీ
విలసితనీతిశాస్త్రములు ♦ వేమరు నా కిటు నేర్ప వచ్చితే. 170

మ. సమసత్త్వం డగుశత్రురాజునెడ నీ♦చందంపునీతు ల్ప్రమో
జ్యము లౌఁ గాక వధూజనంబునెడ న♦త్యంతోగ్రతేజస్కు లౌ
మనుబోఁటు ల్మది నిట్టి వెంతురె వృథా♦మానంబున న్వచ్ఛుత
త్ప్రమదన్ గెల్వఁగఁ జాలమే యిటు భయో♦త్పాతంబు నీ కేటికిన్. 171

శా. అక్షీణోగ్రబలప్రతాపులు మహా♦హంకారయుక్తుల్ మదీ
యాక్షౌహిణ్యధిపు ల్పరశ్శతము ల♦త్యంతంబు భూతంబులన్
భక్షింపం గడిమిన్ జగత్త్రయముఁ గా♦ల్వన్ సప్తపాథోధులం
గుక్షిం బూర్ణము సేయఁగా నయిన శ♦క్తుల్ భీతి నీ కేటికిన్. 172

సీ. అయ్యంతిసకలవృ♦త్తాంతంబు మును వింటిఁ, జారులచే సవి♦స్తారఫణితి
నగ్నిలో నుదయించె♦నఁట లలితాంగామ,ధారిణి యై యొక్క♦తలిరుఁబోఁడి
తననామమునకు న♦త్యనురూపముగఁ బుష్ప,కోమలాకృతి యయి ♦ కోమరు మిగులు
సత్త్వంబు శౌర్యంబు ♦ సంగ్రామకుశలత, యేమియు వినఁబడ ♦ దామగువకు

గీ, నన్నెలంతుక బహులమా♦యాప్రవీణ,యనుచుఁ దెలుపుచునున్నవా ♦ రాప్తజనులు
దనదుమాయాబలంబున♦వనజముఖులఁ, గొందఱసృజించెనఁటవారు♦గొలువఁదిరుగు.

క. అటు గాక నీవు చెప్పిన,యటు లన్నెలఁతకు మహాబ♦లాఢ్యత్వము గ
ల్గుట నిక్కమేని మహిమో,త్కటుఁ డగుభండునకుఁ గలదె ♦ దైన్యము పోరన్.

గీ. త్రిభువనంబులఁ దనభుజా♦విభవమహిమ, నేలకును గోలకును దేరఁ ♦ జాలినట్టి
భండదైత్యుండు నేఁడొక♦పడఁతిచేత, భంగమొందునె యేల యీ♦పలుకు విషము.

క. చెప్పవలె నీ వెఱుంగవె, యప్పుడు మద్బాణపరవ♦శాత్ము లగుచుఁ దా
రిప్పటికి నైన మూర్ఛలు, దెప్పిఱిలక యున్నవారు ♦ దివిజవరేణ్యుల్. 176

వ. మఱియు నావలనిభయంబున మరుద్గణంబులలోన. 177

సీ. పాథోనిధానగ♦ర్భమునందుఁ గొందఱు, కాకోదరేంద్రలో♦కమునఁ గొంద
ఱవనీధరమహాగు♦హాంతరంబులఁ గొంద, ఱద్రినికుంజంబు♦లందుఁ గొంద
ఱఖిలంబు నెఱుఁగంగ ♦ హరిదంతములఁ గొంద, ఱన్యజాతిశరీరు♦లందుఁ గొంద
ఱతిగూఢవర్తను ♦ లై భార్యలను బుత్రు,లను సంపదల మిత్ర♦జనులఁ బాసి

గీ. వేదభాషలు శ్రోత్రములై ♦ వికలు లగుచు, దైన్యమున నధికారము ♦ లక్ష్మీ భీతి
విహ్వలాత్ములై యున్నారు ♦ విబుధవరులు, ప్రాణములదెస నిరపేక్షు ♦ లైవిషంగ.

గీ. ఇట్టివానిగా నెఱుఁగ ద ♦ య్యింతి నన్ను, నబల గావున బాలిక ♦ యగుటఁజేసి
దర్పమునఁ బొంగుచున్న దా ♦ తలిరుఁబోఁడి, స్త్రీలు ముగుదలునతిసాహ ♦ సికలుగారె.

క. కార్యాకార్యవిమోహిత, లార్యవిగర్హితదురాశ ♦ యలు నెలఁతలు త
చ్చర్యలు దలంప వింతలు, శౌర్యము స్త్రీయందుఁ గలదె ♦ చర్చింపంగన్. 180

క. బుద్ధిమతి యయ్యెనేనిన్, యుద్ధంబున మగల గెల్వ ♦ నూహించునె స్త్రీ
బుద్ధిః ప్రళయాంతక యను, బోద్ధలవాక్యంబు వినమె ♦ పొగడెద వింతిన్. 181

ఆ. అట్లు గాక నను ది ♦ వౌకసు గెలువంగఁ, గడఁగి తమకుఁ బ్రియము ♦ గాఁగ నమ్మ
గువఁ బురస్కరించు ♦ కొని వత్తురేని నా, దోర్బలమునఁ బడక ♦ తొలఁగఁ గలరె. 182

ఆ. యుద్ధదుర్మదు లయి ♦ సిద్ధసాధ్యభుజగ, గరుడయక్షభూత ♦ గణపిశాచ
కిన్నరాశ్వవదన ♦ ఖేచరు లొక్కట, నలిగి యైన నెదుర ♦ నిలువఁ గలరె. 183

మహాస్రగ్ధర. పలుకు ల్వేయేల శుంభ ♦ ద్బలయుతు లగుచున్ ♦ పద్మసంభూతుఁ డైనన్
జలరుట్పత్రాక్షుఁ డైనన్ ♦ సకలసురచమూ ♦ శాస్త యాశక్రుఁ డైనన్
బలసారోదారు లాది ♦ క్పతు లయినను మ ♦ ద్బాహుయుగ్మప్రతాప
జ్వలనజ్వాలల్ సహింపన్ ♦ జరుగక నిలువన్ ♦ శక్తులే యెప్పు డైనన్. 134

క. నాదాఁకన్ రానిత్తురె, యాదైత్యచమూవరేణ్యు ♦ లిందఱు సమరో
న్మాదులు గినిసినఁ జీల్చరె, పాదుకొనినరిపుల దోస ♦ పండ్లన్ బోలెన్. 185

వ. ఇంత వెఱవ నేల యీకుటిలాక్షుండును కురుండకుండును కరకుండును కాకవాశితుండును వజ్రదంతుండును వజ్రముఖుండును వజ్రలోముండును వలాహకుండును సూచీముఖుండును ఫాలముఖుండును వికర్ణుండును వికటాననుండును కరాళాక్షుండును కరటకుండును దమనుండును దీర్ఘజీవకుండును హుంబేకుండును హులుముల్లుండును కల్కసుండును కల్కివాహనుండును పుల్కసుండును పుండ్రకేతుండును చండబాహుండును కుక్కురుండును జంబూకాక్షుండును జంభనుండును తీక్ష్ణశృంగుండును త్రికంటకుండును చంద్రగుప్తుండును చతుర్బాహుండును చకోరాక్షుండును చతుశ్శిరుండును వజ్రఘోషుండును ఊర్ధ్వకేశుండును మహామాయుండును మహాహనుండును మఘశత్రుండును మఘాస్కంది సింహధాతువు సిరాళకుండును అంధకుండును సింధునేత్రుండును కూపకుండును కూపలోచనుండును గుహాక్షుండును గండగల్లుండును చండవర్మ యమాంతకుండును లట్టుణుండును పండసేనుండును పురుజిత్తుండును పూర్వమారకుండును స్వర్గశత్రుండును స్వర్గబలుండును దుర్గుండును స్వర్గకంటకుండును అతిమాయుండును బృహన్మాయుండును ఉపమాయుండును ఉలూకజిత్తు పురుషేనుండును విషేణుండును కుంతిషేణుండును

కురూషకుండు మలదుండు కశూరుండు మంగళుండు ద్రుఘణుండు కోల్లాటుండు కుటిలాశ్వుండు దాశేరుండు బభ్రువాహనుండు దుష్టహాసుండు ధృష్టకేతుండు పరిక్షిత్తు పాపకంచుకుండు మహామోహుండు మహాదంష్ట్రుండు దుర్మతి స్వర్గమేజయుండు శతకేతుండు శతవసుండు శతదత్తుండు శతప్రియుండు దుశ్శఠుండు దుర్వినీతుండు భిన్నకర్ణుండు చమూరుకుండు అట్టహాసి మహాహాసి సింహహాసి మదోత్కటుండు కుంభోత్కచుండు కుంభనాసుండు కుంభగ్రీవుండు కుటోదరుండు హస్తిమేహనుండు మహాండుండు కుంభాండుండు పూతినాసికుండు పూతిదంతుండు పూతిచక్షుండు పూత్యాస్యుండు పూతిమేహనుండు మొదలైన ప్రౌఢవిక్రాంతులు గల రిందులోనఁ జతుర్బాహుం డాదిగాఁ ద్రింశత్సంఖ్యాకులైనమత్పుత్రులు హిరణ్యకశిపుహిరణ్యాక్షులంతటిమహాశూరులు మహాబలులు గలరు వీర లొక్కరొక్కరికి నూర్వురేసిసుతులు వీరలయట్టివార కలరు వీరితోఁ గూడ నీసేనానాయకులు మదోద్వృత్తులై విజృంభించిరేని సమరంబున దుర్వృత్తులగుసురాధముల నక్షణంబున నాశంబునొందించం గలరు సహస్రాక్షౌహిణీశ్వరులైనవీర లింతవట్టొక్కమొగంబై తలపడిన నెదుర నెంతకడిందియైనను బ్రత్యర్థిసంఘంబు నాక్రమించి భస్మీకరించం గల రబలలమాత్రంబునకేమిచెప్ప నబ్బోటికి సంగ్రామరంగంబున మాయావిలాసంబె కాని కేవలవిక్రమసంపద గలుగనేర దదిగావున మహామాయికులైనమదీయభటులముందరఁ దదీయమాయ యేమి పనిగొనఁగల దన్నిలంత మద్బలంబున కామిషంబయ్యెడు నీకు వృథా శంకింపం బని యేమి భవన్మానసం బుత్సాహవంతం బగుంగాక యనుచు దిగ్గన లేచి భండాసురుండు మహాబలాఢ్యుం డగుకుటిలాక్షుం డనుసేనానాయకుం గనుంగొని యోరీ నీబలంబు సమస్తంబును సన్నద్ధంబు చేసి యీపురద్వారంబులయందుఁ దగినకావు పెట్టుము దుర్గంబులం జేనుము క్షేపణికాశతంబు నిర్మింపుము మంత్రవేత్తలయినపురోహితులచేత దుష్టాభిచారక్రియలు సేయింపుము శస్త్రసన్నాహంబు శీఘ్రంబునం గావింపుము కలహం బత్యాసన్నం బయ్యెనిప్డు డీవాహినీనాయకులయం దెవ్వనినైన నొక్కని ననేకబలసంఘాతసహితంబుగా ముందరఁ బంపు మతం డతివేగంబున నయ్యబలాసైన్యంబున కెదురుగాఁ జని యవ్వనితలతో సంగరంబు చేసి దేవసత్వదర్పితయు మూఢయు నైనయవ్వనితం దొడరి జయించి కచాకర్షణంబున నిచ్చటికిఁ దెచ్చుంగాక యని యచ్చమూనాథునకు నాజ్ఞ యిచ్చి యచ్చపలుండు సహస్రత్రితయాక్షౌహిణ్యాధిపతియు మహాసత్వుండును నైనయాతని వీడుకొలిపి తా నంతఃపురంబు ప్రవేశించె నప్పుడు దైత్యేం

ప్రకట్టైజ్వాలావహం బై లలితామహాదేవియాత్రానిస్సాణనిస్వనం బుచ్చైస్స్వరం బుగాఁ జెలంగె నని చెప్పి హయగ్రీవుండు మఱియు ని ట్లనియె. 186

గీ. అంత లలితామహాదేవి యానభేరి, కాధణంధణధ్వాననికాయమునకు నద్భుతముగఁ బ్రతిధ్వని యగుచు మ్రోసె, దుర్మదోద్ధతదైత్యదుందుభిరవంబు.

మ. బధిరత్వంబు వహించె జంతునికరుంబంబుల్ మహాభీతితోఁ గుహరోచ్చానచకండనంబులు గడుక్ ఘూర్ణిల్లె సప్తాంభసాం నిధు లెల్లన్ గలఁగెన్ నిలింపపథముల్ దిక్కుల్వెస స్ఫీతలె శా ర్యధురీణాసురసార్వభౌమబలయాత్రాభేరికాభాంకృతిన్. 188

గీ. నరహారిక్రోధహుంకారనాదమునకు, దీటుగా మ్రోసె దైత్యేంద్రవీట దేవ శత్రుసేనాజిసన్నాహసమయజాత, ఝల్లరీనామవాద్యకోట్చైరవంబు. 189

వ. అప్పుడు భండాసురోక్తప్రకారంబునఁ గుటిలాక్షప్రేషితుం డై దుర్మదుం డను సేనానాయకుండు లలితాదేవిం గెలువ నుద్యోగించి సబలంబుగా యుద్ధసన్నద్ధుం డయ్యె నయ్యవసరంబున. 190

క. లలితాంబిక యట వచ్చుట, దెలిసి మహాక్రోధవహ్ని దీప్తు లగుచుఁ గో టులకోలఁది దైత్యవీరులు, విలసితసన్నాహ మొసఁగ విభవము వెలయన్.191

క. కిలకిలనాదంబుల దిక్కులు వగులించుచు సమీరకోవిదమతి న త్యలఘుపరాక్రమయుతవోర్బలు లగుచు న్వాడలి రహితభంజనవాంఛన్. 192

క. ఘనమణిమయకవచితుఁ డై, దనుజభటుం డొకఁడు మెఱసెఁదత్సంఘమునన్ గనుఁగొనువారికి గమనంబున భాసిలురోహిణ్యాదిపోలిక దోఁపన్. 193

ఆ. కాళరాత్రిసదృశకరవాల మొకచేతఁ, గుంత మొక్కచేతఁ గూర్చి పట్టి సలుపుచును విచిత్రచారీగతి హయంబు, సకలయోధు లరిగె నగరవీధి.

క. వితతవిలయావసరమా, రుతవేగోచ్చలితకులగిరుపోలిక ను న్నతము లయి నడచుగజముల, నతిరయమున నెక్కి కొంద అరిగిరి వేడ్కన్.

వ. మఱియును. 196

సీ. పరిఘముద్గరగదాపట్టిసప్రాసాసి, భిదురపరశ్వధభిండివాల పాశదుర్ఘణశూలబాణక్షురట్టక, ఫణిశీర్షవక్త్రాస్యపాశతుండ ఫణిదంతతురగాస్యకణయశతఘ్నికా, ద్విశిఖముసుండికాంకుశకఠార యవమధ్యకోణమధ్యక్షేపణీశస్త్ర, కాకతుండార్ధచక్రప్రహరణ

ఆ. చాపశార్ఙ్గముసలశక్తిమహాచక్ర, ముష్టిమధ్యకలితముఖమహోగ్ర భాసమానశస్త్రబాహు లై కవచిత, దేహు లగుచు నతులసాహసమున. 197

వ. మహాబలు లైనయనేకకోటిదైత్యులు దుర్మదాభిధాన సేనానిపురస్సరంబుగా నగరంబు వెడలి రందుఁ గొందఱు శతాంగమాతంగతురంగంబులను గొందఱు గర్దభమహిషోష్ట్రవృకశునకంబులను గొందఱు కాకకంకగృధ్రోలూకభేరుండాదులను గొందఱు శరభసింహవ్యాఘ్రవరాహాదులను గొందఱు సర్పంబుల నధిరోహించి చనిరి కొందఱు ప్రేతాధిరోహణంబు చేసి యరిగి రివ్విధంబున బహువిధవాహనారూఢులై విశ్వంబు దహించువారలుం బోలె నతిదారుణులై మహాబలోత్కటు లైనభటులు దన్నుం బరివేష్టించి చనుదేరఁ బటుపటహార్భటులఁ జతుర్దశజగద్భిత్తులు వ్రీలఁ దత్సహాకారంబుగా నట్టహాసంబు సలుపుచు దుర్మదుం డమ్మహాదేవికి నభిముఖంబుగా నడచె నంత భండాసురాజ్ఞప్తుం డైన కుటిలాక్షుండు శూన్యకపురంబుప్రాగ్ద్వారంబునందు రక్షణార్థంబుగా దశాక్షౌహిణీపరిమితం బగురాక్షసబలంబుతోడం దాలజంఘుం డనుయాతుధానప్రవరు నిలువ నియమించి తన్నగరదక్షిణద్వారంబున నంతియ సేనతోడం దాళభుజుం డనుదైత్యేంద్రు నిల్పి తత్పుటభేదనంబుపడమటివాకిటఁ దావత్ప్రమాణం బగు సైన్యంబుతోడఁ దాళగ్రీవుం డనుదనుజపుంగవుం గాపు వెట్టి తత్పట్టణంబునుత్తరద్వారంబునఁ దాదృశసంఖ్యం బైనయనీకంబుతోడం దాళకేతు నుండ నియోగించి యాప్రోలిసాలవలయంబునందలికపిశీర్షాఖ్యగృహంబులయందుఁ దథావిధపరిమాణం బైనవరూధిని నివసించునట్లుగా నాజ్ఞాపించి యిట్లు పంచాశదక్షౌహిణులచేతఁ బురసంరక్షణంబు నిర్వర్తించి యావృత్తాంతంబు దెలుప రాక్షసేంద్రునిసన్నిధికి నరిగి వినయనిభృతుండై యిట్లని విన్నవించె. 198

శా. బాహావిక్రమమందరోన్మథితదృ♦ప్యద్వ్యోమసంచారిసం
దోహాంభోనిధి దేవ నీ వపుడు నా♦తోడన్ గృపాదృష్టిఁ బ్రో
త్సాహస్వాంతత నాజ్ఞయిచ్చినటులే ♦ తత్పట్టణత్రాణస
న్నాహంబున్ దగ నిర్వహించితి సప♦త్నవ్రాతముల్ భీతిలన్. 199

ఆ. చండదోఃప్రతాప♦సారుఁ డాదుర్మదుఁ, డిపుడు తునల గెల్వ ♦ నెత్తి వచ్చు
తెలివఁ బట్టి తేరఁ ♦ దెంపున సబలుఁడై, చనియె యాతుధాన♦సార్వభౌమ. 200

క. ఉద్భటవిక్రముఁ డగున,స్మద్భటుఁ డొక్కరుఁడె చాలు ♦ సత్వరగతి నై
తద్భామఁ బట్టికొని రిపు,హృద్భయదము గాఁగ నిచటి ♦ కే తేరంగన్. 201

క. పురరక్షణంబు సేయుట, నరపతులకు నీతి గావు♦నన్ దేవర యి
ప్పురమున నానతి యిచ్చితి, వరిభీకర చేసినాఁడ ♦ నట్టుల నేనున్. 202

క. అని తనచేసినపని య,ద్దనుజునకున్ విన్నవించి ♦ తడయక ... చ్ఛా
సనమున సమస్తసైన్యం,బును సన్నద్ధంబుచేసె ♦ ముద... 203
క. అతిదర్పోద్ధతుఁ డగుచు,ద్దితిజనివచనమున నధిక♦ధీరులు సేనా
పతులు సమరసన్నాహము, లతులితములు గాఁగ మెఱసి ♦ రధిపతి యలరన్.
వ. అంత. 205
క. కుటిలాక్షవీక్షితుఁ డై, చటులబలోదీర్ణ మైన♦సైన్యము గొలువం
బటుగతిఁ జని దుర్మదుఁ డు,ద్భటశక్తిబలంబుతోడఁ ♦ దలపడియె వడిన్. 206
క. క్రూరులు తద్భటు లతిదు,ర్వారులు నిశితాస్త్రశస్త్ర♦భల్లప్రతతుల్
నీరంధ్రంబుగఁ గురిసిరి, దారుణముగ శక్తిసైన్య♦తతిపైఁ గినుకన్. 207
గీ. కిలకిలారావముల రణ♦క్రీడ సలుపు,దైత్యభటులఁ గని సగని సము♦దగ్రరోష
మగుచు నుద్దండవిస్ఫురి♦తాట్టహాస,నినదములతోడఁ దచ్ఛక్తి♦నికర మపుడు.
క. కరధృతబహువిధశస్త్రా,త్కరతళతళదీప్యమాన♦కాంతినికర మం
బర మెల్ల నావరింపఁగ, సురవైరులతోడఁ బోరెఁ ♦ జోద్యము గాఁగన్. 209
వ. ఇవ్విధంబున. 210
గీ. శక్తులకు దానవులకుఁ ద♦త్సమయమునఁ ద్రి
లోకసంక్షోభకర మాస♦మీక మయ్యె
బలపదోద్ధరజఃపుంజ♦భరితగగన
మగుచు బహులాస్త్రశస్త్రసం♦పాత మగుచు. 211
గీ. సామజశ్రుతిచామర♦చాలిత మయి, యశ్వనిశ్వాసవిక్షిప్త ♦ మై శతాంగ
పటలవిశ్రాంతమై ధ్వజ♦పటసమీర,ధూతమై పర్వె దివి రజో♦వ్రాత మపుడు.
శా. ఆరీతిన్ దృఢసాహసోగ్రుఁ డయి యు♦ష్ట్రాక్షౌహిణీసంవృతుం
డై రాజచ్ఛరవర్షము ల్గురియుచున్ ♦ సాటోపదోస్సారుఁడై
యారాత్రించరమాళి శక్తిబల ము♦ద్యచ్ఛక్తిమైఁ జొచ్చి రా
వారింప న్వెస వచ్చె నచ్చటికి సం♦పద్దేవి క్రోధంబునన్. 213
వ. ఇట్లు సంపత్కరీదేవి దుర్మదున కభిముఖంబుగాఁ దనబలంబుతోఁ గూడ నడుచు
నప్పు డయ్యంబతోడ నరుగుదెంచి తత్సమాన లైనయనేకశక్తులు దమతమ
వాహనంబు లైన ఘోటకంబులచేత ననేకరాక్షసులం జదియం ద్రొక్కించుచు
విహరించుచుండ దుర్మదానుచరు లైనదానవులును విజృంభించి బహువిధశస్త్రా
స్త్రంబులు శక్తిసైన్యంబుపైఁ బ్రయోగించుచుండ నత్యంతతుములం బగుయుద్ధం
బును భేరీమృదంగాదివాద్యనాదంబులును నక్తంచరసింహనాదంబులును శక్తినిక

రాట్టహాసనాదంబులును బరస్పరధిక్కారనాదంబులు నన్యోన్యప్రశంసానాదంబులును నితరేతరాయుధసంఘర్షణనాదంబులును రథాంగఘర్ఘరనాదంబులును మాతంగబృంహితనాదంబులును తురంగహేషానాదంబులును నేకీభవించి సకలదిఙ్నభఃపరిపూరితంబు లగుచునుండఁ దదుభయసేనాసంచారసముత్థితధూళిపటలంబు లంబరంబును దిక్కులు నాచ్ఛాదించి యంధకారం బొనరించుచుండఁ దత్సమయంబున శక్తిసేనాప్రయుక్తమహాస్త్రశస్త్రవిద్యమానంబులై ధరణిం బడురాక్షసకళేబరంబులవలనఁ దొరఁగినరుధిరం బారేణుసముదాయంబు నడంచి యక్కొలంది నిలువక యనేకనదులై ప్రవహించుచుండ నందు శిలీముఖవిలూనంబులై పడి తత్తద్విరుదాంకితంబు లగుకేతనంబులు వోవుచుండ శరపతితం బగుధవళచ్ఛత్రమండలంబులతోఁ గూడి రక్తారుణి యైనభండనభూమి సంధ్యారోహితాభ్రహిమమయూఖమండలమండితం బైనవ్యోమమండలంబు ననుకరింపఁ గల్పాంతజ్వలనజ్వాలాకలాపంబు సాగరోదకంబులం బోలె శక్తినికరంబు దైత్యసైన్యంబుల నావరించె నప్పుడు తత్ప్రయుక్తనిశితాస్త్రశస్త్రధారానికృంతకంధరులై యనేకదానవులు సమరతలంబునం బడిన సందష్టాధరంబులు భ్రుకుటికఠోరంబులు క్రోధసంరక్తనయనంబులు నగుబహువిధరాక్షసశిరంబులు సంగ్రామధరణీతలంబున నంతటం గలయ నెఱసె నివ్విధంబున సకలజగద్భయంకరం బగుసంగరంబు ప్రవర్తిల్లుచుండ నత్యంతక్రోధంబున శక్తిసముదయంబు రాక్షససేనం బడలువడ నడఁచె నాసమయంబున బహుప్రకారదారుణప్రహరణతాడితమూర్ఛితవినాశితవిభ్రాంతపలాయితం బైననిజబలంబు నాశ్వాసించి రణదుర్మదుం డగుదుర్మదుండు సాహసంబున దీర్ఘగ్రీవసమున్నమ్రంబును గకుద్విరాజితనిష్ఠురతోత్రంబును నైనమహోష్ట్రంబు నెక్కి శక్తిసేనతోఁ దలపడి తోడిదానవులుం దానును నిశ్వసత్కాలసర్పభయానకశస్త్రాస్త్రదుర్నిరీక్ష్యులై సంపత్కరీచమూచక్రంబుల నెల్ల సముల్లసత్ఫలంబు లైనభల్లంబులచేత మహాంబుదంబులు వర్షధారలచే వనంబులం బోలెఁ గప్పిన దుస్సహసత్త్వం బైనయద్దైత్యునిబాణసహస్రంబుల సంతాడితంబై శక్తిసైన్యంబు క్షణమాత్రంబు చేయునది లేక యూరక నిల్చె నంత నది గనుంగొని క్రోధారుణలోచన యై సంపత్కరీదేవి రణకోలాహలాఖ్యం బైనదంతావళంబు నెక్కి యతని మాఁగొని సమరంబు సేయుసమయంబున. 214

చ. కనఁబడె నిత్యమండలిత•కార్ముకముక్ శరరజ్జువుక్ బత
ద్దనుజచయంబు నింతియ యి•తఃపర మేమియుఁ దోఁప దమ్ముఁ గై

క్రొని యరిఁబోసి నింపుతెగ ♦ గూరిచి లక్ష్యము చేసి యేయ న
య్యనిమొన సంపదీశ్వరిక♦రాశుగలాఘవ మెన్న శక్యమే. 215

వ. ఇత్తెఱంగున. 216

క. ఖరకరకరసంపర్క, స్ఫురదుగ్రతశత్త ఖాతి♦సురుచిరబాణో
ద్ధురదవకీలల సంప్రత్యరిదానవసైన్యవనముఁ ♦ గాల్పం జొచ్చెన్. 217

క. దానన్ గోపం బినుమడి, గా నాదుర్మదుఁడు తీవ్ర♦కాండము లతిదు
ర్మానమున సంపదీశ్వరిపై నిబిడముగాఁగఁ గురిసె ♦ బహువేగమునన్. 218

క. ఇతరేతరశరశతసాం,ద్రితచే దిమిరంబు పర్వె ♦ నభమున నం దు
ద్ధతతత్సంఘర్షనము,ద్గతశిఖికణములు వెలింగె ♦ ఖద్యోతరుచిన్. 219

వ. అప్పుడు. 220

క. బలవంతము రణకోలా,హలనామము సంపదంబి♦కాధిష్ఠిత ము
జ్జ్వలమహిమం బగుదంతా,వళరాజము గవిసె దాన♦వప్రతతిపయిన్. 221

వ. ఇవ్విధంబున నాసంపత్కరీదేవివాహనవేదండంబు మదోద్దండం బై యమ్మహానుభా
వను మోచుచు శాత్రవబలంబులపై నుఱికి. 222

సీ. కఱకుఁదొండమునఁ గొం♦దఱఁ జుట్టి నేలతోఁ, గుల్లలత్తిగాఁ ♦ గొట్టి కొట్టి
యేడ్తెఱతో స్పృశ♦న్నివగజోహంతినా, మఱి కాళ్లఁ గొందఱ ♦ మట్టి మట్టి
కులిశంబు నగువాఁడి♦కొమ్ములఁ గొందఱఁ, గడుపులు పగులంగఁ ♦ బొడిచి పొడిచి
కాలదండముఁ బోలు♦వాలదండంబునఁ, గడిమిమైఁ గొందఱ ♦ నడిచి యడిచి
గీ. గాత్రమర్దనమున నఖా♦ఘాతముల న,నూనఘీట్కారములఁ బ్రథి♦మానబాధ
పీడనములఁ గొందఱ బాధ♦పెట్టి పెట్టి, వారణం బిట్లు దనుజుల♦బారి చమరె. 223

గీ. దానఁ గోధరక్తాక్షుఁ డై ♦ దానవాధి,పతి యొకశిలీముఖమున సం♦పత్కరీకి
రీటగతమణి యొక్కటి ♦ నూటి గాఁగ, నులిచెఁ గోలాహలముగ దై ♦త్యులు నుతింప.

శా. నక్రోధారుణదృఙ్మహోగ్ర యగుచున్ ♦ సంపత్కరీదేవి శా
తక్రూరాస్త్రము లుద్ధతిం బఱపి త♦ద్వక్షంబు ఛేదింప నా
విక్రాంతాగ్రణి యైనదుర్మదుఁడు వే ♦ వీతాసుఁ డై కూలె న
ర్వక్రవ్యాదులు భీతిఁ బాఱఁగఁ బ్రహ♦ర్షం బంద శక్త్యోఘముల్. 225

క. అప్పుడు కిలకిలనాదం, బుప్పతిలన్ శక్తు లసుర♦యూథోత్తములన్
దప్పి చనకుండఁ గుప్పలు, తెప్పలుగాఁ గూల్చి కడిమి ♦ దీపించి గనిన్. 226

క. హతశేషులు శూన్యకపురి, కతిజవమునఁ బఱచి దుర్మ♦దాభిఖ్యచమూ
పతి సంపత్కరిచే రణ,హతుఁ డౌ టేర్పడఁగఁ జెప్పి ♦ రసురవిభునకున్. 227

క. ఆవృత్తాంతము విని దు,ర్భావుఁడు భండాసురుండు ♦ పరుషతరక్రో
ధావిర్భావుం డగుచుఁ బ్ర,భావప్రజ్వలితుఁ డైన♦భంగి మెఱయుచున్. 228

గీ. చంద్రనిప్పులతో నెక♦నక్కెమాఁడు, నీక్షణంబులచే దుర్ని♦రీక్షుఁ డగుచుఁ
గేల దారుణతరకర♦వాల ముగ్గి,లీల నంకించి భ్రుకుటిక♦రాళుఁ డగుచు. 229

క. కుటిలపరాక్రము నాత్మని,కటవర్తి ననూనసమర♦కార్యధురీణున్
గుటిలాక్షు సైన్యపతిఁ గని, చటులోద్ధత్యమున రాత్రి♦చరపతి వల్కెన్. 230

క. ఆదుష్టవనితయఁట నేఁ, డాదేవారుల జయించి ♦ యతిబలమత్తుం
డాదుర్మదునఁట రణమున, మేదినిఁ గూల్చెనఁట యప్ర♦మేయమదమునన్. 231

క. హా విధికృత మగుపని యెం,తో వింత గదా తలంప ♦ దుర్జయుఁడు గదా
దేవతలకు నరులకు నా,శీవిషములకతఁడు సుప్ర♦సిద్ధము గాఁగన్. 232

గీ. అట్టిదుర్మదు ననిఁ దెగ♦టార్చె నట్టె, యబల యొక్కతె యిది కడు ♦ నద్భుతంబు
గాన నాలస్య మొనరింప ♦ గాదు వేగ, వినుము దీనికిఁ బ్రతికార♦విధముఁ దెలియ.

క. చండభుజాదండబలో,ద్దండుని నప్రతిమబలవి♦తానరణజితా
ఖండలముఖసురకాండుఁ గు,రుండుం డనువానిఁ బంపు ♦ రూఢిగ ననికిన్. 234

చ. అతఁడు రయంబున న్నిజబ♦లావళితోఁ జని విక్రమాతిద
ర్పిత యగుచున్న యన్నెలఁతఁ ♦ బేర్చి జయించి తదీయ మైనయ
య్యతివలపింఁడుతోడ నిట ♦ కమ్మెలనాఁగను గొప్పు వట్టి యు
ద్ధతగతి నీడ్చి తేఁగలఁ డు♦దగ్రబలాఢ్యుఁ డజేయుఁ డేరికిన్. 235

క. కుటిలాక్ష యతని నీ వి,చ్చటికిన్ బిలిపింపు మనిన ♦ సత్వరముగ న
ప్పటుబుద్ధిఁ బిలువనంపెన్, గటుశౌర్యవినిర్జితారి♦కాండుఁ గురుండున్. 236

గీ. చండదోర్దండుఁ డైనకు♦రుండనామ,వాహినీనాథుఁ డత్యంత♦సాహసుండు
నేత్రనిర్దిష్టభటసమా♦హూతుఁ డగుచు, వచ్చె నచ్చటి కందఱు ♦ మెచ్చి చూడ.

గీ. వచ్చి భండాసురునిపాద♦వనజములకు, నధికభక్తిఁ బ్రణామంబు ♦ లాచరించి
వినయమున నిల్వ నాతనిఁ ♦ గని నిశాచ,రేంద్రుననుమతిఁ గుటిలాక్షుఁ ♦ డిట్టు లనియె.

క. ఆజికి నినుఁ బొమ్మని మన,రా జానతియిచ్చినాఁడు ♦ రాజత్సైన్య
భ్రాజిష్ణుఁడవై యరుగుము, స్త్రీజయ మెం తని నిరాక♦రింపకు మదిలోన్. 239

క. దుర్మదునిఁ దునిమి రణజయ,దుర్మదమున విఱ్ఱవీఁగి ♦ దుస్త్రీ లెంతో
శర్మముతో నుండిరి రణ,కర్మఠ మన కిది సహింపఁ♦గాఁ దగ వగునే. 240

క. మాయావిశారదుండవు, సాయకవిద్యావిశేష♦చతురుఁడవు విచి
త్రాయోధనదక్షుండవు, నీయెదుర న్నిల్వఁ గలరె ♦ నిర్జరు లైనన్. 241

క. స్త్రీ లసఁగ నెంత నీ కిటు, లాలస్యముసేయ కేగి ♦ యావనితల ను
న్మూలింపు మనుచు నధిపతి, మోఁగ్రిలన్ గుటిలాక్షుఁ డాసు♦రుండపుఁ బల్కెన్. 242
చ. పలికిన నాతఁ డాదనుజ♦భర్తపదంబులకున్ నమస్క్రియా
కలన మొనర్చి వీడ్కొని ప్ర♦గాఢరయంబున శూన్యకంబు దా
వెలువడి యుద్ధతిన్ జనియె ♦ విశ్రుతబాహుపరాక్రమంబు తో
బలములు గొల్చి రా నహిత♦భంజనవాంఛ దురాగ్రహంబునన్. 243
వ. ఇవ్విధంబున. 244
క. ఇరువదియక్షౌహిణు లుద్ధురరాక్షసబలము గొల్వ ♦ దోర్దర్పముమైఁ
ద్వరితముగ దుర్మదాగ్రజుఁ, డరిందముఁడు హయము నెక్కి ♦ యరిగెడువేళన్.
క. కరిహయనరసమ్మర్దిత, ధరణీతలరజముచేత ♦ దశదిశలును సం
భరితములు గాఁగఁ దిమిరము, పరఁగెన్ వ్యోమమున భువిని ♦ బరమమునిండ్రా.
వ. అప్పుడు కురుండకుండు. 247
క. అనుజునిఁ దలంచి శోకము, ఘనరోషము నాగ్రహంబు ♦ గాఢముగ మనం
బున ముప్పిరిగొన శక్తిప్ర, తన మార్కొని శాతశరశ♦తంబుల ముంచెన్. 248
వ. మఱియును. 249
ఆ. కుటిలశార్ఙ్గచాప♦గుణఘోషణము మహా, భీషణముగ మ్రోయఁ ♦ బేర్చి శక్తి
సైన్యముల నుదగ్ర♦సాహసంబునఁ జొచ్చి, కడిమి సంపదంబఁ ♦ గాంచి పల్కె.
క. బాలుఁ దనతమ్ము దుర్మదు, నాలంబునఁ గూల్చి దాన ♦ నతిశయగర్వ
వ్యాలీఢహృదయ వైతివి, బేలా యిటువంటి వగునె ♦ విజయము లెందున్. 251
గీ. మదిఁ దలఁప నల్ప మగువిక్ర♦మంబు సల్పి, బేల యింతమహామదం ♦ బేల నీకుఁ
బాపమతి వైననిన్ను మ♦ద్బాణవితతి, నంతకునిపురి కనిచెద ♦ నసురు లలర. 252
క. అతిహృదయంగమమును స్వాదుతరంబు నపూర్వమును గ♦దుష్ణము నగునీ
దుతనూవల్లిఁ గలుగులో, హిత మింపుగఁ గ్రోలుఁ గాక ♦ యిట భూతంబుల్. 253
ఉ. చూచెదు గాక మద్విజయ♦సుస్థిరబాహుబలంబు నాజిలో
నీచత నీవు దుర్మదుని ♦ నేఁ డనిఁ జంపినయట్టిపాపమున్
ఖేచరభూచరుల్ గనఁగఁ ♦ గిల్బిషచిత్త మమ్ము గెల్వఁగా
వేచిననిన్ను బిట్టనుభ♦వింపఁగఁ జేసెద మచ్ఛరంబులన్. 254
మ. అని యీరీతిఁ గఠోరవాక్కుల గజేం♦ద్రారూఢ యాసంపదం
బ నధిక్షేపముచేసి యాఖలుఁడు దృ♦ప్యచ్ఛక్తి సేనావిమ

ర్ధనశౌర్యంబున కాత్మసైనికుల దు♦ర్వారపరితాపాఢ్యులన్
బనిచెన్ వారలు నుద్ధతిం గడగి సం♦పద్దేవిసైన్యంబుపైన్. 255

చ. కవిసిన వారలం గని య♦కంపితధైర్యముతోడ నిల్చి శా
స్త్రవజయకౌతుకంబున దు♦రం బొనరింపఁగ నాత్మశక్తిసై
న్యవితతి కాజ్ఞ యిచ్చె నతి♦హర్షముతోడుత సంపదంబ లో
కవిదితసుప్రభాజితవి♦కర్తనబింబ నతావలంబ దాన్. 256

గీ. తత్కరుండకసైన్యవి♦దారణమున, కిట్లు సబలంబుగా నుత్స♦హించుసంప
దంబికాదేవికడకు న♦శ్వాధిరూఢ, వచ్చి యి ట్లను నధికసాం♦త్వనము గాఁగ. 257

క. చెలి సంపత్కరి సద్గుణ,బలనిధి నీ విపుడు నాదు♦చనవున నామా
టలు చిత్తగింపు దెలిపెదఁ, దలఁచిన కార్యంబు నీకుఁ ♦ దద్దయుఁ బ్రీతిన్. 258

క. నవనవముగ నిప్పుడు దా,నవవీరగణంబుతో ర♦ణం బొనరింపన్
దివిరి యిటకుఁ జనుదెంచితి, నవిలంబితముగ నొసంగు ♦ మనుమతి నాకున్. 259

క. నాయందలిస్నేహంబున, నాయోధన ముడిగి నిల్వ ♦ మట క్షణమాత్రం
బీయాచన నెఱవేర్పుము, నాయుల్లము సంతసించు ♦ నయమున దీనన్. 260

సీ. అనుచు వేఁడిన మందస్మి♦తాస్య యగుచు, నధికసమరసన్నద్ధ మైనట్టియాత్మ
సైన్యము మరల్చె నయ్యంబ♦శాసనమున, నిలిచె నూరక నంతంత ♦ నిఖిలబలము.

వ. అంత బాలమార్తాండమండలప్రభాభాసమానదేహకాంతు లగునశ్వారూఢాంబసైన్యశక్తులు పవమానవేగంబులును నిశితఖురపుటనిర్దళితసమరభూభాగంబులును నైయాత్మీయబలవార్ధికిఁ దరంగంబులువోనితురంగంబుల నెక్కి యొక్కపెట్టునఁ గురుండకవాహినిపైఁ బడి వల్గావిభాగకృత్యంబులను సంవర్తనవివర్తనంబులను జారీభేదంబులను బంచధారలను బాతనప్రోత్సాహనంబులను మఱియు ననేకగతివిశేషంబుల నత్యంతచతురలై యశ్వహృదయజ్ఞలై నయమ్మహనీయలు సమరవిహారంబు సలుపం దొడంగిన నిజవాహినీనాథప్రేరితులై దానవవీరులు వారిం దలపడి దారుణరణంబు సేయుచుండ నశ్వారూఢాదేవి యపరాజితసమాహ్వయంబును గతిలాఘవవిజితకురంగహయంబును నైనమహాహయంబు నెక్కి సంచలద్వేణికాసుభగయు సలీలవిలోలన్మృగాంకకలోజ్జ్వలయు సంధ్యారాగరక్తశీతాంశుబింబప్రతీకాశస్మయమానవదనయు నగుచు మణిమయం బైనదివ్యకార్ముకంబుఁ గేల ధరించి సజ్యంబుచేసి గుణటంకారంబున దిశలు పూరించుచుఁ గురుండకుని మాఱ్కొని శరాసారంబులం గప్పినఁ దత్ప్రయుక్తంబులై రుక్మపుంఖంబులైనయసంఖ్యశిలీముఖంబులు దశదిక్కు ల్లాక్రమించిన దుర్మదాగ్రజుండును దురాచారుండును జండవిక్రముం

చును నైనయుక్కురుండకుండు నిజశార్ఙ్గనిర్గతంబు లైనయనేకశరంబుల నద్దేవిం గప్పె నప్పు డమ్మహానుభావవాహనతురంగం బనేకదనుజుల సంహరింపుచుఁ బ్రళయకాలకాలమేఘగర్జనంబుఁ దర్జనంబుసలుపు హేషాఘోషంబున వైరిసైన్యంబు దైన్యంబు నొంది మూర్ఛిల్లునట్లు గాఁ జేసె నంత నద్దైత్యబలంబున నమ్మహాదేవి యథేచ్ఛంబుగా సంచరించుచు దివ్యంబును నమోఘంబును జ్వలితాకృతియును నగునిజపాశాయుధంబువలన భుజంగభీషణంబు లగుబహుకోటిపాశంబుల నుత్పాదించి ప్రతిపక్షానీకంబు సమస్తంబును బంధించి పడఁద్రోచిన నాత్మీయసైన్యబంధనంబునఁ గ్రుద్ధుం డై యయ్యాతుధానుం డొక్కనిశాతకాండంబున నవ్వేదండయానరత్నమయకోదండదండగుణంబు ఖండించిన నత్యంతక్రోధంబున సంఛిన్నమౌర్వీ యగుశరాసనంబు విడిచి యాహయారూఢ మహాగ్రహంబున దుర్మదుం డగు నద్దుర్మదపూర్వజువక్షస్థలంబు లక్ష్యంబుచేసి యంకుశంబు ప్రయోగించిన నది. మండుచుఁ దద్వక్షంబు భేదించి యతనిప్రాణంబులతోడ శోణితంబుఁ గ్రోలుచు వెడలిన వాఁ డశనిపాతంబునం గూలినవృక్షంబునుంబోలె భూమిం బడియెఁ దత్సమయంబునఁ దదంకుశసముద్భూత లై యపరిమిత లైనయుద్భటపూతనలు గవిసి పాశబద్ధంబు లైనశత్రుసైన్యంబుల భక్షించి యనంతరంబ యంతర్ధానంబునొంది రిట్లు వింశత్యక్షౌహిణీనాథుం డైనకురుండకుండు భండనంబున సబలంబుగా నిహతుం డైన హతావశిష్టు లగుతద్భృత్యులు సత్వరంబుగాఁ బఱచి యావృత్తాంతం బంతయు రాక్షసాధిపతి కెఱింగించిన నాశూన్యకపురాధీశ్వరుండు నిజసేనాధిపతి యగుకురుండకుండు సోదరయుక్తంబుగా శక్తిసైన్యనిపాతితుం డౌటకు మనంబున విషాదంబు నొంది భుజంగంబుభంగి దీర్ఘోష్ణనిశ్వాసంబులు నిగుడ్చుచుండె నని చెప్పి హయగ్రీవుండు వెండియు ని ట్లనియె. 262

సీ. భండనభూమిఁ గు◆రుండకుం డశ్వాధి,రూఢచేఁ బడుటకు ◆ గాఢకోప
ఘూర్ణితచిత్తుఁ డై ◆ కుటిలాక్షుఁ గని భండ,దైత్యుండు పల్కె ను◆ద్ధతము గాఁగ
స్వప్నంబునందు న◆సంభావ్య మశ్రుత,పూర్వంబు భయద మ◆ద్భుతతమంబు
కదఁ దీవ్ర మైనయీ◆కష్ట మాగత మయ్యె, నిన్నినాళ్లకు నది ◆ యెట్టి దనిన
గీ. నధికజవసత్వశాలులు ◆ నన్నదమ్ము, లతిపరాక్రమదుర్మదు ◆ లైనయట్టి
దుర్మదకురుండులకు యొక్క ◆ దుష్టవనిత, చెలులచే జచ్చి రింతకుఁ ◆ గలదె వింత. 263

క. అతిమాయావిని యగున,య్యతివపనియె యింతవట్టు ◆ నదిగావునఁ ద
త్ప్రతి గెలువఁ బంపు మపరా,జితులఁ గరంకాదిపంచ◆సేనాపతులన్. 264

భుజంగ. శతాక్షౌహిణీసైన్య♦సంయుక్తులై యా,దితిప్రోద్భవు ల్గట్టి♦తెం పొప్ప మాయా
వతిన్ దుర్విలాసాధి♦వాసాంగకన్ ద,త్సతిన్ బట్టి తేరంగ ♦ శక్తు ల్బలాఢ్యుల్. 265

క. వారలు రణదుర్మదు లతి,శూరులు సంగ్రామభూమి ♦ సొలయక ధైర్యో
దారతఁ బ్రాణము లీఁగల,వా రొకసతి గెలువ లేక ♦ వత్తురె నగుడన్. 266

క. అని యానతి యిచ్చిన న,ద్దనుజేంద్రునియాజ్ఞ యపుడు ♦ తలఁదాల్చి రయం
బునఁ గుటిలాక్షుఁడు పిలిపిం,చిన వచ్చి కరంకముఖ్య♦సేనాధ్యక్షుల్. 267

గీ. అపుడు కుటిలాక్షదర్శితు ♦ లగుచు దాన
వేంద్రుపదముల కెఱఁగి వ♦హ్నిప్రదీప్త
కీలములయందుఁ బడఁ దమ♦కించి యరుగు
మిడుతగమివోలె ధైర్యంబు ♦ మిక్కుటముగ. 268

క. అక్షౌహిణీశతాన్వితు, లక్షీణపరాక్రములు దు♦రాగ్రహచిత్తుల్
రక్షోగ్రణు లేవురు రణ,దక్షులు నగరంబు వెడలి ♦ దారుణభంగిన్. 269

క. క్రోధాంధు లగుచు శక్త్యా,యోధనకృతివాంఛ నరిగి ♦ రుద్భటరణభే
రీధాంధణ లాశాద్విర,దాధిపులచెవు ల్వగుల్పఁ ♦ దగి గర్వమునన్. 270

క. సతతప్రచలత్కేతన, ఘతులితగతిభేదచతుర♦హయచయము మదో
ద్ధతరణకుశలమతంగజ, మతిదృప్యద్వీరభటము ♦ నై బల మొప్పెన్. 271

వ. అని చెప్పి. 272

ఆశ్వాసాంతము.

మ. కనకోర్వీధరచాప చాపలయుత♦త్కామకంటకోగ్రాసుర
స్తనయిత్నుప్రబలప్రభంజన జన♦ధ్యానానురూపప్రభా
ఘనచిన్మూర్తివి శేష శేషఫణిరా♦డ్గ్రైవేయకాంతిప్రతాం
తనితాంతస్ఫుటవత్స వత్సలతరాం♦తస్సార సారాకృతీ. 273

క. శతపత్రపత్రలోచన,శతధృతిశతమన్యుముఖ్య♦సకలసవనభు
క్ప్రతతిప్రస్తుతశుభదా, ప్రతిసిద్ధిదివ్యానుభావ ♦ ప్రవిమలభావా. 274

స్రగ్విణి. ఖండితానేకపా♦కారదైతేయరా,ట్పుండరీకాకృతి♦స్ఫూర్జదుగ్రాసురా
కాండభాండౌఘర♦క్షాతిదీక్షాచణో,ద్దండనేత్రాంచలో♦ద్యద్దయాభాసురా. 275

గద్యము.

ఇది శ్రీభవానీశంకరకరుణాకటాక్షవీక్షాసుధారసాసారప్రసారణసులబ్ధ
కవితావైభవాపస్తంబసూత్ర పరాశరగోత్ర విలసదాతుకూరివంశ
సంభవ వాయ్యనామాత్యపౌత్రాదిమూర్తినామసత్కవిపుత్ర
సకలసుకవిజనవిధేయ పాపయనామధేయ
ప్రణీతం బైన లలితాంబోపాఖ్యానం
బనుమహాప్రబంధంబునందుఁ
జతుర్థాశ్వాసము.



ఓమ్.

శ్రీసద్గురుచరణారవిందాభ్యాంనమః.

శ్రీ

# లలితాంబోపాఖ్యానము.

## పంచమాశ్వాసము.



మద్ధరాధరేంద్రసు
తామహితలతోపగూహి♦తప్రథితనిజాం
గామరభూజలలామా
భూమశ్రీధాన్యవాటి♦పురవరధామా. 1

వ. అవధరింపుము తురంగవదనుం డగస్త్యమునీంద్రునకు వెండియు నిట్లనియె నట్లు
గరంకాదులు రణనిశ్శంకు లై చనునప్పుడు. 2

మ. హయహేష ల్గజబృంహితంబులు భటో♦ద్యత్సింహనాదంబులున్
రయవత్స్యందనచక్రఘుర్ఘురమహా♦రావంబులుం గూడి య
త్యయకాలార్ణవభూరిఘోషసదృశం♦ బై యుద్భటం బై నయొ
క్క యపూర్వధ్వని నిండె నంబరదిశా♦కాండంబులన్ గాఢ మై. 3

క. రథచక్రనేమివిదళిత,పృథివీరేణుచ్ఛటా♦క్షపితరుచి యగుచున్
బృథుహిమవర్షచ్ఛన్న,ప్రథితుం డై నట్లు దోఁచెఁ♦ బద్మాప్తుండున్. 4

గీ. ధూళిమయ మయినట్టుల♦ తోఁచె విశ్వ,మంతయును జూడ శబ్దమ♦యంబురీతిఁ
దోఁచె నిఖిలంబు విసఁగ ను♦ద్ధురత నడచు,దనుజసేనల రేణువా♦ద్యములవలన. 5

గీ. పాంసుజాలసంవృతదైత్య♦బలము జలధి,పోల్కి నింకని గణుతింపఁ♦ బోలదయ్యె
వ్యాళమీనాదిచిహ్నితా♦లోలకేతు,జాల మబ్ధిసంచారమ♦త్స్యాళి నెనసె. 6

గీ. అవ్విధంబున నుద్ధతు♦ లగుచు దైత్య,నాథు లేవురు శక్తిసై♦న్యములమీఁద
నడచునప్పుడు త్రిదశమా♦నసము లెల్ల, శక్తిభంగభయంబున♦ జలదరించె. 7

క. అయసురవల్లభులు బహు,మాయోపాయప్రయోగ•మహితు లగుటచే
గాసుడ సర్పిణి యనియెడు, మాయన్ గావించి హితత•మస్తనవాంఛన్. 8

సీ. అట్లు గావించిన•యాసర్పిణీనామ,దుష్టశాంబరి యప్డు • ధూమ్రవర్ణ
యును మఱి ధూమ్రోష్ఠి•యును ధూమ్రలంబప,యోధరయును మహాం•భోధిసదృశ
గంభీరకుక్షియుఁ • గఠినగోమాయుసం,రావిణియును నై క•రంకముఖ్య
తెలమిఁ బూర్వంబున • నేమాయచే మహేం,ద్రప్రభృత్యమరుల•దర్ప మడఁచి

గీ, గట్టిమాసర్పిణీమాయ • యటుల శక్తి,సైన్యములమ్రోల వారల•స్వాంతములకు
భయముఁ జేయుచు నుద్ధతిఁ • బరువులెత్తె, బహువిధవిచిత్రగతుల భూ•భాగ మదర.

వ. ఇత్తెఱంగున ననేకసర్పవిభూషణి యగునాసర్పిణీమాయ తన్నుఁ గనుంగొనువారికి నాశ్చర్యభయకంపంబు లుత్పాదించుచు సర్పజనని యైనకద్రువియపరావతారం బగ మాయామయశరీరంబు లైనబహువిధసర్పంబులకు నుద్భవస్థానం బై వృద్ధజంబుకంబు లై వినువారికిం గర్ణకఠోరంబుగా నఱచుచు శక్తిసేనామధ్యంబున నపరిమితవిచిత్ర వల్గనంబుల సంచరించుచుండ నప్పుడు శక్తులు రాక్షసులు నొండొరులం దలపడి వీరభాషణంబుల నన్యోన్యమానసంబులయం దత్యంతక్రోధం బుదయింపంజేయుచు యుద్ధోన్మాదంబున నతిసంకులత్వంబునం బరస్పరంబు నెఱుంగక శస్త్రపాణు లై యితరేతరప్రహారంబులు సల్పుచు శస్త్రాస్త్రసంఘట్టనసముత్థితంబు లై విస్ఫులింగంబు లంబరంబున నిబిడంబుగా మెఱయ నుభయసైనికనికరప్రవర్తితబాణసమూహంబు దిశాసందోహంబు నిండ నతికఠోరంబు లగునట్టహాసంబులును సింహనాదంబులును భయంకరంబు లై ప్రవర్తిల్ల రణమహీతలసముత్థపరాగపటలం బంధకారంబు నాపాదింప రాక్షసగణంబులు యథేచ్ఛంబుగా రక్తమాంసమేదోమజ్జ లాస్వాదించి తృప్తి నొంది నర్తనంబులు సలుప ఘోరసమరంబు సేయుసమయంబున రాక్షససైన్యంబున శక్తినికరకరాగ్రజాగ్రన్మండలాగ్రనిరర్గళవిహారంబున ఛిన్నంబు లైనపదకరంబులును భిన్నంబు లైనయురశ్శిరంబులును బగిలినవర్మంబులును నెగిలినమర్మంబులును నికృత్తంబు లగుకరవాలంబులును బరివృత్తంబు లగురక్తనదీజాలంబులును వికీర్ణంబు లగు కేశపాశంబులును విశీర్ణంబు లగునంకుశపరశుపాశంబులును ద్రుగ్గెడుతురంగంబులును మొగ్గెడుమాతంగంబులును నుగ్గునూచంబు లైనశతాంగజాతంబులును దగ్గి పడియెడు కేతనవ్రాతంబులును రాలెడుగజదంతంబులును దూలెడుకుంతంబులును విఱిగినబాణాసనంబులును నొఱిగినసుభటజనంబులును విలూనంబు లగుతనుత్రాణంబులును దనువిలీనంబు లగుబాణంబులును మఱియు రక్తనదీప్రవాహంబులం బడి పోవుచుండు కరితురగనరభోజనకళేబరరథావయవధ్వజచ్ఛత్రచామరంబులును నతిసాంద్రమాంస

కర్దమంబున. నిమగ్నంబులై కదలక యున్నరథస్తోమంబులును శోణితనిర్ఝరంబులకు ననురూపంబుగా నెఱయుశిరోరుహశైవాలంబులును గలిగి సంగ్రామంబు భీమంబై చెల్లుచుండ సహింపక నిజబలంబులం జేకొని యయ్యైపురువాహినీనాయకులు సర్పిణీం బ్రేరేపించిన నది తనశరీరంబువలన ననేకవిధంబులైనయసంఖ్యాదందశూకంబులం గలిగించిన వానిలోఁ గొన్ని తక్షకసన్నిభంబులు గొన్ని కర్కోటకసదృశంబులు గొన్ని వాసుకిప్రతిమంబులు మఱియుఁ గొన్ని నానావిధవపుర్విశేషంబులు నానావిధదంష్ట్రాభయానకంబులు నానావిధవిషాగ్నిజ్వాలాజాలనిర్దగ్ధభువనత్రయంబులు నై దరదాఖ్యంబును వత్సనాభాహ్వయంబును గాలకూటాభిధంబును సౌరాష్ట్రిజనామధేయంబును బ్రహ్మపుత్రాభిఖ్యంబును బ్రదీపనసమాఖ్యంబును శౌక్లికేయనామధేయంబును గాకోలసమాహ్వయంబును హాలాహలాభిధానంబును మఱియు నితరంబులు బహువిధంబులునైనయనేకవిశేషంబులచే వ్యాప్తంబులై నస్వకీయవదనంబులతోడ నాలుకలు గోయుచు శక్తిసైన్యంబుల నావరించె నందు ధూమ్రవర్ణంబును వదనద్వయసంయుతంబులును నతిభయంకరంబులును నగుననేకకోటిసర్పంబులు సర్పిణీనయనద్వయంబులవలన నుత్పన్నంబులయ్యె నగ్రంబునను బుచ్ఛంబునను ఫణాన్వితంబై నవదనంబు గలిగి సర్వాంగనీలంబులైనయపరిమితవ్యాళంబులు దదాస్యంబువలన నుద్భవించె శబలవర్ణంబులును జతుర్వక్త్రంబులును నుగ్రరోచులు నైనయాశీవిషసహస్రంబు లమ్మాయావినినాసికావివరంబులవలనం గలిగెఁ బీతవర్ణంబులును ఫణాత్రయమండితంబులును దంష్ట్రాభీషణవికటాననంబులును గ్రోధదీపితంబులును నైనభుజంగసంఘంబు లక్కుహనాపరాయణకర్ణకుహరంబులవలన వెడలె వెండియు లంబమానంబును బవమానకుంభితచర్మభస్త్రికాప్రతిమానంబును మహాస్థూలంబును నైనతదీయపయోధరద్వంద్వంబువలన రక్తవర్ణంబులు నతిదారుణంబులు నైనబహుపన్నగంబులు హాలాహలంబు గ్రక్కుచు నుప్పతిల్లె నిట్లావిర్భవించి యాసరీసృపసంఘాతంబులు ప్రతిబలంబులపైఁ గవిసి చిందఱవందఱగాఁ గఱచియు విషవహ్నిజ్వాలలఁ గాల్చియు నతిదీర్ఘభోగపాశంబుల బంధించియుఁ గఠినమణిమండలంబులైనఫణామండలంబుల నడిచియు నత్యంతాకులత్వంబు నొందఁ జేసిన లలితాసైన్యంబునందలిశక్తినికరంబులు బహుశస్త్రాస్త్రసముదాయంబుల వానినెల్ల ఖండించుచు విజృంభించిన నక్కాకోదరంబులు పునఃపునస్సర్పిణీసముత్పాదితంబులై శతసహస్రాయుతనియుతప్రయుతాదిసంఖ్యాతీతంబులై యుపర్యుపరివర్తమానంబులై ముహుర్ముహుశ్శక్తిసేనావివిధాయుధఖండితంబులై యంతకంతకు వింత యగునట్లుగా నొక్కసర్పంబు ఖండితం బగునంతలో ననేకకోటిసర్పంబు లుద్భవిల్లుచు నిజోద్భ

వమూలం బైనసర్పిణి నశింపకుండుటంజేసి తాము ను దత్థుండనమాత్రంబున నశింపక మఱిమఱి పుట్టుచు గిట్టుచు వెండియుం బుట్టుచుండె నయ్యెడ శక్తిసైనికశరీరంబులు విషానలదహ్యమానంబులై తన్మానసంబులు దుఃఖసంతాపితంబు లగుటయు వీరల మర్దింప నింతకంటె మఱొక సమయంబు లే దని కర్తవ్యవిచారమూఢ లగునాశక్తుల మీఁదఁ గవిసి. 10

క. రాసభశతోహ్యమానో,ద్భాసితరథ మెక్కి ప్రళయ♦వారిదసదృశుం
డై సాయకవర్షము లలి,తాసేనలపైఁ గరంక♦దనుజుఁడు గురిసెన్. 11

గీ. కరివరము నెక్కి విక్రమో♦ద్ధురుఁడు కాక,వాసితసమాఖ్యుఁ డగుదైత్య♦వాహినీశుఁ
డతినిశాతధారాంచితం♦బైనయట్టి,చక్రమున శక్తివాహినీ♦చయముఁ గలఁచె. 12

ఉ. భండమహాసురేంద్రబల♦పాలనదక్షుఁడు వజ్రదత్తుఁడున్
జండభుజాబలుండు పటు♦శౌర్యకుతూహలతన్ మహోష్ట్రవా
హుం డయి వజ్రఘోరవిశి♦ఖోత్కరముల్ నిగిడించి విక్రమా
ఖండితశక్తిసైన్యముల♦గర్వ మడంచి యలంచె నుగ్రుఁడై. 13

క. గడుసరి వజ్రముఖుండును, గడిఁది మగం డత్యుదగ్ర♦ఖరవాహనుఁ డై
కడువాఁడికుంతధారల, బడలుపడఁగ నడిచె శక్తి♦బలములఁ గడిమిన్. 14

మ. అరిదుర్వారుఁడు వజ్రలోముఁ డనువాఁ♦డత్యుచ్చ మాగృధ్రయు
గ్యరథశ్రేష్ఠము నెక్కి దుస్సహము లౌ♦కాండవ్రజంబు ల్భయం
కరలీల న్నిగిడించి శక్తిబలముల్♦గంపింపఁగాఁ జేసె ని
ర్జరవిద్వేషులు సంతసింపఁగ సమ♦ర్త్యవ్రాతముల్ భీతిలన్. 15

వ. ఇవ్విధంబున. 16

క. అతిశౌర్యులు నతిదుష్టులు, జితకాశులు నైనపంచ♦సేనాపతు లు
ద్ధతిఁ బోరఁగఁ దత్ప్రోత్సా,హితదైత్యబలంబు లేక♦హేలాలీలన్. 17

క. శతసంఖ్యాక్షౌహిణు లు,ద్ధతి శక్తులమీఁదఁ గవిసి♦దారుణరణసం
గతి విహరించుచు నుండె ని,శితశస్త్రాస్త్రప్రసార♦శీఘ్రతరములై. 18

క. క్షణమునకుఁ గోటికాబహు,ఫణులఁ బుట్టించె నధిక♦పాపాత్మిక స
ర్పిణి వివిధకపటదుశ్చా,రిణి యాసర్పములు శక్తి♦ప్రతతి నలంచెన్. 19

గీ. సర్పిణీమాయచే బహు♦సర్పకోటు, లుదయ మంది యాశక్తుల♦మద మడంప
దాన నప్రతిహతముగా♦దైత్యనాథ,పంచకం బట్లు దా విక్ర♦మించుచుండె. 20

చ. అది గని కోపఘూర్ణితని♦జాంబకశోణమరీచిజాలముల్
మదయుతదానవప్రకర♦మండలిపై నిగిడించుచున్ జవా

స్వపగరుడోగ్రయానమున ♦ సత్వరతన్ జనుదెంచెఁ జూచి యా
త్రిదశులు సంతసిల్లఁగ మదిన్ ♦ నకులీశ్వరి తత్సురక్షకై. 21

పంచచామరము. ప్రతప్తకాంచనప్రభావి♦భాసమానదేహ యై
సుతీక్ష్ణవజ్రరూపదంత♦శోభమానవక్త్ర యై
ప్రతీతవాఙ్మయాకృతిత్వ♦భావితప్రభావ యై
వితానభుక్ప్రతానహర్ష♦విస్మయప్రదాత్రి యై. 22

క. లలితాదేవీతాలు,స్థలసంభవ యైననకులి ♦ తచ్ఛక్తిబలా
వలిసంరక్షకొఱకు నిజ,బలముం బ్రకటించె సదయ♦భావస్ఫురణన్. 23

క. తదధిష్ఠితోన్నతాంసుఁడు, విదితమహాపక్షవేగ♦విక్షిప్తధరా
భృదనీకుఁ డై నగరుడఁడు, గదనమునఁ జరత్సుమేరు♦ఘనత వహించెన్. 24

గీ. సర్పిణీమాయచేత సం♦జనన మొంది, శత్రులను బీడపెట్టెడు♦సర్పచయముఁ
గాంచి క్రోధతామ్రేక్షణో♦గ్రంబు గాఁగ, నన్నకులి నోరు దెఱవ న♦త్యద్భుతముగ. 25

క. ద్వాత్రింశద్దంతంబుల, ద్వాత్రింశత్కోటినకుల♦తతులు జనించెన్
జిత్రముగఁ గనకరుచులై, గాత్రంబులు మెఱయ నొక్క♦క్షణమాత్రమునన్. 26

గీ. అట్లు జన్మించి నకులసం♦హతులు సర్ప,బృందములమీఁదఁ గవిసి య♦మందలీలఁ
గఠినదంతవజ్రంబుల ♦ ఖండఖండ,ములుగఁ జేసె నన్నిటి సురల్ ♦ ముదము నొంద. 27

క. నిజదంష్ట్రామర్శనమున, భుజగసమూహములవిషము ♦ పొలియఁగ నకుల
వ్రజ మప్రతిహతగతియై, యజరులు మెచ్చ విహరించె ♦ నహులఁ దునుముచున్.

గీ. కనకవర్ణముల్ నిక్కు ను♦కర్ణయుగము
నూర్ధ్వవాలముల్ హృష్టరో♦మోత్కరములు
వ్యాత్తముఖములు గల్గి క్రో♦ధాంధవృత్తి
నకులములు దందశూకజా♦లకముఁ దునిమె. 29

క. ఒకమాయాసర్పమునకు, నొకనకులము గాఁగ నిట్టు ♦ లుద్భవ మై యా
నకులప్రకరము లాసర్పకులంబులఁ దీక్ష్ణదశన♦పంక్తిన్ ద్రుంచెన్. 30

చ. చిలువలమీఁద నిట్లుఱికి ♦ చిందఱవందఱ గాఁగఁ దున్మచున్
సెలవుల జాఱునెత్తురులు ♦ జిహ్వలు వేమఱుఁ జాఁపి నాకుచున్
బలుమొన లూఁదిపట్టునెడఁ ♦ బాములు గ్రుక్కి తముం బెనంగఁగాఁ
గలనఁ జరించె నన్నకుల♦కాండము లద్దనుజుల్ భయంపడన్. 31

. ముంగులకోఱలు దగిలి భు,జంగఫణాచ్యుతము లైన ♦ సన్మణిగణముల్
సంగరమునఁ దత్కోపపు,టింగలమునఁ బుట్టుశిఖల ♦ యేడ్తెఱ మెఱసెన్. 32

వ. ఇటు తనమేనఁ బుట్టినయ ♦ హిపరికరంబులు బభ్రుదంష్ట్రికా
త్రుటితము లైనఁ జూచి యతి ♦ దుష్టమనస్క దురాగ్రహాగ్రహో
త్కటదురితాలవాలము వృ ♦ థామద సర్పిణి కోపసంచల
త్కటవతి యై పయిన్ గవియఁ ♦ గా నకులేశ్వరి బిట్టదల్చుచున్. 33

క. ఆసర్పిణితోఁ గూడ మ,హాసంగ్రామంబుచేసి ♦ యంతట నరిసం
త్రాసక మగుగరుడాస్త్రము, భాసురముగ వింటఁ దొడిగి ♦ పటుగతి నేయన్. 34

క. ఆగారుడాస్త్ర మెంతయు, వేగంబున దానిమేన్ బ్ర ♦ వేశించి తదీ
యాగోనిదాన మగుమా,యాగరిమము నడఁచె దాన ♦ నదియు నడంగెన్. 35

వ. ఇట్లు గారుడాస్త్రకృతం బైనసర్పశాంబరీనాశంబున సర్పిణియును నాశంబునొందు
టయుఁ గరంకప్రభృతు లైనపంచసేనాధిపతు లెద్దానిబలంబువలనం బూర్వంబున
నింద్రాదిదేవతల నశ్రమంబున నోడించి రట్టిసర్పిణి యానకులీశ్వరిమహానుభావంబు
వలనఁ గథామాత్రావశేషిత యైన దాన నత్యంతక్రోధంబున నేకోద్యోగంబున
నద్దేవిపై ననేకాస్త్రశస్త్రంబులు వర్షించిన వారలం దా నొక్కతి యయ్యు నగ్గరుడ
శతాంగ మిక్కలి యగునట్లుగా నిజహస్తలాఘవంబుఁ బ్రకటించుచు నంపవానల
ముంచిన. 36

క. అసురేంద్రులు గోపంబున, ముసలంబులు భిండివాల ♦ ములు గదలున్ బ
ట్టిసములు సహస్రసంఖ్యలు, విసువక తొరఁగించి నకుల ♦ విసరముఁ దునుమన్. 37

క. జ్వాలదగ్నిసదృశభాస్వర,విలసద్దేహములు నకుల ♦ వితతు లడరి దై
త్యులమీఁద నుఱికి కఱచెను, గులిశాతినిశాతదంత ♦ కోటిన్ సూటిన్. 38

సీ. ప్రసభంబుగా మింటి ♦ పై నుండి యుఱికి కొం,దఱు రక్కసులమెడ ♦ లఱచి కఱచి
కొందఱికర్ణముల్ ♦ కొందఱినాసికల్, కొందఱిమర్మముల్ ♦ గొఱికి కొఱికి
కొందఱివివృతాస్య ♦ గుహఁ దూఱి ఫణితుల్య,జిహ్వికల్ నలి గాఁగ ♦ జిదిమి చిదిమి
కొందఱిశీర్షంబు ♦ లందు వెన్నులయందు, శీఘ్రదంతక్షతుల్ ♦ చేసి చేసి

గీ. ఘోరసీత్కారకారులై ♦ కొందఱిపయి, మించి తద్వర్మములు బిట్టు ♦ చించి చించి
నకులనికరంబు లిట్లు దై ♦ త్యకులనాశ, మడరి కావించుచుండె స ♦ త్యద్భుతముగ. 39

వ. మఱియు నన్నకులంబులలోన. 40

సీ. కొన్ని యవుడు దైత్యులముఖ ♦ గుహలఁ గొన్ని
యమరరిపులకర్ణంబుల ♦ యందుఁ గొన్ని

యస్రపులఘ్రాణములయందు ♦ నధికసూక్ష్మ
రూపములఁ జొచ్చి వారల ♦ రూపుమాపె. 41

శా. ఈరీతిన్ నకులాభిఘాతముల న♦య్యుగ్రారిబృందంబు దా
నూరుం బేరును లేక పోవఁ గని య♦త్యుగ్రకృధాన్వితు లై
యారాత్రించరసైన్యనాథులు భుజా♦హంకార మేపారఁగాఁ
గ్రూరానేకశిలీముఖాహతుల బ♦భ్రుశ్రేణుల నొంచినన్. 42

క. అతిసత్త్వులు లఘుహస్తులు, నతిసాహసు లైనయట్టి♦యాదైత్యచమూ
పతులు నిగిడించుబాణ,ప్రతతుల నకులములు గతిన♦రదనాగ్రములన్. 43

క. కిటకిటనాదం బత్యు,త్కట మయి మ్రోయఁగ ననేక♦ఖండములుగ ను
ద్భటలీలఁ ద్రుంచివైచెన్, జటులక్రోధమున నురలు ♦ సంతోషింపన్. 44

గీ. తచ్చమూనాథపంచక♦దారుణాస్త్ర,బహుసహస్రవిఖండన♦ప్రథితనకుల
కోటిశతకోటిసన్నిభ♦క్రూరదంత,జాతుడై జాతవేదుఁ ♦డుజ్జ్వలతఁ దనరె. 45

మ. తమబాణంబులు బభ్రుదంతహతిచే♦త వ్యర్థమ్ములై యిట్లు పో
వ మహాక్రోధవిఘూర్ణమాను లయి దే♦వద్వేషిసేనాగ్రిముల్
సుమహాదర్పముతోడ దారుణశర♦స్తోమంబు వర్షించి దు
ర్దమవృత్తిన్ నకులంబులన్ బహుభయా♦ర్తత్వంబు నొందించినన్. 46

క. సురరిపుశరహతి మేనుల్, విరవిరఁబోవంగ నకుల♦విసరములు భయా
తురగతిఁ జని యన్నకులీ,శ్వరిఁ బరివేష్టించె నపుడు ♦ సంభ్రాంతమతిన్. 47

క. కకపిక లై తనుఁ జేరిన,నకులంబుల వాజ్మ్రయైక♦నాయిక యగునా
నకులీశ్వరి గనుఁగొని స,భ్రుకుటీబంధముగ రోష♦రూక్షేక్షణ యై. 48

గీ. క్రించుల వధింపఁ గోరి య♦క్షీణనకుల, మనఁగ విఖ్యాత మైనమ♦హాస్త్ర మపుడు
వింట సంధించి యేయ న♦వ్విశిఖమునన, వెడలె బహుకోటినకులముల్ ♦ విస్మయముగ.

మత్తకోకిల. వజ్రసన్నిభకర్కశాంగులు ♦ వజ్రతుల్యతనూరుహుల్
వజ్రదంతులు వజ్రవేగులు ♦ వజ్రసారసమున్నతుల్
వజ్రవాలభయంకరుల్ సిత♦వజ్రరూపనఖాంచితుల్
వజ్రరత్ననికాశనేత్రు ల♦వార్య లన్నకులోత్తముల్. 50

వ. ఇట్లుదయించి యన్నకులంబులు మహోద్ధతిం గడంగి. 51

క. పిడుగులకరణి సురారుల,దడములపై కుఱికి తీక్ష్ణ♦దశనాగ్రములన్
గడిమి బహుదానవులఁ బొడ,వడఁ జెన్ సీత్కారనాద ♦ మధికతరముగన్. 52

క. ఈరీతి శతాక్షౌహిణు, లా రాక్షసబలము నామ♦మడఁగినపిదపన్
దా రేవురు శేషించి మ,హారోషవిఘూర్ణితాంత♦రంగంబులతోన్. 53

క. రాక్షససేనాధిపు లతి, దక్షులు సంగ్రామ మధిక♦దర్పము మీఱన్
బక్షివరవాహతో న,స్పృక్షతఁ గావించి రస్త్ర♦దీప్తు లడరఁగన్. 54

చ. అతిజవతార్క్ష్యవాహనస♦మంచితచిత్రగతిప్రచారవి
శ్రుత యయి దైత్యబాణములు ♦ ద్రుంచుచు వారి నడంచుచున్ సము
ద్ధతగతిఁ బట్టిసంబుఁ గొని ♦ దారుణచేష్టితుఁ డౌకరంకుఁ డన్
దితిజునికంఠమున్ దునిమె ♦ ధీరత నన్నకులేశి యీసునన్. 55

వ. ఇవ్విధంబున విక్రమించి యంతలోన. 56

మ. అతిశౌర్యాంబుధి యైనయన్నకులి యు♦ద్యత్క్రోధరక్తాస్య యై
శితధారం బగుచంద్రహాసము వెసన్ ♦ జేపట్టి యక్కాకవా
సితముఖ్యాసురవాహినీశ్వరచతు♦ష్కంబు లాశ్చర్యవి
శ్రుతబాహాబలదుర్నివార యగుచున్ ♦ ద్రుంచెన్ సుర ల్మెచ్చఁగన్. 57

వ. ఇట్లు తత్క్షణమాత్రంబున నకులీశ్వరి కరంకకాకవాసితవజ్రదంతవజ్రముఖవజ్రలోమ నామధేయు లగురాక్షసగణాధ్యక్షుల నక్షీణజవంబునం దునిమినఁ దదీయహస్త లాఘవంబు గనుంగొని యత్యంతసంతోషితస్వాంత యై శ్యామలాంబిక మెచ్చి దుష్టాసురవినాశినియు మహాసత్త్వయు నగునద్దేవికి నిజాంగదేవతాత్వం బొసంగి బహుమానంబుచేసె నది యట్టిద కాదె లోకంబున లోకోత్కృష్టం బైనగు ణంబు ప్రస్ఫుటం బైనచో నెవ్వరైనను సంతోషింప కుందురే యది యట్లుండె నంత హతశేషు లధికభయంబున నానాముఖంబులఁ బఱచి శూన్యకపురంబుఁ బ్రవేశించి సమరవృత్తాంతం బంతయు భండాసురునకు విన్నవించిన నతండు ప్రచండ రోషంబున నిశ్వాసంబులు నిగుడ నాయోధనేచ్ఛావ్యాకులం బై నయంతరంగం బుతోడఁ దనసమీపంబున వినయనిభృతుం డై నిలిచినకుటిలాక్షుం జూచి యి ట్లనియె. 58

గీ. భద్ర నీయట్టివాహినీ♦పతి గలుగఁగఁ, ద్రిదశవైరుల కిట్టియా♦పదలు వచ్చె
స్త్రీలచే మద్వరూథినీ♦పాలు రైన,దుర్మదాదులు పలువురు ♦ దూలి రాజి. 59

సీ. సర్పిణీమాయచే ♦ సర్వగీర్వాణుల,మద మడంచినయట్టి♦మహితశౌర్య
లాకరంకాదిమ♦హాచమూనాయకుల్, క్రూరస్వభావయు ♦ గూఢమాయ
యును బాపకర్మిణి♦యును దుష్టయును నగు,నొక్కబోటిచే సమ♦రోర్విఁ బడిరి
కావున నన దని ♦ భావింపఁగా రాదు, భూరిదోస్సారులై ♦ పొలుపుమిగులు

గీ. నావలాహకముఖ్యసేనాధిపతుల, నమితమాయావిచక్షణు లైనవారిఁ
కీకసాగర్భజాతులై కీర్తిగన్న,వారి నేవ్వరిఁ బనుపంగ వలయు ననికి. 60

క. రాక్షసబలముల మున్నూ,ఱక్షౌహిణులం దదీయ మగుసాహాయ్యం
బక్షీణధృతి నొసర్పఁగ, నీక్షణమునఁ బనుపవలయు నిద్ధచరిత్రా. 61

గీ. మును పరాజయ మెన్నఁడుఁ గనినవారు, గారు దేవదైత్యాదినగరములందు
నట్లు గావున శక్తిసైన్యములఁ దుంచి, భూరివిజయులై యిచటి కేతేరఁ గలరు. 62

క. వారలవిజయమునకు మది, నారసి చూడంగ సందియము గలుగదు బృం
దారకుల గెల్చువారికి, నారు లనఁగ నెంత సద్గుణ స్తవనీయా. 63

వ. అని భండాసురుండు యాజ్ఞాపించినఁ గుటిలాక్షుం డప్పుడ వారి రావించినం జటులవిక్రమధురీణులును బహులమాయోపాయప్రయోగపారీణులును నాభీలచతురంగబలసముద్భటులును భుజాబలమదోత్కటులును నగువలాహకసూచీముఖఫాలముఖవికర్ణవికటాననకరాళాక్షకరటకు లనునేవ్వురుదానవశ్రేష్ఠులు రయంబున నచ్చటికి నరుగుదెంచి యారాక్షసేశ్వరునకు నమస్కరించి తదాజ్ఞప్తకుటిలాక్షసంప్రేషితులై యుద్ధకౌతూహలవ్యగ్రాయమానమానసులై పురంబు వెడలి యరుగునవసరంబున నత్యంతసౌభ్రాత్రమహితులు నన్యోన్యసాహాయ్యసహితులు విజయలోలురు వీర్యశాలులు నగునక్కీకసానందనులం బరివేష్టించి త్రిశతాక్షౌహిణీపరిమితం బైనదనుజబలంబు మహోత్సాహంబున నడచె నప్పుడు మహాన్నత్యంబున నభోగతకేతుమండలంబు నారయు కేతుమండలంబును బరివీతసముద్రవ్రాతంబు లగుత్రిశ్చతచతుర్విధవాహినీపదాఘాతసంజాతభూరజస్సంఘాతంబులును విశ్వంబు నెల్ల శబ్దమయంబుగాఁ జేయుభేరీనిస్సాణతంపోటపణవానకాదితూర్యనాదంబులును మిక్కిలియై ప్రవర్తిల్లె నిట్లు సబలంబుగా నద్దానవనాథు లేవ్వురు క్రోధారుణముఖులును మార్తాండమండలసముద్దీప్తకవచులును బ్రద్యోతితశస్త్రాస్త్రసముదయులును బ్రదీప్తాభరణులును సందీప్యమానోర్ధ్వకేశలును బ్రస్ఫురత్తేజస్కులు నగుచు సమరంబునకుం జని పూర్వంబున భండాసురప్రేషితులై యాసప్తరాత్రించరులు సమస్తలోకంబులు జయించి వచ్చినవారు గావున తత్పరాక్రమంబు నమ్మి యద్దానవేంద్రుండు వనుపఁ దామును లలితాసైన్యంబు జయింపంగల మనుదుర్బుద్ధి వొడమి శక్తిసేనల కభిముఖంబుగా సముజ్జ్వలశస్త్రపాణులై సక్రోధంబుగాఁ గలకలారావంబుల దశదిశలు పూరించుచు నడచి రిట్లు వచ్చునసురబలంబుం జూచి దేవీబలంబులు బద్ధభ్రుకుటీభీషణంబులై సన్నద్ధంబు లగుచుం బాణంబులు ముసలంబులు చక్రంబులు ముద్గరంబులు పట్టి

సంబులు కోదండంబులు గదలు పరశువులు భిండివాలంబులు తోమరంబులు సంకుశంబులు మఱియు బహువిధంబు లైన నానాయుధంబులు గొని యారక్కసిమూఁకలం దలపడియె నవ్వం డగుల్యా... లు మదోద్రేకంబున శక్తులం గనుంగొని వారల సరకుసేయక పరుషాక్షరం... ని ట్లనిరి. 64

క. వనితాధములార వెసన్, జనుదెం డిచ్చటికి మిమ్ముఁ ♦ జననెత్తుమె పె
ల్చనఁ జంపక జలనిధిలో, మునిఁగిన మఱి మింటి కెగసి ♦ పోయిన నైనన్. 65

గీ. తుచ్ఛమాయలు వన్ని యుద్ధురత మీఱు, మూఢబుద్ధులఁ గొందఱ ♦ మోసపుచ్చి
యుదియె విజయం బటంచును ♦ ముదము నొంది, విఱ్ఱవీఁగెద రిప్పు డో ♦ వెలఁదులార.

క. కాలవ్యాళసదృశశర, జాలంబుల నిపుడ మిమ్ముఁ ♦ జక్కాడి కృతాం
తాలయమునకున్ బనిచెద, మాలంబునఁ ద్రుళ్లి యాడుఁ ♦ డందాఁక వెసన్. 67

క. అని శక్తుల భర్జింపుచు, దనుజులు శరవృష్టి ముంపఁ ♦ దరలక వారున్
సునిశితశరములఁ గప్పిరి, ఘనబలు లగుదైత్యవరుల ♦ గాఢరయమునన్. 68

ఉ. ఒక్కసురాహితుండు గడు ♦ నుక్కున నొక్కనెలంతతోఁ బతన్
స్రుక్కక పోరుచుండ నతి ♦ శూరత నయ్యువతీలలామయున్
గ్రక్కునఁ బట్టిసంబు గొని ♦ రాక్షసుకంఠముఁ ద్రుంపఁ జిల్లునం
దక్కక లేచెఁ దదుధిర ♦ ధార మహోగ్రముగాఁగ మింటికిన్. 69

క. ఆరక్తధారఁ గ్రోలఁగ, దారుణతరగృధ్రనమితి ♦ తదుపరిగత మై
చారుతరమండలాకృతి, నై రవిజునియాతపత్ర ♦ మనఁ గడు నొప్పెన్. 70

మ. ఒకపద్మేక్షణమీఁద నొక్కదనుజుం ♦ డుత్సాహి యై శక్తినా
మకఘోరాయుధ ముద్ధతిం బఱప న ♦ మ్మాతంగకుంభోపమా
నకఠోరస్తని వింట నొక్కశరమున్ ♦ సంధించి యత్యుద్ధతిన్
సకలామర్త్యులు సంస్తుతింపఁ దునిమెన్ ♦ దచ్ఛక్తి నద్దైత్యునిన్. 71

మ. అరవిందానన యోర్తు భీషణగజేం ♦ ద్రారూఢ యై యొక్కయు
ద్ధురదైత్యేంద్రునితోడ సంగరము నెం ♦ తో వింతగా సల్పుచున్
సుర లాశ్చర్యము నొందఁ దత్కరినవ ♦ క్ష్వేడి నాజిక్రియా
పరతంత్రాత్మమదావళంబునకు వ ♦ ప్రక్రీడ నేర్పెన్ దగన్. 72

ఉ. తుంగమతంగజంబు నొక ♦ దుష్టనిశాచరుఁ డెక్కి యొక్కమా
తంగమనోజ్ఞయాన నతి ♦ దారుణసాయకవృష్టి ముంప న
య్యంగన యల్గి తద్గజము ♦ హత్తరకుంభయుగంబు ఖడ్గధా
రం గడిమిం బగిల్చెఁ దద ♦ రాతినిజస్తనహర్ష దాయి యై. 73

ఉ. అంచితశౌర్య యైనయొక♦యండజయాన నెదిర్చి యొక్క రా
త్రించరుఁ డంపవాన యతి♦తీవ్రముగాఁ దొరఁగింప నల్గి యా
చంచలనేత్ర వానిఘన♦చాపము చక్రహతిన్ సగంబుగాఁ
ద్రుంచి ఘటింపఁజేసెఁ దన♦భ్రూయుగళంబునకున్ బ్రమోదమున్. 74

మ. ఒకనక్తంచరకుంజరుండు పటుశౌ♦ర్యోత్సాహుఁడై శాతదీ
ప్తకృపాణోద్యతహస్తుఁడై కడు వడిం ♦ దర్పించి యేతేరఁగా
నొకశాతోదరి వానిఖడ్గము రయం ♦ బొప్పం గఠోరోగ్రసా
యకజాలంబునఁ ద్రుంచి కూల్చెఁ బ్రమదం ♦ బాత్మీయరోమాళికిన్. 75

గీ. రామ యొక్కతె పటుముద్గ♦రమున నొక్క, దానవునిరథచక్ర ము♦ద్ధతిఁ బగిల్చి
భవ్యశృంగారరూపవి♦భాసుర మగు,తననితంబంబునకుఁ బ్రమో♦దం బొనర్చె. 76

గీ. చంచలాక్షి యొక్కతె ఘన♦శాతఖడ్గ
ధార నొక్కదుష్టాసుర♦వీరునిరథ
కూబరముఁ ద్రుంచి ముదము గీ♦ల్కొనఁగఁ జేసె
జిగిఁ బిసాళించుతనయూరు♦యుగళమునకు. 77

గీ. ఒక్కబింబాధరి గడంగి ♦యొక్కదనుజుఁ, డేయునారాచములు ద్రుంచి ♦యింపొనర్చె
మారునారాచములకును ♦ మాఱుమసలి, యేపు దీపించుతనవాలుఁ♦జూపులకును. 78

వ. ఇవ్విధంబున. 79

గీ. శక్తిసైన్యంబులోన రా♦క్షసబలంబు
రాక్షసబలంబులోన వి♦క్రమసమృద్ధ
మైనశక్తిసైన్యముఁ జొచ్చి♦యతివిచిత్ర
గతుల నాయోధన మొనర్చెఁ ♦ గుతల మదుర. 80

గీ. శక్తిసంఘంబు రాక్షస♦సముదయంబు, క్షీరనీరము ల్గలసిన♦చెలువు దోఁప
నధికసమ్మర్దమునఁగ భీష♦ణాగ్రహంబు, లగుచుఁ గలసి పోరాడె న♦త్యద్భుతముగ. 81

ఆ. శక్తిఖడ్గపాత♦సంఛిన్నశుండాలి,పాణియుగళసమద♦సామజౌఘ
మధికరక్తసిక్త ♦ మగుచు మహాక్రోధ,మూర్తి యనఁగ యుద్ధ♦భూమి మెఱసె. 82

క. వీరవరులకును సాధ్వస,కారణ మయ్యుద్ధ మనినఁ ♦ గాతరులకు సం
చారంబుసేయ నలవియె, దారుణతర మైనతత్క♦దనరంగమునన్. 83

వ. ఇత్తెఱంగున నత్యంతభీషణంబును శస్త్రాస్త్రవ్యాపారదుర్గమంబును నగుసమరంబు
ప్రవర్తిల్లుసమయంబున. 84

సీ. కాలదండోపమా♦భీలజంఘాకాండ, మత్యంతచండప♦రాక్రమంబు
దీప్తమహావజ్ర♦తీక్ష్ణకృకాటికం, బంగారకుండతు♦ల్యాననంబు
భయదపక్షక్షేప♦పరిహృతమేఘంబు, లోలదతిక్రూర♦లోచనంబు
దుర్వారఘనధూమ♦ధూసరాకారంబు, నిష్ఠురాశనిఘోర♦నిస్వనంబు
గీ. కుధరసదృశంబు సంహార♦గుప్తనామ, మసురసంతోషదాయకం ♦ బైనయట్టి
గృధ్రరాజము నెక్కి యక్షీణధృతివి,శేషుఁడు వలాహకుఁడు శక్తి♦సేనఁ గలఁచె. 85

వ. ఇట్లు కైకసేయాగ్రజుండు రణదుర్మదుండై యుద్దామరభసంబున బహువిధాస్త్ర పాతంబుల శక్తిసైన్యంబు దైన్యంబు నొందించుచున్న సమయంబునఁ బూర్వంబునం దపోనిష్ఠాగరిష్ఠుం డైనయద్దానవేంద్రుండు హోమంబు సేయుచుండ నక్కుండ బున నుద్భవించి యధికబలదుర్నివారం బై సంహారగుప్తం బను పేర విఖ్యాతం బైన గృధ్రరాజంబు భండనాగ్రంబున మండలీకృతకోదండుం డై శక్తిమండలిపైఁ గుపిత కుండలీంద్రప్రచండకాండపరికాండంబులు వఱగించు నవ్వలాహకునిఁ దనవీఁపున మోచుచు నంబరంబున లఘుచిత్రసంచారంబులు సేయుచు దారుణనిస్వనంబులును క్రోశార్ధపరిమితవ్యాయామంబులు నైననిజపక్షంబులు విప్పి యంగారకుండసదృశం బుగాఁ దనముఖంబు వివృతంబు చేసి శత్రుసేనల భక్షించుచు నక్షీణజవంబున విక్రమించుచుండె నప్పుడు. 86

సీ. ప్రబలపక్షద్వయ♦పర్వతసదృశ మై, తేజరిల్లెడుగృధ్ర♦రాజ మెక్కి
పాకశాసనచాప♦భాసురమణిహేమ,సుమహితధనువు హ♦స్తమునఁ దాల్చి
శింజినీటంకార♦సింహనాదంబులు, గర్జితస్వనముల♦కరణి మోయ
సజలనీలాంబుద♦శ్యామలతనుకాంతి, దిక్కులఁ జీకట్లు ♦ పిక్కటిలఁగ
గీ. భూషణద్యుతుల్ మెఱుపుల♦పోల్కి మెఱయ, శాతబహువిధబాణవ♦ర్షములు గురిసె
బాహుబలభూషణుఁడు వ♦లాహకుండు, తనవలాహకత్వంబు సా♦ర్థకము గాఁగ. 87

వ. అయ్యవసరంబునఁ దత్సహోదరుండు. 88

సీ. అభీలకాలదం♦డాభజంఘాయుగం, బంభోధికర్దమ♦శ్యామలంబు
పుష్కలావర్తకాం♦భోదసంకాశంబు, క్రోశమాత్రాయత♦క్రూరపక్ష
మతిమత్తమహిషశృం♦గాభచంచూపుటం, బత్యంతపరుషమ♦హారవంబు
సూచ్యగ్రసదృశని♦ష్ఠురపక్షతియుతంబు, దావసన్నిభదృష్టి♦దారుణంబు
గీ. సైనధ్వాంక్షంబు నెక్కి యు♦నూనదర్ప, మడర బహువిధఘోరశ♦స్త్రాస్త్రపాత
ములఁ గలంగించె శక్తిసే♦నలఁ బ్రతాప,ఘనుఁడు సూచీముఖుండు దో♦ర్గర్వ మలర.

వ. ఇవ్విధంబున. 90

క. అనుపమవిక్రముఁ డగుచు, ద్దనుజుఁ డడరి శక్తిసైన్య♦తతి వేధించెన్
ఘనసూచీముఖనామం, బున కనురూపముగ నిశిత♦భూరిశరములన్. 91

గీ. ఆమహాసురు మోచుచు ♦ నతికఠోర, ఘోరనాదంబు రోదసీ♦పూరితముగ
సలుపుచును శక్తితతుల ని♦ఘాతచంచు, ఘాతముల నొంచె నపుడు త♦త్కాక మడరి.

వ. మఱియును. 93

ఉ. ఆలములో సమగ్రబల♦మై గిరిసన్నిభమై కఠోరమై
వాలినకంకవాహన మ♦వారణ నెక్కి దురంతశౌర్యుఁ డా
ఫాలముఖుండు ఫాల మను♦భాసురతీవ్రతరాయుధంబు నా
భీలతఁ దాల్చి యేపడఁచెఁ ♦ బేర్చినశక్తివరూధినీతతిన్. 94

వ. ఆసమయంబున. 95

క. వికటుఁ డనుదైత్యబలనా, యకుఁడు మహాబలపరాక్ర♦మాఢ్యుఁడు ఘోరం
డకవాహనుఁ డై శక్తి, ప్రకరంబులతోడఁ దొడరి ♦ బలువిడి నొంచెన్. 96

ఉ. అంచితశౌర్యుఁ డై నవిక♦టాననుఁ డన్బలితంపుజోదు రా
త్రించరసైన్యపాలనధు♦రీణుఁడు పట్టసహస్తుఁ డై వియ
త్సంచరణోగ్రమై యధిక♦సత్వరయానవిశేషవైఖరిన్
మించినతామ్రచూడము న♦మేయబలాఢ్యము నెక్కి లీలతోన్. 97

గీ. శక్తిసైన్యంబుతోడఁ బ్ర♦చండసమర, కేళి సల్పంగ నప్పు డా♦భీలదర్ప
మైనవానివాహనచర♦ణాయుధం బు, దగ్రమై పేర్చి చండ దురాగ్రహమున. 98

క. జ్వలదీక్షణమై కర్ణ, స్థలరోమము లుబ్బ శక్తి♦తతిఁ గనుఁగొనుచున్
గులగిరు లగలఁగ గర్జలు, సలుపుచుఁ గుక్కుటము పేర్చి ♦ సమర మొనర్చెన్. 99

సీ. అక్షీణధృతి కరా♦ళాక్షుఁ డన్రాక్షసా, ధ్యక్షుండు సమరవి♦చక్షణుండు
నిబిడమహావజ్ర♦నిష్ఠురఘోషుండు, ప్రకటశ్మశానమం♦త్రములఁ దొల్లి
తపముఁ గావించి త♦న్మాహాత్మ్యమున నర్థిఁ, బడసినయట్టి య♦వాఙ్ముఖంబు
దీర్ఘబాహుయుతంబు ♦ దృఢసంప్రసారిత, చరణయుగ్మము భూత♦సంవృతంబు

గీ, దుర్నివారంబు రిపుదృష్టి♦దుస్సహంబు, నైనప్రేతవాహన మెక్కి ♦ యాగ్రహమున
శక్తిసేనలఁ దనతీవ్ర♦శక్తిమహిమఁ, గొందలము నొందఁ జేసె న♦మందలీల. 100

సీ. అప్పుడు కరటకుం ♦ డనుదైత్యసేనావ, తంసుండు దొల్లి బే♦తాళమంత్ర
మునఁ బితృకాననం♦బున జపం బొనరించి, పడసిన ఘోరరూ♦పప్రదీప్త
మరిభయదంబు దృ♦ప్యత్ఫూత్కారనేత్రంబు, యోజనాయతదేహ ♦ మురుజవంబు
నైనబేతాళవా♦హనము నారోహించి, శక్తిసేనల గదా♦శక్తిచక్ర

గీ. ముద్గరప్రాసతోమర ♦ ముసలభిండి, వాలకరవాలసాయక ♦ పరశుముఖ్య
బహువిధాయుధసంగర ♦ పరిణతుఁ డయి, నొంచె రాత్రించరులవిను ♦ తించుచుండ. 101

గీ. వానివాహనబేతాళ ♦ వర్యుఁ డపుడు, వాఁడు ప్రేరేపఁగా శక్తి ♦ వాహినిపయిఁ
గదిసి చిందఱవందఱ ♦ గాఁగఁ జేసె, నానిశాచరు మోచుచు ♦ నతిబలమున. 102

వ. ఇత్తెఱంగున సప్తార్ణవోపమానులును సప్తాశ్వప్రతాపులును సప్తలోకకంటకులును నైన యాసప్తరక్షోబలాధ్యక్షులు నిర్వక్రవిక్రమంబున శక్తిసైన్యంబు దైన్యంబు నొందించుచుండిరి మఱియు నొక్కవిశేషంబు వినిపించెద. 103

శా. ఆదైత్యేంద్రులు పూర్వకాలమున మా ♦ ర్తాండు న్నది న్నిల్చియా
హ్లాదం బొప్పఁ దపం బొనర్చినఁ దదీ ♦ యానూనసద్భక్తికిన్
మోదం బంది దయాపయోధి దివిష ♦ న్ముఖ్యుండు లోకావనుం
డాదిత్యుండు ప్రసన్నచిత్తజలజుం ♦ డై వారితో ని ట్లనున్. 104

గీ. కీకసాత్మజులార య ♦ క్షీణనియమ, నిష్ఠులై మీరు చేసిన ♦ నిరతిశయత
పంబునకు నాదుమది ప్రమో ♦ దంబు నొందెఁ, గోరుఁ డిష్టంబు నే సమ ♦ కూర్తు దాని.

చ. అనుచు దయార్ద్రచిత్తుఁ డయి ♦ యాహరిదశ్వుఁడు పల్కె నంతయున్
వినయవిభూషితాంగు లయి ♦ విశ్రుతభక్తి నమస్కరించి యా
దనుజవతంసు లేడ్వురు ము ♦ దంబునఁ బ్రాంజలు లౌచుఁ బల్కి రో
యనిమిషవంద్యమానచర ♦ ణాబ్జ దివాకర మాయభీష్టమున్. 106

క. దేవరకు విన్నవించెద, మోవనరుహమిత్ర కరుణ ♦ నొసఁగుము దానిన్
మీవరదానబలంబున, దేవాదుల సరకుగొనక ♦ దీపింతు మిలన్. 107

సీ. రణములయందు మ ♦ త్ప్రతిపక్షబలము వి, జృంభించువేళ మా ♦ దృష్టులందు
నీవు ప్రవేశించి ♦ నీతీవ్రతేజంబు, చేత నస్మద్వైరి ♦ సేన లెల్లఁ
దాపమొంది నిజాయు ♦ ధంబులు విడిచి ని, శ్చేష్టితంబులు గాఁగఁ ♦ జేయవలయు
నేము చూచినమాత్ర ♦ నిత్తెఱంగున విప, క్షులు నిరాయుధు లయి ♦ సోలయుచున్న

గీ. మాకు సుకరంబు వారల ♦ మడియఁ జేత, యట్లుగావున నివ్వరం ♦ బధికకరుణ
నిమ్ము మత్ప్రార్థనము సఫ ♦ లమ్ము గాఁగ, సకలనిర్జరనుతిపాత్ర ♦ జలజమిత్ర. 108

మ. అని ప్రార్థించినకైకసేయులకు న ♦ య్యంభోజమిత్రుండు చ
య్యన దద్వాంఛిత మావరం బొసఁగి య ♦ త్యంతప్రమోదం బొన
ర్చి నిలింపార్చితుఁ డవ్విభుం డరుగ న ♦ క్షీణప్రతాపాఢ్యు లా
దనుజశ్రేష్ఠులు దద్వరప్రబలతా ♦ దర్పాంధు లై యీసునన్. 109

ఉ. ఎవ్వరిఁ జేరికింగొనక ♦ యేపున గిట్టి సురాసురాదులన్
గ్రొవ్వడఁగించి విక్రమని♦రూఢి వహించినవార లౌటచే
నవ్వర మాజిరంగమున ♦ నప్పుడు వారు దలంచినంతలో
నవ్వనజాతమిత్రుఁ డను♦రాగిపనేత్రములన్ బ్రవిష్టుఁ డై. 110

క. తనతేజస్తీవ్రత య,ద్దనుజులకుం దోఁపనీక ♦ తచ్ఛాత్రవశ
క్తినికాయములకుఁ దాపం, బొనరించె మహాద్భుతముగ ♦ నొకక్షణమాత్రన్. 111

సీ. దనుజాధిపతులు మా♦ర్తాండసమావిష్ట,నేత్రులై యాశక్తి♦నికరములను
గనుఁగొన్నయంతమా♦త్రన గ్రీష్మకాలమ,ధ్యాహ్నసూర్యులభంగి ♦ నధికతీక్ష్ణ
తేజు లౌవారలఁ ♦ దేఱిచూడఁగ నైన, శక్యంబు గాక త♦చ్ఛస్త్రచయము
లతిసత్వరముగఁ ద ♦ మ్మాక్రమించుటయు నే,మియుఁ జేయఁగా లేక ♦ మిక్కుటమగు
గీ. తాపముఁ గుంది సంస్తంభి♦తస్వకీయ,బహువిధాయుధులై యుద్ధ♦భార ముజ్జ
గించి యుత్సాహరహితలై ♦ ఖిన్నచిత్త, లగుచు శక్తులు నిల్చి ర♦త్యద్భుతముగ. 112

చ. అది సమయంబుగాఁ గొని దు♦రాత్ములు దైత్యులు శస్త్రపాణులై
కదనసముద్యమం బెడలి ♦ గర్వముమాలినశక్తిసేనలన్
మెదలఁగనీక నొంచి రతి♦నిష్ఠురమానసులై కడంకమై
ముదమునఁ దమ్ము నప్తబల♦ముఖ్యులు గన్గొనుచుండ వేడుకన్. 113

వ. ఇట్లు దైతేయనాథులు సానుచరులై విజృంభించిన శక్తిబలంబులు రణోద్యోగంబు వదలి దైన్యంబునొందుచుండ నందుఁ గొందఱు భండనోద్యమంబు గలిగియు నస్త్రశస్త్రస్తంభనంబునఁ జేయునది లేక కుపితభుజంగీసముదయంబువోలె నిట్టూర్పులు పుచ్చుచు నూరకుండి రిట్లు గాసిఁబొందినవారల నెల్ల నయ్యాతుధానులు వజ్రకంకటభేదులైనతీవ్రమార్గణంబులనొప్పించిన రక్తసిక్తాంగులై యాలతాంగులు పల్లవితలైనకంకేళిలతలపోలికఁ జూపట్టి హాహాకారంబులు సేయుచు లలితాపరమేశ్వరిశరణుఁ బొంది బహువిధంబుల నాక్రోశించిన దయానిధి యగునద్దేవి ప్రసన్నయై దీనదశాపన్న లగునయ్యన్నులయాపదఁ దొలంగించుటకు దండనాయికా ప్రత్యంగరక్షిణి యైనతిరస్కరిణికాదేవి నాజ్ఞాపించిన నమ్మహాభాగ యామహారాజ్ఞాశాసనంబు శిరంబున ధరియించి తమోలిప్తాహ్వయంబును సర్వతోముఖంబును శ్యామయుగ్యతురగంబును నైనవిమానోత్తమం బధిరోహించి మోహనాభిఖ్యంబైనయొక్కమహాకార్ముకంబు ధరియించి గుణటంకారంబుతోఁ గూడ సింహగర్జనంబులు సలుపుచుఁ గాలభుజంగసంఘంబులువోనిసాయకబృందంబులు వర్షించిన వలాహకప్రముఖులు తదీయబాణవర్షపీడితులై మహాక్రోధంబు నొంది పరాక్రమింప

ముద్యోగించునవసరంబున నాతిరస్కరిణీదేవి దండనాథానిర్దేశంబున నందాభిధానం
బైనయొక్కమహాస్త్రంబు వింట సంధించి యావిరోధులపైఁ బ్రయోగించిన దివా
కరవరగర్వితు లగుకైకసేయు లేమ్వురు నమ్మహాస్త్రంబున నాచ్ఛాదితనేత్రులై
యంధు లైనకారణంబున శత్రులకు నస్త్రశస్త్రస్తంభనంబు లేక యెప్పటియట్ల రణో
త్సాహం బుదయించుటయు వారలు సింహనాదంబు లొనర్చుచు నాయుధపాణులై
దనుజబలంబులం గీటడంపఁ దొడంగి యాతిరస్కరిణీదేవిం బురస్కరించుకొని దారు
ణరోషంబున దానవులతోఁ సంగరంబు సలుపుచు సదుపాయప్రసంగంబున నయ్యం
బం గనుంగొని యోమహాభాగ తిరస్కరిణికాదేవి యీదురాత్ము లగువలాహకాది
నిశాచరసేనానాయకులనేత్రంబులకుఁ దిరస్కారంబు గావించి మాకు మిక్కిలి మేలు
చేసితివి దుర్జనలోచనంబులకుఁ దిరస్కారమహౌషధివి నీవ కావె యివ్విధంబున
మార్తాండవరప్రాబల్యదర్పితు లైనవీరలదృష్టి యనాయాసంబునఁ బ్రతిబంధించి దేవ
కార్యంబు లెస్సగా నిర్వహించితివి మాబోఁటులకు దుర్జయు లైనయీదుష్టదైతే
యుల నిట్టివ్యసనంబు నొందింప నీవు దప్ప నితరుల కలవి యగునె కావునఁ ద్రిభువన
కంటకు లగునీఖలుల నిప్పుడ నీవు సంహరించినవార్త విని త్రిలోకేశ్వరి యైనలలితా
పరమేశ్వరియు మహాభాగ యైనమంత్రినాయికయుఁ జండపరాక్రమ యైనదండినీ
దేవియుఁ బరమసంతోషతరంగితాంతరంగలు కాఁగల రట్టు లగుట నాలస్యం బేల
యీసప్తరక్షోబలాధ్యక్షుల నీవు నిర్దయంబుగా నక్రమంబున మర్దింపుము వీరలసకల
సైన్యంబుల నస్మదీయంబు లైనమహాస్త్రశస్త్రంబులయతినిష్ఠురప్రహారంబుల నా
శంబు నొందింప మేమె చాలుదు మని యిట్లు బహుప్రకారంబులఁ దన్నుం బ్రేరేచు
చున్నశక్తిసముదాయంబులప్రార్థనావచనంబు విని యమ్మహాప్రాజ్ఞ యుద్ధకౌతుకం
బున మనంబు తొంగలింపఁ దమోలిప్తవిమానయానంబున వలాహకాదుల నిగ్ర
హింపం దలంచి వలాహకాంతరగతయై యతిచిత్రపరాక్రమంబునం బేర్చి యప్పుడు.

ఉ. తనదివ్యాస్త్రమహాప్రభావమునఁ గ్రోధవ్యాప్తిచేఁ గన్నులం
గనఁగా లేనిఖలు న్వలాహకుఁ గచాకర్షంబు గావించి ఘో
రనిశాతాద్భుతమండలాగ్రపటుధారన్ ద్రుంచెఁ దచ్ఛీర్షముల్
దనుజానీకములెల్ల భీతిఁ బఱవన్ శక్తు ల్మదం బందఁగన్. 115

వ. మఱియును. 116

క. వానికి వాహన మై పెం,పూనినగృధ్రముశిరంబు నొకశరమున బల్
పూనికఁ దెగివడ నేసి మ,హానైపుణ్యమున మెఱసె నమరులు మెచ్చన్. 117

వ. ఇట్లు సంహారగుప్తనామధేయం బైనగృధ్రరాజవాహనంబుతోఁ గూడఁ గైకసేయ
పూర్వజునిఁ బరేతనాథమందిరంబునకు నతిథిం జేసి యయ్యంతర్ధానదేవత యతిరయం
బునఁ దదనుజుం డైనసూచీముఖాఖ్యదనుజున కభిముఖి యై యాగ్రహంబున. 118

గీ. అతిభయానకనిజపట్టసాయుధాభిఘాతమున వానియుత్తమాంగంబుఁ ద్రుంచెఁ
దదుదుహస్తలాఘవమహత్త్వంబు చూచి, శక్తిబలము లుప్పొంగ రాక్షసులు దలఁక.

వ. మఱియు నంత నిలువక. 120

మ. అమిత్రప్రాభవ యాతిరస్కరిణి పంచాస్త్రంబు లొక్కుమ్మడిన్
విమతుల్ భీతిలఁగా ధనుర్గుణమున న్వేగంబ సంధించి భా
లముఖాద్యాసురపంచకంబుశిరముల్ జక్కాడఁ జిత్రంబుగా
నమరేంద్రు ల్దనవిక్రమంబునకు నాహా యంచు హర్షించఁగన్. 121

సీ. ఇటు చేసి యద్దేవి యేడ్వురరాక్షససేనాధినాథులశిరము లోలి
నొండొంటితోఁ గూడి యుండఁ దత్కేశసంగ్రథనంబు గావించి కమ్ముదమునఁ
దచ్ఛిరోమాలికఁ దనకంఠమున వినోదంబుగాఁ దాల్చి నృత్తంబు చేసె
నంత శక్తిసమూహ మతిశయక్రోధాంతరంగమై దనుజసైన్యములమీఁదఁ

గీ. గవిసి బహువిధశస్త్రాస్త్రనివహపటిమ, నుఱిపి నెత్తురుటేఱులు వఱపి చూప
ఱకు మహాద్భుత మొనరించి సకలదేవసమితి ముదమునఁ దేల్చె నుత్సాహలీల.

వ. ఇత్తెఱంగున వైరిసంహారకార్యం బతిప్రహర్యంబుగా నిర్వర్తించిన సంతోషతరంగితని
జాంతరంగులై వార లందఱు నాతిరస్కరిణికాదేవి చేసినవలాహకాదిరాక్షససేనా
నాయకసమస్తదృష్టినిరోధంబు వాక్రుచ్చి యద్దేవిం గొనియాడిరి విశేషించి దండ
నాయిక యమ్మహామాయ ననేకప్రకారంబుల మాటిమాటికిఁ బ్రశంసింపుచుఁ బ్రసా
దమంథరంబు లైననిజవిలోకనంబు లమ్మహానుభావమోమునందు నిలిపి సంతసించెఁ
దక్కినశక్తులు తత్పరాక్రమంబునకు శిరఃకంపంబు సేయుచుఁ బ్రతిపదంబును సాధు
వాదంబుల నయ్యంబ నభినందింపుచు నుల్లసిల్లి రంత హతావశిష్టు లైననక్తంచ
రులు బహుభయభ్రాంతులై యాక్రందించుచు నతిరయంబునఁ బఱచి శూన్యకపు
రాధీశ్వరుం డైనభండాసురేశ్వరుశరణువొంది గద్గదస్వరంబులతో నతనికి సమరవృ
త్తాంతంబును వలాహకాదిసప్తసేనానాయకనిధనంబును సమస్తంబును విన్నవించి రని
చెప్పి హయగ్రీవుండు వెండియు నగస్త్యమహామునీంద్రున కిట్లనియె. 123

క. చండతపోబలమున మార్తాండు న్మెప్పించినట్టిదైత్యవరేణ్యుల్
భండనభూమిఁ బడుట విని, భండమహాసురుఁడు క్రోధపరవశుఁ డగుచున్. 124

గీ. భ్రుకుటిభీషణతర మయి ♦ ముఖము మెఱయఁ, జటులనిశ్వాసతత్కాలభు♦జంగవిభుని
భంగి దీర్ఘోష్ణనిశ్వాస♦భాసి యగుచుఁ, గన్నుఁగవనగ్నికణములు ♦ గడలుకొనఁగ. 125

క. దనుజవిభుఁడు మంత్రాలో,చనతత్పరుఁ డగుచుఁ దనదు♦సహజన్ముల స
త్యనుపమచండపరాక్రమ,ధనులన్ సేనాధిపతులఁ ♦ దగ రాఁ బనిచెన్. 126

వ. ఇవ్విధంబున సద్దానవేంద్రుండు ప్రియసహోదరు లైనవిశుక్రవిషంగులను గుటిలాక్షాదు లైనబలాధ్యక్షులను దోడ్తేరఁ బడవాళ్ళం బంచిన. 127

గీ. చండశౌండీర్యుఁ డైనయా♦భండదైత్యు,శాసనంబున వచ్చిరి ♦ సమరకరణ
కుతుకమున విశుక్రుఁడు విషం♦గుండు సత్వ,రముగ సగ్రజాముదివికా♦సమునఁ బొదల.

క. వెండియుఁ దదాజ్ఞ వచ్చి ర,ఖండపరాక్రములు సమర♦కర్కశులు జితా
ఖండలులు క్రూరమతులు ప్ర,చండులు కుటిలాక్షముఖ్య♦సైన్యవరేణ్యుల్. 129

సీ. వచ్చి యేకాంతని♦వాసంబునందు మం,త్రాలోచనోత్కంఠుఁ ♦ డైనదనుజ
భర్తపాదములకుఁ ♦ బ్రణమిల్లి ముకుళితాం,జలు లయి తనమ్రోల ♦ నిలిచియున్న
ప్రకటశౌర్యుని యువ♦రాజువిశుక్రుని, సమరమాయోపాయ♦చతురుఁ డైన
యవ్విషంగునిఁ గుటి♦లాక్షాదు లగుపర,మాప్తు లౌమంత్రుల ♦ నాదరమునఁ

గీ. జూచి విజయవాంఛయు రోష♦శోకములును, దనమనంబున ముప్పిరి♦గొనఁగ శక్తి
కృతపరాభవదైన్య ముద్రేక మంద, దనుజకులసార్వభౌముఁ డి♦ట్లనుచుఁ బలికె.

ఆ. ఇంతవట్టు వాహి♦నీశ్వరుల్ ప్రఖ్యాత,బలులు గలుగ నొక్క♦లలనచేత
నావహిల్లె నిట్టి♦యనివార్య మగుమహా,ప్రళయ మఖిలదైత్య♦కులములకును. 131

క. మానసమునఁ దలపోసిన, దీనికిఁ గారణము విధికృ♦తియ తదితరముల్
గానఁబడ దేమియును నిపు, డో నక్తంచారులార ♦ యుర్వరలోనన్. 132

ఆ. జగదధీశ్వరుండు ♦ భగవంతుఁ డగువిధి, యిపు డుపేక్ష సేయ ♦ నింక మనల
పౌరుషంబు లెట్లు ♦ ఫలియించు దానవ,వీరులార యేల ♦ వెఱఁగుపడఁగ. 133

సీ. మామకభృత్యనా♦మము చెవి సోఁకిన,యపుడ పలాయితు ♦ లౌదు రఖిల
నిర్జరోత్తము లిట్టి♦దుర్జయులకు మన, కీపరాజయదైన్య ♦ మీసమయము
నం దాగతం బయ్యె ♦ సుందరీజనముల,వలన నింతకు వింత ♦ గలదె యెందు
నఖిలలోకారాధ్య ♦ మగుమదీయభుజాబ,లమునకు నొక్క దు♦ర్లలన యెదురె

గీ. చండబలుఁ డైనవిధిచే న♦కాండపాతి,తం బగుమహాశనియుఁబోలె ♦ దానవకుల
నాశనము సేయ నయ్యేల♦నాఁగ యిటకు, వచ్చె విధియాజ్ఞ దాఁట నె♦వ్వరితరంబు.

వ. అదిగావున విధి యఘటితఘటనానిర్వాహకుం డె ట్లనిన. 135

సీ. అతిశౌర్యవంతు న•త్యంతభీరునిఁ జేయు, భీరునిఁ బటుబల•శూరుఁ జేయు
ధనవంతు మిక్కిలి • ధనహీనుఁగాఁ జేయు, నతిదరిద్రుని విభ•వాఢ్యుఁ జేయు
మతిమంతు నమితము•ర్మతియుతుఁగాఁ జేయు, బుద్ధిహీనుని సుప్ర•బుద్ధుఁ జేయు
భాగ్యసంపన్ను ని•ర్భాగ్యునిఁగాఁ జేయు, భాగ్యహీనుని మహా•భాగ్యుఁ జేయుఁ
గీ. ప్రబలు బలహీను దుర్బలుఁ • బ్రబలుఁ జేయు, నధికజీవి నల్పాయుష్కు • నల్పజీవి
ఘనతరాయుష్కుఁగాఁజేయుఁ•గలదెయెందు, విధి కసాధ్యంబు దానవ•వీరులార. 136
గీ. సర్విణీమాయచేత దు•స్సాధ్యదర్పవిభవులై సర్వగీర్వాణ•విభుల నాజి
గెలిచినకరంకముఖు లొక్క•లలనచేతఁ, గలనఁ బడి రిది విధికృతి • గాదె తలఁప. 137
మ. దివసాధీశవరప్రభావమున ను•ద్దీపించి గీర్వాణమా
నవకాకోదరముఖ్యదృష్టితతి నం•ధత్వంబు నొందించి యా
హవభూమి న్విజయంబు గాంచినభుజా•హంకారు లాకీకసో
ద్భవు లాజిక్షితిఁ గూలి రయ్యబలచే•తన్ విధ్యపేక్షం గదా. 138
గీ. ఇట్టు లమ్మాయలాఁడి తా • నేపు మిగిలి, యధికదర్పాంధనయనయై • యస్మదీయ
సర్వరాక్షసబలముల • సంహరించె,నేని మద్దోర్బలము గాల్ప•నే కటకట. 139
గీ. ఈప్రసంగంబు వాకుర్విప్ప • నెంతయేని, సిగ్గు వొడముచున్నది నాదు•చిత్తమున సు
రారివరులార కడిమి న•వ్వారిజాక్షి, మించి మత్తైన్యచయము మ•ర్దించు నొక్కొ.
క. ఇంతకు మూల మయినయ,క్కాంతం బరిమార్ప నిపుడు • ఘనయత్నము నే
నెంతయు విమర్శతో సి,ద్ధాంతము చేసితి వినుండు • దానిఁ దెలియఁగాన్. 141
క. చారులచేతం దెలిసితి, నారమణిస్థితి సమస్త • మరిసైనికదు
ర్వార యగునన్నిలంత చ,మూరాజికి వెనుకభాగ•మున నిల్చి తగన్. 142
క. కరిరథతురగపదాతి,స్ఫురితం బగుబలము తనదు•ఘోరాలి నిశాటో
త్కరములతోఁ బోరఁగ నా,హరిమధ్యమ చూచి యలరు•నఁట మదిలోనన్. 143
వ. అట్లుగావున. 144
క. ముందరిబలములతోడన్, గొందఱు రక్కసులు సమర•కోవిదచిత్తుల్
గ్రందుగఁ బోరుచు నుండఁగఁ, గొందఱుదానవులు వెనుక•కుం దిరిగి వెసన్. 145
క. అనువుగఁ బార్ష్ణిగ్రాహం, బొనరింపఁగవలయుఁ గూట•యుద్ధకుశలులై
దనుజవరులార యటు లై,న నవశ్యము వారిఁ జులుక•నం గెల్వ నగున్. 146
గీ. ఈపని యొనరింపఁగ మా,యాపాటవజితనిలింపుఁ • డై నవిషంగుం
డోపు నతఁడు దక్కఁగ మఱి, యీపురి నితరుండు గలఁడె • యెందు వెదకినన్. 147

క. క్రోధబలోన్మత్తులు బహు,సాధనసంపన్ను లసమ♦సమరవిజయులు దు
స్సాధు లయినపదివేవురు,యోధాగ్రేసరులు దనకు ♦ నొగి బాసటగన్. 148

క. వెనుకం బరివార మేమియుఁ, జనకుండఁగ వేగ నేగి ♦ సమదాత్మిక న
వ్వనితం బరిమార్చి రాఁగలఁ, డనుపమబలుఁ డగువిషంగుఁ ♦ డని పల్కి తగన్. 149

వ. ఆదానవేశ్వరుండు సాదరంబుగా విషంగు నాలోకించి నీవు పంచదశవాహినీనాయకులఁ దోడుకొని వారును నీవును నిగూఢవేషంబులతో మీసన్నాహం బేమియు బయలి కెఱుకపడనీక పార్ష్ణిగ్రాహంబునకు నరుగునప్పుడు నీవెంటఁ గడుసల్పం బైన సైన్యంబు వచ్చునని తక్కినపంచదశసేనానాయకులు సన్నద్ధులై పంచదశాక్షౌహిణీబలంబులతోఁ దరతరంబ నడువవలయు నింతకు ముందర గుప్తవేషుండ వై యరిగి మెఱుఁగు మెఱచినట్లు లల్పబలరక్షితయు దుష్టాత్మికయు నైనయన్నెలంతపై కుఱికి పరిమార్పు మిప్పని నీకు సుకరం బయ్యెలనాఁగ సకలశక్తిసేనలకు మూలం బగుటం జేసి తదీయనాశంబున సమస్తశక్తిబృందంబు నశించుటకు సందియంబు వలవదు కంఠచ్ఛేదనంబునఁ గమలినీదళసముదాయంబునకు నుపద్రవంబు పుట్టుటకు సంశయంబు గలదె యమ్మహాకార్యంబునకు సాభిజ్ఞానంబుగా నుపాయంబు దెలిపెద సకలశక్తిసేనలకును బశ్చాద్భాగంబున దశయోజనసముచ్ఛ్రాయంబును సర్వోర్ధ్వప్రస్ఫురితమహాముక్తాతపత్రపరిశోభితంబును బరిచారికాచతుష్టయకరకమలఘటితమణికంకణఝులఝులాత్కారసహితముహుర్ముహుర్వీజ్యమానచామరచతుష్కంబును మహోత్తుంగకేతనసంఘాతసముల్లిఖితవారిధరమండలంబును నైనమహాస్యందనంబున నాహవవీక్షణ వచ్చుచున్నయది యిట్టియడియాలంబులచేత నద్దురాచార యున్నయునికి దెలిసి యత్యంతనిభృతంబుగాఁ దద్రథంబుపైకి లంఘించి యమ్మానినిఁ గొప్పవట్టి తిగిచి నిర్దయంబుగా మర్దింపుము ప్రబలం బైనశక్తిసైన్యం బెల్లఁ దనముందఱ నడుచుచుండఁ దాను బరిచారికామాత్రరక్షితయై యుండుటఁ జేసి నీకు నశ్రమంబుగా సాధింపవచ్చు భవత్సహాయులై వచ్చురాక్షసేంద్రులనామధేయంబులు వినుము వివరించెద దమనకుండును దీర్ఘజిహ్వుండును హుంబేకుండును హులుముల్లుండును కల్కసుండును కల్కివాహనుండును పుల్కసుండును పుండ్రకేతుండును చండబాహుండును కుక్కురుండును జంబుకాక్షుండును జంభనుండును తీక్ష్ణశృంగుండును త్రికంటకుండును చంద్రగుప్తుండును ననఁబడునీపదియేవురుచమూనాథు లేకైకాక్షౌహిణీసహితులై నీతోడ రాఁగలవారు నీరాక శాత్రవబలంబున కెఱుకపడకుండఁ బ్రచ్ఛన్నవేషంబున నిమ్మహాకార్యంబు నిర్వహించి యసదృశం బైనప్రఖ్యాతియు ననన్యసులభం బైనజయసిద్ధియుఁ బ్రాపింపు మని నిజనిశ్చితమంత్రాలోచనప్రకా

రంబున మర్మంత్రాగ్రేసరుం డగుభండాసురుండు పిన్నతమ్మునికి నాజ్ఞయిచ్చి వీడ్కొలిపిన నయ్యువరాజానుజుండు నిజాగ్రజుపదంబులకుఁ బ్రణామంబుచేసి తత్కృతానేక బహుమతియై యచ్చటఁ గదలి రథారూఢుండై పంచదశసైన్యపాలకులతోఁగూడ శ్రీమల్లలితాదేవిపార్ష్ణిగ్రాహంబునందు దృఢాధ్యవసాయుండై యరుగుచున్నయా నిర్జరారాతికి సంతసంబుగా సూర్యుం డస్తాచలంబుమఱుఁగునకుం బోయె నిత్తెఱంగునఁ బ్రథమయుద్ధదివసం బతిక్రాంతం బగుటయుఁ భండాసురునిక్రోధం బివ్విధంబున సకలదిక్కులయందు వ్యాపించెనో యన సంధ్యారాగం బంతటఁ గలయ నెరసెఁ జక్రవాకమిథునంబులకు వియోగంబును బద్మినీజాలంబులకు ముఖసంకోచనంబును గుముదినీవనంబులకు వికాసంబును సంపాదించుచుండఁ గ్రూరాత్ము లగుదానవవీరులు దౌరాత్మ్యంబున శక్తిబలంబులతో నధర్మయుద్ధంబు సేయుటకై వెడలిరి వారలెట్లు వర్తించెదరో చూతమని వచ్చి నిల్చినదేవబృందంబువోలెఁ దారకాగణంబు నభంబునం దోఁచె నప్పుడు. 150

సీ. వనమహిషస్కంధ♦ఘనధూమసదృశమై, యంజనశైలాభ ♦ మతిశయిల్లి
నీలకంఠగళప్రి♦భాలవాలం బయి, యమునాప్రవాహశో♦భాధిక మయి
కాననభూదార♦కాయభాస్వర మయి, సజలమేఘద్యుతి♦సన్నిభ మయి
ఖంజనచయవిభా♦పుంజసదృక్షమై, సజలబలాహక♦చ్ఛాయఁ దనరి

గీ. యంధకారంబు సకలది♦గంతరాళ,పూరితం బయ్యె రక్కసుల్ ♦ మోద మంద
వారిదేహప్రభాకర♦వాలసుషమ, లాత్మసఖ్యంబు నెరప ని♦రంతరముగ. 151

వ. మఱియు నికుంజపుంజంబులందు ఘనీభవించుచుఁ దరుగుల్మాదిసంధులయందుఁ బరిధావనం బొనర్చుచు భూమివివరంబులవలన నుద్గమించుచు వసుధాధరకందరమందిరంబులవలన వెడలుచు నొక్కొక్కచోట గృహాంతరదీపప్రభాజాలంబువలన నించుక కాతరత్వంబు వహించియు విలాసినీజనకర్ణభూషణీకృతనీలోత్పలకాంతుల నూఁతగొనుచు దిగ్గజాష్టకమదకజ్జలంబుల నేకీభవింపుచుఁ బ్రస్ఫురితశాద్వలమండలంబుతో నత్యంతమైత్రి నెఱపుచు రక్షోభటగృహీతనిర్మలకౌక్షేయకప్రభలఁ బ్రియాంగనలఁ బోలె నాలింగనంబుసేయుచు సాంద్రశ్యామవనపంక్తులయందు ధూర్తజారుండువోలె గూఢప్రవేశంబు సలుపుచుఁ గ్రమక్రమంబున నితాంతబహుళంబై యంధతమసంబు రాత్రి యనుతమోభిసారిక నిజశరీరంబున ముసుంగువెట్టిననీలాంబరంబుచందంబున నందంబై రాక్షసమాయ నిత్తెఱంగున విశ్వం బెల్ల నావరించెనో యన విజృంభించుచు జారచోరులకు సంతోషజనకంబై భీరులకు భయాస్పదంబై ప్రవర్తిల్లుచుండఁ దిమిరావృతం బగుప్రపంచంబునందు సర్వజీవులకు నెద్దియేనియుఁ గాంచ నశక్యంబై

యున్నయెడ నిశాచరులకు నిశీథినియ బలావహ యగుటంజేసి మహోత్సాహంబున దమనకాదిపంచదశవాహినీశ్వరులు భండాసురప్రియసహోదరుండైన విషంగునికి సాహాయ్యంబు సేయుటకై శ్యామకంకటంబులును శ్యామోష్ణీషంబులును శ్యామపరిధానంబులును శ్యామప్రావరణంబులును ధరియించి యతినిబిడంబైన తమిస్రంబులోఁ గలసి యొరులకు నెఱుంగ నలవిగాకుండ వెడలి రప్పు డవ్విషంగుండును వారలు దన్ననుసరించి వచ్చుచుండఁ గూటయుద్ధకౌశలంబున నమ్మహేశ్వరి నిర్జింపఁగలవార మనియెడుదుర్బుద్ధి వొడమి మేఘడంబరకం బనునొక్క కవచంబు నక్షంబున ధరియించి తానును సేనానాయకులు నెత్తెఱంగువేషంబులు వహించి రత్తెఱంగున సమస్తసైన్యంబులును శ్యామకంచుకాదిగూఢచిహ్నంబులు గలిగిన వేషంబులు పూని భేరీమృదంగశంఖకాహళపణవానకాదినిర్ఘోషంబు లేమియు లేకుండునట్లుగా నెవ్వరికిఁ గానఁబడక తమతోఁగూడ నరుగుదెంచుచుండఁ దామును బశ్చిమాభిముఖంబుగా నడచుచున్నలలితాసైన్యంబు నుత్తరమార్గంబున నావరించి పూర్వభాగంబునకుఁ దిరిగివచ్చి నిశ్శబ్దంబుగాఁ బదవిన్యాసంబులు సలుపుచు నిశ్వాసంబులును మందమందంబుగా నిగుడ్చుచుఁ బార్ష్ణిగ్రాహంబునందు సావధానులై తత్తత్సేనాచిహ్నంబు లతిగూఢసాంకేతికంబుగా నొండొరులకుఁ దెలుపుచు నివ్విధంబున సర్వశక్తివాహినీపశ్చాద్భాగం బాక్రమించి కవచచ్ఛన్నవిగ్రహు లగునద్దానవులు నిపుణంబుగా నిరూపించి యచ్చట మేరుమందరసన్నిభంబును సంపూర్ణచంద్రోపమానమహాముక్తాతపత్రవిభ్రాజమానంబును నధికతేజఃప్రదీప్తశక్తివారపరివారితంబును మహోన్నతంబును నైన శ్రీచక్రరాజనామధేయమహాస్యందనంబునఁదమ సహస్రాదిత్యసంకాశయు స్మయమానముఖాంబుజయుఁ జిరతటిత్పుంజరంజితకౌసుంభవసనవిరాజమానకటీతటయు నవరత్నమయప్రదీప్తజాతరూపభూషణభూషితయు వాఙ్మానసాతీతమహాసౌందర్యనిధియు నై స్వసమానసమృద్ధి గలిగి నర్మాలాపవినోదంబులచేతఁ దన్నుం బరివేష్టించి సేవించుచున్నకామేశ్వరీప్రముఖపంచదశనిత్యలను సస్మితకరుణావలోకనంబుల సంభావింపుచుఁ బశ్చిమాభిముఖియై తనముందర నడచుమహాసైన్యంబుల సకౌతుకంబుగా నాలోకించుచున్నయమ్మహాదేవిం గనుంగొని రప్పుడు దురాశయుండైన విషంగుండు సర్వజ్ఞయైనయమ్మహారాజ్ఞిని భ్రమాదయుక్తగాఁ దలంచి యాత్మసైనికులఁ దద్రథపృష్ఠవంశంబు నిరోధించునట్లుగా నాజ్ఞాపించిన నదృశ్యదేహులైనయాదైతేయవీరు లుద్ధతులై యందు నివసించియున్నయణిమాదిశక్తిపరివారపరూధిని నదృశ్యంబులైనయనేకశస్త్రాస్త్రంబులఁ బీడించినఁ జక్రరాజశతాంగనవమపర్వస్థితలైనయణిమాదిశక్తులు మహాకలకలంబు సేయుచుఁ జేయునది లేక చిక్కువడి

యున్నంత నారక్కసు లుక్కుమిగిలి పెక్కువ లైనపరిఘపట్టిసప్రాసద్రుఘణభిండి వాలముసలముద్గరముసుండిచంద్రహాసప్రముఖంబు లైనవజ్రనిర్ఘాతనిష్ఠురవివిధాయుధంబుల శక్తిమండలంబుల మర్దించుచు విజృంభించిన మహాసత్త్వ లైనయమ్మాయావులమాయాయుద్ధంబున నిర్వేరనొంది యాకస్మికరణోత్సాహంబున విపర్యస్తనిజాయుధగ్రహణంబై యాశక్తిసముదయం బకాండసంక్షుభితంబయ్యె నిట్టు లదృశ్యమానశస్త్రాస్త్రులు నదృశ్యమానశరీరులు నంధకారాచ్ఛాదితకవచోష్ణీషాదులు నైనయారాత్రించరులశిలీముఖంబులు వర్మంబులు భేదించి మర్మంబులు నొవ్వ నాటిన వెఱచఱచి యాశక్తులు లలితామహాదేవిం గుఱించి యాక్రందించినఁ దదారవంబు క్రమక్రమంబునఁ గర్ణాకర్ణికవలన విని యద్దేవి కోపించునంతలో దుర్మంత్రాలోచనదక్షుండై నభండదానవాధీశుండు మహారాజన్యుం డై నకుటిలాక్షుని దశాక్షౌహిణీరాక్షసబలంబులతోడ శక్తిసేనాముఖంబున నాయోధనం బొనర్చుటకు నియమించిన నాక్షణదాచరాధీశ్వరుం డక్షీణజవంబున సబలంబుగా నచ్చటికి నడచి సైన్యపశ్చాద్భాగంబునం బుట్టినమహాకలకలంబు వినియుఁ బురోవర్తి యగుశక్తిబలం బచ్చోటికిం జని పరాక్రమింపకుండ నాసీరంబున సమరం బాచరించుచుండె నివ్విధంబున నుభయభాగంబులయందును శక్తిరక్షోబలంబులకు నత్యంతతుములం బైనయుద్ధంబు ప్రవర్తిల్లుచుండ నంధతమసావృతు లౌటను స్వభావంబున రాత్రియందుఁ బ్రాబల్యంబు గలవా రగుటఁ జేసియు ననేకవిధంబుల శక్తిసైన్యంబుల శైథిల్యంబు నొందించుచు నప్రతిహతంబుగా నయ్యాతుధానులు విక్రమించుచుండ దుర్మదానుషంగుం డగు విషంగుండు దమనాదు లైనవరూథినీనాయకులును దానును సమస్తసైన్యంబులును ననేకశస్త్రాస్త్రకోటులు ప్రయోగించినఁ దదీయాయుధమాలికాసన్వతస్సంవృతంబై యాచక్రరాజరథేంద్రంబు వనశ్రేణీనితాంతసాద్రిం బైనపర్వతేంద్రంబుకరణిఁ జూపట్టె నాసమయంబున దురాత్మం డైనయవ్విశుక్రానుజుండు రథపర్వం బాక్రమించి యొక్కనిశాతబాణంబున నమ్మహాదేవితాలవృంతం బొక్కటి చూర్ణంబు చేసిన శక్తిసమూహం బత్యంతభయాక్రాంతం బయ్యె నది గనుంగొని కాలస్వరూపిణులును బ్రత్యేకతిథివిగ్రహాలు నైనకామేశ్వరీప్రముఖపంచదశనిత్యలు మహాక్రోధంబున శ్రీదేవివదనారవిందంబు గనుంగొని యందు భ్రుకుటీరూపం బైనక్రోధచిహ్నంబు ప్రస్ఫుటం బగుటయు నందఱు నమ్మహారాజ్ఞికిఁ బ్రణామంబు చేసి ప్రార్థనారూపంబుగా నకాండసముత్థితసమరకుతూహలగద్గదస్వరంబుతో సవినయంబుగా నిట్లనిరి. 152

సీ. దేవి మహారాజ్ఞి ♦ మావిన్నపము కరు,ణార్ద్రచిత్తంబున ♦ నాలకింపు
నీదుముందఱ మహా♦నీయబలాఢ్య యా,శ్యామలాదేవియు ♦ సమరవిజయ

దోహల మైనవా♦రాహియు మొదలుగాఁ, గలమహాశక్తులు ♦ గావ నన్య
దుర్జయ మగుసేనఁ ♦ దొడరి పోరాడ ధై,ర్యంబు చాలక మాయ ♦ నాశ్రయించి
గీ, కపటచిత్తంబుతో సంధ♦కారపిహిత,మూర్తు లగుచుఁ బార్ష్ణిగ్రాహ♦మున జయింపఁ
గోరి యిట వచ్చి యీనిశా♦చారు లిప్డు, డీరథంబు నిరోధించి ♦ రిద్ధచరిత. 153
వ. కావున. 154
క. క్షణమాత్రములోఁ గ్రూర,క్షణదాచరవరులఁ బట్టి ♦ చక్కాడెద మీ
క్షణపర్వముగాఁ బర్వ,క్షణదాధిపవదన మమ్ము ♦ సదయతఁ గనుమా. 155
గీ. గాఢతిమిరంబులోపలఁ ♦ గలసి వీరు,మనకుఁ గానఁగరాక యీ♦మ్మాడ్కి విక
మించుచున్నవా రిప్డు డీ♦కొ్రించులమద,వంచన లడంచి వేగ ని♦ర్జించవలయు. 156
వ. అది యె ట్లనిన నత్తెఱంగునకు విన్నపంబుఁ జేసెద మవధరింపుము. 157
శా. జ్వాలామాలిని వహ్నివాసిని స్వతే♦జస్స్ఫూర్తిచే నీతమో
జాలంబుల్ విరియింపఁ బ్రస్ఫుటముగా ♦ శత్రువ్రజం బస్మదీ
యాలోకంబులకుల్ గనంబడఁగ మా♦యం బాసి యీదుష్టదై
త్యాళిం గూల్చెద మస్త్రశస్త్రచటుల♦వ్యాపారఘోరంబుగాల్. 158
సీ. తడ వేమిటి కనుజ్ఞ ♦ దయసేయు మిప్పుడ, యీదానవుల నెల్ల ♦ నేపడంచి
దేవి వేగమ భవ♦దీయాంగసంరక్ష, కరుగుదెంచెద మన్న ♦ నలఁతినగవు
మోమునఁ దులకింపఁ ♦ బ్రేమపాత్రంబు లౌ,నద్దేవులఁ గృపాక♦టాక్షలలిత
వీక్షణంబుల గార♦వించి మీచెప్పిన,యట్ల చేయుం డని ♦ యాజ్ఞయిచ్చె
గీ, నమ్మహారాజ్ఞి యపు డమ్మ♦హాదరాఢ్య, లైననిత్యలు పదియేవు ♦ రసమసమర
కౌతుకంబులతో సజ్య♦కార్ముక లయి, రాక్షసవిమర్దనోగ్రసం♦రంభ లగుచు. 159
వ. ఒండొరులఁ గడవ విజృంభించుసమయంబున మహాక్రోధంబునఁ గామేశ్వరీదేవి సజ్య
శరాసనహస్త యై గుణటంకారంబునకుఁ దోఃసింహనాదం బొనర్చుచుఁ దూణీరము
ఖంబువలన నొక్కశరంబు దిగిచి వింట సంధించి రథపర్వావరోహణంబు సేయుచు.
చ. నిలుఁడు నిలుండు దుష్టరజ♦నీచరులార భవన్మహోగ్రమా
యల నడఁగించి మి మ్మిపుడ ♦ యంతకువీటికిఁ బుచ్చునంతకుల్
గలఁక యొకింత లేక తిరు♦గంబడ కంచితధైర్యవంతులై
కలన నెదిర్చి మీకడిమి ♦ గన్పడఁజేయుఁడు మాకు నందఱుల్. 161
శ. అని కుండలీకృతశరాసన యై దైత్యులగుఱించి ♦ సంతర్జనవా
క్యనికాయంబులు వలుకుచుఁ, జనుచుండఁగఁ దోడిశక్తి♦సముదాయంబుల్. 162

గీ. తమ్మహాభాగవెంబడి ♦ నత్యుదగ్ర,సమరసన్నాహములతోడఁ ♦ జనియెఁ జటుల
సింహనాదంబులును ధను♦శ్శింజినీవి,రావములుఁ గూడి సకలది♦గ్రాజి నిండ. 163

వ. ఇవ్విధంబున భగమాలాపురస్సరంబుగా నిత్యాసముదయంబు కృతపర్వావరోహ
ణంబై కామేశ్వరీదేవియుభయపార్శ్వంబుల నిల్చె నప్పుడు. 164

క. కాలాగ్ని సమాకృతిఁ లగు,జ్వాలామాలినియు వహ్ని♦వాసినియు మహో
త్తాలనిజతేజమున నా,ఖిలధ్వాంతంబు నడఁచి ♦ పేర్చిరి కడిమిన్. 165

క. తిమిరం బిమ్మెయి నడఁగిన, సమరమహీస్థలి సమస్త♦శాత్రవసముదా
యములు ప్రకాశితనిజదే,హము లగుటయు నిత్య లధిక♦హర్షముతోడన్. 166

సీ. కనుఁగొని రణకౌతు♦కంబున ఘనకోప,ఘూర్ణిత లగుచు ర♦క్షోబలములఁ
గనకపుంఖము లైన♦కాండప్రకాండంబు,లయుతముల్ నియుతముల్ ♦ప్రయుతములును
గరలాఘవంబు ప్ర♦ఖ్యాతంబుగాఁ బ్రయో,గించి సత్వరముగఁ ♦ బించ మడఁచి
గర్జారవములు ది♦క్పరిపూరితములుగాఁ, గావించుచుండ న♦ఖండధైర్య

ఆ. వంతు లైనదాన♦వప్రతతులు బిట్టు, గవిసి నిశితసాయ♦కము లసంఖ్య
ముగ నిగిడ్చి భువన♦పూజ్య లౌనిత్యల,తోడఁ బోరి రసమ♦దోర్బలమున. 167

వ. అయ్యవసరంబున. 168

సీ. కాంచనమణిమయ♦కాండాసనద్యుతుల్, పురుహూతచాపవి♦స్ఫురణఁ దనరఁ
గమనీయరత్నకం♦కణగుణరావముల్, పటుగర్జితంబుల♦పగిది మొరయ
నిజగాత్రలతికావి♦నిర్మలకాంతులు, చిరతటిల్లతికల♦చెలువు గులుక
నిరులు గ్రమ్మించుపె♦న్నెరిగొప్పు లందంద, ఘనఘనాఘనముల♦కరణి మెఱయ

గీ. లీలఁ బర్జన్యలక్ష్ములఁ బోలి నిశిత,బాణవృష్టి నిశాచర♦బలఖగంబు
లవనిఁ దొరుఁగంగఁ గురిసి ర♦త్యంతశౌర్య, లైననిత్యలు పదియేను ♦ రద్భుతముగ.

క. ఇత్తెఱఁగున నిత్యావను,జోత్తమసంఘముల కధిక♦యుద్ధం బయ్యెన్
జిత్తము లత్యంతముదా,యత్తములుగ మింటనుండి ♦ యమరులు గనఁగన్. 170

గీ. మందరమహీధరేంద్రని♦ర్మథ్యమాన,కలశపాథోనిధానంబు♦నులివు గెలిచె
నపుడు నిత్యాచయంబుతో ♦ నాజి సలుపు,నసురసైన్యంబులోనిమ♦హారవంబు.

క. యామద్వయపర్యంతం, బీమెయి నూఱటలు లేక ♦ యెంతయు ధైర్య
స్థేమమునఁ బోరి కూల్చిరి, యామవతీచరబలంబు ♦ నఖిలము నిత్యల్. 172

క. పంచదశాక్షౌహిణు లిటు, పంచత్వమునొందఁ గ్రోధ♦పరవశు లగుచున్
బంచదశవాహినీశ్వరు, లంచితశరవృష్టి గురిసి ♦ రానిత్యలపై. 173

వ. ఇట్లు దమనాదు లైనపదియేవురురక్షస్సేనానాయకులు కామేశ్వరీప్రముఖ లైనపది యేవురుతిథినిత్యలతోఁ దలపడి ద్వంద్వయుద్ధంబు సేయుసమయంబున. 174

మ. అమితోత్సాహముతో రణోద్యమమునన్ ♦ హర్షించుకామేశ్వరిన్
దమనాఖ్యాసురసైన్యనాథుఁడు మహా♦దర్పాంధుఁడై బాణవ
ర్షములం గప్పిన వాని నన్నిఁటి వెసం ♦ జక్కాడి యద్దేవి య
య్యమరద్వేషుఁ గూలనేసె పృథుదీ♦ప్తాస్త్రమోఘకాండంబులన్. 175

ఉ. మండితశౌర్యరాశి భగ♦మాల యనంగఁ బ్రసిద్ధ యైనయా
రెండవనిత్య సంగరధు♦రీణపరాక్రమ దీర్ఘజిహ్వుఁ డన్
చండభుజాబలున్ గఠిన♦శాతశిలీముఖధారఁ ద్రుంచె నొం
డొండ కలంగి దైత్యబల ♦ ముర్వి చలింపఁగఁ బాఱ నయ్యెడన్. 176

మ. తరుణాదిత్యసమానదీప్తి యగుని♦త్యక్లిన్న హుంబేకుఁ డన్
సురవిద్వేషిపయి న్వెసం గవిసి యా♦శూరుండు దోఃక్రమ
స్ఫురణం బొప్పఁగ నేయుబాణములు వి♦స్ఫూర్జత్త్వరన్ ద్రుంచి యు
ద్ధురకాండంబుల వానిఁ గూల్చె నమరుల్ ♦ దోడ్తోఁ బ్రశంసింపఁగన్. 177

మ. హలుముల్లుం డనురాక్షసేశ్వరుఁడు శౌ♦ర్యోల్లాసి యై విక్రమో
జ్జ్వలభేరుండ యనన్ బ్రసిద్ధ యగుభా♦స్వన్నిత్యతోఁ బోర న
య్యలఘుప్రాభవ క్రోధదీప్తముఖియై ♦ యత్యుగ్రబాణాంబు ల
గ్గలపుంబూన్కి నిగిడ్చి త్రుంచె సుర లు♦త్కర్షింప నద్దైత్యునిన్. 178

గీ. వహ్నివాసిని పటుభుజా♦ప్రాభవముగఁ, బేర్చి తనతోడఁ బోరెడు♦భీమబలునిఁ
గల్కసుం డనురాక్షసుఁ ♦ గలనఁ గూల్చె, నశనిసంకాశఘనకఠో♦రాశుగముల. 179

క. కావరమునఁ దనతోడ మ,హావైచక్షణ్య మమర ♦ నని సల్పెడుదు
ర్భావు నలకల్కివాహను, నావజ్రేశ్వరి శరప్ర♦హతిఁ దునుమాడెన్. 180

గీ. అలఘుశరముల శివదూతి ♦ యనెడునిత్య, పుల్కసుం డనుదైత్యు న♦ద్భుతబలాఢ్యు
యమగృహంబున కతిథిగా ♦ నాచరించె, సురలు హర్షింప దానవో♦త్కరము లడల.

ఆ. పుండ్రకేతుఁ డనెడు♦భూరిబలాఢ్యుని, సురవిరోధిసైన్య♦వరుని గిట్టి
సరభసముగఁ గూల్చె ♦ నురుతీవ్రశరములఁ, ద్వరిత యనెడునిత్య ♦ సురలు మెచ్చ.

ఆ. చండబాహుఁ డనెడు♦సమరపరిచండుని,తోడఁ దొడరి యసము♦దోర్బలమునఁ
గలనఁ గూల్చె నతనిఁ ♦ గులసుందరీదేవి, చటులఘోరనిశిత♦శరచయముల. 183

గీ. నిత్య యనుపేరఁ బరఁగిన♦నిత్య యడరి, కుక్కురుం డనుదానవ♦కులవరేణ్యుఁ
దననిశాతశిలీముఖ♦దావదహన,మునకు శలభంబుగాఁ జేసె ♦ ఘనరయమున. 184

క. నీలపతాక యడరి యా,భీలబలుని జంబుకాక్షుఁ ♦ బృథుశరముల ను
న్మూలించె సురలు మింట, న్మే లని పొగడంగ దైత్య♦నికరము లడలన్. 185

సీ. విజయ యనునిత్య యసమదో♦ర్విజితవిబుధ,నిసరు జంభనుఁ డనువాని ♦ నసురసైన్య
పరివృఢుని నుగ్రశరములఁ ♦ బాలుపఱిచెఁ, గొందలం బంది రక్కసుల్ ♦ గుంపుగూల.

గీ. చెలఁగి సర్వమంగళ తీక్ష్ణ♦శృంగుఁ డనెడు,సోఁకుమూఁకలదడవాయిఁ ♦ దాఁకి యసమ
సమర మొనరించి తీవ్రని♦శాతబాణ, మున నతనిఁ ద్రుంచె ననిమిషుల్ ♦ వినుతిసేయ.

క. జ్వాలామాలిని సమరా,భీలుఁ డగుత్రికంటకాఖ్యుఁ ♦ బేరడఁగించెన్
గాలవ్యాళకరాళవి,శాలశిలీముఖము లేసి ♦ సత్వరలీలన్. 188

ఆ. చంద్రగుప్తుఁ డనెడు♦చటులదుశ్శీలునిఁ, దొడరి చిత్ర యనెడు♦దోర్బలాఢ్య
యతివిచిత్రముగ మ♦హారణ మొనరించి, యతనిఁ జంపె సునిశి♦తాస్త్రనిహతి. 189

క. ఈవిధమునఁ బదియేవురు,దేవాహితసైన్యపతులు ♦ తెంపుమెఱసి ని
త్యావర్గముతోఁ బోరి య,మావసథంబునకుఁ జనిన ♦ నతికుపితుండై. 190

వ. విషంగుండు దనమనంబున నిట్లని వితర్కించె నతిబలపరాక్రమవంతులైనయాదమ
నాదిపంచదశసేనాధిపతులయప్రతిహతదోస్సామర్థ్యంబు లీపదియేవురు తెఱవలముం
దఱఁ జవుటం బెట్టినవిత్తులచందంబున నిరర్థకంబై పోయె దైవబలంబు లేక కేవల
పౌరుషం బెట్లు ఫలించ నేర్చు నిది యంతయు విధికృతంబు దీనికిఁ జింతింపనేల వీరిఁ
దొడరి జయించెదఁగాక యని యామావశేషమైనయారాత్రియందు ముహూర్త
మాత్రంబా నిత్యలతోడ నతిఘోరయుద్ధంబు సలిపి వారియుద్ధతి సహింపనోపక కలంగి
తొలంగిపోవఁ దలంచుసమయంబునఁ గామేశ్వరీదేవి మండలీకృతకోదండదండయై నిశి
తకాండప్రకాండంబులు వఱగించి వానిమర్మంబులు భేదించిన దురాశయుండైన
యద్దానవుండు పిడుగులకంటెను బెడిదంబులై పుంఖానుపుంఖంబులై వచ్చి నొప్పిం
చుచున్నయద్దేవిబాణంబులకు నిలువలేక శరీరంబు విరవిరవోవ భయకంపంబులతో
హతావశిష్టులైనయాతుధానులతోఁగూడఁ బుడమి యద్రువ సత్వరంబుగాఁ
బఱచిన. 191

గీ. కాలదండంబుకంటెను ♦ గడు సుతీక్ష్ణ, మైనవారాహిచేతిమ♦హాముసలము
చేతఁ బడఁగాని యితరుల♦చేత నితఁడు, పడఁ డనుచు నిత్య లతనిఁ బో ♦ విడిచి చనిరి.

క. అదిగాకున్నఁ బలాయితు, నదయతఁ జంపుట యధర్మ ♦ మనియుఁ దలఁచి యా
త్రిదశారిఁ జంపఁబోవక, పదియేవురుఁ దిరిగి రపుడు ♦ పరమమునీంద్రా. 193

వ. ఇవ్విధంబునఁ గామేశ్వరీప్రముఖనిత్యలు భండాసురసోదరుండైనవిషంగునిఁ బోవ
విడిచి యందఱు నొక్కట ననేకదనుజబహువిధశస్త్రాస్త్రక్షతనిర్గళితశోణితధారాప్లుత

దేహులై పల్లవికలై నయశోకలతలపోలిక వచ్చుటం గదలి శ్రీమహారాజ్ఞిసమీపంబు నకుం జని సభక్తికంబుగాం బ్రణామంబుం జేసిన విజయోద్ధతులై నయద్దేవుల పరాక్రమంబునకుం బరమసంతోషభరితాంతఃకరణ యగుచు లలితామహాదేవి వారల నందఱ వేఱువేఱ సంభావించి యిచ్ఛావర్తనంబున నుండె నంతం బద్మినీప్రమోదసంపత్కారుండగు దినకరుం డుదయశైలం బను మణిమయసింహాసనంబుపై నధిష్ఠించె నప్పుడు శత్రులముఖకమలంబులువోలెం గమలంబులు వికసించె రక్కసులమానసకుముదంబులు వోలెం గుముదంబులు ముకుళనంబునొందె నని యిట్లగస్త్యమహామునీంద్రునకు నశ్వాననుండు వినంగుపలాయనవిధం బెఱింగించి. 194

ఆశ్వాసాంతము.

చ. శరనిధితూణ శుభ్రజల•జాతవిలోచనబాణ కోపదృ
క్స్ఫురిహృతపంచబాణ సుర•పాలనకార్యధురీణ దైత్యరా
ట్పురమథనప్రవీణ ఘన•భూరివిభుత్వవిజృంభమాణ భా
స్వరతరుణేందుభూషణ భ•వజ్జనతాబహుదోషశోషణా. 195

క. కలికలుషదావదావా, బలభిన్మణినీలకాంతి•భాస్వద్గ్రీవా
లలితకరుణాస్వభావా, జలజాసనముఖ్యదేవ•చయకృతసేవా. 196

వనమయూరము. సత్రచరవంద్యశిశు•సత్రశుభభూషా, సత్రగజయాత్వజన•సత్రకృతవేషా
గోత్రితనయాదయిత•గోత్రరిపుజైత్రా, మిత్రశశిగంధవహ•మిత్రమయనేత్రా. 197

గద్యము.

ఇది శ్రీభవానీశంకరకరుణాకటాక్షవీక్షాసుధారసాసారప్రసారణసులబ్ధ
కవితావైభవాపస్తంబసూత్ర పరాశరగోత్ర విలస దాతుకూరివంశ
సంభ వాయ్యనామాత్యపౌత్రాదిమూర్తి నామసత్కవిపుత్ర
సకలసుకవిజనవిధేయ పాపయనామధేయ
ప్రణీతంబైన లలితాంబోపాఖ్యానం
బనుమహాప్రబంధంబునందుం
బంచమాశ్వాసము.



ఓమ్.

శ్రీసద్గురుచరణారవిందాభ్యాంనమః.

శ్రీ

# లలితాంబోపాఖ్యానము.

## షష్ఠాశ్వాసము.



మహితధాన్యవాటీ
నామప్రఖ్యాతపట్ట♦ణప్రియధామా
ధామనిధికోటిధామా
ధామద్యుతివిజితపూర్ణ♦తరహిమధామా. 1

వ. అవధరింపుము దివ్యజ్ఞానైకసదనుం డగునశ్వవదనుండు వెండియుఁ గలశసంభవున
కిట్లనియె. 2

మ. కుటిలాక్షుండు గడంకమీఱఁగ దశా♦క్షౌహిణ్యనీకంబుతోఁ
గిటిముఖ్యాదికశక్తివాహినుల స♦క్షీణోద్ధతిం దాఁకి యు
త్కటసంగ్రామము చేసి తద్బహువిధా♦స్త్రవ్రాతసంపాతసం
త్రుటితాత్మీయచమూసమూహుఁ డయి యెం♦తో విహ్వలస్వాంతుఁడై. 3

క. అశనులకంటె నధికకర్కశము లగువరాహవక్త్రి♦కాండంబుల నా
త్మశరీరము విరవిరవోవ శరశరాసనము లచట ♦ వైచి రయమునన్. 4

ఆ. కాలికొలఁది శూన్య♦కపురంపుదెసఁ బాఱె, నంత నిహతశేషు ♦ లైనవారి
చేత దమనకాది♦దైతేయవధము వి,షంగుఁ డనిఁ దొలంగి ♦ చనినవిధము. 5

క. పదియేనక్షౌహిణులుం, జదిసిన తెఱఁ గఖిలశక్తి♦సైన్యముఖమునన్
పదియక్షౌహిణు లడఁగుట, మదమఱి కుటిలాక్షుఁ డాజి♦మహి వెడలుటయున్. 6

క. విని భండాసురుఁ డెంతయుఁ, దనమనమున రోషవహ్ని ♦ దరికొనఁ దాపం
బునఁ బొంది యింక నే నే,యనువున వారల జయింతు ♦ నని వెఱఁగందెన్. 7

వ. అంత. 8

సీ. ఆవిషంగాదిమ♦హాదుష్టదైత్యేయు, లాకా్రత్రి యొనరించి♦నట్టికూట
యుద్ధవృత్తాంత మ♦ర్కోదయసమయంబు,నందుఁ గర్ణపరంప♦రాగతముగ
శ్యామలాదేవియు ♦ సైన్యాధినాథయు, విని విషాదంబును ♦ విస్మయంబుఁ
దమమానసంబులం ♦ దద్దయుఁ బొడమంగ, నిట్లని పలికి రెం♦తేనిచింత

గీ, కటకటా లోకజననికి ♦ ఖలులచేత, దారుణశ్రమ మొదవె నం♦త్తానమతుల
మైమహాప్రమాదము నే♦నాగ్రతలము,నందు నిలిచి యమ్మహాసీయ ♦ నరయలేమి.

సీ. పేరుగల్గినశక్తి♦పృతనలతోఁగూడ, దుష్టదైత్యులతోడి♦సమర
కార్యభరంబునఁ ♦ గడుదూరముగ నిట్టు, లుండుటకతన న♦త్యుగ్రు లైన
కపటదైత్యులు దురా♦గ్రహమున వెనుకకుఁ, దిరిగి పార్ష్ణిగ్రాహ♦కరణమునకు
నరిగిరి కాంబోలు ♦ నక్కటా యమ్మహా,రాజ్ఞినిల్చినచక్ర♦రాజరథము

గీ, రక్షణముసల్ప నచట దా♦ర్ఢ్యంబు గలిగి, దనుజుల నడంపఁగలశక్తి♦తతులు పేర్చి
వారితోఁ బోరిరో యుద్ధ♦భార మెల్ల, నమ్మహాదేవి నొక్కతె ♦ నందె నేమొ. 10

క. మేదురతమంబులోపల, నాదమఱచి యున్నయమ్మ♦హారాజ్ఞిరథం
బాదోషాచరవర్యులచే దైన్యము నొందెనేమొ ♦ చిక్కి యవశతన్. 11

క. ఏమివిధంబునఁ దలఁచెనొ, యామహనీయానుభావ ♦ యవుడు తనమదిన్
యామిని నట నడిచినసం,గ్రామస్థితిఁ దెలియవలయుఁ ♦ బ్రకటము గాఁగన్. 12

మ. అని శంకాకులమానసాంబురుహలై ♦ యాశ్యామలాదేవి యా
ఘనశౌర్యోజ్జ్వల యైనక్రోడముఖియుం ♦ దత్సైన్యందనక్షేమమున్
గనఁగా నాత్మఁ దలంచి యచ్చటికి వే♦గన్ శక్తిసేనాగ్రిణుల్
వెనువెంటం జనుదేర నేగి రలదే♦వీదర్శనోత్కంఠతన్. 13

వ. ఇట్లు దండనాథాపురోగములై సకలశక్తిచమూనాయిక లాశ్యామలాదేవిం బురస్కరించుకొని యచ్చటికిం జని చక్రరాజరథేంద్రంబుఁ బరివేష్టించి రప్పుడు మంత్రిణీ దండనాయికలు దమతమవాహనంబులు డిగ్గి సమస్తశక్తిసైన్యంబు నచ్చట నిలువ నియమించి తా మిరువురును దద్రథోత్తమంబు నారోహించి సత్వరంబు పదవిన్యాసంబు సలుపుచు నవపర్వంబులు దాఁటి తత్తత్పర్వస్థితశక్తిచక్రంబుల దేవీవృత్తాంతం బడుగుచు వరుసన వారు తత్కుశలవార్త లెస్సగాఁ దెలుపుచుండ నలరుమనంబులతో నమ్మహారాజ్ఞికిఁ దమరాక యెఱింగించి తదనుజ్ఞాతలై యుచితప్రకారంబున నాలోకజననిం గనుంగొని సాష్టాంగదండప్రణామం బాచరించి జయ మహారాజ్ఞి జయ సర్వజగజ్జననయిత్రి దేవీ యానిశీథిని నిచ్చట మహాప్రమాదంబు గల్గె ననుమాట

వినినదిమొదలు మిమ్ముఁ జూచునందాఁక మాకుచిత్తస్వస్థత లేకయున్నవార మైతిమి
దుష్టాత్ముండును దురాచారుండును నైనభండాసురుండు మనతోఁ బ్రకాశయుద్ధంబు
సేయ శక్తిలేక వెఱచి మాయాయుద్ధవ్యవహారంబున జయంబు సాధింపఁ గోరి
పంపుసేయ దురాత్ము లైనదైత్యులచేతఁ గూటయుద్ధప్రకారంబున నపకారంబు
చేయంబడియె దానం జేసి భవదీయయోగక్షేమం బరయ నిట వచ్చితిమి మేము
చేసినభాగ్యవశంబునఁ బుష్పసుకుమారం బైనయుష్మద్గాత్రంబు దుష్టాసురసముదయ
శస్త్రాస్త్రసంస్పర్శనంబు నొందక సుఖంబున నుండుటఁ గనుంగొని యత్యంతధ
న్యుల మైతిమి నీదుపాదారవిందయుగళంబె శరణంబుగా నవలంబించి యే మంద
ఱము సంతసంబున జీవించి యభీష్టం బనాయాసంబుగా సాధింపఁగల మది యట్లుం
డె నింక మనకుఁ గర్తవ్యవిచారంబు సేయవలయు భవదీయాంగసంరక్షణంబు ప్రథమ
కర్తవ్యంబు దానికి భండాదిదుష్టదైతేయు లతిశయమాయోపాయులు వారలు
వచ్చి యకాలంబునఁ గూటయుద్ధవిధానంబున మనల వంచనసేయకుండ వారలకుఁ
బ్రవేశింప శక్యంబుగానియట్లుగా నిమ్మహేంద్రశైలంబుదక్షిణదిగ్భాగంబున మనకుఁ
గల్గినసమస్తశక్తిసైన్యసమూహంబునకు రక్షణార్థంబుగా శాత్రవదర్పశమనార్థంబుగా
శతయోజనవిస్తారం బైనవహ్నిప్రాకారవలయంబు నిర్మింపవలయుఁ దన్మధ్యదేశం
బును శతయోజనవిస్తారంబు గావలయుఁ దత్ప్రాకారవలయంబునకు దక్షిణదిక్కున
ద్వారంబు రచియింపవలయు నది యేమిటి కనిన నచ్చటికి యామ్యదిగ్భాగంబున
మనకు విద్వేషు లైనబృందారకద్వేషులకు నివాసం బైనశూన్యకపురం బున్న యది
యట్టు లగుటఁ జేసి వహ్నిమయం బైనతత్సాలవలయంబుద్వారంబున లోపలికి
బయలికి వచ్చుచుఁ బోవుచుండువారలలోనఁ గపటవర్తనుల లెస్సగాఁ బరిశీలించుచు
నహోరాత్రంబులయందు నిద్ర యెఱుంగక యాలస్యవర్జితు లై సంతతోద్యోగు లై
యుద్యతాయుధు లై యత్యంతవిధేయు లై బహులపరిజనులు ద్వారరక్షణం బాచ
రింపవలయు నిట్లు ఘటించిన నైనఁ గూటయుద్ధప్రవర్తకు లైనదైత్యులకు సంధ్యా
కాలంబులయందును మధ్యరాత్రులయందును మఱియు ననేకంబు లైనయసమయం
బులయం దెల్ల మనల నాక్రమింప శక్యంబుగాకుండు నిట్లు చేయకుండితి మేని బహు
మాయికులు దురాశయులు నైనసురాహితులు పశ్యతోహరుపోలిక వచ్చి యస్మ
ద్బలంబులఁ బీడింపఁజూతురు వారలతలంపు సాగకుండ నివ్విధంబున నేము సేయు
మనవిఁ జిత్తగించి యక్కార్యంబు సందర్భింపఁ జేయవలయు నని మంత్రిణీదండనాథలు
విన్నవించిన వారియుక్తియుక్తంబు లైనమంత్రాలోచనవాక్యంబులు సమధికతాత్ప
ర్యంబున నాకర్ణించి లలితామహాదేవి నిజదంతకోరకధవళకాంతులకు నితాంతస

ఖ్యంబు నెఱపుమందహాససుందరద్యుతిబృందంబుచేతఁ బరిశుద్ధమౌక్తికవర్షంబు గురి
యించుచు నత్యాదరంబున ని ట్లనియె. 14

క. చారుమతులార యిప్పుడు, మీరు దలంచినతలంపు • మేలు నయకళా
పారగు లౌవిజిగీషులు, గారవమున నిట్లు చేసి • కాంతురు జయముల్. 15

క. తమసైన్యమునకు రక్షా,క్రమముల్ సుదృఢముగ మున్ను • కావించి సుధీ
సమధికులు వైరిసైన్యా,క్రమణము సేయఁదగుఁ బిదపఁ • బ్రాబల్యముతోన్. 16

క. అని పల్కి యాత్రిలోకీ,జనని మనంబున ముదం బెసఁగ జ్వాలామా
లిని యనుపదునాల్గవని,త్యను బిల్చి మృదూక్తి నిట్టు • లను నయ్యమతోన్. 17

సీ. బాలిక విను జ్వాల • జ్వాలామయాకృతి, వహ్నిస్వరూప వీ • వనఘచరిత
యీశక్తిబలముల • కెల్ల నిర్భయముగా, శతయోజనములవి • స్తార మగుచు
శత్రుభీషణము త్రిం • శద్యోజనోన్నతం, బధికకీలోల్లంఘి • తాంబరంబు
సుప్రభావము యోజ • నప్రమాణద్వార,సహిత మహాపావక • సాలరూప
గీ. మమర ధరియించి రక్షింపు • మఖిలసేన, ననుచు నాజ్ఞయొసంగిన • నాత్మ నలరి
యాచతుర్దశితిథిరూప • మైననిత్య, తన్మనఃప్రీతి సేయంగఁ • దలఁచి యపుడు. 18

సీ. అద్దేవి పూర్వంబు • నందు నిర్దేశించి,న ట్లమ్మహామహేం • ద్రాభిధాన
భూధరోత్తరభాగ • మున ద్వారమునకుఁగా, యోజనమాత్రంబు • నుజ్జగించి
శతయోజనములవి • స్తారంబుతో శత,యోజనమధ్యభా • గోర్వి యగుచుఁ
బ్రబలవైశ్వానర • ప్రాకారమూర్తియై, యమరి ముప్పదియోజ • నములపొడవు
గీ. గలిగి వర్తులాకారతఁ • గాంచి మించి, ప్రజ్వలజ్జ్వాలికాజాల • భాసురోర్ధ్వ
గగనభాగమై పద్మరా • గప్రతాన,ఖచితవప్రంబుపోలిక • రుచిర మయ్యె. 19

చ. అది గని మంత్రినాయిక మ • హాబలముల్ గిటివక్త్రసైన్యముల్
దదితరశక్తిసేనలు ను • దగ్రతరాయుధభీషణంబులై
ముదమునఁ బొంగిరాక్షసచ • మూసుదురాసదమై విశాలభా
స్వదుదర మైనవహ్నిమయ • సాలము వేడుకఁ జొచ్చె వాకిటన్. 20

వ. ఇవ్విధంబున మహారాజ్ఞి నిర్దేశంబున దండనాథాదేవి సర్వశక్తిసైన్యంబుల దహనప్రా
కారాంతరంబున నిలిపి తన్మధ్యభాగంబునఁ జక్రరాజరథేంద్రం బుజ్జ్వలంబు గాఁ దదీ
యవామభాగంబున నిజశతాంగంబును దక్షిణభాగంబున మంత్రిణీస్యందనంబును
నిలువ నియమించి పశ్చాద్భాగంబున సంపదీశ్వరియును బురోభాగంబున హయారూ
ఢయు ససైన్యంబుగా నివసించున ట్లాజ్ఞాపించి యవ్వారాహవక్త్రి లలితామహాదేవి
యరదంబునలుదిక్కులఁ దగినకాపుఁ బెట్టి నిజాజ్ఞావశవర్తినియు నత్యంతవిస్రంభనీ

యయు వింశత్యక్షౌహిణీసహితయు విఘ్నదేవీనామవిశ్రుతయుఁ బ్రజ్వలదండాయుధహస్తయు సర్వదాజాగ్రత్త్వసమగ్రయు నైన స్తంభినీదేవతం గతాన్లలద్వారంబుఁ రక్షణార్థం బుండునట్లుగా నాజ్ఞయిచ్చి మఱియుఁ బశ్చిమప్రదేశంబుల నయ్యైవారలఁ దత్తత్సేనతోఁ గూడఁ బలసి యుండునట్లు సంఘటించి శిబిరంబెల్ల సురక్షితంబుచేసి సూర్యోదయసమయంబునకు నేతత్కార్యజాతంబెల్ల నిర్వర్తించి రాక్షసయోధుల తోడియాయోధనంబునకు నుత్సహించి సబలంబుగా సింహనాదబధిరీకృతదిఙ్మండలియగుచు నగ్నిమయమహాప్రాకారద్వారంబున వెడలె నప్పుడు. 21

క. ఆలలితాశిబిరోత్తమ, మీలీల సురక్షితమయి ♦ యెంతయు దర్పా
భీలత మెఱయుట గూఢచ,రాళివలన విని విషాద♦హతమానసుఁడై. 22

సీ. అసురాధిపతి కుటి♦లాక్షాదు లగుమహా,మాత్యులఁ బాహుభుజా♦మానసీయ
విక్రమక్రముల వి♦శుక్రవిషంగుల, సమరదుర్జయు లైన♦యాత్మజులను
బిలిపించి వారితోఁ ♦ గలహరంగములోన, లలితామహాదేవి ♦ గెలుచు వెరవుఁ
దలపోసి యంతటఁ ♦ దనతనూజులఁ జతు,ర్బాహుఁడును మొదలైన♦బాహుబలుల

గీ. నుగ్రతేజులఁ బ్రళయాంత♦కోపమాన,తీవ్రశౌర్యుల సమరసు♦స్థిరుల లోక
కంటకుల మానమదరోష♦కలుషమతుల,రణమునకుఁ బంపెఁ గ్రోధసం♦రంభ మెసఁగ.

వ. అప్పుడు. 24

క. చతురంభోనిధితుల్యులు, చతురంగబలాఢ్యు లాజి♦చతురులు బలవి
శ్రుతులు చతుర్బాహుముఖులు, పితృశాసనమునకు నలరి ♦ వేర్చినకడిమిన్. 25

క. వినయముతో జనకునిపద,వనజంబుల కెఱఁగి దుర్నివారచటులశౌ
ర్యనిరూఢు లక్కుమారులు, దనయెదుర న్నిల్వ నలరెఁ ♦ దండ్రి మనమునన్. 26

క. దారుణవిక్రాంతు లయిన,వీరలనామములు నీకు ♦ వినిపించెదఁ జి
త్తాహ్లాదముగఁ జేయుము, సాంతపోధుర్య ఘటజ♦సంయమివర్యా. 27

వ. చతుర్బాహుండు చకోరాక్షుం డూర్ధ్వకేశుండు మహామాయుండు మహాహనుండు మఖశత్రుండు మఖాస్కంది సింహఘోషుండు సిరాళకుం డంధకుండు సింధునేత్రుండు కృపకుండు కృపబోధనుండు మహాశీర్షుండు గండలుండు చండవర్మ యమాంతకుండు లడ్డుండు పండసేనుండు పురుజిత్తు పూర్వమారకుండు స్వర్గశత్రుండు స్వర్గబలుండు దుర్గుండు స్వర్గకంటకుం డతిమాయుండు బృహన్మాయుం డుపమాయుండు వీర్యవంతుం డనువారలు పితృసమానవీర్యవంతులు పితృసమానవిగ్రహులు పితృవాక్యతత్పరులు దుర్మదాంధులు దేవకంటకులు దురాగ్రహు లగుసయ్యంద ఱొక్కటఁ

క్కట నిట్లు కృతప్రణాములు లైన వారిఁ బ్రసాదమధురంబు లైనయాలోకనంబుల
గారవించి కులనాశకుం డైన భండాసురుండు సగౌరవంబుగా ని ట్లనియె. 28

ఆ. తనయులార మీకు ♦ నెవ్వ రెదురుపేరుండు, వెదకిచూడ భువన♦వితతియందు
లేఁడు ముజ్జగములు ♦ లీల మీచే నున్న, గెలువఁబడియెఁ గాదె ♦ కీర్తితముగ. 29

మ. అమరాధీశ్వరు నాశ్రితాశునిఁ బరే♦తాధ్యక్షు దోషాచరో
త్తము సంభోనిధినాథు గంధవహు న♦ర్థస్వామిఁ బి ట్టాక్రమిం
చి మహోద్వృత్తిగఁ జాపకర్షణముచేఁ ♦ జేసాటు నొందించి శౌ
ర్యమునన్ జేర్చినయట్టిమీ కెదురె వా♦మాక్షుల్ రణాగ్రంబునన్. 30

గీ. ఎన్నిగల వస్త్రశస్త్రము ♦ లన్నియును సర్వహాస్యముగ నభ్యసించితిరి ♦ ననఘులార.
యిట్టిమీరలు గలుగంగ ♦ నిప్పు డమరశత్రుకులమున కిట్లు నా♦శంబు వచ్చె. 31

వ. అది యె ట్లనిన. 32

సీ. వినుఁడు మాయావతి ♦ వనిత యొక్కతె దుష్టమతి దుర్మదాంధయై ♦ మనల గెల్వఁ
దనయట్టివారి సుం♦దరులఁ గొందఱఁ గూర్చి, చనుదెంచి యచ్చటి♦దనుజసైన్య
పాలుర దుర్మద♦ప్రముఖులఁ బల్వుర, నాజిలోఁ గూల్చి మా♦యాబలమున
విజ్జవీఁగెడుఁ గాన ♦ వేగ మీ రచ్చటి, కేగి యయ్యెలనాఁగ ♦ నాఁగి చుట్టు

గీ. ముట్టి జీవంబుతోడ న♦ప్పొలఁతి నిచటి, కీడ్చుకొనిరండు తలవట్టి ♦ యింతటిబల
వంతు లై నట్టిమి మ్మొక్క♦కాంత గెలువఁ, బంపుటనుచితమగు నైన ♦ పనిఁగవినుఁడు.

ఉ. ఆయెలనాఁగ గెల్వఁ జని♦నట్టిమహాబలవంతు లైనదై
తేయులలో నొకం డయిన ♦ ధీరతతో విజయంబునొంది రాఁ
డేయెడనైన న ట్లగుట ♦ నీపనికిన్ మిముఁ బంపితిన్ మహో
పాయత నప్రమాదు లయి ♦ భామినిఁ బట్టుకరండు చెచ్చెరన్. 34

క. కొంచెపుఁబని యని మది శం,కించకుఁ డమ్మించుఁబోఁడి ♦ గీటడఁచు న
క్తంచరులనెత్తిపిడు గ,కాంచనగౌరాంగి యనమ ♦ గాదు తలంపన్. 35

క. లోకములోనిసుదంతీ,లోకముతో సరియె యిచ్చె♦లువ యటు లగుటన్
మీకుం జింతిలఁ బనిలే, దీకీర్తివిపర్యయమున ♦ కిటు సైఁప నగున్. 36

గీ. అని యనేకవిధంబుల ♦ నాత్మజులకు, ఘనరణోత్సాహ మొదవువా♦క్యములు పలికి
నిర్జరవిరోధి యక్షౌహి♦ణీశతద్వయంబు వారికిఁ దోడిచ్చి ♦ యనిపె ననికి. 37

క. రక్షఃపతిసూనులు ద్విశ,తాక్షౌహిణు లైనదాన♦వౌఘంబులతోన్
దక్షతఁ దిలకములై సమ,దాక్షీణబలంబుతోడ ♦ నాగ్రహ మెసఁగన్. 38

క. త్రింశత్సంఖ్యాకులు ని,స్త్రింశధనుర్బాణముఖ్య♦తీవ్రాయుధసం
ఘాంశునికరవిజితసహ,స్రాంశుసహస్రాంశు లగుచు ♦ నతిసాహసులై. 39
క. బద్ధభ్రుకుటులు సంగర,యోద్ధలు క్రోధాంధలోచ♦నోగ్రులు రణస
న్నద్ధు లయి నగరు వెడలిరి, యుద్ధం బొనరించువేడ్క ♦ నుల్లము లలరన్. 40
గీ. అవనికంపము దిగ్దాహ ♦మాది యైన,బహువిధోత్పాతములు దోఁచె♦భయమునొందె
మూఁడులోకములును భండ♦పుత్రు లాజి, కేగుసమయంబునందు ము♦నీంద్రచంద్ర.
సీ. అతిశౌర్యయుతులు మ♦హాసత్త్వు లైనట్టి, యసురరాజకుమారు ♦ లట్లు వెడలి
రాజమార్గమున వి♦భ్రాజిష్ణులై రాఁగ, వారలఁ గనుఁగొని ♦ పౌరసతులు
సౌధోపరిప్రదే♦శంబుల నిల్చి య,క్షతపుష్పలాజవ♦ర్షములు గురిసి
రధికప్రమోదయు♦క్తాంతరంగములతో, వందిమాగధసూత♦బృందములును
గీ. దత్పరాక్రమపదపద్య♦తతులు పాడి, రంతఁ బ్రతిగృహద్వారంబు♦నందు వృద్ధ
పుణ్యకాంతాజనంబులు ♦ భూరివిభవ,మంగళారాత్రికంబు లొ♦సంగి రపుడు. 42
క. వా రట్లు పోవుచుండఁగ, వారినిధులు గలఁగి నభము ♦ వడవడ వడఁకెన్
ధారుణి దిర్దిరఁ దిరిగెను, మేరుగిరిప్రముఖగిరిస♦మితి చలియించెన్. 43
క. ఇన్నూఱక్షౌహిణు లతి,సన్నాహత బలసి రాఁగ ♦ సరభసముగ ను
ద్యన్నిటలభ్రూకుటు లయి, క్రన్నన వెడలిరి పురంబు ♦ రక్షఃప్రవరుల్. 44
వ. ఇ ట్లరుగునప్పు డమ్మహావీరులు దమలోన, 45
సీ. శక్తిసేనల సమ♦స్తమును గ్రక్కున మ్రింగి, యశ్రమంబున వత్తు ♦ మనెడువారు
వారిశస్త్రాస్త్రముల్ ♦ వరుసఁ జూర్ణముచేసి, యందఱ సమయింత ♦ మనెడువారు
వారల కిర వైన♦ఘోరాగ్నిసాలంబు, నార్చి పెల్చనఁ గూల్త ♦ మనెడువారు
మాయచే జగమున ♦ మత్తిల్లునబ్బోటి, నట నాఁగి చెఱఁదెత్తు ♦ మనెడువారు
గీ. మఱియు నతిదారుణంబు లౌ♦మాటలాడు,వారు నై వహ్నివరణంబు♦ద్వారభూమిఁ
జేర నరిగిరి భండకు♦మారు లధిక,యౌవనోద్ధతు లగుట మ♦దాంధు లగుచు. 46
వ. ఇవ్విధంబున. 47
క. శలభములు పేర్చి దావ,జ్వాలనంబునఁ బడఁ దలంచి ♦ సత్వరగతి ని
ట్టలముగ డాసినక్రియ న,బ్బలియులు డాసిరి కృశాను♦వరణవలయమున్. 48
క. బొమముడులు భీకరంబుగఁ, దమమొగములఁ గనఁబడంగ ♦ దైత్యులు బ్రహ్మాం
డము వగుల సింహనాదము, లమరులు వెగడొంద సలిపి ♦ రందఱుఁ బెలుచన్.
గీ. ప్రళయజలధరఘోరని♦ర్ఘాతరవము,పగిది మున్నెన్నఁడును విన♦బడనియట్టి
తన్మహాధ్వని యాశక్తి♦తతులశ్రవణ,మానసంబుల సంక్షోభ ♦ మూనఁ జేసె.

క. కలఁగియుఁ బిఱుతివియక య,గ్గలపుధృతిన్ రాక్షసప్ర♦కరములతోడన్
పోరుచేసిరి శక్తి,తతులు మింటన్ సురలు నిల్చి ♦ స్తోత్రముసేయన్. 51

గీ. యసేనాప్రయుక్త బ♦హుప్రకార,శాత హేతినికాయసం♦పాత మపుడు
వెగడు నొందించె దేవతా♦విసరములను, మానినాయక యప్రతి♦మానలీల. 52

వ. ఇట్లు సంకులసమరంబు ప్రవర్తిల్లుచున్నసమయంబునఁ జతుర్బాహుప్రముఖులు త్రింశత్సంఖ్యాకు లైనభండాసురకుమారులు సంగ్రామకుతూహలంబున జనకనియుక్తు లై శక్తిసమూహంబుల మార్కొన నేతెంచుట యాకర్ణించి యపూర్వరణకౌతుకవ్యగ్రమానమానసాంభోజ యగుచు సదానవవర్షవయస్కయు శ్రీమహారాజ్ఞిసమీపవర్తినియు సమస్తశక్తిసైన్యసంభావితమహాశౌర్యశాలినియు సర్వవిద్యాసేవధియు లలితాప్రతిబింబశోభాకారయు బాలమార్తాండప్రభావిభాసమానశోణకాంతిసుందరతనూలతికయు నైనబాలాదేవి యాసింహాసనేశ్వరికి బహిఃప్రాణంబై తత్పాదపీఠసన్నిధి నిత్యంబును నివసించునదియై యమ్మహాదేవికి నాల్గవవిలోచనంబై యున్నయది గావున నద్దైత్యరాజతనూజులయుద్ధతి సహింపక వారలఁ దలపడి యవలీలఁ గూల్తుఁగాక యని మనంబున నిశ్చయించి యాజగదంబతో నిట్లని విన్నవించె.

సీ. జనని భండాసుర♦తనయులు మనతోడ, యుద్ధంబుసేయంగ ♦ నుత్సహించి
వచ్చినా రిప్పుడు ♦ వారలతోఁ బోర, మదిలోన వేడుక ♦ మొదవె నాకు
నను నివారింప క♦ద్దనుజవీరులతోడ, ననిసేయ నాజ్ఞయి ♦ మ్మాదరమున
నొక్కయెత్తున వారిఁ ♦ జక్కాడివైచెదఁ, జేతులతీఁటవోఁ ♦ జిన్నతనము

గీ. గలిగియుండుటకతనఁ గ్రీ♦డలకుఁ దివురు,నాదుమతికి రణక్రీడ♦నప్రదాన
మెలమిఁ గావించి ప్రమదంబు♦గలుగఁజేయు,మిదియమద్వాంఛితార్థంబు♦త్రిదశవంద్య.

క. అని విన్నవింపఁ ద్రిభువన,జనని తనదుముద్దుపట్టి♦సంప్రార్థనవా
క్యనికాయము విని మందహా,సన మాననపూర్ణచంద్ర♦చంద్రిక గాఁగన్. 55

సీ. బాలాంబఁ జూచి యో♦బాలిక నీ వతి,మృదుతనూలతికవు ♦ కదనవిధము
లేమియు నింతకు ♦ నెఱుఁగవు దివ్యాస్త్ర,శస్త్రశిక్షారహ♦స్యములు నీకు
విదితము ల్గావు తొ♦మ్మిదియేండ్లశిశువవు, నిన్నుఁ బాసి క్షణమైన ♦ నిశ్చయముగ
ధైర్యంబుతో నిల్వఁ ♦ దరమె నాకుఁ దలంపఁ, బ్రాణసమాన వో♦పట్టి నీవు

గీ. వలదు సమరంబునకుఁ బోవ ♦ వనజనయన, మంత్రిణీదండనాథలు♦మఱియుఁ గలుగు
శక్తికోట్లుఁ గడిమితో ♦ సంగరంబు, సలుపుటకుఁ జాలియున్నారు♦నిలువు మిచట

గీ. అని యనేకవిధంబుల ♦ నమ్మహాను,భావ దన్ను నివారింప ♦ బాల భావ
మునకు నుచితంబుగా నతి♦వినయయుక్త,ముఁగ మఱియు నట్లు ప్రార్థించె♦మునివరేణ్య.

గీ. అతికుతూహలమై వేడు♦నాత్మజాతఁ, గాంచి సంతుష్ట యగుచు స♦త్కాంచనాంగి
గారవించి గాఢంబుగాఁ ♦ గౌఁగిలించి, యమ్మహారాజ్ఞి రణమున ♦ కాజ్ఞయిచ్చె.
క. తనయదృఢనిశ్చయంబున, కనుకూలత వెలయ నమ్మ♦హాదేవి ప్రియం
బున నిటు లవ్వనజాక్షికిఁ, ననుజ్ఞ దయచేసి మఱియు ♦ నతిహర్షమునన్. 59
క. తనకవచంబువలన నొక, ఘనతరకవచంబు లీలఁ ♦ గల్పించి♦ఘనా
ఘనవేణికి బాలాంబిక, కనుపమితప్రేమ మెసఁగ ♦ నంబిక యొసఁగెన్. 60
వ. మఱియును. 61
క. తనయాయుధములవలనన్, సునిశితదివ్యాయుధములఁ ♦ జోద్యంబుగఁ గ
ల్పన సేసి నిజప్రియనం,దన యగుబాలాంబ కొసఁగెఁ ♦ దాత్పర్యమునన్. 62
సీ. వెండియుఁ దనదుకో♦దండదండమునఁ గ,ర్ణి రథంబు నొకటి ని♦ర్మించి దాని
నమ్మహాదేవి ని♦జాత్మజకు నొసంగ, నాలలితాంగి య♦త్యాదరమున
రాజమరాళతు♦రంగశతాన్వితం, బనుపమానర్ఘర♦త్నాంచితంబు
తప్తజాంబూనదా♦త్మక మతిమహిమాఢ్య, మై ప్రకాశించున♦య్యానరత్న
గీ. మెక్కి దిక్కులఁ దనుకాంతి ♦ పిక్కటిలఁగ, ఘనరణోద్యోగమునఁ బేర్చి♦కదలివచ్చు
నక్కుమారికఁ జూచి య♦త్యంతభక్తి, సర్వపర్వస్థదేవతల్ ♦ సంభ్రమమున. 63
క. అందఱుఁ గొక్కట సవినయ,వందనములు సలిపి మధుర♦వచనంబులచేఁ
గ్రందుగ డీనన లొసఁగిరి, ముందుగఁ దమకేలుదోయి ♦ ముకుళించి తగన్. 64
ఉ. పరుషదీఁ ప్తచక్రరాజరథ♦పర్వసమాశ్రితదేవతానమ
స్కారణము లాచరించుచుఁ బ్ర♦గాఢముదంబునఁ దద్రథంబు స
త్వరగతి డిగ్గ భూతలగ♦తం బగుశక్తిచమూసమూహ ము
ద్ధురతరహేలఁ జొచ్చె రణ♦ధూర్వహదోర్బల బాల లీలతోన్. 65
మ. అహితానీకవిభాల బాల యిటు లు♦గ్రాజిక్రియాగాఢన
న్నహనం బొప్పఁగ నేగుచుండఁ గని సై♦న్యం బంతయున్ వేగ న
మ్మహితప్రాభవవెంబడిన్ జటులశుం♦భత్తద్రణాలోకన
స్పృహతోఁ బోవఁగఁ జూచి దండినియు ము♦ద్రిణ్యంబయున్ భీతితోన్. 66
క. ఆయమఁ గూడఁగ నేగి త,దీయాననరోషచిహ్న ♦ దెలియఁగఁ గని చిం
తాయత్తతఁ బ్రార్థించి ర,మేయవినయభరితమధుర♦మితహితసూక్తిన్. 67
క. ఇదియేమి భర్తృదారిక, కదనముసేయంగ మేము ♦ గలుగఁగ నీవున్
మదు లైనదనుజపీరుల, నెదిరింపఁగఁ జనుట కెద్ది♦హేతువు చెపుమా. 68

క. పసిబాలవు నీవు దనుజు, లసమసమరసాహసులు మ♦హామాయులు శౌ
ర్యసమగ్రులు వారలతో, విసువక పోరాడఁబోవ ♦ విహితముమె నిన్నున్. 69

ఉత్సాహ. ఎంతలేసిపనుల కైన ♦ నేమె చాలియుండి దు
ర్దాంతశౌర్యశాలి నఘోర♦దైత్యులన్ వధింపఁగా
నింతి యిట్లు దరలిపోవ ♦ నేల నేను నీవు మా
పొంత నిలిచి చూచు మమ్ముఁ ♦ బోరిలోన నేర్పడన్. 70

గీ. రమణి మాకు నీ వమ్మహా♦రాజ్ఞి యట్ల, యమ్మహాదేవిమూర్తి మ♦త్ప్రాణ మీవు
నిన్ను నేమిటి కనిచె నా♦నిఖిలజనని, యసమయంబున నిట్లు ర♦క్కసులఁ దునుమ.

క. నీకుఁ బ్రణామము సేసెద, మోకమలదళాక్షి మేము ♦ యోపుదు మసురా
నీకనిఖండనరూపమహాకార్యంబునకు విడువు ♦ మాజిభరంబున్. 72

సీ. అని మంత్రినాయిక♦యును దండనాథయు, ననునయగాఢసాం♦త్వనము దోఁపఁ
దను నివారింప ను♦ద్దామభుజాబల, శౌర్య యాబాల య♦చ్చట నిలువక
దైత్యులమీఁది క్రో♦ధంబునఁ జనుచుండ, నద్దేవు లిద్దఱు ♦ నద్భుతంబు
దమమానసములఁ ద♦ద్దయుఁ బొడమంగ నా, కమలాక్షి కుభయపా♦ర్శ్వములనడచి

గీ. రాత్మబలములతోఁగూడ ♦ నక్కుమారి, కామణీరక్షణంబున♦కై సుహార
థంబు లెక్కి నిరంతరో♦త్సాహధైర్య, చటులసన్నాహనిశ్చయ♦సహిత లగుచు. 73

క. ఈరీతి మంత్రినాథయు, వారాహియు నుభయపార్శ్వ♦వర్తిను లగుచున్
భూరిధ్వజినీసంగత, లై రా నబ్బాల పరమ♦హర్షముతోడన్. 74

క. దమనకపాత్రికారద్వా,రమున వెడలి రాఁగ నామ♦రాళగమనఁ గాం
చి మహితసద్భక్తిఁ బ్రణామములు సలిపి రఖిలబలస♦మాజాధ్యక్షుల్. 75

క. అందఱుబలాధినాథ ల,మందం బగువినయమున న♦మస్కారము లా
నందముతోఁ జేయఁగ న,య్యిందీవరనేత్రి కరుణ♦నెనసినచూడ్కిన్. 76

క. వారిప్రణామాంజలులు గ,భీరాదర మెసఁగ గార♦వించి సకలసే
నారాజితోడ భండకు,మారులపై నడచె దివిజ♦మండలి యలరన్. 77

ఆ. ఆమహానుభావ ♦ యరివర్గము నడంప, నట్లు పోవునప్పు ♦ డద్భుతముగఁ
గెలఁకులను బిఱుంద ♦ లలితాబలము లెల్లఁ, దద్బలంబు లగుచుఁ ♦ దఱిసి నడచె.

వ. అప్పుడు. 79

క. కర్ణీరథశోభిత యా,కర్ణాంతవిశాలనేత్ర♦ఖంజన సుమనో
వర్ణితగుణ యగునవ్వార,వర్ణినిఁ గని సకలశక్తి♦వాహిను లలరెన్. 80

క. కొండికవడ విట్లు చమూ,మండలితోఁ గూడ నడచి ♦ మహితాత్మిక య
య్యండజయాన గనుంగొనె, భండాసురసుతులబలము ♦ పటుదోర్బలముల్. 81

క. కనుఁగొని యతికోపంబున, దనుజవరాత్మజులపై ని♦తాంతరయమునన్
సునిశితశరవర్షంబుల, ననుపమముగఁ గురిసె మింట ♦ నమరులు పొగడన్. 82

మ. నవవర్షంబులపాయ మింపెసఁగ న♦న్నాళీకపత్రాక్షియున్
బవిసంకాశకఠోరదేహములతో ♦ భండాత్మజాతుల్ మహా
హావముం జేయఁగ నిర్ఝరాదులకుఁ జి♦త్రాకారతన్ జూచువాం
ఛ విధించెన్ బరమాద్భుతప్రదము త♦త్సంగ్రామ మత్యుగ్రమై. 83

క. తమపై శరవర్షము సాం,ద్రముగాఁ గురియుచు నితాంత♦దర్పము మెఱయన్
దము సరకుగొననియబ్బా,లమహాశౌర్యమున కధిక♦లజ్జితు లగుచున్. 84

వ. తమమనంబున నిట్లని వితర్కించిరి. 85

గీ. చిన్న దని తల్లిచాటున♦ నిన్నిదినము, లున్న దని యెన్నఁడును మున్ను♦యుద్ధ మెఱుఁగ
దని శిరీషాభమృదులాంగి ♦ యని తలంచి,నా మహాహ యెంతవింతయీ♦నాతికడిమి.

వ. అని తలంచుచు. 87

క. దైత్యాధిపతికుమారకు, లత్యంతాద్భుతమనస్కు ♦ లగుచున్ గ్రోధా
ద్ధత్యమున నిల్చి పోరిరి, పీత్యుత్కర్షమున దేవ♦బృందము గనఁగన్. 88

క. ఒక్కతె యయ్యున్ బలువురు, రక్కసులు నిగుడ్చుశరప♦రంపర లెల్లన్
జక్కాడి వార లందఱు, వెక్కసపడ బాల యంప♦వెల్లువ వఱపెన్. 89

క. నొచ్చియు దైత్యాధిపతికి, నచ్చినవా రగుట యాఘు♦నభుజులు ధైర్యం
బచ్చుపడఁ బోరి బాలిక,హెచ్చునకున్ వెఱఁగునొంది ♦ యి ట్లనిరి మదిన్. 90

ఉ. ఈపసిబాలతో నెదుర ♦ నిందఱుఁ జాలకయున్నవార లెం
తోపనిపూని దైత్యపతి ♦ దుర్జయవిక్రముఁ డింతవట్టు నే
నాపతులన్ బలాఢ్యుల ర♦ణం బొనరింపఁగఁ బంపె నింతకే
యోపనియట్టులైన మన♦యుద్ధతి యేటికి శౌర్య మేటికిన్. 91

క. అని కోపాటోపంబున, దనుజకుమారకులు భర్తృ♦దారికతోడన్
ఘనబలము మెఱసి పోరఁగ, ననిమిషులు గనుంగొనంగ ♦ నాసమయమునన్. 92

క. అందఱియెదురన్ బాలా,సుందరి వేర్వేఱ నిల్చి ♦ సునిశితశరముల్
గ్రిందుగ నిగిడ్చినటు ల,య్యందఱకున్ గానవచ్చె ♦ నాశ్చర్యముగన్. 93

ఆ. దాన బెగడుగుడిచి ♦ దైత్యాధిపతనూజు, లక్కజంబు గాదె ♦ యొక్కబాల
పెక్కుబాల లగుచు ♦ రక్కసు లందఱుఁ, జిక్కువడఁగఁ బోరె ♦ నొక్కమొగిని.

క. అసి యుయ్యెలచేరులవలె, వెనుకకు వీఁగుచును జలము ♦ వెలయ మొనయుచుం
బెనఁకువ సేయుచు నుండిరి, దనుజకుమారకులు గ్రోధ♦తామ్రేక్షణులై. 95

క. అయ్యంబ రక్కసులతోఁ, గయ్యం బొనరించుచుండ ♦ క్షణమున కొకసా
రయ్యెడ లలితాదూతిక, లయ్యాజిక్షితికి వచ్చి ♦ యఖిలముఁ గనుచుం. 96

గీ. అమ్మహారాజ్ఞి కడకు ర♦యంబుమీఱ, నరిగి సమరవృత్తాంత మ♦య్యఖిలజనని
కెఱుఁగఁజెప్పుచునుండిర♦యియ్యాశ్వేరియు ముదంబునొందుచునుండెఁద♦ద్వార్త వినుచు.

వ. మఱియును. 98

సీ. ఆబాలికామణి ♦ యద్దానవాధిప,తనయులతోడ యు♦ద్ధంబు సేయఁ
దొడఁగినప్పటినుండి ♦ దురముసేయుట మాని, శ్యామలావారాహు ♦ లద్భుతంబు
దమహృదయంబుల ♦ సమధికం బగుచుండ, నయ్యంబహస్త వే♦గాతిశయము
తనతోడ నెదిరించు♦దానవు లెంద ఱం,దఱ కన్నిరూపముల్ ♦ తాని తాల్చి

గీ, బింబమాలికపోలికఁ బేర్చి పెనఁగు,నక్కుమారికవిక్రమ ♦ మఱి లలరఁ
గనుఁగొనుచు సేనలును దామ♦ఘనముదమున, నిలిచిరద్దేవిఁబొగడుచు♦నిశ్చయముగ.

ఉ. కాలభుజంగపావకశి♦ఖాప్రతిమానము లై నయట్టియ
బ్బాలమహాశరంబులు సు♦పర్వవిరోధులసర్వమర్మముల్
వ్రీలఁగఁ జేయుచుండఁగ స♦విస్మయు లై దివి సర్వనిర్జరుల్
మే లని సంస్తుతించిరి య♦మేయతదీయమహానుభావముం. 100

క. ఈతెఱఁగున దివి సురసం,ఘాతకృతస్తోత్రరవము ♦ జ్మాతలగతవి
ఖ్యాతబలశక్తి బలముల,యాతతనుతిరవము నొక్కఁ♦డై వీతెంచెం. 101

వ. ఇట్లు విజృంభించి యమ్మహారాజ్ఞీప్రియతనూజాత యతివిచిత్రకరలాఘవంబుగాఁ దొ
రంగించునిశితశిలీముఖపరంపరలచే నిర్జరాదులు జర్ఝరితశరీరులయ్యును జలంబున
నయ్యంబతోఁ దమయోపినభంగి సంగరంబు సేయుచుండ ద్వితీయయుద్ధదివసం బతి
క్రాంతం బగునంతదాఁక నిత్తెఱంగున వారితోఁ బో రొనర్చి యాసారసాక్షి యం
తట నూఱడక యంతకంతకు నిజబలంబు ప్రకటంబుగా నాసురద్వేషులు చేయా
డక వెగడుపడి చిత్రరూపులచందంబున నిల్చునట్లుగా నంపవెల్లువలు వఱపిన నది
గనుంగొని కార్యంబు దప్పె నని ద్విశతాక్షౌహిణీసంఖ్యంబు లగుతదీయబలంబు
లన్నియు నొండొండ పేర్చి యుగాంతకాలంబున సముద్రంబులు చెలియలికట్టల
నతిక్రమించి భూమిపైఁ బొరలివచ్చుపోలిక వారలం గడచి యమ్మహాదేవిపైఁ బఱ
తెంచి యనేకశస్త్రాస్త్రజాలంబులఁ గప్పిన నదియు యూఱటకు సమయంబుగాఁ
దలంచి యమ్మహావీరు లెడగల్గి సేదదీర్చుకొనుచుండఁ దత్సేనాప్రయుక్త బహువిధ

హేతివ్రాతంబుల సక్రమంబున ఖండించుచుఁ గుంభీంద్రంబులు గుంభినీధ్రంబులుగాఁ తురంగవ్రాతంబులు తరంగసంఘాతంబులుగా రథసమూహంబులు ద్వీపసందోహంబులుగా సుభటపరికరంబులు మకరాదిజలచరనికరంబులుగాఁ జతురంగకలకలంబు నిరంతరకోలాహలంబుగాఁ బెరిఁగినచ్చుతత్త్వైన్యసముద్రంబులోన నిజయానంబు స్యందనధరణీధరంబువిధంబున మెఱయ వివిధవిచిత్రసంచారంబుల నది యంతయుఁ గలఁగుండ్లుగాఁ జేసి యంతటఁ జూడ నవ్వాలుఁగంటి బాలిక యయ్యైను మహాప్రాజ్ఞ గావునఁ గాలవిలంబనంబు గాకుండఁ దద్రక్షోవాహినులనెల్ల నక్షణంబున నవలీలఁ బొరివడంచుటకు నుపాయంబు దలంచి. 102

క. దారుణరోషంబున నవ్వారిజదళనేత్ర దైత్య ♦ వరనందనచే
నారాజిఁ జూడఁ బన్ముఖ,సారస మరుణాంబుజాత ♦ సమతం దనరెన్. 103

వ. ఇవ్విధంబున రక్షోబలంబుల రూక్షేక్షణంబుల నిరీక్షించి యాహార్యక్షమధ్య నారాయణాస్త్రంబు సమంత్రకంబుగా నిజశరాసనగుణంబున సంధించి యాకర్ణాంతంబుగాఁ దిగిచి సౌవర్ణకంకణఝణఝణాత్కారంబులతోడంగూడ గగనమహీభాగంబులయందు నిలిచి కనుంగొనుచున్న గగనచరశక్తిసంఘంబులప్రశంసారవంబులు మ్రోయుచుండ దృష్టిగోచరం బగుదుష్టాసురసైన్యంబుమీఁదఁ బ్రయోగించిన నమ్మహనీయాస్త్రంబు వహ్నిశిఖామయంబు లై యపరిమితశస్త్రాస్త్రరూపంబుల నపరబలంబులపైఁ గవిసి క్షణమాత్రంబున భస్మంబు చేసిన నది గనుంగొని యత్యంతాద్భుతరసాక్రాంతహృదయులై చతుర్బాహుప్రముఖు లైన దానవేంద్రకుమారులు ద్విశతాక్షౌహిణీపరిమితబలక్షయసంజాతఖేదంబున నుద్గతక్రోధోన్మాదులై యక్కజంబుగా నుక్కున నొక్కపెట్ట నక్కాంచనాంగిపై నురవడించిన. 104

ఉ. ముప్పదియర్ధచంద్రశర ♦ ముల్ వెస నొక్కట నారిఁబోసి కన్
ఱెప్ప విదిర్చుమాత్రమున ♦ ఱివ్వున దైత్యులయుత్తమాంగముల్
ముప్పదియొక్కపెట్ట రణ ♦ భూస్థలి వ్రాల్చఁగ నేసెఁ జూచి య
ప్పప్ప మహాద్భుతం బని ది ♦ వౌకసు లెన్నఁగ బాల హేలతోన్. 105

గీ. భండతనయు లివ్విధమున ♦ భండనమునఁ, గూలి యందఱు దండధ ♦ రాలయమున
కరుగుటయు విస్మయమున నిం ♦ ద్రాదిసురలు,కుసుమవర్షముల్ బాలపైఁ ♦ గురిసిరపుడు.

గీ. శాత్రవజయంబుచేతఁ బ్ర ♦ శస్తిగాంచు,నమ్మహారాజ్ఞితనయ న ♦ త్యాదరమున
దండనాథయు మంత్రినా ♦ థయు ముదమునఁ, గౌఁగిలించిరి వేర్వేఱఁ ♦ గౌతుకమున.

మ. అతిలోకం బగుతత్పరాక్రమమునన్ ♦ హర్షించుచున్ శక్తిసం
తతు లాశ్చర్యరసాబ్ధిమగ్న లగుచున్ ♦ హార్దంబునన్ సాధువా

క్రతు లుచ్చైస్స్వర మొప్పఁ బల్కుచు మదా♦ధ్యత్వంబుతో నాడుచున్
శ్రుతిసౌఖ్యంబుగఁ బాడుచుండిరి ముద♦శ్రుస్రావనేత్రాబ్జలై. 108

ఉ. అంతట మంత్రనాయికయు ♦ నక్కుటివక్త్రియు భర్తృదారికన్
జెంతఁ బురస్కరించుకొని ♦ శీఘ్రము యాజగదంబపాలికిన్
సంతతసర్వశక్తిబల♦సంఘము గొల్వఁగ నేగి యుద్ధవృ
త్తాంత మశేషముం దెలుప ♦ నయ్యఖిలేశ్వరి యాదరంబునన్. 109

చ. తనయపరాక్రమంబునకుఁ ♦ దద్దయు సంతసమంది ప్రేమ న
వ్వనితఁ గవుంగిలించి యని♦వారితమోహమునన్ శిరంబు మూ
ర్కొనుచుఁ గపోలయుగ్మకము ♦ కూరిమి ముద్దులుగొంచు వేడుకం
దనతొడమీఁద నుంచి విది♦తం బగులాలన చేసి వెండియున్. 110

క. లలితాంబ కూఁతుపయి నర్మిలితో నన్నలినేత్రి♦మేను కరతలం
బుల నివురుచు నానందాశ్రులు గనుఁగొలుకులను జాఱ ♦ సొంపు వహించెన్. 111

ఉ. తక్కినసర్వశక్తిసము♦దాయము లప్పుడు దృష్టపూర్వ మా
నక్కలహంసగామినిమ♦హత్తరశౌర్యముఁ గాంచి యీవిధం
బక్కజ మంచు నాత్మలఁ బ్ర♦హర్షము నొందుచుఁ దేనెజాలు నే
ల్వాకలఁ దన్మహామహిమ ♦ వర్ణనచేసిరి పెక్కుభంగులన్. 112

వ. అని చెప్పి హయగ్రీవుండు వెండియు నగస్త్యమహామునీంద్రున కిట్లనియె. 113

పంచచామరము. హతావశిష్టులైనయట్టి♦యాతుధాను లార్యగ
ర్హితాగ్రగణ్యుఁడైనదాన♦వేంద్రుపాలి కేగి త
త్సుతవ్రజంబువార్తఁ దెల్ప ♦ సోలి కొంతసేపు ని
ర్గతాసురీతి నుండి తేఱి ♦ గాఢశోకతప్తుఁడై. 114

క. కొంతవడి యేమి దోఁచక, చింతాకులహృదయుఁ డగుచుఁ ♦ జేడ్పడి మది నం
తంతకుఁ గ్రమ్మెడుగాటపు,వంత మునిఁగియుండె దైత్య♦వర్యుండు గడున్. 115

గీ. పదపడి తనంతఁ దనకు సం♦ప్రాప్తమైన,కులవినాశంబునకు నాత్మఁ ♦ గుంది సుతుల
రూపయౌవనశౌర్యప్ర♦తాపముఖ్య,గుణములు దలంచి పలవించెఁ ♦ గోలుది మీఱ.

సీ. హా సమస్తామరా♦ద్యరిపరాభవకారు,లార హా జగదేక♦వీరులార
హా మదీయవిలోచ♦నామృతపూరాభు,లార హా సద్గుణో♦దారులార
హా సుందరీవితా♦నాలోకకందర్పు,లార: హా విజయవి♦హారులార
హా యమేయమదస్వ♦వాయువివర్ధను,లార హా శరధిగం♦భీరులార

గీ. హా మదేకపరాయణ♦స్వాంతులార, హా గురుసమూహసేవాను♦రాగులార
హా యశోధనకారణో♦పాయులార, హా రసాధారులార కు♦మారులార. 117

సీ. కల్లనైన మీకు భం♦గము గల్గు ననుమాట, విననైతి నింతకుఁ ♦ దనయులార
మిము నోర్వఁజాలెడు♦మేటిబలం బెట్లు, పడఁతికిఁ గల్గెనో ♦ కొడుకులార
యయ్యింతికిఁ గెడపుసా♦మర్థ్యంబు గల దని, పూని పంచితి మిమ్ముఁ ♦ బుత్రులార
స్త్రీమాయముందర ♦ దితిజవీరులశౌర్య, మూన మయ్యెం గదా ♦ సూనులార

గీ. మీరు లేకున్నఁ బశుధనా♦గారరాజ్య,భామినీమిత్రచతురంగ♦బలసమృద్ధు
లించుకైనను శోభించు♦నే తనూజు,లార సద్గుణమణ్యాలం♦కారులార. 118

గీ. ఏకపదమున నొకబాల ♦ హేలతోడ, నప్రధృష్యభుజాబలు ♦ లైనమిమ్ము
నామమడఁచె ననంగ నే ♦ నమ్మఁజాల, నకట విధికి నసాధ్య మెం♦దైనఁ గలదె. 119

వ. అని పలుదెఱంగుల విలపించి మఱియుఁ దనపూర్వజన్మకృతసుకృతవిశేషంబునఁ దాదృశసుగుణభూషణనందనసందోహలాభమోదంబును దనజన్మాంతరకృతదుష్కృతశేషంబునఁ దత్సమయసంప్రాప్తతద్విషయఖేదంబు నుగ్గడించి తత్కారణంబునఁ దన్ను నష్టుండును హతప్రాయుండును విపన్నుండును మందభాగ్యుండు నైనవానిఁ గాఁ దలంచుచుఁ గన్నుల బాష్పకణంబులు దొఱుఁగఁ గేశపాశంబు విరియఁ బైపై గ్రమ్ము మూర్ఛలచేత సింహాసనంబుననుండి వ్రాలుచు మగుడఁ దేఱుచు హృదయభేదకం బైనవిషాదంబునఁ జిక్కువడియున్నయాదానవసార్వభౌమునిం గని విశుక్రుండును విషంగుండును గుటిలాక్షుండును డగ్గఱి యుచితవాక్యంబుల నతనికుందు మాన్పఁ దలంచి భయభక్తివినయనిభృతంబుగా ని ట్లనిరి. 120

క. ప్రాకృతుఁడుఁబోలె నీ విటు, శోకంబునఁ గుందఁ దగునె ♦ శూరత నహితా
నీకములతోడఁ దొడరి స,మీకంబునఁ బడినసుతస♦మితికై యధిపా. 121

గీ. మహితధర్మపాణింధమ♦మార్గ మాజి, శూరులకుఁ గావున భవత్కు♦మారు లెల్ల
నధికశూరులమార్గము♦నందు నడచి, రసురనాయక దీనికి ♦ నడల నేల. 122

సీ. అపకీర్తికారణం ♦ బైయున్న దొక్కటి, తలపోసి చూచిన ♦ దానవేంద్ర
యది యెట్టి దనిన దు♦ష్టాంగన యొక్కతె, తనయట్టివారలఁ ♦ దలిరుఁబోండ్లఁ
గొందఱఁ దోడుగాఁ ♦ గూర్చి రాక్షసులపై, దండెత్తి పటుభుజా♦దర్ప మొప్ప
దైవతాసాధ్యు లౌ♦దనుజవీరుల నెల్ల, నాజిలోపలఁ గూల్చె ♦ ననెడువార్త

గీ. యఖిలజగములలో నిండె ♦ నద్భుతముగ, నింతకంటెను హీనత ♦ యెద్ది మనకు
నట్లు గావునఁ బ్రతికార ♦ మాచరింప,వలయు దీనికి నిపుడు న♦త్వరము గాఁగ. 123

క. ఇది విధికృత మత్యద్భుత, మిదమిత్థం బని వచింప ♦ నేరికయినఁ దోఁ
చదు మదిఁ దలంప నొకచిన్నది భవదాత్మజుల నెట్లు ♦ నామమడంచెన్. 124

గీ. అని విశుక్రాదు లాడువా♦క్యములవలన, స్త్రీకృతపరాభవంబు హృ♦ద్భేదకముగ
వీడ్చచే నల్కచే దైత్యవిభునిఖేద, మంబుదము వాయుహతిఁ బోలె ♦ నపుడ విరిసె.

వ. ఇట్లు శోకంబు నుజ్జగించి. 126

క. కరవాలము గొని నక్తం,చరకుంజరుఁ డుగ్రభంగి ♦ జళిపించుచు ను
ద్ధురరోషవహ్ని యంతః,కరణారణ్యము దహింపఁ♦గా ని ట్లనియెన్. 127

క. మీ రెల్లను నాకుం దోడ్డై రావల దిచట నిలువు ♦ డందఱు నే న
ద్దారుణరణభూమికిఁ జని, యారమణికిఁ దోషువచ్చి♦నట్టి నెలఁతలన్. 128

గీ. తరతరమ తుర్పించివైచి యా♦తలిరుఁబోఁడి, నతినిశితమత్కృపాణధా♦రాభినిహతి
నింతలింతలు గాఁగ ఖం♦డింతు నిపుడ, దనుజవరులార కనుఁడు మ♦ద్ఘనబలంబు. 129

చ. అని గమనోన్ముఖుం డయిన♦యారజనీచరసార్వభౌమునిం
గని భయకంపితాంగు లయి ♦ గాఢరయంబున మోడ్పుఁగేలు చ
య్యన నొసలన్ ఘటించి తగ♦వా దితిజాన్వయవార్ధిచంద్ర యి
ట్లనుపమసాహసం బనుచు ♦ నడ్డమువచ్చి నిశాటు లందఱున్. 130

క. కాలయమసదృశ మగుకర,వాలము సలుపుచును ద్రాఁచు♦బాముువిధమునన్
వాలికయూర్పు విడుచుతమ,యేలికతో నిట్లు లనిరి ♦ హితమితఫణితిన్. 131

గీ. స్వామి నీ వొంటిగా నిట్లు ♦ చనఁగ నేల
యావనిత నోర్చ్పవనికి నీ♦యాజ్ఞఁ బూని
యెంతకార్య మైనను నిర్వ♦హించునట్టి
యేము గలుగంగ నిది మాకు ♦ నెఱుఁగఁ జెపుమ. 132

క. భవదీయాజ్ఞాబలమున, భువనంబుల మూఁటినైన ♦ బొలియింపఁగ దా
నవనాథ సమర్థుల మే, మువిద లనఁగ నెంత మాకు ♦ నువ్వోత్తుగొనన్. 133

ఉ. పీల్తుమె సర్వవారిధులఁ ♦ బ్రేల్తుమె సర్వచరాచరంబులన్
గూల్తుమె మేరుశైలము వ♦గుల్తుమె పద్మభవాండభాండముల్
రాల్తుమె సర్వతారకల ♦ వ్రాల్తుమె యష్టదిగీశసంఘమున్
ద్రీల్తుమె యాధరాస్థలి యి♦సీ నరివత్తురె మాకు భామినుల్. 134

శా. త్రైలోక్యంబును గ్రిందుమీఁదుగ నొన♦ర్పన్ సర్వదేవావలిం
దూలింపన్ గులశైలరాజముల ను♦న్మూలించి భక్షింపఁగా

వ్యాళాధీశమహోగ్రదంష్ట్రికల స♦మ్యాటంబుగాఁ బట్టి యు
య్యేల ల్వేఁడుక నూఁగఁగా నయినమా ♦ కిమ్మాజ్ఞ దైత్యేశ్వరా. 135

క. ఆముగ్ధాంగనతో సం,గ్రామముసేయంగ లజ్జ ♦ గదిరెడు నైనన్
మీఁదికి నిష్టమేనిన్, భామన్ దోడరంగ మమ్ముఁ ♦ బంపు మధీశా. 136

గీ. అని మహాక్రోధమానస♦దాంధు లగుచుఁ, బలుకువాక్యంబు లాలించి ♦ భండదైత్యుఁ
డతిశయప్రోత్థరోషర♦క్తాక్షుఁ డగుచు, నవ్విశుక్రున కిట్లని ♦ యానతిచ్చె. 137

ఆ. మహితభుజబలమున ♦ మాయాబలంబున, నస్త్రశస్త్రపటుమ♦హాబలమున
నీకు సాటి లేరు ♦ లోకత్రయములోన, నోవిశుక్ర కార్య ♦ మొకటి వినుము. 138

క. మాయాంతర్హితకాయుఁడ, వై యెవ్వఁడుఁ గానకుండ ♦ నతినిభృతముగాఁ
బోయి జయవిఘ్ననామమ,హాయంత్రము చేసి వైవు ♦ మరిసైన్యములోన్. 139

క. విఘ్నమహాయంత్రము ని,ర్విఘ్నముగాఁ జేయ శక్తి♦విసరము నిద్రా
నిఘ్న మయి పోలియు నాసా,దఘ్నము గద నీదుకడిమి ♦ దైవతతతికిన్. 140

క. అని యగ్రజుఁ డానతియి,చ్చిన నట్టుల కాక యంచు ♦ శీఘ్రమ రిపువం
చనకుశలుఁ డగువిశుక్రుఁడు, ఘనమాయాంతర్హితాత్మ♦కాయుం డగుచున్. 141

క. చనియెన్ లలితాబలములఁ, దనయంత్రబలంబుచేతఁ ♦ దద్దయు జాడ్యం
బునఁ గొందల మందించెద, ననియెడుదుర్బుద్ధిచే ర♦క్షారూఢుండై. 142

గీ. అంతఁ డటు పోవునప్పు డ♦బ్జాప్తుఁ డరుణ,కిరణసముదాయపాటలీ♦కృతసమస్త
దిగ్వధూమండలుం డయి ♦ తీక్ష్ణతావి,యుక్తుఁడై యేగె నస్తాద్రి♦యోలమునకు. 143

క. చరమాద్రిమఱుఁగునకుఁ జను,హరిదశ్వునిఁ గాంచి యతని ♦ ననురాగముతో
గిరికుంజంబునఁ గూడఁగ, నరుగుకరణి సంధ్య యరిగె ♦ నతివేగమునన్. 144

ఆ. పద్మమిత్రతీవ్ర♦పాతసముత్థిత,పశ్చిమాబ్ధితోయ♦బహులబిందు
సమితి వోలె నెరసెఁ ♦ జదలఁ దారాగణం, బంబరద్రుమసుమక♦దంబ మనఁగ. 145

గీ. అతిదురాచారుఁ డగువిశు♦క్రాసురునకుఁ, దోడుపడ వచ్చెనో నాఁగఁ ♦ దోడుతోడ
నంధకారంబు నిండె రో♦దోంతరమున, బహులకజ్జలకాంతిచేఁ ♦ బరిఢవిల్లి. 146

క. బంధురబలుఁడు విశుక్రుం, డంధతమసలీననిజమ♦హామాయాసం
బంధిరథారూఢుండై, గంధవహాప్తవనంబు♦కడ కేగి వెసన్. 147

క. శతయోజనవిస్తారం, బతిశయకీలాకరాళ ♦ మై వెలుఁగుమహో
న్నతవహ్నిసాలవలయము, దితిజుఁడు గని దానిఁ జొరఁగఁ ♦ దెరువు వెదకుచున్.

గీ. తిరిగివచ్చి తద్దక్షిణ♦దేశమున సు,రక్షితం బైనయొక్కద్వా♦రంబుఁ గాంచి
యచటఁ క్షణమాత్ర మతివిస్మ♦యమున నిలిచి, శక్రమదహారి యైనవి♦శుక్రుఁ డపుడు.

సీ. ఆరూఢవాహను ♦ లై కవచచ్ఛన్నగాత్రు లై కోదండ♦కాండఖడ్గ
ముద్గరతోమర♦ముసలాదిశస్త్రాస్త్రపాణులై స్తంభినీ♦ప్రముఖ లైన
శక్తులు పేర్చి విం♦శతిసంఖ్య గలిగిన, యక్షౌహిణులతోడ ♦ నతిదృఢముగ
ననోన్యబోధిక♦లై యహోరాత్రంబు, నేకాగ్రదృష్టిచే ♦ నెల్ల గనుచు
గీ. దండనాథాజ్ఞ శిరమునఁ ♦ దాల్చి సావ,ధానముగ వహ్నిసాలంబు♦ద్వారదేశ
మున వసించుటఁ గనుఁగొని ♦ దనుజుఁ డధిక, విస్మయావిష్టుఁడై చొర ♦ వెరవు లేక.
క. కొంతదడ వేమి దోఁచక, చింతాక్రాంతుఁ డయి నిలిచి ♦ శిఖిసాలబహిః
ప్రాంతమున విఘ్నయంత్రము, నెంతయు వైచిత్రిఁ జేయ ♦ నిచ్ఛ వహించెన్. 151
వ. ఇ ట్లుద్యోగించి. 152
సీ. గవ్యూతిమాత్రదై ♦ ర్ఘ్యము నంత పఱపును, గలిగినయొకశిలా♦తలమునందు
సకలదిక్పాలాగ్ర♦సంస్థితం బగుచుండ, సంహారసంజ్ఞబీ♦జంబు వ్రాసి
యలసాది యాదేవ♦తాష్టకం బెల్లచోఁటుల యథాక్రమముగా ♦ లలి లిఖించి
తదుచితమంత్రతం♦త్రవిధానములచేతఁ, బూజావిధిసమగ్ర♦ముగ నొనర్చి
గీ. కోటవెలుపలనుండి యా♦క్రూరచిత్తుఁ
డామహాయంత్రపాషాణ ♦ మరిబలంబు
నడుమఁ బడ వైవఁ దత్కార♦ణమున శక్తి
సైన్యముల కెల్ల నపు డను♦త్సాహ మొదవె. 153
వ. ఇవ్విధంబున దురాత్ముం డైనవిశుక్రుండు శక్తిసేనామర్దనంబు సేయంబూని వహ్నిప్రాకారమధ్యంబున సురక్షితం బై యున్నయాలలితాబలంబునడుమ విఘ్నయంత్రంబు వైచినఁ దత్ప్రభావంబున శిబిరంబునఁ గలిగినశక్తు లందఱు రణోత్సాహంబు వదలి దీనమానసలై శస్త్రాస్త్రంబులు పడవైచి తమలో ని ట్లనిరి నిష్కారణం బసురుల వధియింప మనకు నేమిఫలంబు గలుగు శస్త్రాస్త్రవ్యాపారంబువలన నయ్యెడి దేమి జయసిద్ధివలన నేమిలాభంబు ప్రాణిహింస పాపకర్మం బగుటకు సంశయంబు లేదు దేవకార్యంబునకుఁ గదా మన కీప్రయోజనంబు వారలప్రయోజనంబు సఫలం బైన మన కేమిమేలు సంభవిల్లుఁ బరమర్మభేదు లైనయాయుధంబులఁ జేపట్ట నేల యహింసాపరమోధర్మ యనియెడువాక్యంబు విందుమకాదె యదియట్లుండె స్వశరీరరక్షాప్రతికూలం బైనయాలంబు నుజ్జగించుట లెస్స యె ట్లనిన మరణంబునకు వెఱవక కలహింపవలయుఁ బ్రత్యక్షం బైనజీవితంబు నిరర్థకంబు చేసి పరోక్షం బైన స్వర్గంబు నపేక్షించి రణమరణంబుఁ గోరనేల సమరనిధనంబు స్వర్గదాయకం బగుటకు నేమి ప్రమాణంబు కేవలసుఖావహ మైననిద్రయుఁ జిత్తవిశ్రాంతిప్రదం బైనయాలస్యం

బును నవలంబించి సుఖంబున నుండుద మిట్లున్న మనతలం పెఱింగి యమ్మహారాజ్ఞి యేమి సేయఁగల దయ్యంబికరాజ్ఞీత్వంబు మనయందజేయైకమత్యానుసరణంబునఁ బ్రతిష్ఠాపితం బై నదిగదా యిత్తెఱంగున నిందఱు నుపేక్షచేసినట్లైనఁ దద్ర్రాబల్యం బెట్లుసాగు న ట్లగుట లలితాదేవి మనలఁ గోపించు ననుభయంబు వలవదు మనకు నిప్పుడు దోఁచినయాలోచనమార్గంబున నిందఱము నడుత మెల్లశుభంబులుఁ గలుగు నని మఱియు ననేకవిధంబు లైనవిపరీతాలాపంబు లాడుచు నిద్రాలస్యాదివికార విఘూర్ణమాన లై యుండుటఁజేసి యక్కటకంబున సర్వకార్యంబులయందును మాంద్యంబు గలిగె నిట్లు సేనాసన్నివేశంబు శిథిలంబై చేష్టడియుండుటఁ దెలిసి విశుక్రుండు నిర్విఘ్నంబుగాఁ దాను ప్రయోగించినజయవిఘ్నమహాయంత్రంబుప్రభావంబున నిద్రితప్రాయం బై నయాసైన్యంబుపైఁ బడి నిర్దయంబుగా మర్దింప నుద్యోగించి ద్వితీయయుద్ధదివసంబునర్ధరాత్రసమయం బతిక్రాంతం బగునప్పుడ రయంబున నిజనగరంబునకుఁ జని ముప్పదియక్షౌహిణులబలంబుఁ గూడుకొని యతిశీఘ్రంబున మగిడి శత్రువాహిని డగ్గఱ వచ్చునప్పుడు రక్షోవరూధినియఁ దక్షిణంబులై భేరీభాంకారంబులు రోదోంతరపూర్ణంబులై బోరుకలుగుచుండ నది వినియు నిరుద్యోగలై యనుద్వేగ లగుచు శక్తులెల్ల నిద్రాలస్యాదిసక్తులచేత నశక్తలై యూరకుండిరి తత్సమయంబున మహానుభావ తొంట విఘ్నయంత్రజాతంబు లైనవికారసంఘాతంబుల నేమియుఁ బొరయక పూర్వప్రకారలై యున్నమంత్రిణీదండనాయికలు తాదృశదుర్దశాధీన యై యతిదీన యైననిజసేనఁ గనుంగొని యహా యిమ్మహాకష్టం బీయనీకంబున కెట్లు వచ్చె శాత్రవసైన్యంబులోని భేరీమృదంగాదివాద్యనిస్వనంబులును దదీయసింహనాదధ్వనులును వినియు నిరస్తసమస్తాయుధసన్నాహలై నిర్గతరణోత్సాహలై నిద్రాలస్యతంద్రప్రముఖదుర్వికారవిఘూర్ణమానలై నిరభిమాన లై నశక్తులు మనవాక్యంబు లాదరింపక యమ్మహేశ్వరియందు నుదాసీనభావంబు గలిగి నిస్పృహలై యున్నవా రని చింతాకులమానసలగుచు నయ్యిద్దఱుఁ జక్రరాజరథోత్తమంబు నారోహించి యమ్మహారాజ్ఞిసమీపంబునకుఁ జని వినయవినమితోత్తమాంగ లై రప్పుడు శ్యామలాదేవి యమ్మహానుభావతో మెల్లన నిట్లని విన్నవించె. 154

గీ. ఓమహాదేవి యిది యేమి♦యో తలంప, నిపుడు శక్తులుత్సాహవి♦హీన లగుచు
విశ్వపాలని యై యిందు ♦ వెలసినట్టి,నీదునాజ్ఞ యుల్లంఘించి ♦ నిర్భయముగ. 155

సీ. కర మరుదుగఁ బర♦స్పరవిరాగిణు లౌచు, సమరకార్యముల న♦ద్యమము వదలి
మంపు నిద్రయుఁ దమ్ము ♦ ముంపఁగా దుష్టవా,క్యము లాడఁజొచ్చిరి ♦ సమదవృత్తి

వారాహి యనఁగ ♦ నెవ్వరు శ్యామల యనంగ, నెవ్వరు లలితామ♦హేశ్వరి యన
నెవ్వరు మన కీర♦ణేచ్ఛ యే లనుచు నా,క్షేపం బొనర్చుచుఁ ♦ జాపలమునఁ
ఆ, దోఁచకున్నవారు ♦ దుష్టు లౌశాత్రవు, లిది సమస్త మెఱిఁగి ♦ యదను వేచి
యిపుడు రయముమీఱ ♦ నేతెంచి రిదిగొ త,ద్భేరికారవం బు♦దారి మయ్యె. 156
క. ద్యావాభూమిభృతతదా,రావము వినియుఁ రణాద♦రము శాత్రవశౌ
ర్యావష్టంభముఁ దలఁపక, యీవిధమున నూరకుండి ♦ రిందఱుక్తుల్. 157
గీ. ఈబలవ్యసనంబు మీ ♦ రిపుడు మట్టు,పఱిచి రక్షింపవలయు ని♦దఱఁ గృపాత
రంగితాంతరంగంబుతో ♦ రాజ్ఞి యిట్టు, లైన వీరలు సాధింతు ♦ రరిబలముల. 158
క. అని దండనాయికయుఁ దా,నును మనవి యొనర్చి విబుధ♦నుత యగు త్రిజగ
జ్జననిపదాంబుజయుగళం,బునకుఁ బ్రణామంబు చేసె ♦ ముద్రిక భక్తిన్. 159
క. ఆయిరువురమనవి విని కృ,పాయత్తమనస్క యగుచు ♦ నంబ నిజమనో
నాయకవదనాంబుజ మన,పాయప్రేమమున వేడ్క ♦ నాలోకించెన్. 160
గీ. దంతకోరకకాంతులు ♦ ధవళమంద,హాసరుచులును గలసి బిం♦బాధరోష్ఠ
మండలముఁ గ్రమ్మ నిట్లు వే♦దండయాన,ప్రాణవిభుమోముఁ గనుఁగొన్న ♦ యంతలోన.
ఉ. ఆమహితానుభావవిమ♦లాస్యసరోజగతస్మితప్రభా
స్తోమమునన్ జనించెఁ గర♦ధూతకులాచలుఁ డంచితాంగశో
భామహిమావధీరితజ♦పాప్రసవప్రకరప్రకాశుఁ డై
సామజవక్త్రుఁ డద్దివిజ♦సంఘము నెమ్మది సంతసింపఁగన్. 162
సీ. ఆశ్రితవ్రజసమ♦స్తాభీష్టదాయకుం, డమరాద్రిసదృశదే♦హాంచితుండు
సిద్ధలక్ష్మీసమా♦శ్లేషహృష్టాత్ముండు, శతకోటిసదృశని♦శాతదంతుఁ
డధికబృంహితనాద♦బధిరితాశాగజుం, డసురసంహారబ♦ద్ధాశయుండు
దానధారార్ద్రగం♦డస్థలీయుగళుండు, బాలేందుమకుటవి♦భాసురుండు
గీ, శంఖచక్రగదేక్షువ♦చాపపాశ,మాతులుంగోత్పలవ్రీహి♦మంజరీస్వ
కీయరదనాగ్రిమణికల♦శాయతత్రి,శూలహస్తుఁడై మెఱసె న♦వ్వేలుమగఁడు. 163
గీ. అట్లు జనియించి యవ్వార♦ణాస్యుఁ డఖిల,జననికతిభక్తితోడ వం♦దనము చేసి
తత్కృతాశీఃప్రహృష్టుఁడై ♦ తత్క్షణంబ,చనియె జయవిఘ్నయంత్రభం♦జనమునకును.
సీ. అట్లమ్మహారాజ్ఞి♦యాజ్ఞఁ గైకొని యాశ్రి,తాదరుండై నలం♦బోదరుండు
డాకతోఁ జని శిఖి♦ప్రాకారవలయంబు, నంతట జయవిఘ్న♦యంత్ర మరసి
యొక్కచో గూఢమై ♦ యున్నయంత్రాశ్మంబుఁ, గని. దాని ఘోరని♦ర్ఘాతసదృశ
నిష్ఠురదుస్సహా♦నిశితదంతాగ్రని,పాతంబులఁ బదాభి♦ఘాతములను

గీ, వరుసఁ బ్రత్యర్థదుష్టదే◆వతలతోడఁ, దక్షిణము చూర్ణముగఁ జేసి ◆ తత్పరాగ
మెలమి మింటఁ దూర్యత్రైస◆హింసనాద,భరితులై నిర్జరులు దన్నుఁ ◆ బ్రస్తుతింప.
గీ. అపుడు కిలకిలారావంబు ◆ లడర శక్తి,గణము లాలస్యనిద్రావి◆కారరహిత
వృత్తులై సంగరము సేయు◆వేడ్కతోడ, సర్వసన్నాహసంపదఁ ◆ జాల నొప్పె. 166
క. అసమయంబున వేడుక, నాసానుజవదనుఁ డద్భు◆తావహలీలం
భాసురుఁడై తనయట్టిమ,హాసత్త్వుల నిజముఖంబు◆నందు సృజించెన్. 167
ఉ. ఏనుఁగుమోముసామి యిటు ◆ లిచ్చఁ దలంచినమాత్రలోనఁ బె
క్కేనుఁగుమోముసాము లుద◆యించి సదా స్వకపోలనిర్గళ
ద్దానజలప్రలుబ్ధసమ◆దభ్రమరవ్రజగీయమానులై
సానుమదాభులై దనుజ◆సంహరణప్రవణస్వభావులై. 168
క. వికసద్దాడిమకేసర,నికరచ్ఛాయాపహాస◆నిజతనురుచులై
సకలసముద్రోదకముల, నొకయెత్తునఁ గ్రుక్కఁగొనఁగ ◆ నోపినవారై. 169
సీ. మునినుతచరితు లా◆మోదుఁడు మొదలైన,విఘ్నేశు లార్వురు ◆ విదితశౌర్యు
లాబుద్ధిముఖ్యశ◆క్త్యావళితోఁ గూడి, సప్తకోటిగణేశ◆సంఘములకు
నధిపతు లగుచు న◆య్యాదివిఘ్నేశ్వరు,ముందఱ నత్యంత◆మోద మెసఁగ
బృంహితధ్వానముల్ ◆ పృథివీనభోంతర,పూర్ణంబులై పేర్చి ◆ బోరుకలుగ
గీ, నడచి రివ్విధమున గజా◆ననుఁ డనేక,దంతిముఖసేనతోఁ గూడ ◆ దనుజసైన్య
మర్దనము సేయఁ బూని య◆మర్త్యు లలర,వెడలె వహ్నిప్రాకారద్వార◆వీథివలన. 170
గీ. ఇత్తెఱంగున వెడలి య◆య్యిభవదనుఁడు, కోటవెలుపలఁ ద్రింశద◆క్షౌహిణీక
కుటిలాక్షుసేనలు ◆ గొలువఁ గడిమిఁ, బేర్చినవిశుక్రుఁ గని రోష◆భీషణముగ. 171
గీ. గాఢహుంకార మడర నై◆కువశరాస,ముక్తశితశరవృష్టుల ◆ ముంచి నొంచెఁ
దనదుకరలాఘవముఁ జూచు◆ననిమిషాళి, కనిమిషత్వంబు సార్థకం◆బై రహింప.
చ. అపుడు తదీయ మాబహుగ◆జాననసైన్యము పేర్చి దానవా
ధిపతిబలంబుపై కుఱికి ◆ తెంపున బృంహితనాదసర్వవి
ష్టపబధిరత్వకారి యయి ◆ చక్కడిచెన్ సుభటౌఘఘోటక
ద్విపరథమండలంబులఁ బ్రి◆దీప్తపరాక్రమదుర్నిరీక్ష్యమై. 173
క. హేరంబదేవుఁ డప్పుడు, దారుణశస్త్రాస్త్రతతుల ◆ దైత్యబలములన్
మారి మసంగినకైవడిఁ బారిసమరె గర్జితాతి◆భయదుం డగుచున్. 174
క. బలములఁ దెగటార్చుచు న,గ్గలపుఁగడిమిఁ బేర్చి వచ్చు◆గజముఖుఁ గని యి
ట్టుల మైనయలుకతోడన్, దలపడియె విశుక్రుఁ డతని◆దానవు లలరన్. 175

మ. గణనాథుండు విశుక్రుఁడున్ నిజభుజా♦గర్వం బఖర్వంబుగా
గుణటంకారము రోదసీభరిత మై ♦ ఘూర్ణిల్లఁ గ్రూరాస్త్రముల్
గణనాతీతముగాఁగ నొండొరుపయిన్ ♦ గాఢంబుగా నేయుచున్
రణ మత్యుద్భటభంగి సల్పి రమర♦వ్రాతంబు కీర్తింపఁగన్. 176

గీ. కోపదంష్ట్రాధరములు భ్రూ♦కుటియుతములు, నధికపాటలములు భీష♦ణాట్టహాస
భాసురము లైనమోముల♦తో సమరము, సలిపిరి గజాననుండు ని♦శాచరుండు. 177

క. దొర లివ్విధమునఁ దలపడి, దుర మొనరింపంగఁ జూచి ♦ దుర్దమగతి న
య్యిరువురసైన్యంబులుఁ జెచ్చెర వారలఁ గడచి తాఁకెఁ ♦ జిత్రము గాఁగన్. 178

వ. ఇవ్విధంబున. 179

క. దానవసైన్యంబులు ద్వి,దానవసైన్యంబులును మ♦హాద్భుతభంగిన్
బూని రణం బొనరించె న,నూనధృతిన్ సురలు మింట♦నుండి పొగడఁగన్. 180

వ. ఆసంకులసంగ్రామంబున శస్త్రాస్త్రసంఘట్టననిస్వానంబులును బహులరథచక్రనేమిఘుర్ఘురధ్వానంబులును గజేంద్రబృంహితనాదంబులును నుద్భటసుభటప్రకరవీరవాదంబులును దురంగహేషావిశేషంబులును దక్షుద్దాలకుట్టనఘోషంబులును నవక్రనక్రచాత్కారంబులును నిశితశరనికరఝాత్కారంబులును భేరీమృదంగాదితూర్యనినాదంబులును శూరవారసింహనాదంబులును నొక్కటఁ గలసి సర్వదిగంతసంక్షోభంబు గావించుచుండ మహాయోధు లైనగణనాథులు విజృంభించి యసురబలంబుల కుజేకి దంభోళిధారాసంరంభంబుఁ జీరికింగొననితమవంతకాండంబుల నుద్దండు లైనవైరివీరుల భేదించుచుఁ గాలపాశంబు గేలిగొనుశుండాదండంబులఁ బరిపంథిచతురంగబలంబుల జుట్టు పట్టి నేలతోఁ జదియఁగొట్టుచుఁ బుష్కలావర్తకాభీలంబు లైనకర్ణతాళంబులఁ బరబలంబులఁ జాపకట్టుగా నడుచుచు నత్యంతజవనంబు లగునాసికాపవనంబుల శాత్రవసైన్యంబుల నెగురఁగొట్టుచు కాళిన్యావహసితకులాగంబు లైనవక్షోభాగంబులచేత నభియాతివర్గంబుల నిరర్గళవిహారంబుగా మర్దించుచు సంఘాతపాతంబులఁ బోలుపదాతిఘాతంబుల విపక్షవ్రాతంబుల నలియఁద్రొక్కుచుఁ గార్కశేశంబసోదరంబు లైనలంబమానోదరంబులఁ బ్రత్యర్థిదేహంబులఁ బగుల్చుచుఁ దేజితోత్తాలంబు లైనశూలంబుల నహితజాలంబుల గుదులుగ్రుచ్చుచు రయవిజితమహావాతంబు లైనచక్రపాతంబుల నమిత్రజాలంబులఁ దునుముచు నిర్జితప్రళయాంభోధరగర్జితం బైనశంఖవిరావంబున విరోధివరూధినుల వివశత నొందించుచు నివ్విధంబున మహాగణనాథవదనసముద్ఘాతంబు లగుగణనాథసహస్రసంఘాతంబులు మదాన్వితంబు లై నిర్భీతంబులును భుజాబలస్ఫీతంబులును నైనవిశుక్రసేనావ్రాతంబుల నిరవ

శేషంబుగా ధూళిమాత్రావశేషంబు లగునట్లు గావించి జయాభ్యుదయంబుసొంపునఁ బొంపిరివోవుచున్నం గనుఁగొని క్రోధావిష్టుండై యాదుష్టాగ్రగణ్యుండు తనముందర నిల్చినసప్తాక్షౌహిణీసైన్యాధినాథు గజాసురుం డనుమహాయోధు నాలోకించి నీవు నీచతురంగబలంబులతోఁ గూడ సత్వరంబుగాఁ జని యీసమస్తహస్తివదనసేనాజాలంబునకు మూలం బైనయయ్యాదిమహాస్తివదనుం దొడరి యశ్రమంబున సపరివారంబుగా దుర్జయుం డైనయతని నిర్జించి రమ్ము పొమ్మని యనుజ్ఞ యిచ్చిన మహాప్రసాదం బని యతని వీడ్కొని యచ్చటఁ గదలి యగ్గలిక నగ్గజాసురుండు దుర్మతి యగుటంజేసి సరకుగొనక యావిఘ్నేశ్వరునకు నభిముఖంబుగా నడచి యద్దేవుని మార్కొని తానును దోడిదానవులును నపరిమితంబు లైననిశితశస్త్రాస్త్రసమాజంబుల నిర్వ్యాజంబుగాఁ గప్పిన నమ్మహాత్ముండు మహాబలపరాక్రమధురీణంబును లఘుచిత్రసంచారప్రవీణంబును బర్వతప్రతిమానభాసురాంగంబును నఖదంతాయుధనిర్భిన్నరక్షస్సేనాంగంబును నై స్వామిచిత్తవిజ్ఞానాభిరామం బైనమూషకకులసార్వభౌమంబు నారోహించి యుదయాచలంబుమీఁద వెలుఁగొందుబాలమార్తాండునివిధంబునఁ దా నేకవీరుం డయ్యును నద్దానవు లందఱకు నన్నిరూపు లై వేఁడివేలుపుకంటి నెన్నుచిటికంటిమంటలు వోనిచండకాండంబులు లెక్కకు మిక్కిలిగాఁ బ్రయోగించి యవ్వారణదైత్యసేనల మారణంబు సేయుచు నగ్గజాననుండు గజాసురు నాక్రమించి తీవ్రశిలీముఖంబుల నొప్పించినఁ జేయునది లేక చిక్కువడియున్న యద్దానవవాహినీపాలకుం జూచి విజితసురపాలకుం డైనవిశుక్రుండు దనమనంబున నోహో యమ్మహావీరునిభుజాబలం బప్రతిహతంబై వృద్ధిఁబొందుచున్నది యీకుంజరదైత్యునిబాహువీర్యంబు క్రమక్రమంబున సంక్షీణంబగుచున్నయది యింక నితం డతని జయించుట యెన్నఁడుం గలుగ దీరక్షోవీరునిరక్షించుటయు నాకు శక్యంబుగా దని తలపోసి ప్రాణభయంబున ధైర్యశౌర్యంబులతోఁ గూడ లజ్జ నుజ్జగించి భండాసురసోదరుండు భండనంబుఁ దొలంగి పఱచి శూన్యకపురంబు ప్రవేశించె నంతలోన సప్తాక్షౌహిణీబలంబుల నిశ్శేషంబుగాఁ గూల్చి యయ్యాఖువాహనుండు దనముందర ధైర్యంబవలంబించి ప్రాణంబులదెస నిరపేక్షుండై ప్రక్షీణబలుండయ్యు నక్షీణరణాభిమానంబునఁ బోరుచున్నసురప్రతిపక్షబలాధ్యక్షుని రూక్షేక్షణంబుల నిరీక్షించి యాక్షణంబ నిశితామోఘదివ్యసాయకం బైక్షవశరాసనంబున సంధించి యాదేవకంటకు నేలం గూల్చి సకలదంతావళముఖసేనాసంస్తూయమాననిజపరాక్రమవిశేషుం డై యశేషానిమేషులు మింటనుండి తనవిజయంబుఁ గొనియాడుచుండ సంతసంబునఁ జెలంగె నిట్లు సబలంబుగా గజాసురుండు గజాననునిచేత నిహతుం డగుటయు నంతకుమున్న

విశ్రుతుండు రణనిపాతితబలచక్రుండై యుద్ధభూమి విడిచి పాఱుటయు హతశేషులై నరక్కసులచేత విని భండాసురుండు క్రోధశోకవ్యాకులుం డయ్యె నంత రాత్రించరులకుం గోరరాత్రి యైనయారాత్రి గడచుటయు నిజబలంబులతోఁ గూడ నాలంబోదరుండు త్రిలోకజనని యైనయాలలితామహాదేవిసమీపంబునకు నరిగిన నమ్మహాభాగయుఁ దదీయబలవిక్రమంబులకు నత్యంతసంతుష్టాంతరంగయై యగ్గణేశ్వరునకు సర్వదేవతాపూజలకంటెఁ బూర్వపూజ్యత్వంబు దయచేసి యక్కుమారుని సంభావించె నని హయగ్రీవుం డగస్త్యమహామునీంద్రున కెఱింగించి. 181

ఆశ్వాసాంతము.

చ. అనుపమితప్రతాప కన♦కాచలచాప గిరీంద్రకన్యకా
ననసరసీజమిత్ర సుర♦నాయకసన్నుతిపాత్ర లోకపా
లనసుదృఢాంతరంగ మృగ♦లాంఛనవిస్ఫురితోత్తమాంగ భ
క్తనికరచిత్తరంజన మ♦దావళదానవగర్వభంజనా. 182

క. అమితార్కకోటితేజా, సుమహితపరిమాణరహిత♦సుగుణసమాజా
దమునఃకరసీరేజా, శమధనహృద్భావ్యభవ్య♦చరణాంభోజా. 183

స్రగ్విణి. స్యందనీభూతవి♦శ్వంభరామండలా, దందశూకాత్మకో♦ద్యల్లసత్కుండలా
వందమానాబ్జభృ♦త్పద్మజాఖండలా, చందనాభాంగభా♦స్వత్ప్రభామండలా. 184

గద్యము.

ఇది శ్రీభవానీశంకరకరుణాకటాక్షవీక్షాసుధారసాసారప్రసారణసులబ్ధ
కవితావైభవాపస్తంబసూత్ర పరాశరగోత్ర విలస దాతుకూరివంశ
సంభవ వాయ్యనామాత్యపౌత్రాదిమూర్తినామసత్కవిపుత్ర
సకలసుకవిజనవిధేయ పాపయనామధేయ
ప్రణీతం బైన లలితాంబోపాఖ్యానం
బనుమహాప్రబంధంబునందు
షష్ఠాశ్వాసము.

---



ఓమ్.

శ్రీసద్గురుచరణారవిందాభ్యాంనమః.

శ్రీ

# లలితాంబోపాఖ్యానము.

## సప్తమాశ్వాసము.



రుచిరకృష్ణవేణీ
తీరభ్రాజితవిదర్భ • దేశాభరణో
దారగుణధాన్యవాటీ
పూరమరేశా సమస్త • భువనాధీశా. 1

వ. అవధరింపు మనుపమప్రజ్ఞానసదనుం డగుతురంగవదనుం డవిరళతపోనిష్ఠుం డగు నగస్త్యమునిశ్రేష్ఠునకు వెండియు నిట్లనియె. 2

గీ. శక్రశాసనుఁ డైనవి • శుక్రుఁ డాజి
భంగ మొందివచ్చుట విని • భండదైత్యుఁ
డతిశయవిషాదచింతాకు • లాత్ముఁ డగుచు
నలఁత చేఁ గొంతదడ వేమిఁ • బలుక కుండె. 3

క. పదపడి యించుక ధైర్యము, మదిలో నుదయింప నాత్మ • మంత్రుల హితులన్
విదితబలుల సోదరులను, గదనవిజయవాంఛ యొదవఁ • గాఁ బిలిపించెన్. 4

మ. దితిజాధీశ్వరునాజ్ఞ నచ్చటికి మం • త్రిశ్రేష్ఠులున్ సోదర
ద్వితయంబున్ హితులున్ బలాధిపతులున్ • వే వచ్చి యచ్చో నిజో
చితపీఠంబులపై యథార్హవిధి రాం • జిల్లంగఁ గూర్చున్నచో
నతఁ డత్యుద్ధతిఁ దమ్ములం గని యమ • ర్షావిష్టుఁ డై యిట్లనున్. 5

మ. మును దేవాసురయుద్ధభూముల జయం • బుల్ గన్నమీ కిమ్మెయిన్
వనితాసంఘముచేఁ బరాజయము దై • వప్రేరణన్ గల్గె స

జ్జనసంభావిత మైనశూరతతకిన్ ◆ సంగ్రామభూమిన్ బలా
యనముం బొందుటకంటెఁ జచ్చుటయె మే ◆ లం డ్రార్యు లర్థాస్థితిన్. 6

గీ. అస్థిరప్రాణరక్షకై ◆ యపయశంబుఁ
బొంది నరకలోకమునకుఁ ◆ బోవుకంటె
సంగరములోనఁ జచ్చి శా◆శ్వతము లైన
పుణ్యకీర్తులఁ బడయుట ◆ పోలదొక్కొ. 7

క. మీయంతటిశూరాగ్రణు, లాయెలనాఁగలకు నోడి ◆ యనిఁ దొలఁగి దురం
తాయాసంబునఁ బురి దెస, కై యరుదెంచుట విచిత్ర ◆ మయ్యెఁ గటకటా. 8

క. స్వబలంబును దృఢచతురంగబలంబు నజేయ మైన◆ఘనతరశస్త్రా
స్త్రబలంబును గలమీర, య్యబలాబలమునకుఁ జాల ◆ రైతిరె యహహా. 9

గీ. అఖిలజగముల నవలీల ◆ నాక్రమించు
భండదైత్యునితమ్ములు ◆ ప్రాణభీతిఁ
బడఁతులకు నోడి యూడనిఁ◆బాడి రనెడి
దుర్యశము మీరు సైఁచు ◆ టాశ్చర్య మయ్యె. 10

క. నే నపుడు దుర మొనర్పఁగఁ, బూని యరుగ నుత్సహింపఁ ◆ బోవల దని నన్
మానిచినదోష మీయవమానము నిటు మీ కొనర్చె ◆ మగువలవలనన్. 11

క. అచ్చుగ నే నపు డరిగిన, నచ్చెలుత నెలంతలన్ మ◆హామాయలచే
నిచ్చ మఱిఁగించి వే పోరి, పుచ్చనె యీరీతి వారు ◆ పొంగుదు రె కడున్. 12

క. ఆలలన నోర్వ మీరలు, చాలర యేనిన్ నిలుండు ◆ సదనంబుల నే
నాలమున నన్నెలంతన్, దూలించెద నశ్రమమున ◆ దోర్బల మొనఁగన్. 13

క. అని న్యాయనిష్ఠురంబుగఁ, గనలుచు నగ్రజుఁడు వలుకఁ ◆ గంపించి భయం
బున భక్తిచే వినంగుం, డనునయమార్గమున నన్న ◆ కనియె మృదూక్తిన్. 14

సీ. మున్ను దెల్పనె స్త్రీత్వ◆బుద్ధి యుంచకుము శక్తియె ప్రధానం బని ◆ దేవ నీకు
మెలఁతలయందప్ర◆మేయసామర్థ్యంబు, గలిగియున్నది దైవ◆ఘటనఁ జేసి
కాంత లంచును వారి ◆ గణనసేయక యుంట, నీతిజ్ఞుఁ, డైనట్టి◆నీకుఁ దగునె
యిది యట్లులుండె మా◆కపరాధ మొక్కటి, గలదు దానిసహింపు◆కరుణతోడ

గీ. గెలుచుటయుఁ జచ్చుటయు రెండు ◆ కీర్తికరము
లలఘుబలు లైనశూరుల ◆ కట్టు లగుట
దైత్యనాథ యారెంటికిఁ ◆ దప్పి యిటకు
రాక యన్యాయ మపయశ◆ఃప్రదముఁ దలఁప. 15

వ. కాలస్వభావంబు దుర్విజ్ఞేయం బెట్లనిన జయాపజయంబులు కీర్త్యపకీర్తులు వృద్ధిక్షయంబులు సుఖదుఃఖంబులు నివి మొదలుగాఁగల బహువిధద్వంద్వంబులు ప్రాణులు చేసినతత్తత్కర్మవిశేషంబుల కనురూపంబుగాఁ గాలాధీనంబులై సంప్రాప్తంబు లగు దీనికిఁ జింత యేల కడచినదానిఁ దలంపవలవదు గతజలసేతుబంధనంబున నేమిప్రయోజనం బింకఁ గర్తవ్యంబు విన్నవించెద నవధానంబుతోఁ జిత్తగింపు మత్తైజవలమొత్తంబుతోడిసమరంబునకు నమరకంటకుండ వగునీవుత్సహింప నేల మమ్మిరువుర నిప్పనికి నాజ్ఞయొసంగి పనుపుము భవత్సహోదరుల మగుమేము నీదుకీర్తికి లోపం బగునట్లు వర్తిల్లుదుమె యిది యొక్కకాలకౌటిల్యంబువలన సంభవిల్లె నని యివ్విధంబున విషంగుం డన్నయుఁ దానును గృతనిశ్చయులై విన్నవించిన దనుజకులసార్వభౌముం డమ్మాటల కలరి యువరాజగు విశుక్రుం గనుంగొని నీవును విషంగుండును సన్నద్ధులై చతుశ్శతాక్షౌహిణీబలంబులు మిమ్ముఁ గొల్చి రాఁ గదలిచని శాత్రవబలంబుల నిశ్శేషంబుగా సంహరించి రండు పొమ్మని యనుజ్ఞయిచ్చిన మహాప్రసాదం బని యనుజనహితుండై యమ్మహాబలుండు సర్వసన్నాహంబునఁ దేజరిల్లి యుద్ధంబునకు నరుగుచుండఁ బుడమి యీనినకైవడిఁ ద్రిలోకంబులుఁ గడగడ వడంకుచుండ నన్నూఱు అక్షౌహిణులరాక్షసబలంబు లాయక్షీణబలునిఁ గొల్చిచనుచుండఁ బ్రతాపప్రజ్వలితుం డైనయద్దైత్యుని నులూకజిత్తు మొదలయినపదుండ్రుసేనానాయకులు భండాసురునిచేత ననుజ్ఞాతులై సాహాయ్యం బాచరించువారై కూడం జనిరి వార లారాక్షసేశ్వరునకు సహోదరి యైనధూమిని యనుకామినికిఁ బుత్రులై విచిత్రంబులైనశస్త్రాస్త్రవిద్యావిశేషంబుల నవశేషంబుగాఁ దమమాతులుండైనభండదైత్యునివలన నెఱింగినవా రగుట విక్రమదర్పితు లగుచు నిజధనుశ్శింజినీటంకారంబున రోదసీకుహరంబు పూరించుచు మహనీయవాహనారూఢులై మహాహంకారనిరూఢులై తమవచ్చుటకు నమ్మేనమామ లిరువురు మనంబున నత్యంతంబు సంతసించుచుండఁ దమతమబలంబులతోఁగూడ నత్యుద్ధతితో వచ్చుచుండ నవ్విశుక్రుండు యౌవరాజ్యప్రధానచిహ్నంబు లైనఛత్రచామరాదులచేత నతిశోభితుండై యంజనశైలాభం బైనయొక్కభద్రేభంబు నెక్కి కలకలారావబధిరీభూతభూనభోంతరం బైనస్వసైన్యంబుతో రణరంగంబుఁ జేర నడచి భయంకరంబుగా సింహనాదం బొనర్చిన నమ్మహారావంబు విని సంక్షుభితస్వాంతులై వహ్నిప్రాకారాంతరస్థిత లైనశక్తు లెల్లఁ దదీయద్వారంబున బారులుదీరి నిజకరకమలగృహీతనిర్మలశస్త్రాస్త్రరోచిస్సముదాయంబుచేతఁ గ్రోధా

రుణంబు లైనవదనంబులచేత నాకాశంబెల్లఁ దటిన్మయంబును రక్తాంబుజమయం బగునట్లుగాఁ జేయుచు వెడలి రప్పుడు మంత్రిణీదేవియు దండనాయికయు భండాసురసహోదరు లైనవిశుక్రవిషంగు లొక్కమొగి నుక్కున యుద్ధసన్నద్ధులై సబలంబుగాఁ దమతోఁ సమరంబు సలుపఁ గోరి యట్లు వచ్చుట దెలిసి కిరిచక్రంబును గేయచక్రంబును ననునామద్వయంబునఁ బ్రఖ్యాతం బైనరథద్వయంబు నెక్కి ధవళాతపత్రప్రకరవిరాజితలును జామరద్వయయుగ్మసంవీజితలును నాట్యప్రవర్తమానరంభాద్యప్సరోజనగీయమానవిజయమహోదయలును నాశ్రితసమూహసంప్రకటితస్వాభావికమహోదయలు నగుచు నారక్షోనాయకవ్యూహంబుతోడ నాయోధనం బొనర్చుటకు లలితామహాదేవియనుజ్ఞఁ గొని శ్రీచక్రరాజరథరక్షణార్థంబుగా శతాక్షౌహిణీపరిమితం బైనశక్తిసైన్యంబు నచ్చట నిల్పి తక్కినసర్వసైన్యంబులతోఁగూడ గాఢ్పనెచ్చెలికోటవాకిట నడచి రప్పుడు సమస్తం బైనశక్తిచయంబుముందర మహాస్యందనారూఢయై కాలదండంబు గేలికొనుహలాయుధం బొక్కకేలను బ్రజ్వలజ్జ్వాలాజాలాభీలం బైనముసలాయుధం బొక్కకేలను ధరియించి మాటిమాటికి శాత్రవవ్యక్తుల కతిభయదంబుగాఁ ద్రిప్పుచు బాలేందువిభూషితచూడారమణీయయు విస్ఫురత్పోత్రివదనాంబుజయు సర్వదావిక్రమసముద్ధురయు నగుచుఁ దమతోఁ బోడరుటకుఁ జనుదెంచుచున్ననిశాచరబలంబులనెల్లఁ దోలుముద్దగొనుటకు నుద్యోగించునట్లు విజృంభించి దండనాథాదేవి మహోద్దండంబుగా నడచుసమయంబున.

సీ. అమ్మహాదేవిశ • తాంగంబు వెనుక మ,హామేరుధాత్రీధ • రాభ మగుచు
సురుచిరానుపమతే • జోమయం బగు గేయ,చక్రనామకమహా • స్యందనమున
ఘనశరాసనగుణ • ధ్వనిచేత రోదసీ,కుహరంబు పూర్ణమై • ఘూర్ణిలంగ
వేణీకృతశిరో • జవిలసితబాలశ,శాంక యై సమరని • శ్శంక యగుచు
గీ. నలికతలమునఁ గుంకుమ • తిలకరీతిఁ, గాంతిఁ జెన్నొంది మూఁడవ • కన్ను దనర
దైత్యులమనంబుతోఁగూడ • ధరణి నిజర,థాంగనేమిఘట్టనమున • నవియుచుండ.
క. మాణిక్యకంకణాన్విత,పాణిసరోజమున నొక్క • బాణము వేడ్కం
దూణముఖంబున శౌర్యధు,రీణ యగుచుఁ దిగిచి లీలఁ • ద్రిప్పుచు మఱియున్.
సీ. జయ దేవి వర్ధస్వ • జయమంత్రనాయికే, జయ ప్రధానేశ్వరి • శ్యామలాంబ
యనుచు హర్షతరంగి • తాంతరంగములతో, నాడుచు సప్తమ • హర్షివరులు
మొదలుగాఁ గలసర్వ • మును లర్థగూఢంబు, లైనమంత్రముల న • నూనభక్తి
నాశీఃప్రశంస ల • త్యాదరంబునః జేయ, సంతోషపూరిత • స్వాంత యగుచు

గీ. నాలకించుచు సకలలో•కాతిశాయి,విశ్వమోహకసంగీత•విశదఫణితిఁ
దన్ప్రభావంబ నేకభా•మినులు వినుతి,సేయుచుఁ గెలంకులను రా న•మేయలీల.

క. ఎనిమిదివే లక్షౌహిణు, లనుపమబలశక్తిబలము • లత్యయవేలా
జలనిధిసమములు దన్నుం, బలసి నడువ శ్యామలాంబ • పటుగతి నడచెన్. 20

పంచచామరము. మహేంద్రనీలకాంతితోడ • మచ్చరించుదివ్యవి
గ్రహప్రభల్ దుజుంగలింప • గాఢభక్తితోఁ బితా
మహాదు లర్థి సంస్తుతింప • మాన్యలీల నిట్టు ల
మ్మహానుభావ యేగె దైత్య•మర్దనం బొనర్పఁగన్. 21

సీ. అమ్మహాదేవిసై•న్యంబులోఁ గొందఱు, కాంచనవర్ణవి•గ్రహులు గొంద
ఱంబుదోపమవినీ•లాంగులు గొందఱు, దాడిమపుష్పాభ•తనులతికలు
కొందఱు పాటల•సుందరమూర్తులు, కొందఱు చంద్రికాం•కూరరుచులు
కొందఱు నిర్మల•సిందూరకాంతులు, కొందఱుమరకతా•మందదీప్తు

గీ. లందుఁ గొందఱు వజ్రప్ర•భాభిరామ, లందుఁ గొందఱు పరిశుద్ధ•హారిపంచ
వర్ణమిశ్రితగాత్రు లీ•వరుస దివ్య, మహిమఁ జెన్నొంది దేవతా•మాన్య లగుచు.

క. పవికాలదండసన్నిభ,వివిధాయుధపాణు లగుచు • విలయసమయహ
వ్యవహజ్వాలలవలె దా,నవబలములఁ దుంప వెడలి • నడచిరి శక్తుల్. 23

గీ. కిటిముఖీదేవిసైన్యశ•క్తివ్రజంబుఁ, బోలె నెన్న శక్యముగాదు • భువనవంద్య
యైనయాశ్యామలాంబసే•నానివహము, నెంతటివిశేషదృఢబుద్ధి•మంతులకును.24

వ. అదియునుంగాక యమ్మంత్రనాయికాసైన్యసన్నాహంబును భూషణవేషభాషాదులును భుజాబలపరాక్రమంబులును నాశ్రితానుగ్రహంబును దైత్యబలసంహారంబును సర్వలోకపూజ్యత్వంబును శ్రీమహారాజ్ఞియందలిభక్తియు నివి యన్నియుం దత్తుల్యంబుగా దండనాయికకును గల వింతకంటె విశేషంబుగా శ్రీలలితామహాదేవిచేతఁ దత్తంబయినయాజ్ఞాముద్రాంగుళీయకంబు సచివేశ్వరికరపంకజంబునఁ బ్రకాశించుచుండు నిత్తెఱంగున మంత్రిణీదండినీనామదేవీద్వయంబుం గొల్చి సకలశక్తిసైన్యంబు నడచుచుండఁ దదీయభారంబున భూమి యొడ్డగెడ వైడోలికాలీల నాలంబించె నప్పుడు. 25

శా. అక్షీణోద్ధతితోడ శక్తిసముదా•యంబు ల్వడిం జేర్చి యా
రక్షోవాహినితోడ మార్కొని సుర•వ్రాతంబు సంప్రీతితో
వీక్షింపన్ నిజపాదఘాతచలితో•ర్వీరేణువుల్ సప్తవా
ర్ధిక్షోభం బొనరింపఁగా రణ మొన•ర్చెన్ రోమహర్షంబుగన్. 26

సీ. మాతంగములు పేర్చి ♦ మాతంగములతోడ, హయములు విజృంభించి ♦ హయములతోడఁ
దేరు లుద్ధురవృత్తిఁ ♦ దేరులతోడఁ గాల్బలము గడంకఁ గా♦ల్బలముతోడఁ
దలపడి యత్యంత♦దారుణంబుగఁ బోర, నన్యోన్యసంతర్జ♦నారవంబు
నన్యోన్యసంప్రయు♦క్తాస్త్రఘట్టనరవం, బన్యోన్యవిహితాట్ట♦హాసరవము

గీ. సరవి నన్యోన్యసంప్రశం♦సారవంబు, గరిమ నన్యోన్యఘోరహుం♦కారరవము
నుభయసైన్యవాదిత్రమ♦హోగ్రరవముఁ, గలసి శరధినిర్ఘోషంబు♦కరణిఁ జెలఁగె.

వ. ఇట్లుభయబలంబులుఁ దలపడి యతిభీమంబుగా సంగ్రామంబు సేయుచుండ నందు శక్తిసైన్యవిజృంభణంబు సైరింపంజాలక రక్షస్సేన దీనదశకు వచ్చిన నది గనుంగొని యతిలోకపరాక్రమావక్రుండైన విశుక్రుండు గోపించి సోదరసహితుండై యయ్యులూకజిత్తు మొదలైనభాగినేయు లందఱును సబలంబుగాఁ దనతోఁగూడ నురవడింప నేకోద్యోగంబునఁ బేర్చిన దానికి సహింపక మంత్రిణీదండనాథలు సంపత్కరీహయారూఢాప్రభృతిసకలశక్తిబలాధినాయికాసమేతంబుగా నొక్కట నెదిర్చిన నారెండుదెఱంగులబలంబులు నోలమాసగొనక యుత్సాహవంతంబులై పోరుచుండె నప్పుడు. 28

క. ఆసంకులసమరంబున, వాసవముఖదేవనికర♦వర్ణితశౌర్యా
వాస యగుదండనాథ మహాసాహసుఁ డగువిషంగు ♦ నమ్ములఁ గప్పెన్. 29

వ. ఇట్లద్భుతపరాక్రమంబునఁ బేర్చి యాక్రోడముఖిదేవి కిరిచక్రనామరథారూఢయై తనయిరుగెలంకులను బిఱిందిదెసలను విక్రమనిర్వక్రంబులైనశక్తిచక్రంబులు బలసినడవ దానవసైన్యంబులపై నప్రతిహతంబుగా నడచి తనయెదురశక్తిబలంబుల సరకుగొనక దుర్నివారుండై శరపరంపరలు గురియుచుఁ బ్రతిబలప్రయుక్తంబులైనయనేకాస్త్రశస్త్రంబులం దునుముచు విజృంభించి వచ్చువాని దుర్వాగ్రహాభిషంగు విషంగుని మార్కొని నిరర్గళభుజార్గళమహాశౌర్య యగునాప్రభావధుర్య యపరిమితనిశితశిలీముఖవర్షంబులు గురిసిన. 30

శా. ఆభండాసురుపిన్నతమ్ముఁడు భుజా♦హంకారదుర్వారుఁడై
యాభీలం బగుసింహనాదమున దే♦వానీకముల్ భీతిలం
గా భూదారముఖిన్ బహుప్రదరసం♦ఘాతంబులం గప్పె భే
రీభాంకారము లొప్ప దైత్యబల ము♦ద్వృత్తిన్ విజృంభింపఁగన్. 31

క. ఇటు లొండొరుపై నత్యుత్కటకరలాఘవము మెఱయ ♦ గాఢంబుగ న
క్కిటివదనయును విషంగుఁడుఁ, జటులోద్ధతిఁ బఱపి రస్త్ర♦చయము బలువిడిన్ •

క. వారలిటు పోరుచుండఁగ, వారినిధు ల్గలఁగె భూమి వడఁకెఁ గులగిరుల్
బోరుకలిగె సంత్రాసము, గూరె నఖిలజగము లపుడు గొందలపడియెన్. 33

చ. అపుడు విశుక్రుఁ డెంతయు రయంబున శక్తిచమూవ్రజంబుపై
నపరిమితాస్త్రముల్ పటుమహాబలవిక్రమదుర్నివారుఁడై
విపులదురాగ్రహం బెసఁగ వీఁక నిగుడ్చుచు రాఁగఁ జూచి తాఁ
గుపితమనస్కయై యతనిఁ గ్రూరత మన్త్రిణి మార్కొనెన్ వడిన్. 34

వ. ఇట్లు భుజాబలనిర్జితశక్రుం డైనయవ్విశుక్రుని మార్కొని. 35

గీ. మండలీకృతరత్నకోదండ యగుచు, బాణవర్షము లద్దైత్యుపై నిగిడ్చె
శ్యామలాదేవి వాఁడును సరభసముగఁ, బోరె నయ్యంబతో నతిధీరవృత్తి. 36

సీ. ఆసమయమున నశ్వారూఢ పేర్చి యు,లూకజిత్తు నెదిర్చెఁ బ్రాకటముగ
సంపదీశ్వరి మహాశౌర్యాఢ్యుఁ డగుపురు,షేణుతోఁ బోరె విన్నాణ మొప్ప
నామహామాయ సంగ్రామకోవిదుఁ గుంతి,షేణు మార్కొని యని సేయుచుండె
మహనీయ యైనయున్మత్తభైరవి యేచి, మలదాసురునితోడఁ గల నొనర్చె

గీ. నమితవిక్రమ యాలఘుశ్యామ యడరి, యలకశూరునితో నుర మాచరించె
మహితచరితయాస్వప్నేశి మంగళాఖ్యుఁ, డైనయసు రేంద్రుతోఁ గలహంబు చేసె.

గీ. అపుడువాగ్వాదినీదేవి యాగ్రహమున, ద్రుఘణుఁ డనుదైత్యవీరునితోడఁ దొడరెఁ
జండకాళిక సమరంబు సలిపె నలుక, దోలఁకఁ గోల్లాటుఁ డనుమహాదుష్టుఁ దొడరి.

గీ. క్రోధపారవశ్యమున శక్తులకు దానవులకుఁ గల్గినయక్షౌహిణులు దలపడి
పోర నంతకు నంతకు నీరసంబు, సాహసము వృద్ధిఁబొంద నుత్సాహలీల. 39

క. కొంతదడవునకు శక్తిదు,రంతప్రాబల్యమున నిశాటబలము వి
క్రాంతిఁ దొఱఁగి క్షీణదశాక్రాంతంబై సంచలించె గాఢభయమునన్. 40

వ. అత్తెఱంగు గనుంగొని. 41

శా. చండక్రోధముతో విశుక్రుఁడు తృషాస్త్రం బుద్ధతిన్ విక్రమో
ద్దండప్రాభవ లైనశక్తులపయిన్ దర్పాంధుఁడై యేయ మా
ర్తాండాగ్నిప్రతిమానతీక్ష్ణతరతత్కాంక్షప్రకాండోష్మ లొం
డొండం బర్వఁగ వార లప్పుడు నిరుత్సాహ లై రందఱున్. 42

వ. ఇట్లు విశుక్రప్రయుక్తతృషాస్త్రప్రభావసంభూతమహోత్కటపిపాసాజ్వరపరాధీన లై
యాశక్తిసేన లాయుధంబులు వైచి మేనులు డిల్లపడ నోళ్ళెండ నాలుకలు వెడలిం
చుచుఁ గాళ్ళు వడంకఁ గర్ణకుహరంబులయందు వేఁడిమి దనికి నేలం బడి పొరలుచు
రోఁజుచు నెలుంగు వెడలక శుష్కంబు లైనకంఠవివరంబులతోడ దుర్దశాపీడిత

లైనం జూచి మంత్రనాయిక యత్యంతచింతాక్రాంతయై దండనాయికాస్యందనంబు సమీపంబునకు నిజస్యందనంబు వఱపించి యవ్వారాహవక్త్రం గనుంగొని యంతకు మున్న నిజసైన్యసంతాపంబునకుం జింతిల్లుచున్నయమ్మహాభాగతో ని ట్లనియె. 43

సీ. ఓచెలి వినవమ్మ ♦ నీచాత్మ్యఁ డగువిశు,క్రాసురుం డిపుడు తృ♦షాస్త్ర మేయఁ
దద్బాధచే శక్తి♦తతులు మహాపిపా,సాజ్వరంబునఁ జాల ♦ సంతపించి
యుత్సాహహీనలై ♦ యున్నారు వారల,వార్త దెలుప నేల ♦ వామనయన
డప్పిచే నాదుకం♦ఠము శుష్క మయ్యె మా,టాడ బలంబు లే♦ దనఘ నాకు
గీ, నిట్టివారిగా మనలఁ దా ♦ నెఱిఁగి రాజ్ఞి, యేమి యానతియిచ్చునో ♦ యెఱుఁగ రాదు
కావునఁ దలంపు తత్ప్రతీ♦కారవిధము, దండనాయిక నీ వసా♦ధారణముగ. 44

క. ఆలంబున మనపదియా,ర్వే లక్షౌహిణులలోన ♦ వెదకిన నైనన్
దూలుచు డప్పిం జెందని,నీలాలక, లేదు సుమ్ము ♦ నిక్కము గాఁగన్. 45

సీ. ఇవ్విధంబున నుండ ♦ నిది సమయం బని, మాయికు లైనదై♦తేయు లడరి
శస్త్రసన్యాసంబు ♦ సలిపి యూరకయున్న,శక్తుల దారుణ♦శస్త్రనిహతి
నొప్పించుచున్నవా ♦ రిప్పుడు దీనికి, నదుపాయ మొక్కటి ♦ మదిఁ దలంచి
సమరోత్సవము విరా♦మముఁ బొందకుండంగ, శ్రీమహారాజ్ఞి సం♦ప్రీతి నొంద
గీ, వీరితృష్ణావికారంబు ♦ విరియునట్లు, సేయవలయు నప్పనికి ను♦పాయ మేను
నీకుఁ దెలిపెద దాని స♦నాకులముగ, సంఘటింపంగవలయు నో♦సకియ నీవు. 46

వ. అది యెయ్యది యనిన నీదురథపర్వంబునందు మూర్తిమంతంబై నివసించియున్న మదిరాసాగరంబునకు నాజ్ఞయిమ్ము సమరోత్సాహకారియు సర్వతృష్ణాపరిశమనసమర్థుండును మహాబలవివర్ధనుండును నైనయమ్మహాత్ముండు భవదనుజ్ఞాతుండై యీ శక్తిసైన్యంబుల నొందినతృష్ణాజ్వరంబు నివారింపఁ జాలు నని పలికిన నవ్వారాహవక్త్ర తద్వచనంబులకు సంతసించి యప్పుడ యాసురాసముద్రపురుషునిం బిలిపించుటయు నతండు వచ్చి యెదుట నిల్చి భక్తియుక్తంబుగాఁ బ్రణామంబుచేసిన మదాలసరక్తలోచనుండును గాంచనపద్మమాలికాభూషితుండును నగునద్దివ్యునిఁ జూచి యయ్యాజ్ఞాచక్రేశ్వరి యీసమస్తశక్తిసైన్యంబుల కిత్తఱి నుదయించినతృష్ణావికారంబు శీఘ్రంబున నపనయింపు మని యాజ్ఞయిచ్చినఁ బ్రసాదం బని యతండు బాలమార్తాండసన్నిభం బైననిజస్వరూపం బయ్యవసరంబున ననేకవిధమూర్తులచేతం బ్రకాశించునట్లు చేసి కొన్నిచోట్లఁ దాపింఛసమానశ్యామంబుగాఁ గొన్నిస్థలంబుల ధవళకాంతిసుందరం బగునట్లుగా మదిరారసంబు గల్పించి కల్పాంతకాలపరివర్తమానపుష్కలావర్తకాదిబలాహకరూపంబునఁ గరికరోపమానంబు లై పరార్థసంఖ్యాతీతంబు లైన

ధారలచేత ననుకూలవాయుప్రేరితుండై యెద్దానిగంధాఘ్రాణమాత్రంబున మృతుండై నవాఁడు సుప్తోత్థితునికై వడి లేచు దుర్బలుండై నవాఁడు ప్రబలుం డగు నట్టిగంధోత్తమావర్షంబు గురిసి పిపాసాపీడిత లై నశక్తులనెల్ల నాప్యాయనంబు నొందించుచుండఁ దద్రసానుభవంబు దురాత్ము లైన దైత్యులకుఁ గలుగకుండ మహాప్రభావనిధి యగు శ్యామలాదేవి యత్యంతలఘుహస్త గావున నపరిమితశరజ్జాలంబులచేత స్వబలంబు చుట్టును బాణప్రాకారవలయంబు నిర్మించి సురక్షితంబుచేసె నప్పు డక్కదంబవనవాసిని చేసినయద్భుతకర్మంబునకు నాఖండలాదిదైవతమండలంబులెల్ల విస్మయరసాక్రాంతహృదయంబులై యమ్మహానుభావం గొనియాడుచుండె నాసమయంబున శక్తులెల్ల యథేష్టంబుగా బహువిధకాదంబరీరసపానంబు నిర్వర్తించి రిట్లు తృతీయయుద్ధదివసంబున యామద్వయపర్యంతంబు గౌడియుఁ బైష్టియు మాధ్వియు వాల్లియుఁ గాదంబరియు హైంతాళియు లాంగలీయయుఁ దాళీయయుఁ గల్పవృక్షోద్భవయు నానాదేశసముద్భవలును నైనమదిరాఝరులు కటుకషాయమధురత్వాదిబహువిధరసప్రధానంబులు బహువిధసౌరభంబులు బహువిధమదప్రదంబులు బహువిధవర్ణసమాశ్లిష్టంబులు వకుళప్రసవామోదంబులు బుద్బుదోజ్జ్వలంబులు శస్త్రక్షతినివారణంబులు భగ్నాస్థిసంధానదాయకంబులు రణశ్రమహరంబులు సర్వసంతాపనాశకంబులు నై యైరావతశుండాప్రమాణంబుగా నఖండధారారూపంబున వర్షించుచున్నయమ్మహామద్యధారలు యామమాత్రం బవిచ్ఛిన్నంబుగా నుత్తానవదనంబులతోడఁ జంచలరసనాంచలంబులతోడ సంతోషముకుళితలోచనంబులతోడ నాకంఠపూర్తిగాఁ బానంబుచేసి సర్వయోగినులు విగతతృష్ణాజ్వరలై తృప్తినొంది రిట్లు దండనాథాదేవియాజ్ఞాక్రమంబున శక్తిసైన్యఖేదం బపనోదించి యాహాలాసముద్రంబు స్వస్వరూపంబు ధరియించి క్రమ్మఱ నద్దేవిపాలికిం జని ప్రణామంబుచేసి స్నిగ్ధగంభీరఘోషంబున నయ్యంబతో నిట్లని విన్నవించె. 47

సీ. దేవి చూడుము భవ◆దీయసేన ల వెల్లఁ, దృష్ణాజ్వరము వీడి ◆ తెలివి నొంది
మత్సమర్పితహృద్య◆మధుపానమత్తలై, యిందుఁ గొందఱుపూర్ణ◆మేందుముఖులు
మణిమయకంకణ◆మంజీరమేఖలా,క్వణనంబు మీఱంగ ◆ గానకలన
నృత్తముల్ సేసెద ◆ రిందుఁ గొందఱు నృత్త,ముల్ సేయువారికి ◆ మోద మెసఁగ
గీ. నలయపద్ధతిఁ గరతాళ◆ములు ఘటింపు,చున్నవా రిందుఁ గొంద ఱ◆న్యోన్యదేహ
లతలపై వ్రాలుచున్నవా◆రతిహసనము,నెఱపెదరు శక్తు లిందుఁ గొం◆దఱు ముదమున.
క. కలవాణు లిందుఁ గొందఱు, గళదంశుకమేఖలోరు◆కటితట లగుచున్
లలితమదవల్గనంబులఁ, జెలువొందుచు నున్నవారు ◆ శీధుమదమునన్. 49

మ. మగువల్ గొందఱు పయ్యెద ల్దొలఁగఁగా ♦ మాతంగకుంభంబులన్
మిగులం జాలునిజస్తనద్వయము లెం♦తేఁ జేర్చి నర్తింపఁగా
నగవుల్ వెన్నెల లీన మోవిపయి దం♦త శ్రేణికాంతిచ్ఛటల్
నిగుడంగా సరసోక్తు లాడెదరు కం♦టే వేడ్క దండీశ్వరీ. 50

క. సారసనయనలు కొందఱు, మైరేయాత్యంతపాన♦మదమునఁ నిజపృ
క్తారకలు దిప్పి యాయుధ,వారము జళిపించుచున్న♦వా రదె కంటే. 51

క. అని విన్నవించు మదిరా,వనధిం గని దండనాథ ♦ వాత్సల్యముతో
ననుపమహర్షంబున ని,ట్లని పలికెఁ దదీయమతికి ♦ నానందముగన్. 52

క. హాలాంబుధి నీచేసిన,మే లెన్నఁ దరంబె మాకు ♦ మేదినిలో నిన్
బోలినయుపకర్త గలఁడె, చాలఁగ నామనసు దీన ♦ సంతోషించెన్. 53

ఆ. దేవకార్య మిట్టు ♦ లేవిఘ్నమును లేక,యుండ నిర్వహించి ♦ భండనమున
శత్రులకు జయంబు ♦ సంఘటించితివి నీ, వనుపమప్రశస్తి ♦ నమరు మింక. 54

వ. అని యత్యంతవాత్సల్యంబున నమ్మద్యసముద్రంబునకుఁ బ్రాశస్త్యసంపాదకంబు లగు వరంబు లిచ్చి సంతోషసముద్రంబునఁ దేల్చి యాదండినీదేవి సముత్సాహదోహల యగుచు మంత్రనాయికం జూచి నీ వింక సబలంబుగా సర్వసన్నాహంబులతో రాక్షసుల నిర్జించుటకు నుద్యోగింపు మని పలికి నిజబలంబుల నెల్ల సన్నద్ధంబులు చేసి పురికొల్పిన నుత్సాహవంతంబు లై దండనాథానిర్దేశంబున సకలశక్తిసమూహంబులుఁ జేర్చి తమసింహనాదాట్టహాసమహాస్వనంబుల దిశాసందోహంబును గులమహీధర బృందంబును భేదిల్లఁ జేయుచు దానవవరూథినులతోఁ దలపడి పూర్వంబున నెత్తెఱంగున నెవ్వ రెవరితో మార్కొని పెనంగుచుండి రత్తెఱంగున వారు వారల మార్కొని ఘోరసంగ్రామంబు సేయుసమయంబునఁ బ్రత్యగ్రమదిరాపానమత్తలును గ్రోధావిష్టచిత్తలును బాటలీకృతనేత్రలును వీరరసవిచిత్రలును బ్రస్ఫురితనిజాయుధవ్రాతలును బ్రస్ఫుటరోషవదనాంబుజాతలును నుద్యద్భ్రుకుటీభీషణలును శత్రునిరాకరణభాషణలును నగుచు శక్తు లేకహేళి నద్దనుజసంఘంబులమీఁద నశనులపోలిక నుఱికి వివిధాస్త్రశస్త్రప్రహారంబుల నుఱిపిడికిఁ జొచ్చినబలవత్కర్షకులవిధంబునఁ దచ్చతురంగంబుల బారిసమరుచు నప్రతిహతంబుగాఁ బరాక్రమించుచుండి రప్పుడు మదాతిరేకంబున నత్యంతలోహితంబు లగునిజాంబకంబులును రాక్షసరక్తసంసిక్తంబు లై నచంద్రహాసాద్యాయుధంబులశోణకాంతికదంబకంబులు నొక్కరీతిని మెఱయఁ బ్రస్ఖలితంబు లగుపాదవిన్యాసంబులును దథావిధంబు లగువీరభాషణంబులును గదంబగోళకాకారంబు లై నహృష్టావయవంబులును విలసిల్లి యువరా జై నయ్యవిశుక్రుని

బలంబులతోడ నిర్వక్రవిక్రమంబున సమరంబు సలుపునాశక్తిచక్రంబులం గనుంగొనిన మాత్రన మృత్యుదేవియైనను బెదరిపఱచు ననిన నన్యుల కెంతవారికైన నిర్భయం బుగాఁ జూడ శక్యంబు గా దని వేఱ చెప్పనేల యిట్లతిదారుణం బగురణంబు ప్రవర్తిల్లుచుండ నంతకంతకు దురాగ్రహంబునఁ బైపై నురవడించుననేకాక్షౌహిణీరక్షోబలంబులతోడఁ బీనుంగుఁబెంటలు గావించి బహులవీరావేశంబున నయ్యోగినీసముదయంబు మింటనుండి చూచుఖేచరుల నద్భుతరసాక్రాంతస్వాంతులం జేయుచు వెండియుఁ దోడ్తోడ నగ్గలిక బెగ్గలంబందక నేలం గూలినవారిఁ ద్రొక్కి నడచురక్కసిమూఁకల కుత్తికి చక్కాడుచుండ గొప్ప లగుతిప్పలకరణిఁ గుప్పలువడినభగ్నరథసమూహంబులును విచ్ఛిన్నపాదశుండాదండంబులై కొండలపోలికఁ గూలినమదోద్దండవేదండకాండంబులును నఱకఁబడినతఱుచుటడవి తెఱంగునఁ గనుపట్టిన నొండొండఁ గ్రిక్కిఱియఁ బడినఘోటకబృందములును నానావిధబాణపరంపరల గుదులుగుచ్చినట్లు తెఱపి లేకుండ నతిసాంద్రంబుగా ధరణి నొరగినపదాతినికాయంబులును సముద్రంబులుపోనియుభయబలంబులపై స్వాతిగతశుక్రయోగంబున నిరంతరంబుగాఁ బన్ని నీలమేఘంబులు గురియువర్షధారలచెలువున నత్యంతనిబిడంబుగా నన్యోన్యంబుఁ దొరఁగించునిశితశస్త్రాస్త్రధారాసారంబులును బ్రావృట్కాలంబునఁ గ్రమక్రమప్రవృద్ధంబులై ప్రవహించుమహానదులవడువున క్షణక్షణవివర్ధమానంబులై పఱచు నెత్తురుటేఱులును దద్వేగంబునం బడి పోవుచున్నచతుర్విధసేనాంగవివిధాయుధనానాభూషణచ్ఛత్రచామరకేతనభేరీకాహళమృదంగాదిసాంద్రానీకవస్తుసముదాయశకలంబులును రక్తమాంసమేదోమస్తిష్కసమాస్వాదనమదోన్మత్తంబులైనభూతప్రేతపిశాచకాకకంకగృధ్రవృకసృగాలాదులును గలిగి యొక్కచో వీరరసంబు మూర్తీభవించెనో యన నొక్కస్థలంబున రౌద్రరసం బాకృతివహించెనో యన నొక్కనెలవున బీభత్సరసంబు సావయవంబయ్యెనో యనఁ గొన్నిచోటుల నివి యన్నియుఁ గలసి ప్రస్ఫుటంబులుగాఁ గనుపట్టుచుండ భీరులకు దుర్నిరీక్షంబై శూరులకు నతిభీలాశ్చర్యజనకంబై యారణాంగణం బత్యంతభీషణంబును నతివిషమంబును నై యుండె నాసమయంబున. 55

శా. భూరిక్రోధముతోడ రాక్షసబలం♦బుల్ వేర్చి యొండొండ న
వ్వారాహిన్ వడిఁ జుట్టుముట్టి శరము♦ ల్వర్షింపఁ బేరల్కతోఁ
దేరు ల్వారణముల్ హయంబులు పదా♦తిస్తోమము ల్నుగ్గును
గ్గై రాలన్ నిజహస్తలాఘవము దం♦డాధ్యక్ష సూపెన్ గడున్. 56

వ. మఱియును. 57

శా. అక్షీణోద్ధతిఁ బైపయి న్వెస ననే♦కాక్షౌహిణుల్ సర్వలో
కక్షోభంబుగఁ గ్రమ్మి కోడముఖపై ♦ గాఢంబుగా నస్త్రశ
స్త్రక్షేపం బొనరింపఁగా నలిగి యా♦తామ్రాక్షియై యాబలా
ధ్యక్షాదేవి వధించె నేకశతసం♦ఖ్యాక్షౌహిణీసైన్యముల్. 58

వ. ఇవ్విధంబున శతాక్షౌహిణీక్షోబలంబుల నవలీల మారిమసఁగినకరణి బొరిసమరి యావారాహి యసాధారణపరాక్రమంబునఁ బేర్చినం గనుఁగొని యత్యంతక్రోధంబున విషంగుం డమ్మహాదేవిం దలపడి యాయోధనంబు సలుపుచుండె నంతకుమున్న యువరాజైనవిశుక్రునిముందర దైత్యవిరాజమానంబై నశక్తివితానంబుతోడ జన్యం బొనర్చుదనుజసైన్యంబు నాలోకించి శ్యామలాదేవి యధికసంరంభంబున నిజవాహినీచక్రంబుతోడనుంగూడ నవ్విశుక్రుని మార్కొని. 59

ఉ. మండలితప్రచండరుచి♦మండలమండితచిత్రజీవకో
దండమహోగ్రహస్త యయి ♦ దైత్యునిమీఁద నిశాతవిస్ఫుర
త్కాండపరంపరల్ వఱపి ♦ గ్రక్కున నాతని కడ్డమైన వే
దండశతాంగఘోటకప♦దాతిచయంబులఁ గూల్చె లీలతోన్. 60

గీ. క్షణమున కనేకవీరరా♦క్షసులఁ గూల్చి,యమ్మహాదేవిహస్తవే♦గంబుఁ గాంచి
యెంత చెట్టిదమమ్మ యీ♦కాంతశౌర్య, మనుచు శత్రులు విస్మయం♦బంది రపుడు.

ఉత్సాహము. శ్యామలాంబచిత్రజీవ♦చాపముక్తమార్గణ
స్తోమముల్ సమస్తదిగ్వ♦సుంధరాప్రపూర్ణతో
ద్దామతన్ వహింప నంధ♦తమస మావరించె సం
గ్రామభూమిఁ దన్మహత్త్వ♦గరిమ యెన్న శక్యమే. 62

మ. ప్రదరం బొక్కటి మంత్రనాయిక ధను♦ర్జ్యావల్లి సంధించి యా
త్రిదశామిత్రులమీఁద నేయ నది త♦ద్దీప్తప్రభావంబునన్
బదులున్ నూఱులు వేలు లక్షలయి యా♦బల్వీరుల న్బల్వురన్
జిదుముం జిత్రముగాఁగఁ గన్గొని సుర♦శ్రేణు ల్ముదం బందఁగన్. 63

సీ. మేఘబృందముల స♦మీరణోద్ధతులట్లు, తేరులగుంపుల ♦ బొరిసమరి
శైలసంఘముల దం♦భోళిధారలయట్లు, కరిసమూహముల ను♦ద్ధురతఁ గూల్చి
విపినౌఘములఁ గాల్చు♦వేఁడివేలుపులట్లు, హయసమాజముల ను♦ద్ధతి నడంచి
మంచుమొత్తంబుల ♦ మార్తాండరోచుల,భాతిఁ గాల్బలముల ♦ బడలుపఱిచి

గీ, మండలీకృతకోదండ♦దండ యగుచు, మంత్రనాయిక యడరించు♦మార్గణములు
శక్తినికరంబులెల్లను ♦ సంతసింప, సురలు వినుతింప నద్భుత♦స్ఫురణఁ దనరె. 64

స్రగ్విణి. చిత్రభూశౌర్యల♦క్ష్మిగతిన్ బైటఁబో, గుత్తమై కుల్కవ♦క్షోజయుగ్మంబుతోఁ
జిత్తవృత్తిన్ మంత్రనా♦థాంబ సల్పెన్ సమి,న్నృత్తమున్ గేయచ♦క్రేద్ధరంగస్థలిన్.

మ. ద్రోణకైకేల్మిగిడించి యమ్ము గొని త్రో♦డ్తోవింట సంధించి పె
ల్చిన నాకృష్టి యొనర్చి నైపుణిఁ గడున్ ♦ లక్షించి బిట్టేయుటన్
గనఁగా శక్యమె యెట్టివారి కయినం ♦ జక్రాకృతిం బొల్చున
ద్ధనువుం దూపులనెల్లులుం బడెనుదై♦త్యస్తోమముల్ దక్కఁగన్. 66

చ. కరముల వింటికోపులను ♦ గార్ముకమధ్యమునం గుణంబునన్
దరతర ముద్ధతిం దమకుఁ ♦ దామె జనించి విరోధిసైన్యమున్
బొరిఁగొనునట్లు చూడఁబడె ♦ భూరిరయంబున మంత్రనాయికా
శరసముదాయముల్ సరభ♦సంబుగఁ జూపఱ కద్భుతంబుగన్. 67

గీ. ఇంద్రజాలంబుఁ జూపిన♦యేపు మిగిలి, పటుగతి శపించి తెగటార్చు♦పగిది మించి
చూపులనె బారిసమరువి♦స్ఫురణ మీఱి, యమ్మహాదేవి యసురసై♦న్యములఁ జంపె.

క. నిస్త్రింశతఁ బొగడుగనిన,యస్త్రధరుల కెల్ల నద్భు♦తావహమై ది
వ్యాస్త్రప్రభావ మాసుమ,నస్త్రిణ నిగిడ్చి కూల్చె ♦ నరభుక్తతులన్. 69

మ. కదనక్షోణిని గూలినట్టిచతురం♦గస్తోమముం ద్రొక్కియు
న్మదదర్పంబులఁ బొంగి పైపయి నిలిం♦పద్వేషు లేతేర నా
త్రిదశేంద్రార్చిత మంత్రనాథ యలుకన్ ♦ దీపించుచున్ నూటయేఁ
బదియక్షౌహిణులన్ మహిం గలపె. దృ♦ప్యద్బాణపాతంబులన్. 70

గీ. అద్భుతపరాక్రమం బిట్టు ♦ లాచరించు,మంత్రనాయికఁ జూచి య♦మర్షకలుష
హృదయుఁడై తనదృష్టుల ♦ నింగలములు, గురియ నయ్యంబతో విశు♦క్రుండు దొడరె.

సీ. అప్పు డశ్వారూఢ ♦ యాదిగాఁ గల్గుశ,క్తిబలాధినాథలు ♦ తెంపుసేసి
శీకరబలు లౌను♦లూకజిత్ప్రభృతిర,క్షోబలాధిపుల మా♦ర్కొని నిశాత
శస్త్రాస్త్రవర్షముల్ ♦ సరభసంబుగ వారి,పైఁ దొరఁగించుచుఁ ♦ బరుసభంగిఁ
దత్ప్రయుక్తాస్త్రశ♦స్త్రములు ఖండించుచు, నాశ్చర్యముగఁ బోర ♦ నసురసైన్య
గీ, మడరి యాదైత్యులకుఁ దల♦కడచి బిట్టు, దాఁకుటయు యోగినీబలా♦ధ్యక్షు లధిక
ఘోరముగఁ బేర్చి యాసేన ♦ బారిసమరి, రతులదారుణనిశితది♦వ్యాశుగముల. 72

వ. ఇత్తెఱంగున. 73

మ. దహనజ్వాలలు పేర్చి యుద్ధవిడి న♦త్యంతంబు శుష్కంబు లౌ
గహనశ్రేణులఁ గాల్చుపోలిక మహా♦క్రోధోద్ధతిన్ శౌర్యధూ

ర్వహులై శక్తులు మీఱి సార్ధశతదే♦వద్వేషణాక్షౌహిణుల్
మహిఁ గూలంగఁ బరాక్రమించి రతిస♦మ్మర్దాజిపారీణలై. 74

వ. ఇవ్విధంబున నశ్వారూఢయు సంపదీశ్వరియు మొదలైన శక్తిసేనానాయికలు మదా
రుణవిలోచనలై విజృంభించి యులూకజిత్ప్రభృతిదానవసైన్యపాలకులకు నడ్డంబైన
సార్ధశతపరిమితంబైన యక్షౌహిణీసముదయంబు నవలీలఁ గూల్చినఁ జూచి క్రోధా
వేశంబున నద్దానవవరేణ్యు లెప్పటియట్ల యద్దేవీసమాజంబుతోఁ దలపడి భండనం
బొనరించుచున్న సమయంబున. 75

మ. దితిజశ్రేష్ఠుఁ డులూకజిత్తు గడఁకన్ ♦ దీపించి క్రోధాంధుఁడై
శితబాణంబులు పింజపింజవెఱవన్ ♦ శీఘ్రంబుగా నేయఁగా
నతితీక్ష్ణం బగునంకుశంబునఁ దురం♦గారూఢ యాక్రవ్యభు
క్పతి నాజిక్షితిఁ గూల్చెఁ గన్గొని నిలిం♦పశ్రేణు లగ్గింపఁగన్. 76

వ. ఇట్లు క్షణమాత్రంబున హయారూఢాదేవి భండాసురభాగినేయుఁ గృతాంతాల
యంబున కతిథింగాఁ జేసినం జూచి శక్తిసేనలు సమ్మదంబునం బొంగి యమ్మహాభా
గ ననేకవిధంబులం గొనియాడి రంత. 77

గీ. సంపదీశ్వరి మొదలైన♦శక్తిసైన్య,నాయికలు పేర్చి యతిఘోర♦సాయకముల
నధికరయమునఁ బురుషేణుఁ ♦ డాదియైన,రక్కసుల నుక్కడంగించి ♦ రక్కజముగ.

వ. అయ్యవసరంబున. 79

శా. ధూమిన్యాత్మజులన్ బదుండ్ర రణపా♦థోరాశిలో ముంచి యు
ద్దామస్ఫూర్తి హయాధిరూఢ మొదలౌ♦తచ్ఛక్తిసేనాగ్రిణుల్
సామోదంబుగఁ దమ్ము దేవతతు లా♦శ్చర్యంబునం గన్గొనం
గా మాన్యద్గతితోఁ జెలంగి రకలం♦కస్వాంతనీరేజలై. 80

వ. అసమయంబున. 81

శా. కిర్యాస్యాదిబలాధినాయికలయు♦త్కృష్టోగ్రతేజంబె చా
లూసర్యం డేమిటి కీసమస్తజగముల్ ♦ శోభిల్లఁగాఁ జేయు నం
చార్యు ల్బల్కుడు రన్విచారముననో ♦ యాదిత్యుఁ డస్తాభిధా
హార్యశ్రేష్ఠముమాటుఁ జెందెఁ బరిదృ♦శ్యాత్యంతశోణచ్ఛవిన్. 82

క. ఆసంధ్యాసమయంబున, నాసచివేశ్వరి మరాగ్ర♦హావ్యగ్రు విశు
క్రాసురునిఁ దొడరి నిశితమ,హాసాయకపంక్తి నొంచె ♦ నద్భుతభంగిన్. 83

ఉ. అంతకమున్న దైత్యబల ♦ మెంతయు శక్తిబలవ్రజంబుచే
నంతము నొందుటన్ గలుషి♦తాశయుఁడై యువరాజు క్రోధదు

ద్భ్రాంతదురాగ్రహం బెసఁగ ♦ దారుణసాయకవృష్టి ముంచె న
త్యంతవిఘూర్ణమానచటు♦లాంబకుఁడై సచివాధినాయికన్. 84

వ. ఇట్లు విజృంభించిన. 85

ఉ. వాఁ డడరించుశాతశర♦నర్గ మనర్గళలీలఁ ద్రుంచి క్రొ
వ్వాఁడిశిలీముఖంబుల న♦వారణ నాతనిమేను నొంచి పూఁ
బోఁడి మహాద్భుతంబు భయ♦మున్ జనియింపఁగఁ జేసె వేలుపు
ఱేఁడులమానసంబుల న♦నింద్యభుజాబలశౌర్యధుర్య యై. 86

క. దానికి సైరింపక యద్దానవుఁడు శితాస్త్రశస్త్ర♦తతులు వఱప న
మ్మానవతి వాని నన్నిటిఁ, దా నశ్రమవృత్తిఁ దునిమెఁ ♦ దక్షణమాత్రన్. 87

సీ. ఇవ్విధంబున దైత్యుఁ ♦ డేసినబాణంబు, లతిరయంబునఁ ద్రుంచి ♦ యమ్మహాను
భావ మహోగ్రకో♦పంబున నభ్రంకషం బౌతదీయధ్వ♦జంబు నొక్క
యర్ధశశాంకసా♦యకమునఁ బడనేసి, తాదృశం బైనయ♦స్త్రమున నతని
తేరిసారథితల ♦ ధారుణి వ్రాల్చఁగాఁ, జేసి యత్యంతవి♦చిత్రభంగి

గీ. నట్టితూపుల రెంట న♦య్యసురవీరు, శింజినియుఁ జాపమును దునిమిచి ♦ శీఘ్రవృత్తి
నవ్విశుక్రుని సమయింప♦నాత్మఁ దలఁచి, యలుకమొగమునఁ దోఁప న♦చ్చెలువయపుడు.

ఉ. దేవతలెల్లఁ దన్ను వినుతింపుచు వేడుకఁ జూడఁ బ్రజ్వల
త్పావకసన్నిభం బయిన♦బ్రహ్మశిరం బరిఁబోసి లోకచి
త్రావహశౌర్యధుర్య యగు♦నవ్వరవర్ణిని యేసెఁ గంకణా
రావము శక్తిసంస్తుతివి♦రావము నొక్కటఁ గూడి మ్రోయఁగన్. 89

గీ. అమ్మహాయోగి యేసిన♦యస్త్రరాజ, మధికదుర్నిరీక్షం బయి ♦ యాక్షణంబ
యవ్విశుక్రుని ప్రాణంబు ♦ లపహరించి, నమ్మదముఁ గూర్చె నిర్జర♦సమితి కపుడు. 90

వ. ఇవ్విధంబున. 91

ఆ. శ్యామలాంబచేత ♦ సమరోర్విఁ బడియున్న, యావిశుక్రుఁ జూచి ♦ యఖిలశక్తి
గణములెల్ల నపుడు ♦ గడు సంతసించుచుఁ, బొగడి రన్నెలంత♦భూరిమహిమ. 92

వ. మఱియును. 93

శా. దండాధీశ్వరియున్ విషంగుఁడు భుజా♦దర్పంబు శోభిల్ల బ్ర
హ్మాండం బంతయుఁ దల్లడిల్ల భయదా♦హంకారహుంకారు లై
చండక్రోధముతోడఁ బోరునెడ ర♦క్షఃపాలకున్ దండభృ
ద్దండాభం బగురోఁకటిం బెలుచ భూ♦దారాస్య మోఁదెన్ వెసన్. 94

వ. ఇట్లు ముసలతాడనంబున నొచ్చియు ననమాంబు లగుధైర్యసాహసంబు లవలంబించి
యభంగక్రోధతరంగితాంతరంగుం డగుచు నవ్విషంగుండు కాలదండప్రచండం బగు
గదాదండంబు హస్తంబున ధరియించి సకలలోకప్రశస్త యగునమ్మహాదేవిం దలపడి
చూపఱకు విస్మయం బాపాదించుచు దారుణం బగుమహారణంబు సలుపం దొడంగె
నివ్విధంబున మహోద్దండు లగుదండనాథాదైత్యనాథులు ప్రవర్ధమానక్రోధులై
గదాయుద్ధంబునకుఁ జొచ్చి చండాట్టహాసంబుల బ్రహ్మాండకటాహంబుఁ బగిలించుచు
నొకళ్లొకళ్ల నతిరయంబునఁ జుట్టుకొనివచ్చుచు నితరేతరావయవంబుల నిజపాణిద్వయం
బున నొప్పించుచు నన్యోన్యప్రహారంబులు దమకౌశలంబునఁ దప్పించుచు బహువిధ
పరిభ్రమణభేదంబు లపరిమాణంబుగా జరుపుచు నమరనేత్రంబులకుఁ గృతసంతోషంబు
లై నయనేకచారీవిశేషంబుల సంచరించుచు నొండొరులవ్రేటుల ద్రుక్కుచుఁ దెలివి
నొందుచు మదోద్ధతు లౌట నొకరి నొకరు నిరాకరించుచు నాయుధపాతంబులకుఁ
దెఱపి వెతకుచుఁ దమకరంబులఁ బొలుపలరుముసలగదాదండంబులనిరంతరసంఘట్ట
నంబునం బుట్టురణనంబు గణనాతీతం బై యంబరం బెల్ల నాదమయంబుగాఁ జేయు
చుండ వారాహీవిషంగులు దురాధర్షులు నభిలషితజయోత్కర్షులు నగుట నర్ధరా
త్రపర్యంతంబు సంగ్రామం బొనరించి రంతఁ గ్రమక్రమవివృద్ధం బగునాత్మీయబలం
బును నంతకంతకుఁ బ్రక్షీణదశాయత్తం బగుశాత్రవబలవృత్తంబు ననుసంధించి యా
దండనాయిక యాజగత్కంటకునిఁ బరిమార్ప మనంబునం దలంచి తనరథంబుమీఁద
ననూనతేజోవితానంబున దేదీప్యమానం బై వైరిసంహరణదోహలం బైనహలంబు
నవలీలఁ గేల నందికొని యతిజవంబున నద్దితిజునికంఠంబు నకుంఠవిక్రమంబునఁ దానఁ
దగిల్చి పెల్లునఁ దిగిచి భీషణకఠోరపాత్రం బగుముసలఘాతంబున నవ్విషంగునిఁ దచ్ఛ
తాంగంబుతోఁగూడ నొక్కపెట్ట తూర్ణంబుగాఁ జూర్ణం బగునట్లు చేసి యమరసం
ఘంబులకు నత్యాశ్చర్యం బాపాదించె నిత్తెఱంగున నమ్మెఱుంగుఁబోఁడిచేత నద్దితిసూ
నుం డసూనుం డైన నధికపరిమోదభరితహృదయంబు లై సురసముదయంబులు ప్రశం
సావచన కుసుమంబుల నద్దేవిం బూజించె నప్పుడు శక్తిచక్రాదినాయిక లెల్లఁ దద్విక్రమం
బునకుఁ జాలఁ బ్రహృష్టంబునం దేలి యనేకప్రకారంబుల నానిర్వికారం గొనియాడి రంత
భండాసురునిభాగ్యవిశేషంబుతోఁగూడఁ దద్విభావరీశేషంబునుం గడచనియె నివ్విధం
బున నమ్మంత్రిణీదండనాథ లతిదుష్కరం బై నయమ్మహాకార్యంబు నిర్వర్తించి కృతకృ
త్యలై నసకలశక్తులతోఁగూడ నారాత్రిశేషం బచ్చటఁ గడపి సూర్యోదయసమయం
బున రణశ్రాంతం బగునిజసేనాసమూహంబు నెప్పటియట్ల శిబిరంబుఁ జేర్చి రాసమ
యంబున నతిలోకం బగుతత్పరాక్రమవిశేషంబున నత్యంతసంతోషితస్వాంతయై లలి

తామహాదేవి వారలనత్యాదరంబున నధికప్రేమ వెలయ సంభావించి వారును దా
నును నిచ్ఛావర్తనంబున సుఖంబుండె నని యిట్లు హయగ్రీవుండు మంత్రనాయికాదం
డనాయికలయద్భుతశౌర్యంబులు వేర్వేఱఁ దెల్పిన విని కుంభసంభవుండును బరమప్ర
మోదసంభరితహృదయాంభోజుం డగుచు వెండియు నమ్మహాత్మున కిట్లనియె. 95

సీ. అప్రమేయప్రభా♦వాఢ్య మహాప్రాజ్ఞ, సర్వదేవార్చిత ♦ సదయహృదయ
తురగానన సమస్త♦దుష్కృతసంహార, యాశ్రితావనపరా♦యణ మహాత్మ
యాశ్చర్యకర మైన♦యమ్మంత్రనాయికా,దండనాయికలయు♦ద్దండపటిమ
దెలియంగఁబడియె వత్సలతాసముద్రుండ, వైనసీవలన న♦నూనమహిమ
గీ. యింక నొక్కటి వినఁగ మా ♦ కిచ్చ గలదు, శ్రీమహారాజ్ఞి శౌర్యవి♦శేషమనఘ
భండదైత్యుండు తమ్ములఁ♦పాటుఁ వినిన, పిదప నేమి యొనర్చె వి♦న్పింపవలయు. 96

సీ. అనుపమశౌర్యులై ♦ యఖిలంబునేలకు, గోలకుఁ దెచ్చిన♦క్రూరబుద్ధు
లావిశుక్రవిషంగు ♦ లనుసోదరులు మహా,సాహసు లగుచతుర్బాహుముఖ్య
తనయులు పల్వురు ♦ దారుణసంగ్రామ,రంగంబులోపలఁ ♦ గ్రుంగిపోవ
దానవవిభుఁ డేవి♦ధంబున ధైర్యంబు, గలిగి శత్రులతోడఁ ♦ గల నొనర్చెఁ
గీ. దన్మనోగ్లాని యేరీతిఁ ♦ దలఁగిపోయె, సంగరోత్సాహ మతని కె♦ట్టంగిఁ గలిగె
నడరి యెవ్వరు సాహాయ్య♦మాచరించి, రింతయును మాకు నెఱిఁగింపు♦మిద్ధచరిత.

ఉత్సాహము. భండనప్రచండుఁ డైన♦భండదానవుండు బ్ర
హ్మాండభాండజనని యైన♦యమ్మనుభావతో
దండి నెవ్విధమునఁ దొడరి ♦ దారుణాజి సల్పి త
త్కాండనిహతిఁ గూలెఁ దత్ప్ర♦కార మెల్లఁ దెల్పుమా. 98

క. అని వేఁడినఁ గలశోద్భవుఁ, గనుఁగొని హయవదనుఁ డధిక♦కారుణ్యమునన్
విను మని తెల్పఁ దొడంగెన్, వనదఘుమంఘుమగభీర♦వాక్యప్రౌఢిన్. 99

సీ. వినుము చెప్పెద నీకు ♦ విస్పష్టముగ లలి,తామహాదేవి యు♦దారచరిత
మార్యసంస్తవన మ♦హాప్రాజ్ఞ కలశసం,భవమానిచంద్ర నీ ♦ వవధరింపు
మఖిలపాతకహరం ♦ బత్యంతకీర్తిసం,పాదకంబు సమస్త♦భద్రకరము
సకలపుణ్యావహ ♦ మకలంకసమధిక,జ్ఞానవిజ్ఞానప్ర♦దానశాలి
గీ. యష్టవిధసిద్ధిదాయకం ♦బై నదీని, భక్తితో విషువాయన♦పంచపర్వ
ముఖ్యపుణ్యకాలములఁ బ్ర♦స్ఫుటవినీతిఁ, బఠనసేయంగవలయు స♦త్ప్రవరులకును. 100

ఆ. అనుజు లాజిలోన ♦ హతు లౌట హత శేష,దనుజు లరిగి చెప్ప ♦ దైత్యభర్త
వినట మునిఁగి కొంత♦వడి యుండి యింకఁ దన,మనుట దెల్పె ననుచు ♦ మదిఁ గలంగి.

క. తనబాహాయుగళ మనఁ దగు,ననుజద్వయ మాజిలోన • నట్టులు వమ్మై
చనుటకు నిర్భరవేదన, దనికిన నిల సోలి తెలిసి • దైన్యము దోఁపన్. 102

ఆ. మగుడ మగుడ మూర్ఛ • నిగుడఁగ జగతిపై, వ్రాలి తెలియుచును ము•రంతశోక
తప్తచిత్తుఁ డగుచుఁ • దలవెండ్రుకలు వీడ, భూషణములు రాలఁ • బొలుపు దక్కి.

క. ఏదిక్కు చూచె నాతం, డాదిక్కున నిల్చియున్న•యసురులు గాలిం
దూదివిధమ్మున సనునట్లు మహాదూరము గాఁగ భీతి•నందె పఱవఁగన్. 104

వ. అయ్యసురేంద్రుండు సురేంద్రకంటకులైననిజసహోదరులం దలంచి కడు విహ్వ
లించి మఱియును. 105

క. వారికిఁ గలిగినసుగుణము, లారూఢిగ నచటివార • లందఱు వినఁగన్
జేరుకొని గాఢచింతం, గూరి దనుజవర్యుఁ డెలుఁగు • గుత్తుకఁ బగులన్. 106

ఆ. విజయవాంఛ విడిచి • వెజ్జిధైర్యము దన,మానసమునఁ బొడమ • మగువపిండు
వలనఁ బరిభవంబు • వచ్చుట లజ్జావి,కార మంతకంటె • మేరమీఱ. 107

క. పరిభవకారిణు లగును,ద్ధురశక్తులమీఁదియధిక•దుర్దమకోపం
బురుతరదానవహుతాశను,కరణిఁ బొడమి తనదుహృదయ•కానన మేర్చెన్. 108

గీ. గాఢదీర్ఘోష్ణనిశ్వాస•గణము నిగుడఁ, జటులదుర్నిరీక్ష్యోగ్రలో•చనయుగంబు
భస్త్రికాద్వయి నూఁదఁగాఁ • బ్రజ్వలించు,చండవిస్ఫులకొలుముల•చంద మొంద.

వ. మూర్తిమంతంబైనక్రోధంబువోలెఁ జూపట్టినయతనిఁ జేర వెఱచి యచ్చటియంత
అయ్యైమఱుఁగుల నిఱికి యొదిగి యుండ. 110

గీ. అప్పుడు కుటిలాక్షుఁ డొక్కరుఁ • డధికధైర్య,సాహసములూని యుచితంపు•సాంత్వనోక్తు
లల్లనల్లన బహువిన•యంబు దోఁపఁ, బలుకుచుండంగ నొకకొంతఁ • దెలివినొంది.

వ. దానవేంద్రుం డుండునంత. 112

గీ. పరిభవవ్రీడచేత న•పార మయిన,కోపవిక్రృతిచేఁ గుటిలాక్షుఁ • డోపి పలుకు
సాంత్వనములచే రాక్షసే•శ్వరునిశోక, మంతకంతకు సన్నమై • యడఁగె నపుడు. 113

వ. ఇట్లు శోకంబు నుజ్జగించి. 114

క. ఫాలం బనునాయుధ మా,భీలంబుగఁ గేలఁ దాల్చి • పృథుసమధికశౌ
ర్యాలంబనుఁడై సలుపుచుఁ, గాలాంబుదనినదసదృశ•ఘనహుంకృతి నై. 115

సీ. తనసమీపమున నెం•తయు భక్తితోడ వి,నీతవేషుం డయి • నిలిచియున్న
కుటిలాక్షు నఖిలర•క్షోబలాధ్యక్షునిఁ, గనుఁగొని నీవు వే•గంబ మనకుఁ
గలిగినబలముల • గాఢసన్నాహంబు, వెలయ రప్పింపుము • వీరవర్యు
లుగ్రతాళజంఘాదు • లందఱు మనతోడ, నరుగుదేవలయు న•త్వరము గాఁగ

గీ. మచ్ఛ్రమాయలు పచరించి ♦ దుష్టవృత్తి, నింతపని చేసినట్టియ ♦ క్కాంతఁ ద్రుంచి
యెయము మీఱఁగఁ దత్కంఠ ♦ రక్తమునను, రణనిహతబాంధవులకుఁ ద ♦ ర్పణ మొనర్తు.

క. అని ప్రళయాంబుదగర్జా, ధ్వనికి సదృశ మైనయట్టి ♦ దారుణగర్జా
ధ్వని సేయుచు నసురేంద్రుం, డనుపమితోత్సాహ మెసఁగ ♦ నానతియిచ్చెన్. 117

ఆ. ఇట్టు లానతిచ్చి ♦ యింతింత యనరాని, సమరకౌతుకంబు ♦ సాహసంబు
ధైర్యశౌర్యమాన ♦ దర్పముల్ శోభిల్ల, నసురనాథుఁ డనుప ♦ మాగ్రహమున. 118

గీ. వజ్రపాతసహిష్ణులై ♦ వజ్రఖచిత, కఠినరమణీయ మగు హేమ ♦ కంకటంబు
దొడిగి శితశరపూర్ణ మహా ♦ తూణయుగము, చరమభాగంబునందు వి ♦ స్ఫురణఁ దనర.

ఉ. జంగమమేరుపర్వత ము ♦ చందమునన్ దృఢకార్ముకంబుఁ గే
లం గొని మెక్కువెట్టి యచ ♦ లావియదంతరభాగ మెల్ల నిం
డం గఠినంబు గాఁగ గుణ ♦ టంకృతి సేయుచు మేన రత్నహే
మాంగదముఖ్యభూషణము ♦ లద్భుతకాంతుల నీనుచుండఁగన్. 120

క. కాలాగ్నివోలెఁ గ్రోధ, జ్వాలలు నిగుడంగ సమర ♦ సన్నాహం బా
భీలముగ మెఱయ రక్షః, పాలుం డున్నంత నతని ♦ ప్రబలతరాజ్ఞన్. 121

సీ. అతులశస్త్రాస్త్రవి ♦ ద్యాధురీణులు దీప్త, సన్నాహచతురంగ ♦ సైన్యయుతులు
కఠినశిరస్త్రాణ ♦ కవచాదిపరికరుల్, కార్ముకమార్గణ ♦ ఖడ్గధరులు
వర్ణితపటుజవ ♦ వాహనారూఢులు, సమదదురాగ్రహ ♦ చటులమతులు
తాళజంఘాదు లౌ ♦ దానవప్రవరులు, నలువురు సేనాన్యులా ♦ నగరరక్ష

గీ. లుద్ధతోద్ధతుల్ చతురర్ణ ♦ వోపమాను, లఖిలయుద్ధవిశారదు ♦ లసురనాథు
నుల్ల మలరంగ వెడలిరి ♦ యుద్ధకేళి, కౌతుకాధీను లగుచు లో ♦ కములు బెదర. 122

క. సమదులు పంచత్రింశ, చ్ఛమూవరులు వెడలి రతుల ♦ సమధికసన్నా
హము మెఱయఁగఁ గుటిలాక్షుఁడు, దమకున్ గన్నాకుగాఁగ ♦ దర్పము మెఱయన్.

క. బలసంయుతులై ప్రళయా, నలసము లగు సైన్యపతుల ♦ నాసీరముసం
దిలకింపఁగఁ గుటిలాక్షుం, డలఘుబలుఁడు సకలబలవ ♦ రాగ్రణి మెఱసెన్. 124

వ. ఇత్తెఱంగున. 125

క. నలువురు నగరసురక్షకు, లలఘులు మఱి మువ్వదేవు ♦ రాకుటిలాక్షా
దులు భండాసురువెంటన్, నలుబండ్రు బలాధిపులు ర ♦ ణప్రియు లగుచున్. 126

గీ. వెడలునప్పు డద్దానవ ♦ విభునితోడ, గండుమిగిలిన సేనలు ♦ రెండువేల
నూటయెనుబదేనక్షౌహి ♦ ణులు మహోగ్ర, సంగరోత్సాహలీలఁ బొ ♦ సంగి నడచె. 127

ఆ. ఇవ్విధమునఁ బగఱ ♦ నేకహేల హరింపఁ, గోరి భండనిర్జ ♦ రారి వెడలఁ
జూడ వింతగాఁగ ♦ శూన్యకం బపుడు స్త్రీ,మాత్రశేష మయ్యె ♦ మానిచంద్ర.

వ. అయ్యవసరంబున. 129

క. అక్షీణవేగపటుహ,ర్యక్షసహస్రోహ్యమాన ♦ మై దృఢసమ్య
క్పక్షయుత మైనమైనా,కక్షోణిధరంబుభాతిఁ ♦ గడుఁ జోద్యంబై. 130

క. అభీలనామమై జగ,దాభీలౌద్ధత్య మగుమ ♦ హారథవర్యం
బా భండాసురుఁ డెక్కెఁ గ్రు,ధాభుగ్నభ్రుకుటి యగుచు ♦ దారుణభంగిన్. 131

క. కరమునఁ బ్రళయానలవి,స్ఫురదుగ్రజ్వాలభంగి ♦ భూరితరరుచిన్
సురనికరభయద మగుచున్, గర మరుదుగ యాతనాఖ్య ♦ ఖడ్గము మెఱయన్. 132

సీ. బలములతోడ న ♦ ప్రతిహతగతిఁ బ్రోలు,వెడలి యుద్ధముసేయు ♦ వేడ్క మెసఁగ
దానవభర్త యు ♦ ద్ధతిఁ జొప్పచుండంగ, నానాముఖంబుల ♦ నడచుచున్న
సైన్యసంఘంబుల ♦ సమ్మర్దగమనంబు,వలన నుత్పన్నమై ♦ వార్ధు లెల్ల
వంకుగాఁ జేయుచు ♦ వసుధాపరాగంబు, తచ్ఛమూభారంబుఁ ♦ దా సహింప

గీ. నలవి గాక విశ్వంభర ♦ యంబరమున, కరిగెనో యన మిన్నెల్ల ♦ నావరించి
యపుడు గాఢాంధకారంబు ♦ నావహించి, సకలజగముల కతిభీతి ♦ సంఘటించె. 133

వ. మఱియును. 134

సీ. పుడమిపై నడువఁగా ♦ నెడ లేక కొందఱు, గగనభాగమున న ♦ గ్గలికఁ జనిరి
పూనికఁ గొందఱ ♦ భుజము లారోహించి, కొందలం బందక ♦ కొంద ఱరిగి
రన్యోన్యసంఘర్షి ♦ తాంగకు లై కొంద, ఱధికవ్యథలతోడ ♦ నల్ల నడచి
రతులశతాంగచ ♦ క్రానేకపాంఘ్రిఘ,ట్టితు లయి కొందఱు ♦ క్షితి నడంగి

గీ. రివ్విధంబున దివి భువి ♦ నెల్లదిశల, నేస్థలంబునఁ జూచినఁ ♦ నిసుము చల్ల
రాల కుండెడునట్టిసాం ♦ ద్రత్వ మొంది, దితిజబల మేగె నప్రతి ♦ హతము గాఁగ. 135

వ. ఇట్లు సర్వసైన్యంబులతోఁగూడ జగదవక్రవిక్రమవిభాసురుం డగుభండాసురుండు సంగ్రామరంగంబుఁ జేరం జని వజ్రనిష్పేషంబుతోడ సదృక్షం బగుసింహనాదంబు చేసిన నత్యంతకఠోరభావం బైనయమ్మహారావంబువలన. 136

సీ. పగిలె బ్రహ్మాండంబు ♦ పాథోధు లేఁకును, శోషించె మార్తాండ ♦ శుభ్రకిరణు
లెక్కడేని దొలంగి ♦ యేగిరి తారకా,వ్రాతముల్ రాలె ధా ♦ త్రీతలమున
భూమి డోలాలీలఁ ♦ బొలుపు దక్కె దిశాగ,జంబు లెన్మిది సాధ్వ ♦ సంబు నొందె
నెల్లదేవతలు మూ ♦ ర్ఛిల్లి రకాండసం,త్రాసవిహ్వల మై కృ ♦ శానువరణ

గీ. మధ్యగతశక్తినికరంబు ♦ మాఱ్మినుపడి నిజాయుధంబులు విడిచి య♦నంతరంబ
మనసులోపలఁ దెలివి నూ♦ల్కొన్నఁగఁ జేసి, యత్నమునఁదాల్చె నెప్పటి♦యట్ల వాని.

గీ. అసురసైన్యంబులోపలి♦హస్తివాజిబృందములు గాఢమూర్ఛల ♦ గ్రమ్మదినట్టు
లుండి యెట్టకేవియుఁ జేష్ట ♦ నూని నిల్చెఁ, దొంటిపోలికఁ దద్రవో♦ద్ధురత యసదె.

క. ఆరనమున వహ్నిప్రాకారవలయ మద్భుతంబు ♦ గాఁగఁ బ్రశాంతం
బై రయమున నుజ్జ్వలమై, యారూఢి వహించెఁ దొంటి♦యట్ల మునీంద్రా. 139

గీ. దైత్యపతిసింహనాదంబు ♦ తద్బలాధిపతులచాపగుణధ్వనుల్ ♦ ప్రబల సకల
యోధకోలాహలంబును ♦ నొకటి యగుచు, శబ్దమయముగ నొనరించె♦జగమునెల్ల.

శా. ఆనాదంబున భండదానవుఁడు క్రో♦ధావిష్టుఁడై యాజికిఁ
దా నేతెంచుట యాత్మలోఁ దెలిసి యా♦దైత్యాగ్రణిఁ ద్రుంపఁగా
నేనే కాని మదన్యు లెవ్వరును ని♦ర్ణీతంబు గానోప రం
చానందధ్వజయుక్తచక్రరథరా♦జాధ్యక్ష సక్రోధ యై. 141

గీ. తానె యయ్యాతుధానుని♦దర్ప మడఁప, నాత్మలోనఁ దలంచిన♦యంతలోన
నమ్మహారాజ్ఞితలఁపున ♦ కనుగుణముగఁ, దరలె శ్రీచక్రరాజర♦థంబు వేగ. 142

వ. ఇత్తెఱంగున సకలజగదరిష్టహేతు వైనయాదుష్టాగ్రగణ్యుని సమయింపఁ దనదివ్యచిత్తంబునఁ దలంచి శ్రీమల్లలితాపరమేశ్వరి యాదైత్యవాహినిపై నరుగ సమకట్టినఁ దదనుజ్ఞాతంబై తద్రథచోదకషట్కంబ తిరయంబున నడపింప ఋగ్వేదాదిచతుర్విధపురుషార్థమహనీయతురంగంబును నానందధ్వజయంతీమహితంబును నవపర్వసంయుతంబును బరార్ధసంఖ్యకంటె నధికంబైనపరివారశక్తిసమూహంబు గలిగి యెప్పుడు నాకృష్టకార్ముకలై పర్వానవకంబునఁ దత్తత్స్థానస్థిత లైననవసంఖ్యాకదేవతలచేత సర్వతఃపాలితంబును దశయోజనోన్నతంబును జతుర్యోజనవిస్తృతంబును నైనశ్రీచక్రరాజరథేంద్రంబు మహాప్రకాశమానంబై యరుగుచుండ నమ్మహారాజ్ఞిస్యందనంబునగ్రభాగంబున వీణావినోదినియుఁ శుకప్రియయుఁ జిత్రజీవశరాసనధారిణియు సింహాసనేశ్వరీప్రదత్తభద్రముద్రాంగుళీయకవిరాజితకరాంగుళియుఁ బ్రధానేశ్వరియు నైనశ్యామలాదేవి గేయచక్రరథారూఢయై నిజసైన్యసమేతంబుగా వీరశృంగారరసంబులు రెండును నేకీభవించి యాకారంబు వహించెనో యన దనుజభయంకరంబుగా నపరిమితవిలాసంబునఁ బోవుచుండఁ దదీయమహనీయశతాంగంబునకు ముంగల నభంగవీరరసప్రధానయు సమస్తశక్తిసేనాపరిపాలనధురీణయుఁ బ్రదర్పితదానవవాహినీసంహారణప్రవీణయు నైనదండనాయికాదేవియుద్దండవిక్రమంబు నెఱపఁ గిరిచక్రనామమహాశతాంగంబు నెక్కి యుక్కున ససైన్యంబుగా నేగుచుండఁ దక్కిన

శక్తులు బహుపార్శ్వసంఖ్యాతంబు లైనసింహ వ్యాఘ్ర మహోష్ట్ర విహంగ కురంగ మాతంగ తురంగ భేరుండ శరభ శార్దూల వరాహ మహిష తరక్షు వృక వాతప్రమీ ప్రముఖంబు లైనతిర్యగ్వాహనంబు లారోహించి భండాసురవధోద్యోగంబునం దేకనిశ్చయంబు గలిగి నడిచి రిట్లు సర్వశక్తిసైన్యంబులు వహ్నిప్రాకారంబువలన నిర్గమించునప్పుడు యోజనమాత్రవిస్తారం బగుతత్సాలద్వారం బాచమూసమూహంబు వెడలుటకుం జాల దని తలంచి జ్వాలామాలినికానిత్య యత్యంతవిస్తారంబుగా నవ్వాకిలి యొనర్చిన నాజగన్మాత మహాప్రతాపదీపితయై సకలశక్తిసేనలతోఁగూడ నిస్సమ్మర్దంబుగా హుతాశనావరణంబు బయలికి వెడలినం గనుంగొని యనిమిషులు బ్రహర్షంబున దుందుభులు మొరయించుచు నమ్మహాభాగపైం బుష్పవర్షంబులు గురియించుచు ననేకవిధంబుల నప్పరమేశ్వరిం బ్రశంసింపుచు దివ్యవిమానారూఢులై యమ్మహాయుద్ధంబు వీక్షించువేడుక దమయుల్లంబుల మల్లడిగొనుచుండ నుండిరి వసిష్ఠాదు లగుసప్తమహర్షులును దక్కినమౌనీంద్రులును మహార్థగూఢంబు లైనమంత్రసమూహంబులం దదీయజయార్థులై కొనియాడుచుండిరి మఱియుం దద్రథోత్తమంబుమీఁద నతిశయప్రదీప్తంబై మహాముక్తాతపత్రం బంబరం బెల్ల నిజకాంతిమయంబుగాఁ జేయుచుండె జయలక్ష్మీసూచకంబు లైనయనేకశుభనిమిత్తంబులు పరిదృశ్యమానంబు లగుచునుండె నప్పుడు తచ్ఛక్తిసైన్యగమనసముత్థితధూళిప్రకరం బంతటం గలయంబర్వి నభంబును భూమియు దిక్కులును గనుంగొన నెవ్వరికి శక్యంబు గాక రోదసి యెల్ల కేవలధూళిమయం బగుచుండ నుభయవాహినులు లొండొంటిం దలపడి యతిఘోరంబుగా సంగ్రామంబు సేయందొడంగిన శక్తిసేనాధినాయిక లెల్ల నేకహేళి నక్తంచరవరూధినీచయంబుల నపరిమితసాయకప్రముఖాయుధప్రపంచంబునం బెంచ మడంచుచుండ మఱియుం బైపై నతిసాహసంబున నురవడించుసురవైరిసముదయంబుల గిట్టి నెట్టన బహువిధదివ్యాస్త్రజాలంబులు వఱపి యయ్యోగినీనికరం బనేకదనుజసేనాప్రకరంబులం గనుపుగొట్టిన సంగ్రామరంగంబున నెయ్యెడం జూచినం జతురంగసముదయంబు లకాండప్రళయవాత్యాహతులచేత నిర్మూలంబులై కూలుసాంద్రవిపినంబులపోలికం బ్రబలహస్తినీసమూహశుండాదండసలిలోన్మూలితకమలాకరకమలషండంబులవిధంబునం జతురకృషీవలనికరాగ్రస్థితనిశితలవిత్రధారానికృత్తసపరిపాకక్షేత్రసస్యకదంబంబులడంబునం జూపట్టుచుండ మఱియు నిశాచరవాహినులలోన నృత్యత్కబంధనివహంబు లుభయతీరస్థపాదపపటలంబులుగా రణనిపతితదానవకేశబంధనికాయంబులు బహుశైవాలపుంజంబులుగా శ్వేతాతపత్రవలయంబులు శ్వేతాంభోజబృందంబులుగా నిశితబాణఖండితంబు లైనవారణచరణసంఘాతంబులు కమఠవ్రాతంబులుగా శక్తినారాచవిద్ధ

స్తంబులై నగజకళేబరసముదయంబులు గండశైలసందోహంబులుగా నానాకాండ విలూనకాండంబులై కూలినచామరవ్యూహంబులు ఫేనవిసరంబులుగా సుతీక్ష్ణకృపాణస్తోమంబులు ప్రతీరంబుల దట్టంబుగా నల్లినవల్లికాపరంపరలుగా ర్చాతించువీరుల వీక్షణశ్రేణులు భాసమానశుక్తిసంపుటవితానంబులుగా వివిధంబులైనవాహనమండలంబులు నక్రమీనాదిజలజంతునికురుంబంబులుగా భేరీప్రముఖవాద్యప్రకరంబులు మండూకనికరంబులుగా నస్థిశకలోత్కరంబులు దట్టంపుటిసుకప్రోవులుగా ననేకశోణితనదీప్రవాహంబులు వఱచె నిట్లు చతుర్థయుద్ధదివసంబు ప్రాతఃకాలంబునఁ దొడంగి యామయామద్వయపర్యంతంబు మృత్యుదేవతకైనను గుండె లదరఁజేయుఘోరసంగ్రామం బారెండుమొనలవారును సలుపుచుండి రాసమయంబున. 143

మ. రణకోలాహలహస్తిరాజముపయిన్ ♦ రౌద్రాకృతిం బొల్చి స
త్త్వగుణాతుల్ సల్పుచు దేవత ల్గనుఁగొనన్ ♦ భద్రేభకోటు ల్వెసన్
గణనాతీతముగాఁ దనుం బలసి రా ♦ గాఢోద్ధతిం బేర్చి స
ద్గుణపాథోనిధి సంపదంబ బహురక్షోరాజిఁ గూల్చె న్వడిన్. 144

కవిరాజవిరాజితము. భువిఁ దలపోయఁ బరాజిత మయ్యును బోఁడిమిచే నపరాజిత మన్
సువిదితసార్థకనామము దాలిచి ♦ సొంపు వహించుసమీరసదృ
గ్జవయుతఘోటకరత్నము నెక్కి ని♦శాతతరాంకుశపాతములన్
బ్రవిమలశౌర్యతురంగమనాయిక ♦ రాక్షససేనల రూపడఁచెన్. 145

పృథ్వి. తురంగనుతతిన్ మదో♦ద్ధురమతంగజవ్యూహమున్
సరోషరథికౌఘమున్ ♦ బటుపదాతిసందోహమున్
శరాసనగుణచ్యుతా♦స్త్రశతపంక్తిపా ల్సేసె నా
తిరస్కరిణికాంబ వి♦ద్విషదనీకదుష్ప్రేక్ష్య మై. 146

ఉత్సాహము. తనదుకీర్తి సద్భుతప్ర♦తాపమున్ వహించెనో
యనఁగ ముఖము ధవళకాంతి ♦ నమర పక్షయుగళ మిం
పెనయుశోణకాంతిఁ దనర ♦ నెసఁగుపైన తేయుఁ దా
ననుపమముగ నెక్కి నకులి ♦ యాజిఁ గూల్చె రిపుతతిన్. 147

పంచచామరము. చలంబుమీఱఁగా కరాంబు♦జంబునం దనర్చు పెన్
హలంబు సాఁచి నిర్భరాగ్ర♦హంబుతోడఁ బేర్చి యా
బలాధినాథ దైత్యరాజి ♦ బల్మిఁ బట్టి రోఁకటన్
దల ల్పగిల్చి కూల్చె దేవ♦త ల్మహాద్భుతం బనన్. 148

వ. మఱియును. 149

చ. అఱిముఱి దైత్యసేనలు మహాగ్రహవృత్తిఁ గడంగి వీఁకమైఁ
దఱుచగుబాణవర్షము లుపగ్రతఁ గురియింప నప్పుడున్
మెఱుఁగులు గ్రక్కునంపఱ యమేయముగా నిరసించి త్రుంచి త్రె
చ్చఱఁ గిరివక్త్రి దప్పితనిశాచరసైన్యముఁ గూల్చెఁ బల్విరన్. 150

పద్మనాభము. శ్రీమించుమంత్రాధినాథామహాదేవి శ్రీమన్మహారాజ్ఞి సంతోషమందన్
భీమాసురాక్షౌహిణీసంహతిం గిట్టి నిస్సీమనారాచవృష్టిన్ రథంబుల్
సామోద్భవంబుల్ హయంబుల్ పదాతివ్రజంబుల్ ధరం గూల బృందారకేంద్ర
స్తోమంబు లత్యంతహర్షంబుతోఁ జూచి స్తోత్రంబు సేయంగఁ బొల్చెన్ రణోర్విన్.

వ. ఇత్తెఱంగున. 152

మ. తనవారందఱు దైత్యమర్దనకళాధౌరేయులై సంగరా
వని శోభిల్లఁగఁ జూచి సమ్మదసుధావారాన్నిధిం దేలి యా
యనఘప్రాభవ చక్రనాయిక త్రిలోకార్తిం బెడంబాప దు
ర్జనతాగ్రేసరు భండదానవు వధించం గోరి యుద్వృత్తితోన్. 153

క. వానిరథ మున్నచోటి క, నూనవిభవ మెసఁగ నిజరథోత్తమ మరుగం
గా నియమింపఁ దదాజ్ఞన్, బూనికమై నడపి రరదముల్ దత్సూతుల్. 154

చ. ఇటు తను మార్కొనం గడఁగి యేడ్తెఱ వచ్చుత్రిలోకనాయికం
జటులభుజాబలుం డగునిశాచరవంశలలాముఁ డాగ్రహో
ద్భటముగఁ జూచి సంగరనితాంతకుతూహల ముప్పతిల్ల ను
త్కటమతి రోషపావకశిఖాపరితాపితమానసాబ్జుఁ డై. 155

క. కాలాంతకోపమానుం, డై లోకైకప్రసూరథాభిముఖముగాఁ
దోలించె నిజోత్తాలా,భీలాఖ్యస్యందనంబుఁ బేర్చినకడిమిన్. 156

వ. ఇవ్విధంబునఁ జక్రరాజరథారూఢయై పశ్చాద్భాగంబున నుభయపార్శ్వంబుల నవక్రవిక్రమసమగ్రసముదగ్రజాగ్రదనేకశక్త్యనీకంబులు గొలువ శృంగారవీరరసంబులును బ్రాభవసౌందర్యంబులును నతిలోకంబులై కనుపట్ట రౌద్రోద్రేకంబున వచ్చుచున్న శ్రీమహారాజ్ఞికి సమ్ముఖంబుగా నాభీలాభిధానమహాస్యందనారూఢుం డై తనయిరుదెసలఁ బిఱిందిదిక్కున నక్షీణసమరవిద్యావిచక్షణంబు లైన రక్షోబలంబులు బలసి చనుదేర ననూనంబు లైనమాయోపాయసాహసధైర్యశౌర్యోత్సాహమానంబులతోడ స్వబంధువధజనితమహాక్రోధప్రజ్వలితుం డై వేంచేంచుభండాసురసార్వభౌమునకుఁ దలకడచి దానవసేనల ధికరయంబున నమ్మ

హాదేవిస్యందనంబుఁ జుట్టుముట్టి యపరిమితశస్త్రాస్త్రంబులు వర్షించిన నీహారచ్ఛన్నం బైనసూర్యబింబంబువోలె నించుకసేపు తద్రథంబు చూపట్టె నంతకుమున్న యమ్మహానుభావ యాబద్ధతూణీరయు నాముక్తవజ్రకవచయు నారోపితశింజినీకార్ముకయు నతిశయసమ్యగ్వృద్ధీకృతభూషణవిశేష కేశపాశోత్తరీయనీవీబంధయు దుష్టాసురనిగ్రహకుతూహలయు నగుచు సమరసన్నాహంబునఁ దేజరిల్లియున్నయది గావునఁ దచ్చమూసమూహంబులపైఁ గవిసి తూణీరముఖంబునకై నిజపాణిపద్మంబు సాఁచుటయు నమ్ము దిగుచుటయుఁ గార్ముకగుణంబున సంధించుటయుఁ దెగనిండ నాకర్షించుటయు లక్ష్యనిరూపణంబు సేయుటయుఁ గనుంగొన శక్యంబు గాకుండ హస్తలాఘవంబుఁ బ్రకటించి ధనుర్విద్యాప్రభావంబుఁ జూపిన ఝంఝానిలంబున విరియు మేఘపటలంబువోలె నయ్యసురుల బెడిదంపు లంపఱ యెల్ల నాక్షణంబ విరిసిన మఱియు నంత నిలువక తోడ్తో దనుజసేన లురవడించిన నయ్యద్భుతానుభావ నిరతిశయమహత్త్వంబువలన. 157

సీ. కోదండగుణమునఁ • గూర్చుచో నొకటియై, శరమోక్షణంబున • దశక మగుచు
నంబరంబునఁ బోవు•నప్పుడు శతక మై, యసురసైన్యములో స•హస్ర మగుచు
లక్ష్యంబు డాయుచో • లక్షసంఖ్యాక మై, సూటి శత్రులఁ గూల్చు•చోటఁ గోటి
సంఖ్యయై యాజగ•జ్జనయిత్రిశరములు, పరమాద్భుతంబును • బరముదము
ఆ. నందఁ జేసెఁ జూచు•బృందారకశ్రేష్ఠ,తతులమానసమున • కతులితముగ
మానివర్య యమ్మ•హానుభావ తొడంగి, ముట్టు దనుజబలము • నేపడంప. 158

మ. కని భండాసురుఁ డాగ్రహోగ్రవిలస•త్కాలాంతకాకారుఁ డై
ఘనబాణంబులఁ జక్రరాజరథముం • గప్పెన్ మహారాజ్ఞియున్
దనుజాధీశ్వరుపై నిశాతపటుకాం•డశ్రేణి వర్షించె ని
ట్లనిమేషాద్భుతకారి యారణ మవా•ర్యం బై ప్రవర్తింపఁగన్. 159

క. ఆలలితాభండాసుర, పాలురయాయోధనంబు • పరమముదముతో
నాలోకించిరి వేడుక, నాలో నయ్యుభయబలచ•యంబులవారల్. 160

గీ. అప్పు డన్యోన్యసంప్రయు•క్తాస్త్రఘట్ట,నారవంబును ఘోరహుం•కారరవము
శింజినీమహారవము ని•స్సీమభంగి, నఖిలదిక్కులు నిండె మ•హాద్భుతముగ. 161

క. ఇరువురకుఁ దూణముఖమున, శరముం గొనుకరము వింట • సంధించుకరం
బురవడినేయుకరంబున్, గర మరుదుగ నెల్లయపుడుఁ • గనఁబడె నాజిన్. 162

ఆ. అంత కంత కమ్మ•హారాజ్ఞి యతిలాఘ,వముగ నమితబాణ•సమితి యేయ
నరుదు గాఁగఁ దత్క•రాంబుజవ్యాపార, మరసి కన నశక్య • మయ్యె నపుడు.

వ. మఱియును. 164

క. శరవృష్టి నంధకారము, పరువడిఁ గావించుచును న♦భంబును దిక్కుల్
కర మరుదుగ ఛేదించుచు, సురారివరు నొంచెఁ ద్రిపుర♦సుందరి పెలుచన్.

వ. ఇట్లు లోండోండ మర్మభేదనప్రచండంబు లైన కాండప్రకాండంబులు నిగిడించు నాబ్రహ్మాండనాయికయద్భుతహస్తవేగంబునకు నాశ్చర్యంబు నొంది భండదాన వుండు సహింపక క్రోధారుణితనేత్రుండై యాలలితాపరమేశ్వరి నసంఖ్యాతశర సంఘాతంబునఁ గప్పి యంత నిలువక. 166

గీ. అంధతామిస్రనామమ♦హాస్త్ర మప్పు, డమ్మహారాజ్ఞిపై నేసె ♦ నసురభర్త
దాని నశ్రమమున మహా♦తరణిబాణ,మున నడంగించె వేగ న♦భ్యువనజనని. 167

వ. ఇవ్విధంబున మహేశ్వరీప్రయుక్తమహాతరణిబాణంబున నిజాస్త్రం బుపసంహృతం బగుటయు. 168

క. రోషంబున దోషాటుఁడు, పాషండాస్త్రము త్రిలోక♦పావనిమీఁదం
భీషణభాషణుఁడై విజి,గీషఁ బ్రయోగించె బహువి♦కృతిహేతువుగన్. 169

వ. దానం గోపించి. 170

క. గాయత్రీనామాస్త్రం, బాయపరిమితప్రభావ ♦ యడరించి వెసన్
మాయించె దనుజుఁ డేసిన,యాయస్త్రముఁ జదల నిలిచి ♦ యమరులు వొగడన్.

వ. అప్పుడు. 172

క. అంధాభిధానశర మమ్మ,హాంధఃపరిపంథి యేసె ♦ నంబికపైఁ గ్రో
ధాంధుఁ డయి శక్తి చక్షు,ష్మతి,బంధముగా దనుజబలము ♦ పరువడిఁ జెలఁగన్. 173

క. రక్షఃపతి యేసినయా,యక్షుద్రశరంబు పేర్మి ♦ యడఁగించె వడిన్
జక్షుష్మతీమహాస్త్రం, బాక్షణమె నిగిడ్చి త్రిజగ♦దంబిక లీలన్. 174

గీ. అసురపతి యల్గి శక్తినా♦శాభిధాన, మఖిలజననిపై వైచె ని♦శాటు లలర
నదియుబహువిధాకృతులస♦మస్తశక్తి,నివహములమీఁద నురవడిఁ♦గవియరాఁగ.

క. విశ్వేశ్వరి దానిం గని, విశ్వావస్వస్త్ర మపుడు ♦ వింటఁ దొడిగి యా
విశ్వాహితునస్త్రంబు న,నశ్వరమహిమమునఁ దునిమె ♦ నాకులు మెచ్చన్. 176

క. దైత్యవిభుఁ డంతకాస్త్రం, బత్యంతక్రోధుఁ డగుచు ♦ నడరింప మహా
మృత్యుంజయాస్త్రమునఁ దా,నత్యుత్సాహమున నడఁచె ♦ నంబయు దానిన్. 177

క. దితిజేంద్రుఁడు సర్వాస్త్ర,స్మృతినాశం బనెడునాఖ్యఁ ♦ జెన్నొందుచు మా
నిత మగుదివ్యాస్త్రం బుద్ధతి నంబికమీఁద నేసె ♦ దారుణభంగిన్. 178

ఆ. ధారాస్త్ర మేసి • తత్క్షణంబున సర్వ,లోకజనని ద్రుంచె • వీఁకతోడ
బ్రత్కు దెచ్చి పెట్టి•స్మృతినామబాణంబు, నమరగణము మోద • మంది కనఁగ. 179

ఆ. అఖిలశక్తితతుల • కతిభీతిదాయకం, బగుభయాస్త్ర మేసె • నసురనాథుఁ
డాత్రిలోకజనని • యభయంకరం బైన,యైంద్రబాణ మేసి • యడఁచె దాని. 180

క. అమరారి మహారోగా,స్త్రము శక్తులమీఁద నేయఁ • దద్ఘనసామ
ర్థ్యమువలన రాజయక్ష్మ,ప్రముఖమహారోగతతులు • ప్రభవించె వెసన్. 181

సీ. ఇవ్విధంబున దాన•వేంద్రుఁ డేసినమహా,రోగాస్త్రమునఁ బుట్టు•రోగతతుల
సంహరింపఁ దలంచి • సర్వలోకేశ్వరి, యపుడు నామత్రిత•యాఖ్యఁ దనరి
మంత్రస్వరూపమై • మహనీయ మగునస్త్ర, మేయఁ దదీయాగ్ర•మేయమహిమ
నాదినారాయణు•నవరావతారంబు, లై మువ్వు రతులమ•హానుభావు

గీ. లచ్యుతానంతగోవిందు • లనెడువార, లాశ్రితారోగ్యదాయకు • లనఘచరితు
లఖిలరోగసంహారకు • లనుపమాను, లుద్భవిల్లిరి. శక్తుల•యుల్ల మలర. 182

క. వారలు దారుణతరహుం,కారం బొనరించుమాత్ర • గ్రక్కున నక్తం
చారిప్రయుక్త శరజమ,హారోగచయంబు లడఁగె • నద్భుతభంగిన్. 183

వ. ఇట్లమ్మహాపురుషు లాదైత్యరాజసంప్రయుక్తం బైనమహారోగాస్త్రంబు నుపసంహరించి యత్యంతమోదంబున నమ్మహేశ్వరికి భక్తియుక్తంబుగా నమస్కరించి తమవలన నధికసంతుష్ట యైనయమ్మహారాజ్ఞియనుజ్ఞఁ గైకొని యమ్మువ్వురు మూఁడులోకంబులయందుఁ గల్గుతదీయభక్తులయాధివ్యాధులఁ బోఁదోలుచు వారికి నభీష్టంబు లొసంగుచు నిజస్థానంబున సుఖంబుండి రంత. 184

క. ఆయుర్నాశననామక,సాయక మమరారి యేసె • జగదంబికపై
నాయనుపమప్రభావ త,దీయవిజృంభణ మణంపఁ • దివిరి రయమునన్. 185

గీ. కాలసంకర్షిణీరూప•కాండ మపుడు, వింట సంధించి యేయఁ ద•ద్విశిఖ మడరి
భండదైత్యేంద్రుఁ డేసిన•పటుశిలీము,ఖంబు నశ్రమముగఁ ద్రుంచె•క్షణములోన.

మ. అసురేంద్రుండు మహాసురాస్త్ర మతిరో•షావిష్టుఁడై యాజగ
త్ప్రసువుం గెల్వఁ దలంచి శక్తులపయిన్ • గ్రౌర్యంబుతో నేయ న
య్యసదృగ్బాణమహాప్రభావమున మ•ధ్వాద్యుగ్రదైతేయరా
డ్విసరం బప్పుడ సంభవిల్లె నమరు • ల్విభ్రాంతులై చూడఁగన్. 187

వ. ఇట్లు భండాసురప్రయుక్తమహాసురాస్త్రసముత్థితు లై. 188

సీ. మహనీయశౌర్యు లౌ•మధుకైటభాసురు, లతివీరుఁ డగుమహి•షాసురుండు
చండవిక్రము లైన•చండముండాసురుల్, సమరదుర్జయుఁ డైన•చామరుండు

శుంభత్ప్రతాపు లౌ శుంభనిశుంభులు, నక్షీణధైర్యుఁ డౌ చిక్షురుండు
కాలాంతకప్రతీకాశు లౌ కాలకేయాసురరక్తబీజాసురులును

గీ, నీచమతి యైనధూమ్రవిలోచనుండు, ధూమ్రనాయకు లగుబహుదుష్టదనుజు
లాది గాఁగ ననేకకోట్యర్బుదములు, దానవులు పేర్చి రత్యద్భుతముగ నపుడు.

వ. ఇట్లు విజృంభించి యయ్యందఱుదానవశ్రేష్ఠులు సబలంబుగా నెక్కువెట్టున నతిభయంకరంబుగా నట్టహాసంబులును హుంకారంబులును సింహనాదంబులును జేయుచు నత్యంతకఠోరంబు లైనశస్త్రాస్త్రనికరంబుల శక్తిప్రకరంబుల నొప్పించుచు దర్పంబునఁ బొంపిరివోవుచుండ శక్తులెల్ల దైత్యబాణనిర్భిన్నలై సత్వరంబుగా లలితామహాదేవిని శరణుఁబొంది యోదేవీ మమ్ము రక్షింపు రక్షింపు మని పలుమాఱు వేఁడినఁ గరుణాంతరంగి యై యావిద్యున్నిభాంగి వారలం గావం దలంచి రక్కసులమీఁదిరోషంబున నట్టహాసంబు చేసిన. 190

సీ. ఆమహాదేవికృతాట్టహాసంబున, నాశ్చర్యముగ నుదయంబు నొందె
సూర్యబింబశ్రేణిసొబగునఁ గాంతిభవ్యం బగుదివ్యదేహంబుతోడ
సకలసుపర్వతేజస్సమూహాత్మిక, దుర్గాభిధాన దుర్మార్గశమని
యొకయశస్విని జగత్ప్రకటితచారిత్ర, యసదృశశౌర్య హేమాద్రిధైర్య

గీ, యమ్మహాభాగఁ గనుఁగొని యఖిలసురలు
సంప్రమోదంబు నొంది యాసరసిజాక్షి
కధికభక్తిప్రణామంబు లాచరించి
సాధనములు వేర్వేఱ నొసంగి రపుడు. 191

వ. అది యెట్లనిన. 192

సీ. శూలహస్తుఁ డొసంగె శూలంబు ప్రీతితోఁ, జక్రాంకహస్తుండు చక్ర మొసఁగెఁ
బాశహస్తుఁ డొసంగెఁ బాశశంఖంబులు, జ్వలనుఁ డొసంగె నిశాతశక్తి
వజ్రహస్తుఁ డొసంగె వజ్రాయుధము వేడ్క, నైరావత మొసంగె నాత్మఘంట
దండహస్తుఁడు కాలదండాయుధ మొసంగె, ధనదుఁ డొసంగె సుధారచషక

గీ, మంబురాశి యొసంగె ననర్ఘ్యహార, మంబుజాసనుఁ డొసఁగె దివ్యాంబుపూర్ణ
రత్నకుండిక లోకాభిరామ యగుచు, నధికమహిమాఢ్య యైనదుర్గాంబ కెలమి.

గీ. తనదుజిహ్వతోఁ బురుడించుఘనకృపాణ, మశనిపాతసహం బైనయలఘుఖేట
మమ్మహాదేవి కిచ్చె నెయ్యంబు మీఱ, మృత్యుదేవత దివిజులమేలు గోరి. 194

క. రక్షణదాధిపవదనకు, నాక్షణమునఁ దెచ్చి యిచ్చె నప్పవమానుం
డక్షయతూణీరంబులు, నక్షుద్రనినాద మైనయస్త్రాసనముం. 195

చ. బహువిధరత్నహేమమయ♦భాసురభూషణరాజిచేత న
ప్పుహితచరిత్రదేహము స♦మంచితభక్తి నలంకరించె లో
కహితము గోరి దైవతని♦కాయసమీప్సితకార్యభారధూ
ర్వహుఁ డగువిశ్వకర్మ యన♦వద్యకళాకుశలత్వ మేర్పడన్. 196

క. తక్కినదేవసమూహము, లక్కమలదళాయతాక్షి ♦ కతిశయభక్తిన్
నెక్కొనుమానసములతోఁ, బెక్కు లొసఁగి రాయుధములు ♦ వేర్వేఱ దగన్.

వ. ఇట్లు సమరసన్నాహంబునఁ దేజరిల్లి యాచండికాదేవి యుద్దండవిక్రమంబున. 198

గీ. బాలమార్తాండశోభావి♦భాసమాన,నిజతనూలతికాంచిత♦నిర్మలాంశు
జాలములచే సమస్తభూ♦షణచయంబు, నాయుధచయంబు భూషిత♦మై మెఱయఁగ.

క. అతిశయశౌర్యము ధైర్యము, గతిలాఘవ ముగ్రసమర♦కౌశలమును గ
ల్గి తనర్చుసింహవాహన, మతులితగతి నెక్కి కదలె ♦ నసురబలముపై. 200

వ. ఇట్లాభీలంబుగా మహిషాదిరక్షోగణాధ్యక్షుల కభిముఖంబుగాఁ దనసువాహనహర్య
క్షంబు వఱపి యతిరూక్షం బగునిజకటాక్షవీక్షణంబులతోడం గూడఁ గార్ముకగుణం
బువలన వెడలుసదృక్షంబు లగుమార్గణలక్ష లారక్షఃకోటులపై నిరాఘాటంబుగాఁ
దొరఁగించుచుఁ దా నొనర్చుసింహనాదంబుతోడ వాహనసింహనినాదంబును శింజి
నీటంకారంబులతోడఁ గంకణక్రేంకారంబును గలసి చెలంగ మింట నమరసంఘంబు
లును సంగ్రామరంగంబున సకలశక్తిసమూహంబులును దనపరాక్రమంబు గనుంగొని
యనేకవిధంబులఁ బ్రశంసింపుచుండ నందఱకు నన్నిరూపులై యసదృశం బగుమ-
హాప్రభావంబున. 201

గీ. సప్తశతిలోనఁ జెప్పిన♦చందమునన, యమ్మహాదేవి సంగ్రామ ♦ మాచరించి
త్రుంచె మహిషాదిదుష్టరా♦త్రించరోత్తముల ససైన్యంబు గాఁగ స♦ద్భుతపుఠేవ.

వ. ఇవ్విధంబున దుర్గామహాదేవి నిరర్గళపరాక్రమంబున రాక్షసవర్గంబు నిశ్శేషంబుగా
వధియించి యశేషశక్తిసేనలు సవినయభాషావిశేషణంబులఁ దన్ను సంభావింప లలి
తామహాదేవిపాలికిం జని భక్తియుక్తంబుగా నమస్కరించిన నితరదుష్కరం బగు
తత్పరాక్రమంబునకు సంతసించి యమ్మహారాజ్ఞి యద్దేవి ననేకవిధంబుల గారవించె
నంత. 203

మ. తనయస్త్రంబు నిరర్థకం బయిన దై♦త్యస్వామి క్రోధోగ్రుఁడై
యనివార్యోద్ధతి శక్తిసేనపయి మూ♦కాస్త్రంబు దా నేయ న
వ్వనితారత్నము సత్వరంబుగ మహా♦వాగ్వాదినీనామ మా
కనదస్త్రంబున దానిదర్ప మడఁచెన్ ♦ గ్రీవ్యాది పెం పేదఁగన్. 204

సీ. ఆదైత్యభర్త వి♦ద్యామాపనిగమత, స్కరులఁ బుట్టించె న♦స్త్రప్రయుక్తి
దాన సోమకుఁ డాది ♦ యైనానేకులు వేద, చోరమహారాక్ష♦సులు గడంగి
శక్తిసేనల బాధ♦సల్పఁ జొడంగిన, నాలలితాదేవి ♦ యల్ల నగుచుఁ
దనదుదక్షిణపాణి♦వనరుహాంగుష్ఠనఖంబు నీక్షించి విచి♦త్రంబు గాఁగ
గీ, నందు జనియించె నాదినా♦రాయణుండు, మత్స్యరూపధరుం డయి ♦ మానిచంద్ర
యామహాత్ముఁడు సోమకా♦ద్యఖిలదుష్ట, దానవుల సంహరించె ద♦క్షణము లీల. 205

వ. ఇత్తెఱంగున దుర్మదుం డగుభండదానవుండు ప్రయోగించినవేదతస్కరాస్త్రంబు విఫలం బగుటయు. 206

క. దుర్ణయుఁ డగుదైత్యవిభుం, డర్ణవబాణంబు వేక ♦ నడరించినచో
ఘూర్ణితమై యుప్పొంగె మ, హార్ణవపూరము సురారి ♦ యచ్చెరువందన్. 207

క. ఇటు దివ్యాస్త్రంబున నుత్కటమై జలరాశి శక్తి♦తతి ముంపఁ బొడం
గుటయు మఱి చేయునది లే, కెటకైనఁ దొలంగిపోవ ♦ నెడ లేక కడున్. 208

చ. వెఱఁగున శక్తు లున్నతఱి ♦ వేగమ యామహితానుభావ య
త్తెఱఁగునఁ బొంగివచ్చుజల♦ధిం గని దక్షిణహస్తతర్జనీ
మెఱయునఖంబు లీలమెయి ♦ మీటినమాత్ర జనించె దానఁ జూ
పఱు లరుదంది కన్గొనఁగఁ ♦ బద్మదళాక్షుఁడు కచ్ఛపాకృతిన్. 209

సీ. అట్లుద్భవించి య♦య్యాదికూర్మము పది, వేలయోజనముల♦విరివి గలుగు
తనదువెన్నున శక్తి♦తతుల నశ్రమలీల, మోచుచు జలధిలో ♦ మునుఁగకుండ
సలిపి యపార మహా♦నీరధితోయంబు, నశ్రమంబునఁ ద్రావె ♦ నద్భుతముగ
శక్తిసైన్యము లస్త్ర♦జలధిఁ గ్రుంకుట మాని, హర్షాంబునిధి నోల♦లాడుచుండె
గీ, భండదైత్యసముద్రాస్త్ర♦భయము వీడి, యది గనుంగొని నిర్జరు ♦ లఖిలజనని
మహిమ వినుతించి రర్థవ♦న్మంత్రతతుల, రాక్షససమూహశౌర్యగ♦ర్వంబు లడఁగె.

వ. దానం గోపించి. 211

సీ. అసురనాథుండు హిర♦ణ్యాక్షమహాస్త్రంబు, వింట సంధించి యు♦ద్వృత్తి నేయ
దానమహోగ్రగ♦దాహస్తులై హిర, ణ్యాక్షు లనేకస♦హస్రసంఖ్య
లప్పుడ యుద్భవం ♦ బంది యాశక్తిసై, న్యముమీఁదఁ గవిసి దు♦రాగ్రహమున
బహువిధశస్త్రసం♦పాతంబు లడరించి, చీకాకుపఱిచినఁ ♦ జిక్కువడుచు
గీ, నధికసంత్రాసవిహ్వల♦స్వాంత లగుచు, నివ్వెఱఁగుతోడఁ గొందఱు ♦ నిల్చి రచటఁ
గొంద ఱిటు నటు నేగిరి ♦ కొందలమున, శక్తు లాజి యొనర్చను♦త్సాహ మెడలి.

సీ. అది గాంచి జగదంబ ♦ యతిరయంబున నిజ,దక్షిణహస్త ప♦ద్మమున మెఱయు
నడిమివ్రేల నెసంగు♦నఖము గీటినమాత్రఁ, గైలాసశైలసం♦కాశ మగుచు
నిర్ఘాతసన్నిభ♦నిజఘుర్ఘురధ్వాన,విదళితాసురకర్ణ♦హృదయ మగుచు
నతిధవళాంగ మై ♦ యాదివరాహంబు, జనియించి యత్రసం♦జాత మైన
గీ. యాహిరణ్యాక్షవర్గంబు ♦ నడచి యాక్ర,మించి నిశ్శేషముగ విదా♦రించె వజ్ర
సదృశనిజపోత్రదంష్ట్రాగ్ర♦సంప్రహార,దారుణక్రీడచేత న♦త్యద్భుతముగ. 213

శా. దానం గ్రోధము నొంది దైత్యపతి యు♦ద్యద్భ్రూకుటీస్ఫూర్జితుం
డై నాకౌకసులన్ భయంపడఁగఁ జే♦యన్ వేగ తద్భ్రూకుటి
స్థానప్రోద్భవ మై నిశాతదృఢశ♦స్త్రం బై నిదాఘజ్వల
ద్భానుప్రస్ఫుట మై హిరణ్యకశిపు♦వ్రాతంబు పేర్చెన్ వడిన్. 214

వ. ఇత్తెఱంగున. 215

గీ. భండదైత్యుఁ డిట్లు మముఁడిఁ ♦ బ్రభవమొంది, యట్టిబహుకోటిసంఖ్య లౌ♦ యాహిరణ్య
కశిపు లాశక్తిసేనపైఁ ♦ గవిసి వివిధ,శస్త్రముల నొంచి రమరు లా♦శ్చర్యపడఁగ.

సీ. అప్పుడు శక్తిసం♦హతికిఁ గల్గినపర,మానందలక్షణం ♦ బై నయట్టి
ప్రహ్లాద మెల్లను ♦ బాలకమూర్తి యై, వర్తింపుచుండంగ ♦ వానిఁ బట్టి
యయ్యసురాధము ♦ లందఱుఁ జలముళ, నలిగి బాధింపఁ బ్ర♦హ్లాదనాముఁ
డై నయయ్యర్భకుఁ ♦ డానిఖిలేశ్వరి,శరణంబు నొందినఁ ♦ గరుణతోడ
గీ. నాధశక్తిగణానంద♦రూపుఁ డైన,యాశిశువుఁ గావఁ దలఁచి య♦య్యఖిలజనని
లీల వలకేలినాల్గవ♦వ్రేలిగోటి,యగ్ర మల్లన గీటిన♦యంతలోన. 217

క. కంఠీరవవదనోగ్రుఁడు, కంఠాధోభాగమనుజ♦గాత్రుఁడు సమరా
కుంఠనఖరాయుధుఁడు నర,కంఠీరవుఁ డుదయ మయ్యె ♦ ఖలుల వధింపన్. 218

సీ. అట్లుద్భవిల్లిన♦యానరకేసరి, ప్రజ్వలల్లోచన♦త్రయము దనరఁ
జటులసహస్రదో♦స్స్తంభము లెసఁగంగ, నత్యంతఘోరాట్ట♦హాస మడర
క్రోధసంభృతకాల♦రుద్రరూపం బొప్పఁ, గఠినసటాజ్వాలి♦కలు వెలుంగ
లలితానిదేశపా♦లనమె కార్యము గాఁగ, ఘనశక్తి మూఁడులో♦కములు వడఁక
గీ. దనుజరాజభ్రుకుటిజాత♦ధర్మదూర,దారుణాసురకోటివి♦దారణంబు
సలిపె వజ్రాయుధంబు మె♦చ్చనినిశాత,సురుచిరనఖాయుధముల ని♦ర్జరులు వొగడ.

స్రగ్ధర. దానన్ సక్రోధుఁడై యు♦ద్దనుజపతి మహా♦హ్యద్బలీంద్రాస్త్ర మేయన్
నానామార్గంబులన్ సం♦దడిగ బహుబలీం♦ద్రప్రతానంబు రాజిఁ

సేనాబృందంబుపైఁ జె♦చ్చెరఁ గవిసి శర♦శ్రేణుల నొంచె నాడి
త్యానీకంబుల్ మహాసా♦ధ్వసమతు లయి యం♦తంతఁ దోడ్తో నొదుంగన్. 220

క. బలిదైత్యకోటు లి ట్లతి,బలవంతము లగుచు శక్తి♦బలముల నొంపన్
గలఁగిననిజసేనలఁ గని, లలితాంబిక మోమునం ద♦లఁతిపగ వొప్పన్. 221

క. తనదక్షిణహస్తాంబుజ,కనిష్ఠికానఖము గీఁటఁ ♦ గడు రయమున వా
మనకోటు లద్భుతంబుగ, జనియించెన్ సురలు గాంచి ♦ సంతోషింపన్. 222

వ. ఇట్లు జనియించి బలిదానవయూథంబుమీఁదిక్రోధంబున. 223

పంచచామరము. క్షణక్షణప్రవర్ధమాన♦చారుదివ్యదేహు లై
ఫణీంద్రభోగతుల్యదీర్ఘ♦బాహుశోభమాను లై
మణిస్ఫురత్కిరీటకాంతి♦మండితోత్తమాంగు లై
రణోగ్రు లై నవామనుల్ శ♦రత్వరన్ గడంకతోన్. 224

మ. బలిదైత్యేంద్రునిమీఁద బి ట్టుఱికి దృ♦ప్యన్నాగపాశంబులన్
బలమున్ దర్పము మీఱ నారితనువుల్ ♦ బంధించి వీఁకన్ ధరా
స్థలిపైఁ గూలఁగఁ ద్రోచి భండదనుజా♦స్త్రస్ఫూర్తి యొక్కుమ్మడిన్
దొలఁగం జేసి రమర్త్యసంఘములు దో♦డ్తో మింటఁ గీర్తింపఁగన్. 225

వ. ఇవ్విధంబున. 226

క. తనయస్త్రము కామేశ్వర,వనితామాహాత్మ్యమున సెఁ♦వారెత మగుటన్
దనుజపతి కార్తవీర్యా,ర్జునాస్త్ర మఱిఁబోసి యేసెఁ ♦ గ్రోధోగ్రుం డై. 227

మ. సురశత్రుప్రవిముక్తహైహయశర♦స్ఫూర్తిన్ మహాహైహయుల్
గర మాశ్చర్యముగా సహస్రములు ల♦క్షల్ కోటు లొక్కుమ్మడిన్
బొరిదిం బుట్టి సహస్రదోఃకలితు లై ♦ స్ఫూర్జద్గతిన్ రా మహే
శ్వరి వారిం గని లీలఁ దక్షిణమ యా♦మతోక్కుపయుక్తాస్య యై. 228

సీ. అరుదుగాఁ దనవామ♦హస్తపద్మాంగుష్ఠ,నఖము గీఁటినమాత్ర ♦ నలిననాభుఁ
డవిరళక్రోధభా♦ర్గవరామమూర్తి యై, హైహయార్జునకోటి ♦ నాక్రమించి
దారుణసింహనా♦దంబులు సలుపుచు, వజ్రాయుధముకంటె ♦ వాఁడి యైన
తనకఠోరకుఠార♦ధారచే లోనరించెఁ, గార్తవీర్యార్జున♦గణము నెల్ల

గీ. నత్తెఱం గద్భుతము సేసె ♦ నమరతతికి, నసురసంహతి కతిభీతి ♦ నావహించె
న్నాత్రిపురసుందరీమహి♦తానుభావ మలవి యె నుతింప మునివంశ♦జలధిచంద్ర. 229

వ. ఇట్లు నిజాస్త్రంబు నిస్సారం బగుటయు. 230

శా. కోపోగ్రుండయి భండదానవుఁ డతి◆క్రూరుండు హుంకార మా
టోపం బొప్పఁగఁ జేసినంత బహుకో◆టుల్ రాక్షసుల్ గాఢశౌ
ర్యోపేతుల్ దనుఁ గొల్వ నిష్ఠురకృపా◆ణోద్యత్కరుండై మహా
చాపల్యాత్ముఁడు రావణుండు గవిసెన్ ◆ శక్తిప్రతానంబుపైన్. 231

వ. ఇట్లు బహువిధమాయోపాయప్రయోగభాసురుం డగుభండాసురుండు గావించిన మహాహుంకారంబువలనఁ బ్రభవించి దుష్టస్వభావుం డైనపంక్తిగ్రీవుండు సహస్రాక్షౌహిణీదానవసైన్యంబులు దన్ను బలసి చనుదేర దారుణవిక్రమోద్దీర్ణుం డగుకుంభకర్ణుండును నిజసింహనాదవినిర్జితమేఘనాదుం డైనమేఘనాథుండును నేకోద్యోగంబునఁ దనతో నడవ నతిభయంకరంబు లైనయట్టహాసంబులును సింహనాదంబులును హుంకారంబులును మౌర్వీటంకారంబులును నొక్కట మ్రోయ బహువిధబాణపాతంబులవలన శక్తిసంఘాతంబుల దీనదశకుఁ దెచ్చిన నది గనుంగొని శ్రీమహాదేవి నిజవామహస్తంబున మెఱయు రెండవవ్రేలిగోటికొన గీఁటినమాత్ర నతివిచిత్రంబుగా నందువలన. 232

సీ. నీలాంబుదముఁడాలు ◆ గేలిసేయఁగఁ జాలు, కోమలతనుకాంతి ◆ కొమరు మిగులఁ
గనకాచలసమాన◆కార్ముకదండంబు, రమణీయహస్తప◆ద్మమునఁ దనరఁ
బటునిశాతాక్షయ◆బాణతూణయుగంబు, వెనుకభాగంబున ◆ వెలయుచుండఁ
గమనీయమృదులవ◆ల్కలజటామకుటముల్, కటిబద్ధకౌశేయ◆కమును మెఱయఁ

గీ. దప్తజాంబూనదోపమ◆ధాముఁ డైన, లక్ష్మణునితోడ బహుశుభ◆లక్షణుండు
మనుకులలలాముఁడు సమస్త◆దనుజకులవి, నాశుఁ డుదయించె గోదండ◆రాముఁ డపుడు.

వ. ఇట్లుదయించి ప్రళయజలధరగర్జాస్ఫూర్జితంబుగా సింహగర్జనంబును గోదండగుణటంకారంబును నొనరించుచుఁ దనయెదుర శక్తిసేనలపైఁ గవిసి సహోదరుం డైనకుంభకర్ణుండును దనూభవుం డైనయింద్రజిత్తును దనకు సహాయులుగా ననేకాక్షౌహిణీరాక్షసులతోడఁ బరాక్రమించురావణుపైఁ గవిసి దివ్యంబులు నమోఘంబులు నైనమహాస్త్రంబులు నిగిడించి యతనితో సంగ్రామంబు చేసి యతనికి బాసటయై వచ్చినదనుజసేనలనెల్లఁ దనదివ్యాస్త్రప్రభావంబున క్షణమాత్రంబునఁ బొడవడంచి యథాపూర్వకంబుగాఁ ద్రిలోకకంటకుం డగుదశగ్రీవుని నవలీల వధించి దివిజుల కాశ్చర్యసంతోషంబు లుత్పాదించె నాలోన లక్ష్మణుండును మేఘనాథునిం దొడరి విచిత్రయుద్ధంబు చేసి దైవతాసాధ్యుం డగునద్దైత్యుఁ దనసాయకాగ్నికి నెరఁ జేసి యగ్రజునకు ముదం బాపాదించె నాసమయంబున. 234

మ. దివిజారాతి మహోగ్రకోపమున ను♦ద్దీపించి చాపంబునన్
ద్వివిధాస్త్రంబు బరింబోసి శక్తులపయిం♦దీవ్రంబుగా నేయ భై
రవనాదంబులుఁ బింగళాక్షులు సము♦గ్రోద్ధతాగ్రాస్యముల్
జవముం గల్గు ననేకవానరసహ♦స్రంబుల్ జనించెన్ వెసన్. 235

పంచచామరము. హనూమదాభు లంద ఱెట్టు♦లస్త్రజాతులై పునః
పునఃప్రవృద్ధచాపలప్ర♦భూతజాతిచేష్టులై
యనేకవానరేశ్వరుల్ దు♦రాగ్రహంబు హెచ్చ శ
క్త్యనీకముం గలంచి రాజి♦నద్భుతప్రతాపులై. 236

శా. కోకారం బతిభీకరంబుగ వనౌ♦కోవ్రాతి మిబ్భంగి ని
ర్భీకం బై వడి శక్తిసైన్యసమితిం♦బీడింపఁగాఁ జూచి యా
లోకాధీశ్వరి తత్ప్లవంగసమితిన్♦లోపంబు సేయన్ మనో
వ్యాపారం బొనరించె నాత్మబలస♦మ్యగ్రక్షణాపేక్షయై. 237

వ. ఇట్లు దనుజరాజప్రయుక్తద్వివిధాస్త్రసంభూతం బైన శక్తివ్రాతంబు నడంపం బూని.

గీ. ఆమహాదేవి నిజవామ♦హస్తమధ్య,మాంగుళీనఖ మల్లన♦నవుడు గోట
నందు జనియించె బలరాముఁ♦డహితభీముఁ,డాశ్రితాంబుధిహిమధాముఁ♦డనఘచరిత.

వ. ఇట్లు జనియించి యమ్మహాత్ముండు కటితటవిభ్రాజితనీలాంబరుండును బ్రకటితవిక్ర
మాడంబరుండును నగుచు మఱియును. 240

శా. కైలాసాచలశుభ్రదేహుఁ డగుచున్♦గాదంబరీపానమ
త్తాలోలారుణనేత్రపద్ముఁ డగుచున్♦హస్తాంబుజాలంబితో
త్తాలాయోగ్రహలాయుధుం డగుచు న♦స్త్రప్రోత్థకీశావలిన్
నేలం గూల్చె నిమేషమాత్రమున ని♦ర్ణిద్రప్రభావంబునన్. 241

వ. తదనంతరంబ. 242

సీ. రాజాసురాఖ్యమై♦తేజరిల్లెడు బాణ, మసురేంద్రుఁ డుద్ధతుఁ♦డగుచు నేయ
దాన జనించి రు♦ద్యత్ప్రతాపులు నృప,దానవుల్ ♦శిశుపాల♦దంతవక్త్ర
చాణూరముష్టిక♦బాణశంబరరుక్మి,కంసతృణావర్త♦కాలయవన
యమళార్జునారిష్ట♦హంసకడింభక,కాళియఫణిధేను♦కప్రలంబ

గీ. వత్సబకకేశిపౌండ్రక♦వాసుదేవ,కాశిరాజమయాత్మజ♦గంధనాగ
శంఖచూడవిదూరక♦సాల్వశకట,పూతనాభిఖ్యు లప్పుడ♦ద్భుతము గాఁగ. 243

క. వా రందఱుఁ దమతమసే,నారాజిం గూడి పటుర♦ణము సేయుట కే
తేరఁ గని సరకుగొనక మ,హారాజ్ఞి యనాదరమున♦నవు డవలీలన్. 244

మ. తనడాచేతియనామికానఖము నం◆దం బొప్పఁగా మీటినం
తన యం దుద్భవ మయ్యె నద్భుతముగా ◆ నారాయణుం డాశ్రితా
వనదక్షుండు పురాణపూరుషుఁడు దే◆వద్వేషిసంహారి శో
భనచారిత్రుఁడు వాసుదేవముఖవి◆భ్రాజచ్చతుర్వ్యూహుఁడై. 245

వ. ఇట్లుద్భవించినవాసుదేవసంకర్షణప్రద్యుమ్నానిరుద్ధులు శిష్టరక్షణంబును దుష్టశిక్షణంబును దమప్రయోజనంబు లగుట భూమిభారప్రవర్తకులై దురాచారులై రాజవేషచ్ఛన్నులై నయారక్కసులఁ గనుంగొని మహాక్రోధంబున. 246

క. చక్రాదిసాధనముల స్వశక్తిపరాక్రమము మెఱయ ◆ వారల నత్యం
తక్రూరులఁ జక్కాడిరి, శక్రాదులు సంతసిల్ల ◆ సమరకుశలులై. 247

గీ. అంత భండాసురుండు దు◆రాగ్రహమునఁ, ధర్మవిప్లావకం బయి ◆ దారుణ మగు
కలిమహాస్త్రంబు శక్తిసం◆ఘములమీఁద, నేసె దైత్యులు తనజయం ◆ బీహసేయ.

సీ. దానఁ బుట్టిరి బహు◆ప్రాణిహింసకు లుగ్రపాపవర్తనులు స్వ◆భావమలిను
లార్యగర్హితులు వ◆ర్ణాశ్రమసాంకర్యకరులు ధర్మద్రోహ◆కరణచణులు
వేదవిప్లావకుల్ ◆ వినయశూన్యులు హూణబర్బరాంధ్రకిరాత◆పారశీక
యవనపుళిందపుం◆డ్రాదు లౌసాహసు, లతిబలవంతులై ◆ యాగ్రహమున

గీ. వార లంద ఱయోగినీ◆వర్గముల ననర్గళంబున వివిధశ◆స్త్రాస్త్రహతుల
నొంపుచుండంగఁ గని యన్ని◆లింపవంద్య, తద్వధోపాయ మాత్మలో◆దలఁచి వేగ.

క. తనడాపలికేలఁ దనర్చినచిటికెనవ్రేలినఖము ◆ శీఘ్రమ గీఁటన్
జనియించెఁ గలికిరూపంబున మధుసూదనుఁడు భువన◆పోషకుఁడు వెసన్. 250

వ. ఇట్లు జనియించి యమ్మహానుభావుండు. 251

పంచచామరము. తురంగమంబు నెక్కి వాఁడి◆తోడిచంద్రహాసమున్
గరంబునన్ ధరించి మేఘ◆గాఢనాదసారమున్
దిరస్కరించుగర్జనంబు ◆ తీవ్రభంగిఁ జేసె న
క్కిరాతసంఘ మాజిభూమిఁ ◆ గీడ్వడంగ మూర్ఛచేన్. 252

వ. ఇవ్విధంబున నశ్వారోహణకళాప్రావీణ్యంబు ప్రకటించుచుఁ గరకమలగృహీతనిర్మలకౌక్షేయకతాళతళ్యంబు సకలదిక్కులఁ బ్రసరింపుచు నతిభయంకరనిజాట్టహాసమహాధ్వనిశ్రావణమాత్రంబునఁ గిరాతపుళిందహూణాదుల నందఱ మూర్ఛనొందించినయమ్మహాపురుషునిం గనుంగొని శక్తిసమూహంబులు నిర్భరహర్షంబునం దేలె నంత దశావతారనాథు లైనయాపదుండ్రును నిత్తెఱంగున దుష్కరంబు లైనకార్యంబులు నిర్వర్తించినయనంతరంబ యాలలితామహాదేవికి నమస్కరించి బద్ధాంజలు లగుచు

నెదుట నిల్చిన సంతుష్టయై వారల గారవించి యమ్మహాదేవి మీరు ప్రతికల్పంబును మత్స్యాద్యవతారంబుల నొంది దుష్టుల నిగ్రహించుచు శిష్టుల ననుగ్రహించుచు లోకంబులయందు ధర్మసంస్థాపనంబు సేయుం డని యాజ్ఞాపించిన మహాప్రసాదం బని యమ్మహాత్ము లంగీకరించి తదనుజ్ఞాతులై వైకుంఠంబున కరిగి రిట్లు తనయస్త్రంబు లెల్ల నాశంబునొందిన దురాశయుం డైన భండాసురుండు క్రోధావిష్టుం డై.

క. సాహసవృత్తిఁ శక్తివ్యూహంబులమీఁద సరభసోగ్రుఁ డయి మహా
మోహాస్త్ర మేయఁ దచ్ఛరమాహాత్మ్యమువలన సోలె మహిఁ దత్సేనల్. 254

వ. ఇట్లు మూర్ఛిల్లి నేలకు వ్రాలినశక్తిసేనలం గనుంగొని. 255

ఆ. అఖిలజనని శాంభవాస్త్ర మేసినమాత్రఁ, దెలివి నొంది శక్తిబలము లెల్లఁ
దొంటిపోల్కి మెఱసె మింట నిర్జరు లెల్ల, నిలిచి కనుఁగొనంగ నలఘుపటిమ.

వ. ఇవ్విధంబున. 257

శా. దైత్యుం డేసినయస్త్ర మెల్లను మహోద్దామప్రభావాఢ్య యై
ప్రత్యస్త్రంబునఁ ద్రుంచి యాఖిలునితోఁ బ్రస్ఫూర్తి నస్త్రాదికా
దిత్యుం డేగినదాఁక సంగరము నెంతే వింతగా సల్పె సం
ప్రీత్యాశ్చర్యములన్ సుర ల్గనఁగ నా శ్రీదేవి హేలాగతిన్. 258

వ. ఆసమయంబున. 259

శా. క్రూరాత్ముం డగుభండదానవుఁ డెంతం గ్రూరంగ లోకంబు లెం
తే రాగంబునఁ దేజరిల్లు ననుచున్ దెల్లంబుగాఁ దెల్పున
ట్లారాజీవహితుండు రాగయుతుఁడై యాలోకనీయత్వ మిం
పారం దాల్చె నసన్మనంబు లిటుఁ లౌ నం చబ్జముల్ గుందఁగన్. 260

మ. అపు డత్యంతవిఘూర్ణమాన మయి సర్వాక్షౌహిణీసంఘముల్
విపులామర్షముతోడ వార్ధిపగిదిన్ విస్ఫూర్తి నేతేర నా
చపలాక్షీమణి పేర్చి బాడబశిఖిజ్వాలాభనారాయణా
స్త్రపటుత్వంబునఁ జేసె భస్మముగఁ దద్రక్షోబలౌఘంబులన్. 261

వ. ఇట్లు నారాయణాస్త్రసంభూతమహోజ్వలనజ్వాలాజాలంబునఁ బరసహస్రరాక్షసాక్షౌహిణీసంఘాతంబు నొక్కక్షణమాత్రంబున భస్మీకరించి యంత నిలువక. 262

క. అపరమేశ్వరి వేగ మహాపాశుపతాస్త్రరాజ మరిఁబోసి సరో
షాపాంగి యగుచు దైత్యాచమూపతులన్ దునిమె నొక్కమొగి నలుబంద్రన్.

వ. ఇట్లు కుటిలాక్షతాళజంఘాదు లైనచత్వారింశచ్చమూనాయకుల నశ్రమంబునఁ ద్రుంచి యాలోకనాయిక వెండియు. 264

క. బలములు సమస్తబంధులుఁ, బొలియుటకు మనంబులోనఁ ♦ బొగుల కక్రోధ
జ్వలితుండై తనతోడం, గలహించు నిశాచరేంద్రు ♦ ఘనబలసాంద్రుల్. 265

క. త్రిజగదుపద్రవకారణు, గజరాజేయుని మహాదు♦ర్వ్యాగ్రహుఁ గని యా
గజరాజగమన శక్తి, ప్రజనులకు ముదంబు గాఁగ ♦ వాని వధింపన్. 266

మ. తనహృత్తామసంబునన్ దలఁచి యు♦ద్యత్ప్రీతియుక్తాత్ములై
యనిమేషుల్ దను సంస్తుతింపఁగ సహ♦స్రాదిత్యసంకాశ మా
ఘనతేజంబున భాసురం బగుమహా♦కామేశ్వరాస్త్రంబుఁ జ
య్యన సంధించె ధనుర్గుణంబున నిలిం♦పారుల్ భయం బందఁగన్. 267

సీ. సంధించి యాలోక♦జనయిత్రి త్రైలోక్య,కంటకుం డైనన♦క్తంచరేంద్రు
నేకాగ్రదృష్టి వి♦లోకించి తెగ నిండఁ, దిగిచి యేసినమాత్ర ♦ జగము లెల్ల
గడగడ వడఁకంగఁ ♦ గాలాగ్నిసదృశ మా,నమ్మహనీయది♦వ్యాస్త్ర మడరి
తత్క్షణంబున భండ♦దానవు భస్మసా,త్కృతుఁ జేసి నిర్జరుల్ ♦ నుతి యొనర్ప

గీ. నంతఁ బోవక వెస నమ్మ♦హాశరంబు, సార్భకంబుగ సవనితా♦జనపశుధన
సకలగేహంబు గాఁగ శూ♦న్యకపురంబు, దగ్ధముగఁ జేసి పిదప శాం♦తత్వ మొందె. 268

వ. ఇవ్విధంబున భండాసురునితోఁగూడ శూన్యకపురంబు కామేశ్వరాస్త్రనిర్దగ్ధం బై స్థలమాత్రశేషం బయ్యె నయ్యెడ. 269

క. సంతోషనర్తనంబు ని,తాంతంబుగ నాచరించెఁ ♦ ద్రైలోక్యము దు
ర్దాంతుఁ డగు భండదైత్యుం, డంతము ప్రాపింప గతభ♦యజ్వర మగుచున్. 270

మ. జయలక్ష్మీప్రవిభాసమాన యగుచున్ ♦ జానొందు నాచిద్ఘనం
జయజాతం గని సర్వశక్తిగణముల్ ♦ సద్భక్తి భేర్యాదులా
జయవాద్యంబులు మ్రోయఁగాఁ బ్రముదిత♦స్వాంతాంబుజాతంబులై
జయగానంబులతోడ నర్తన మొగిన్ ♦ సల్పెన్ మనోజ్ఞంబుగన్. 271

క. మందారపుష్పవృష్టి య,మందముగాఁ గురిసి రపుడు ♦ మహనీయజయా
[illegible] స్పందిత యగు కామేశ్వర,సుందరిపై దేవవరులు ♦ సుస్థిరభక్తిన్. 272

క. వాసంతకుసుమపాళీ,వాసనలు గ్రహించి మలయ♦వాయువు లధికో
ల్లాసముగ వీచె మెల్లన, యాసర్వేశ్వరిమనంబు ♦ హర్షమునొందెన్. 273

వ. మఱియును. 274

మ. సురభేరుల్ మ్రోసెన్ దిశల్ గగనముల్ ♦ శుభ్రచ్ఛవిం బొల్చె ని
ర్జరగంధర్వసరోజలోచనలు ని♦ష్ఠన్ మంగళారాత్రికో

త్కరముల్ సప్పిరి రంభ యూర్వశి మొద ♦ ల్గా ముఖ్యలై నట్టియ
చ్చర లానందముతోడ నాడిరి సమం♦చద్గీతవాద్యంబుగన్. 275

ఆ. ఎంతవింత యీమ ♦ హేశ్వరివిక్రమం, బనుచుఁ బులకితాంగ♦మై చరాచ
రాత్మకప్రపంచ ♦ మంతయు ముదముతో, స్వాస్థ్యమునఁ దనర్చె ♦ సంయమీంద్ర.

సీ. తుంబురుండును నార♦దుండును విశ్వావసు,ప్రభృతిగంధర్వులు ♦ భారతియును
శ్రీమహారాజ్ఞి వి♦శేషపరాక్రమ,విజయమంగళపద్య♦వితతు లలఘు
గానవిద్యాప్రౌఢి ♦ గనుఁ బ్రకటంబుగాఁ, బాడుచు నమ్మహా♦భాగఁ గొలిచి
హర్షసంఫుల్లము♦ఖారవిందములతోఁ, గమనీయపులకిత♦గాత్రు లగుచు

గీ. సారెసారెకు జయజయ♦శబ్దములను, వినుతిసేయుచు సంతోష♦వృద్ధివలన
మదము నొంది యున్మత్తుల♦మాడ్కిఁ బ్రతిప,దంబునాడుచుఁ జెలఁగిరయ్యంబయెదుట.

సీ. అప్పు డమోఘవా♦క్యప్రవీణులు వసి,ష్ఠాదు లౌసప్తమ♦హర్షివరులు
సమ్మతి ఋగ్యజు♦స్సామమంత్రముల న,థర్వమంత్రముల ని♦తాంతభక్తి
నమ్మహాదేవి జ♦యశ్రీఁ బ్రవర్ధిల్లఁ, జేయుచు నధికసు♦స్థిరవినీతి
నత్యంతపావని ♦ యగుమహానలశిఖ, నాజ్యాహుతిఁ బ్రవృద్ధి ♦ నందఁ జేయ

గీ. చందమున మహితాశీస్స♦చక్రపతతుల, నఖిలలోకపావని యైన♦యంబ నధిక
వృద్ధి నొందించి రతిమృదు♦విశదమధుర,వర్ణసుస్వరసంగత♦వచనరచన. 278

వ. అయ్యవసరంబున. 279

చ. తనమహిమానుభావము ని♦తాంతకుతూహలభక్తియుక్తులై
యనిమిషులున్ మునుల్ నిజబ♦లావళియుం గొనియాడుచుండఁగా
నెనసినవ్రీడచే మొగము ♦ నించుక నమ్రముఁ జేసె నాజగ
జ్జనని మహాజనుల్ దమప్రశంస సహింపరుగా మనంబులోన్. 280

వ. ఇవ్విధంబున. 281

క. దనుజేంద్రవధానంతర,మున ననిమిషమునితతు ల్ప్ర♦మోదముతోడన్
వినుతింపఁగఁ గామేశ్వర,వనిత యచటనుండి కదలె ♦ బలములతోడన్. 282

వ. అప్పుడు. 283

ఉత్సాహము. భువనమాతయంకుశమునఁ ♦ బుట్టి దుర్మదాఖ్యదా
నవునిఁ గూల్చి పొగడు గనిన♦నలిననేత్ర లెక్కకున్
మిపుల వారణములు గొలువ ♦ మేలిమత్తగజముపై
వివిధవిభవ మెసఁగఁ గదలె ♦ విశ్వనేత్రి ముందటన్. 284

సీ. ఆమహాదేవిపా♦శాయుధమునఁ బుట్టె,నట్టిహయారూఢ ♦ యనెడుదేవి
యాసంపదంబిక♦యట్ల యా శ్రీదేవి,ముందఱ నత్యంత♦సుందరముగఁ
గోటికోటు లుదగ్ర♦ఘోటకశ్రేష్ఠముల్, దనుఁ గొల్చి రాఁగ ను♦ద్దామలీల
నరిగె మేఘంబుల ♦ విరియించునున్నత,లోలధ్వజసమూహ ♦ మోలి మెఱయ
గీ, మఱియు రథరాజముల నెక్కి ♦ మాన్యగరిమ, ముద్రిణీదండనాథలు♦ముదమువోడ
నమ్మహాభాగయుభయపా♦ర్శ్వంబులందుఁ, జనిరి సబలంబు గాఁగ హ♦ర్షంబు మీఱ.

వ. ఇవ్విధంబున దేవకార్యంబు నిర్వర్తించి విజయలక్ష్మీవిభాసితయు విద్యోతమానమహావిభవసమన్వితయు శ్రీచక్రరాజరథమండలమండనీభూతసహజ తేజస్సంఘాతయుఁ ద్రిలోకమాతయు ననింద్యచరిత్రయుఁ గరుణారసభరితయు వివిధభూషణవిభూషితసర్వానవద్యచారుదివ్యదేహయు భక్తజనరక్షణసమీహయు నై నయాకామేశ్వరీదేవి మహాప్రకాశమానం బై నప్రాభవంబున శోభిల్లి సమరపరిశ్రాంతం బై భండాసురప్రబలబాణాగ్నితప్తం బై ననిజసైన్యంబు సమస్తంబును నమృతాప్లుతం బై నతనవిలోకనంబుల నాలోకించిన నప్పరమేశ్వరికరుణాకటాక్షసుధారసధారలఁ దోఁగి విగతయుద్ధపరిశ్రమ లై శక్తు లెల్లఁ బరమప్రీతమానస లై రాసమయంబున. 286

క. ఇదె భండదానవునిఁ ద్రుంచె దయాంబుధి లోకజనని ♦ క్షేమం బిఁక మీ
కొదవె నని యవలివారికి, ముదమునఁ దెల్పఁ జనునట్లు ♦ పూషుఁడు గ్రుంకెన్.

ఆ. తరణి యట్టు లస్త♦గిరిచాటునకు నేగు,సమయమున సమస్త♦శక్తిసైన్య
సముదయముల నాత్మ♦సన్నివేశముఁ జేర్చె, నమ్మహానుభావ ♦ యతిముదమున.

వ. అని చెప్పి యమ్మహాత్ముండు మఱియు నిట్లనియె. 289

సీ. ఇవ్విధంబున నమ్మ♦హేశ్వరి యద్దాన,వేశ్వరు నని వధి♦యించినట్టి
యీపుణ్యవృత్తాంత ♦ మెవ్వఁ డైన సమగ్ర,భక్తియుక్తంబుగాఁ ♦ బఠన సేయు
నొకసారి యైన న♦య్యుత్తముచేతిలో, భుక్తిముక్తులు రెండుఁ ♦ బొసఁగ నిల్చు
సిద్ధు లెనిమిదియుఁ ♦ జెందు నప్పుణ్యాత్ముఁ, గలహాముల్ దవ్వుగాఁ ♦ దొలఁగిపోవు
గీ, సర్వపాపఘ్న మగుదీని ♦ సత్పురుషులు, పుణ్యదినముల నెల్ల విం♦పుగఁ బఠింప
సకలసౌభాగ్య గరిమంబు♦సమరజయము,నలఘుయశమును బ్రాపింతు ♦రవనియందు.

వ. అని సాదరంబుగా హయగ్రీవుండు దెలుపుటయు. 291

ఆశ్వాసాంతము.

మ. సకృదుచ్చారణమాత్రతత్క్షణనిర♦స్తప్రాణిపాపౌఘునా
మ కళానాథకళాలసన్మకుటశుం♦భద్దీధిస్తోమ లో

కకఠోరోగ్రహాలాహలాఖ్యగరళ•గ్రాసామితాశ్చర్యదే
వకృతస్తోత్రవిభూషణా ఖలచమూ•వారాశిసంశోషణా. 292

క. కోదండీకృతశైలా, వేదండామరవిరోధి•విదళనశీలా
వాదాతిగనిజలీలా, పాదత్రయభూతిభరిత•పదకృతహేలా. 293

హంసగమనవృత్తము. పరిపాలితసురపాలక • ప్రమథాధిప కరుణా
పరిపూరితనయనాంబుజ•ప్రకటీకృత మహిమా
గిరిజాధిప గిరికార్ముక • గిరిభృచ్ఛర సుగుణా
కర భాస్వరశరదోపమ • గళవారిధికరధీ. 294

గద్యము.

ఇది శ్రీభవానీశంకరకరుణాకటాక్షవీక్షాసుధారసాసారప్రసారణసులబ్ధ
కవితావైభవాపస్తంబసూత్ర పరాశరగోత్ర విలస దాతుకూరివంశ
సంభ వాయ్యనామాత్యపౌత్రాదిమూర్తినామసత్కవిపుత్ర
సకలసుకవిజనవిధేయ పాపయనామధేయ
ప్రణీతంబైన లలితాంబోపాఖ్యానం
బనుమహాప్రబంధంబునందు
సప్తమాశ్వాసము.

---





ఓమ్.

శ్రీసద్గురుచరణారవిందాభ్యాంనమః.

శ్రీ

# ల లి తాం బో పా ఖ్యా న ము .

## అ ష్ట మా శ్వా స ము .



శ్రీధాన్యవాటికాపుర
సౌధాభ్యంతరవిహార ♦ శైలసుతాహృ
త్పాథోజసూర ఫణియూ
థాధిపమణిహార బహువి♦ధాగమసారా. 1

వ. అవధరింపుము విబుధగణసముపాస్యుం డగునాహయాస్యునకు నదంభతపోవిభవుం డగుకుంభభవుం డి ట్లనియె. 2

సీ. ప్రాజ్ఞాగ్రగణ్య తు♦రంగమానన నీవు, వాత్సల్యగరిమంబు♦వలనఁ దెలుప
శ్రీమహారాజ్ఞి చే♦సినయద్భుతపరాక్ర,మంబు సర్వాఘహ♦రంబు లైన
తచ్చరిత్రములు నెం♦తయు భక్తితో వింటి, నాశ్చర్యకరములై ♦ యతిశయిల్లు
మంత్రిణీముద్రిణీ♦మహనీయవిక్రమ,వృత్తాంతములతోడ ♦ విశదఫణితి
గీ. నామహాదేవి దైత్యేంద్రు ♦ నామమడఁచి, దివ్యమహిమ నాల్గవయుద్ధ♦దినమురాత్రి
గడపి తదనంతరంబ యే♦కార్య మాచ,రించెఁ దెలియంగ దీని వి♦న్పించవలయు. 3

వ. అనిన విని హయగ్రీవుం డి ట్లనియె. 4

సీ. వినవయ్య కుంభజ♦మునిచంద్ర నిర్మల,ప్రజ్ఞ నీ వడిగిన♦పరమపుణ్య
కథ లలితాదేవి ♦ ప్రధనరంగంబున, భండాసురేంద్రుని ♦ బారిసమరి
సమరంబులోన రా♦క్షసబాణపరిపీడి,తము లైనయాత్మసై♦న్యముల నెల్ల
నమృతధారల నీను♦నవలోకనంబుల, నాప్యాయనము నొందు♦నట్లు గాఁగఁ
గీ. జేసినయనంతరము శక్తి♦సేన లెల్ల, వితతయుద్ధపరిశ్రాంతి ♦ విడిచి పరమ
హర్షమానసాబ్జములతో ♦ నాసమస్త,భువనమాతను గీర్తించు♦నవసరమున. 5

చ. సమరములోన భండదనుజాతుఁ గూలుటఁ జేసి సంప్రమో
దమున సమస్తనిర్జరులు ♦ ధాతృముకుందపినాకభృత్పురో
గము లయి యాజగజ్జనని ♦ గాఢతరం బగుభక్తిఁ గొల్వఁగాఁ
దమతమవారిఁ గూడుకొని ♦ తద్దయు వేడుక వచ్చి రర్మిలిన్. 6

వ. ఇట్లు బ్రహ్మవిష్ణురుద్రులును నింద్రాదిదిక్పతులును ద్వాదశాదిత్యులును నెనమండ్ర వసువులును నేకాదశరుద్రులును మరుద్గణంబులును నశ్వినులును బితృదేవతలును జారణులును శేషాదిమహానాగంబులును వైనతేయాదిఖేచరులును సాధ్యులును నణిమాదిసిద్ధులును సప్తమహాఋషులును యక్షులును విద్యాధరులును నిరృతిప్రముఖరాక్షసులును బలిప్రహ్లాదు లైనమహాదైత్యులును మొదలుగా బ్రహ్మాండనివాసు లెల్ల నచ్చటికి వచ్చి పరమసంతోషభరితాంతఃకరణంబులతోడ నాసింహాసనేశ్వరికి సాష్టాంగదండప్రణామంబు లాచరించుచు భక్తియుక్తంబుగా నిట్లని స్తుతియించిరి.

సీ. సకలజగదేకనాథవై ♦ సాధులోక,కంటకుం డగుభండరా♦క్షసు వధించి
నట్టికామేశ్వరప్రియ ♦ వైననీకు, వందనము లాచరింతు మ♦మందభక్తి. 8

గీ. చిద్ధుతాశనజాతవై ♦ చిత్స్వరూప, వగుచుఁ జిత్రాభిధానని♦త్యాన్వితవయి
చిత్రతర మైనమహిమచేఁ ♦ జెన్నుమిగులు,నీ కొనర్తుము ప్రణతి ని♦ర్నిద్రభక్తి. 9

సీ. మోక్షప్రదాత్రివై ♦ ముగ్ధేందుచూడవై, మోహవిచ్ఛేదనో♦త్సాహ వగుచు
ముద్రేశ్వరీసము♦న్నిద్రకారితరాజ్య,తంత్రవై ముగ్ధమం♦దస్మితాస్య
వగుచు ముద్రాప్రియ ♦ వైనట్టినీకు ని,త్యంబు నమస్కార ♦ మాచరింతు
మవనిఁ గ్రూరాత్ముల ♦ నడఁచి వధించుచుఁ, గ్రోడాననాపరి♦గుప్తసైన్య

గీ, వగుచుఁ గోమలదేహవై ♦ యలుకవేళఁ, గాళికామూర్తి వగుచు లో♦కములఁ గాచు
నపుడు కోడీకృతమహాకృ♦పాలవాల, వైననీ కిదె మ్రొక్కెద ♦ మమ్మ భక్తి. 10

సీ. వెలయు షడంగదే♦వీపరివారస,మ్యగ్గుప్త వగుచు ష♦డంగయుక్త
వేదవాక్యములచే ♦ వెదకంగఁ దగుచు ష,ట్చక్రసిద్ధియును న♦వక్రమహిమ
గలిగి షడూర్మివి♦కారవర్జిత వయి, షడ్భావరూపవై ♦ సన్నుతి గను
నీకు వందనము ల♦నేకము ల్గావింతు, మంబ కామేశ్వరి ♦ యాదిమైన

గీ, సకలనిత్యలు సేవింప ♦ వికచకమల,నేత్రవై కామదేవసు♦గాత్రి వగుచుఁ
గామనీయకరాశివై ♦ కళల కాది,మూల మగునీకు మ్రొక్కెద ♦ మోలతాంగి. 11

సీ. ఉర్వి దివ్యౌఘసి♦ద్ధౌఘమనుష్యౌఘ,రూపవై దీప్తప్ర♦తాప వగుచు
దివ్యానుభావవై ♦ దిననాథసాహస్ర,కాంతివై దానవ♦గర్వ మడఁచి

దేదీప్యమానవై ♦ దేవతారాధ్యవై, దయమానభాస్వర♦నయన వగుచు
దేవాధిదేవవ♦ధూవతంసంబవై, దేవకార్యార్థని♦జావతార
గీ, వగుచు దీనసంరక్షణ ♦ మాచరించి, దివిజసన్నుతిఁ గని చాలఁ ♦ దేజరిల్లు
నీకు మ్రొక్కెద నిపుడు త్రి♦లోకజనని, దుర్భరక్లేశనాశని ♦ దుష్టదమని. 12
సీ. సతతాణిమాద్యష్ట♦సంఖ్యాకసిద్ధిసం,సేవ్యవై శ్రీసదా♦శివమయిప్ర
దీప్తమంచాగ్రసు♦స్థితివై సదాసదే,కాయనపూజ్యాంఘ్రి♦కమల వగుచు
సప్తలోకానీక♦జననివై ♦ సౌమ్యవై, సత్యస్వరూపవై ♦ సకలశక్తి
మూలంబ వగునీకు ♦ మ్రొక్కెద నెప్పుడు, బ్రాహ్మ్యాదిమాతృకా♦ప్రకరసేవ్య
గీ, వగుచు బ్రహ్మముఖసురార్చి♦తాంఘ్రి వగుచు
బంధహంత్రి బ్రహ్మప్రియ ♦ బ్రహ్మజనని
బ్రహ్మవేద్య బ్రహ్మేశ్వరి ♦ బ్రాహ్మణి యనఁ
బరఁగు శ్రీలలితాంబిక ♦ ప్రణతి నీకు. 13
క. సదవనవర సంక్షోభిణి, మొదలగుముద్రలు భజింప ♦ మొగి సంవరణ
చ్ఛిద నల్పుచు సంస్తుతిమే, లొదవించుసరోజనయన ♦ కొగి జోహారుల్. 14
సీ. అత్యంతభక్తికా♦మాకర్షిణీముఖ్య,నిత్యాకళాద్యష్ట♦నిరతసేవ్య
వై నిరాతంకవై ♦ నిరుపమకరుణవై, నిత్యస్వరూపవై ♦ నీలచికుర
భాసుర వగునీకుఁ ♦ బ్రణతిఁ గావింతు మ,నంగపుష్పాదికా♦నంగపూర్వ
దేవినిరంతర♦భావితచరణవై, యరివర్గమాంత్రివై ♦ యాఢ్య వగుచు
గీ, నక్షరసమూహరూపవై ♦ యాద్యవై య,భవ్యహారిణివై యధః♦పతనశీల
దుష్టశిక్షణివై మహా♦ద్భుతచరిత్ర, వైననీకు నమస్కార ♦ మఖిలజనని. 15
సీ. నిరతంబు సంక్షోభి♦ణీముఖ్యలై నట్టి,పదునాల్గుకీలలఁ ♦ బ్రజ్వలించు
నాత్మస్వరూపమ♦హాప్రదీపము దాల్చి, మహితవిలాససం♦పన్న వగుచు
శుద్ధాంతరంగివై ♦ సురుచిరనిర్మల,నిత్యపదాఢ్య వౌ♦నీకుఁ బ్రణతి
యాచరింతుము సమ♦స్తాధికవై సర్వ,గతవై సకలసిద్ధు ♦ లతిశయదయ
గీ, నాశ్రితులకు నొసంగుచు ♦ నఖిలసిద్ధి,ముఖ్యశక్తులతోడ నె♦ప్పుడు వెలయుచు
నిఖిలసర్వజ్ఞవిజ్ఞాత♦నిజపదార,వింద వగునీకు నివె పెక్కు♦వందనములు. 16
గీ. అమితభక్తితో సర్వజ్ఞ ♦ లైనయట్టి,ప్రమథశక్తులు తదితర♦ప్రథితశక్తు
లెలమిఁ గొలువంగ శ్రీచక్ర♦నిలయ వైన,నీకిదె నమస్కరింతుము ♦ లోకజనని. 17
సీ. సకలదేవతలవాం♦ఛాపూర్తి యొనరించి, సర్వలోకములకు ♦ జననివైన
లలితాంబ మముఁ గావు ♦ మెలమి వశిన్యాది,దివ్యవాగ్భూతివ♦ర్ధిష్ణుచక్ర

రుచివాహావాహవై ♦ యూథి వలాహక,శ్యామకుంతల వయి ♦ వామనేత్ర
వై వచోధీశ్వరి ♦ వై వరప్రద వయి, వాత్సల్యనిధి వయి ♦ వఱలునీవు
గీ, పాలనముసేయు మెలమి లో♦కాళి నెల్ల, భండసేనాటవీదావ♦పావకాస్త్ర
పటలములచేత సర్వతః♦పాల్యమాన, వైననీకు మ్రొక్కెదము వి♦శ్వాధినేత్రి. 18
సీ. కామేశి మొదలుగాఁ ♦ గలిగినముప్పురు,నిత్యలు నీవ యై ♦ నివ్వటిలుచుఁ
గాలవిలోపద♦క్షత గల్గి కల్య వై, యమితకళామయ♦త్వమునఁ దనరి
చెలఁగి కథావశే♦షీకృతదానవ,సేనవై కరిరాజ♦యాన వగుచుఁ
గామేశకాంతవై ♦ కమలవై కలికాల,దోషైకసంహార♦ధూర్వహ వగు
గీ, కంబుకంఠి కృపాంభోధి ♦ కమలనేత్ర,కలితనూత్న తేజోజ్జ్వల♦తాండకాశి
కైరవాప్తబింబానన ♦ కావు మమ్ము, నీకు మ్రొక్కెద మనిశంబు ♦ లోకమాత. 19
సీ. బిందుకళై కరూ♦పిణి వౌచు బిందుస,మ్యక్పీఠసుస్థిత ♦ వై బృహత్కు
చాభోగలోలమ♦హార్ఘ్యముక్తాహార, వగుచు బ్రహ్మాత్మిక ♦ వై బృహత్ప్ర
భావవై బృంహిత♦పరమచిత్సాంద్ర,కాశవై బృందార♦కప్రతాప
రక్షణశీలవై ♦ రంజిల్లునీకు న,మస్కరించెదము స♦మగ్రభక్తిఁ
గీ, గామదేవాంచితోత్సంగ♦కలితవాస, కాలరూపిణి కల్పాంత♦కాళికాఖ్య
కందళత్కరుణానిధి ♦ కామదాన,కల్పలత నీకు నిదె నమ♦స్కార మమ్మ. 20
సీ. సర్వారుణప్రభా♦సాంద్రకోమలగాత్రి, సర్వవిశ్వేశ్వరి ♦ సాధులోక
రక్షణశీల సా♦రంగశాబాక్షి సు,ధారసశీతల ♦ సూరివినుత
సారసకాంతివి♦స్తార సదానంద, సారస్యసముదయ ♦ సారభూమి
శ్రీశంభునాథమాం♦త్రికహుతనిర్మల,జ్ఞానపావకునిలో ♦ జాత వైన
గీ, నీదుమహిమచే భండాసు♦రాదిలోక,కంటకసమూహ మడఁగె జ♦గత్త్రయంబు
భవదుదారకృపారసా♦ప్లావిత మయి, తొంటికంటెను హృద్యమై ♦ తోఁచె నిపుడు.
వ. అని మఱియు నిట్లనిరి. 22
సీ. అద్వితీయుండు మ♦హాయశుం డైనట్టి,యాశంభునాథుని♦యపరమూర్తి
యగుచంద్రశేఖరుం ♦ డనుపమితప్రభా,వాఢ్యుండు శ్రీకరుం ♦ డప్రమేయుఁ
డాదక్షనందన ♦ యైనసతీదేవి, తనుఁ బాసినది మొదల్ ♦ ధైర్య మూఁది
యఖిలేంద్రియంబుల ♦ నాత్మలోఁ గుదియించి, వైరాగ్యమున మహో♦దారుణ మగు
గీ, తపము స్థాణ్వాశ్రమమున న♦త్యంతనియతిఁ
జేయుచుండంగ నామహా♦నీయుతోడ

నచలవంశజ యగునుమ • యనెడుకన్యఁ
గూర్పు మని చెప్పి యేము కం•దర్పుఁ బనుప. 23

గీ. అతఁడు నట్ల చేసెద నని • యతిరయమున, నరిగి స్థాణ్వాశ్రమంబున • నతులనియమ
వంతుఁడై భోగములమీఁది•వాంఛ లేక, తపము సల్పుచు నున్నచం•ద్రధరుఁ జేరి. 24

క. తనమానసమునఁ దలఁచిన,పని యొనరింపంగఁ బూని • భర్గునిపైఁ జ
య్యనఁ బుష్పశరము సంధిం,చినమాత్ర నతండు తనదుచి•త్తంబునకున్. 25

ఆ. వికృతి పుట్ట శైల•విభుసుతారూపంబు,నందు బద్ధదృష్టి • యగుచు నుండి
యంతఁ దనకుఁ దా ని•జాంతరంగవికార,హేతు వైనమదను • నెఱిఁగి వేగ. 26

మ. తనవైరాగ్యతపోవిఘాత మున క•త్యంతకు(?)ధావిష్టుఁడై
వనజాస్త్రున్ నిజఫాలలోచనశిఖి•జ్వాలాళి భస్మావశే
షునిఁ గావించి కృశానునేత్రుఁ డపు డ•చ్చోఁ బాసి వేఱొక్కచో
ట నివాసం బొనరించె శాంతరసగా•ఢస్వాంతసీ రేజుఁడై. 27

గీ. అట్లు హరనేత్రవహ్నిద•గ్ధాంగుఁ డైన,ప్రసవబాణాసనునిభస్మ•రాశివలన
భండనాముఁ డైనప్ర•చండదేవ,శత్రుఁ డుదయించి బాధించె • జగము లెల్ల. 28

చ. అతని వధించి లోకముల • నన్నిటిఁ గావఁగఁ జిద్ధుతాశనో
త్థిత వయి యత్యుదారసము•దీర్ణభుజాబల వై సురవ్రజా
ప్రతిహతశౌర్యసారుఁ డగు•రాక్షసనాథునిఁ గూల్చి దేవతా
తతికిఁ బ్రియంబు చేసితివి • తద్దయు నిన్ను నుతింప శక్యమే. 29

మత్తకోకిలము. ఇంక నొక్కటి విన్నవించెద • మీశ్వరేశ్వరి దుర్భవా
తంకనాశని యాశ్రితావన•తత్పరాత్మిక రాజితై
ణాంకఖండలసత్కిరీట ద•యామృతాంబునిధీ శర
త్పంకజేక్షణ మాయభీష్ట ము•దారతన్ ఘటియింపుమా. 30

వ. అది యెయ్యది యనిన. 31

సీ. తారకదైత్యు సం•హారం బొనర్పంగ, శక్తి గల్గినమహా•సత్త్వశాలి
శైలసుతామహే•శ్వరులకుఁ బ్రభవింపఁ, జేయుకార్యమునకుఁ • జిత్తజన్ము
నేము ప్రార్థింప ను•ద్దామదర్పమున న,స్మత్కార్యమునకుఁ గా • మదనుఁ డేగి
ధూర్జటిఁ దొడరి త•ద్దుర్వారకోపాగ్ని,దారుణకీలల • దగ్ధుఁ డయ్యె

గీ. నతనిఁ గ్రమ్మఱ నెప్పటి•యట్ల వేగ, వత్సలతతోడఁ బ్రదికింప•వలయు నీవు
వాన మామనోరథము ల•త్యంతసఫల,తాస్ఫురణఁ జెందు లోకంబు • ధన్య మగును.

వ. అదియునుం గాక. 33

గీ. పతివియోగతాపంబున • బడలియున్న, యీరతివధూటిదుఃఖంబు • నీక్షణంబ
తొలఁగఁ జేయంగవలయు ని•స్తులకృపాక, టాక్షవీక్షాసుధారస•ప్రాపణమున. 34

గీ. ఇంతగాల మత్యంతంబు • హేయ మైన, గాఢవైధవ్యశిఖిచేతఁ • గ్రాఁగినట్టి
యీతలోదరిసీకృప •సెనసితొంటి, పోల్కిఁ బతిఁగూడి మోదంబుఁ•బొందుఁగాక.

క. నీవలన మగుడ బ్రదికిన, యీవారిజబాణుచేత • నతిమోహితుఁ డై
యీవామదేవుఁ డధికత, పోవైభవ మైనశైల•పుత్త్రి న్వేగన్. 36

ఆ. పెండ్లియాడఁ గలఁడు • ప్రేమ నయ్యద్దణుఁ, గలసి లోకసౌఖ్య•కారి యైన
క్రీడనంబు సల్పి • పృథుబలోదారుఁ గు, మారుఁ బడయుదురు స•మగ్రలీల. 37

గీ. అమ్మహాత్ముఁడు దనతండ్రి • యైనహరుని, వలన నిఖిలాస్త్రశస్త్రవి•ద్యలఁ బ్రసిద్ధి
వడసి దేవసేనల కాధి•పత్య మూని, పేర్చి యప్రతిహతవృత్తిఁ • బెంపుఁ గాంచు.

వ. మఱియును. 39

గీ. అక్కుమారుండు రణమున • నఖిలలోక, కంటకుని సర్వనిర్జర•గర్వహారి
భండదైత్యేంద్రసఖుని న•ఖండశౌర్యుఁ, దారకాసురు వధియించు • ఘోరభంగి.

గీ. లోకజనయిత్రి వినుము త్రి•లోకములకు, ధూమకేతువుపోనియా•దుష్టదైత్యుఁ
డాలమునఁ గూలినట్లైన • నంతనుండి, యెలమితోడ సుఖించెద • మిద్ధచరిత. 41

క. అదిగావున లోకములకు, ముదముం గల్పించుభువన•మోహను మాయా
స్పదుని జగదేకవీరుని, మదనుం గల్పింపవమ్మ • మాన్యచరిత్రీ. 42

గీ. అట్టు లైన వేనలి వీడి • యడలురతివ, ధూటివైధవ్యదుర్దశల్ • దొలఁగు నిపుడ
యగసుతాశంకరులకు నె•య్యంబుగలుగు, సకలలోకంబులధికహ•ర్షంబుగాంచు.

గీ. భర్త నెడఁబాసినది మొదల్ •బహులదుఃఖ, హతి నతికృశాంగియై కడు•నడల నీవె
శరణ మని నమ్మియున్నది • తరళనయన, దీని నత్యంతకరుణార్ద్ర•దృష్టిఁ జూడు.

గీ. కన్నుఁగవ బాష్పజలములు • గ్రమ్ముచుండ, నంగలతిక గంపింప న•నన్యశరణ
యగుచునత్యంతదైన్యమా•స్యమునఁదోఁపఁ, బ్రణతి సేయుచునున్నది•ప్పడఁతినీకు.

గీ. విధికృతి ననాథ యగుచు ని•ర్విణ్ణచిత్త, యైనదీని ననాథగా • నలఘుమహిమఁ
జేయవలయు నో త్రిపురేశ్వ•రీ యపార, వత్సలత మీఱ నిదియ మా•వాంఛితంబు.

మ. అని బ్రహ్మాదిసురోత్తముల్ పరమభ•క్త్యావేశితస్వాంతు లై
వినయం బొప్పఁగ సంస్తుతించి రతిదే•విం జయ్యనం బిల్వ న
వ్వనితారత్నము బాష్పపూర్ణముఖ యై • వ్యాకీర్ణకేశాళి యై
ఘనధూళీపరిధూసరాంగి యయి శో•కప్రస్ఖలద్వాక్య యై. 47

సీ. అడుగులు దొట్రిల్ల ◆ నల్లనల్లనఁ జేరి, యతిభక్తి వందనం ◆ బాచరించి
ప్రకటవైధవ్యభా◆రంబున సంత్యక్త,భూషణ యైచాలఁ ◆ బొలుపు దక్కి
నుదుటిపై నంజలి ◆ గదియించి తన్మోల, నిలిచి దైన్యరసంబు ◆ నెలఁత యైన
కరణిఁ జూపట్టిన◆కందర్పభామిని, నధికకారుణ్యర◆సామృతార్ద్ర
ఆ. మైనచూడ్కిచేత ◆ నాజగజ్జనయిత్రి, గారవించె నంతఁ ◆ గాంచువారి
కెల్ల విస్మయంబు ◆ హెచ్చఁ దత్కరుణాక,టాక్షవీక్షణమున ◆ నాక్షణంబ. 48

సీ. జగదద్భుతం బైన◆చక్కందనమువాఁడు, స్మయమానముఖపంక◆జంబువాఁడు
పూర్వదేహాధిక◆భూరితేజమువాఁడు, ప్రకటప్రసూనకా◆ర్ముకమువాఁడు
సర్వభూషణలస◆చ్చారుగాత్రమువాఁడు, సుమహితకుసుమబా◆ణములవాఁడు
పులుకతేనియ చిల్క◆చిలుకగుఱ్ఱమువాఁడు, డంబైనమకరధ్వ◆జంబువాఁడు
గీ. కమలకోమలపాదయు◆గ్మంబువాఁడు
నవ్యమదమేదురాలోక◆నములవాఁడు
భువనమోహనమహిమాను◆భవమువాఁడు
కాముఁ డుదయించె లోకాభి◆రాముఁ డగుచు. 49

చ. ఇటు లుదయంబునొంది కుసు◆మేషుఁడు పూర్వభవంబున న్మహో
త్కట మగుప్రేమ భార్య యయి ◆ గాఢసుఖావహ యైనధారుణీ
కటి రతిదేవి నాదరవి◆కాససమన్వితరాగమేదుర
స్ఫుటతరదృష్టిజాలములఁ ◆ జూచి ముదం బొనరించె నంతయున్. 50

వ. అప్పుడు. 51

సీ. తొలుదొల్తఁ బూవింటి◆దొరను గనుంగొనఁ, నతివయుల్లము విస్మ◆యంబుఁ జెందె
మఱి చూడఁ జూడ న◆త్తెఱవమానసపద్మ, మానందవార్ధి నో◆లాడుచుండె
వెండియుఁ గనఁగ న◆య్యిండజగామిని,మది నాట మైనప్రే◆మఁ జవికొనియెఁ
దిలకింపఁ దిలకింప ◆ లలనామణీచిత్త,మున సిగ్గు దనయంత ◆ మొలక లెత్తె
ఆ. నేమి చెప్ప నప్పు ◆ డామానవతిరూప,వేషభాషణములు ◆ విశదరీతిఁ
దోఁచె నద్భుతముగఁ దొల్లింటికంటె మ,నోజ్ఞభంగిఁ గాఁగఁ ◆ బ్రాజ్ఞవర్య. 52

సీ. ఆరీతి రతిదేవి◆యాత్మేశ్వరుం డైన,నాళీకశరుఁడు పు◆నశ్శరీర
ధారియై తనదుముం◆దర నిల్వఁ గాంచి మ,హానందపారవ◆శ్యమున నుండ
నాజగన్మోహనుఁ ◆ డగుపంచబాణుఁ డ,య్యఖిలలోకనమస్కృ◆తాంఘ్రిపద్మ
యైనమహారాజ్ఞి ◆ కతిభక్తితో నమ,స్కారంబు గావించి ◆ గాఢవినయ

గీ, సంప్రమోదమనస్కు లై • సరసవచన,మాధురీసాధురీతి న•మస్త్వబృంద
మధికహర్షంబుతో విన • నంజలిప్ర,శస్తహస్తులై యి ట్లని • ప్రస్తుతించె. 53

సీ. భానుకోటిప్రభా•భాసమానాంగశ్రీ,షే నమస్తే నమ•స్తే నమోస్తు
భండాదిదనుజప్ర•కాండఖండనచణా,యై నమస్తే నమ•స్తే నమోస్తు
పుండ్రేక్షుకోదండ•పుష్పసాయకకరా,యై నమస్తే నమ•స్తే నమోస్తు
సర్వలోకాతీత•సౌందర్యపాథోని,ధే నమస్తే నమ•స్తే నమోస్తు

గీ, జ్ఞానపావకసంభవా•యై నమోస్తు, దీనసముదయరక్షణా•యై నమోస్తు
మానిజనవాంఛితప్రదా•యై నమోస్తు, తే నమోస్తు మాత ర్లలి•తే నమోస్తు.

వ. అని మఱియు ననేకవిధంబులఁ బ్రస్తుతించి వెండియు. 55

క. శ్రీదేవి యథార్థముగా, నీదుమహిమఁ దెలిసి పొగడ • నీరేరుహగ
ర్భాదిసుర లైన శక్తులె, మాదృశు లన నెంత భువన•మంగళచరితా. 56

క. వితతక్రోధవిఘూర్ణిత,శితికంఠలలాటనేత్ర•శిఖికీలాభ
స్మితదేహ మిపుడు పునరా,గత మయ్యె మహేశి నీదు•కారుణ్యమునన్. 57

క. నీకున్ బుత్త్రుఁడ దాసుఁడ, నేకార్యం బైనఁ గలిగె•నేనియుఁ గరుణా
లోకనము వెలయ నన్నున్, బ్రాకటముగఁ బనుపవమ్మ • ప్రథితచరిత్రా. 58

మ.అనిపుష్పాస్త్రుఁడు విన్నవించినఁ ద్రిలో•కారాధ్య యద్దేవి యి
ట్లను నోమానసజన్మ వత్స యిఁక నీ • వస్మత్ప్రభావంబునన్
గనదవ్యాహతమార్గణుండ వయి లో•కవ్రాతమున్ సంతతం
బును మోహింపఁగఁ జేయుచున్ స్థిరజయం•బున్ బొంది వర్తింపుమా. 59

క. మును వైరాగ్యనిధానం, బన విజితేంద్రియుఁ డనఁగ • నతివిఖ్యాతుఁ డై
తనరినశంభుఁడు తనుభవ, సునిశితత్వద్ధేతిచేత • సుస్థిక్కి తనమదిన్. 60

క. క్రోధ ముదయించియును నిను, సాధింపఁగ లేఁడు తొంటి•చందంబున నో
పాథోజబాణ యిఁక ని,ర్బాధము నీతనువు నాదు•వాత్సల్యమునన్. 61

మ. భవదీయోజ్జ్వలపుష్పబాణమున నా•భర్గుండు దా ధైర్యవి
ప్లవమున్ బొంది నితాంతరాగమున శై•లపోత్రిద్భవన్ బెండ్లియై
నవిశేషంబుగ నవ్యభూమణికి నై•జం బైన దేహంబులో
నవపాలియ్యఁగలండు తథ్య మిది ని•చ్చ ల్నమ్ము మాతోక్తిద్భవా. 62

క. గ్రావజతో నిటు లవినా,భావంబునఁ గలసి శైల•బాణాసనుఁ డా
దేవబలంబులఁ గాచుమ,హావిక్రమవంతుఁ డైన•యాత్మజుఁ బడయున్. 63

క. మదన మదనుగ్రహంబున, మదనార్బుదకోటు లమిత♦మహితబలులు నీ
కుదయించి సకలజీవస,ముదయంబులతనువు లొంది ♦ ముదము నొసఁగుచున్.

క. అతిశయముగ నొండొరుపై, సతులకుఁ బతులకును మోహ♦సంపద యవ్యా
హతముగఁ గలుగం జేయుచు, రతిసౌఖ్యము నొసఁగుదురు ధు♦రంధరలీలన్ 65

క. కందర్ప నీవుప్రాణుల, కందఱకుం గానఁబడక ♦ యతిమోహక మా
సుందరగాత్రముతో నీ,సుందరి యగురతికి దృష్టి♦సులభుఁడ వగుమా. 66

క. మదనుగ్రహమునఁ బుష్ప,ప్రదర యితరదుర్లభప్ర♦భావయుతుఁడ వై
ముదమున నిటు విహరింపుము, పదునాలుగులోకముల న♦పాయరహితతన్. 67

క. నిను నెవ్వరైన నిందిం,చిన నీయెడ విముఖు లైన ♦ శీఘ్రమ వారల్
వనరుచుఁ బ్రతిజన్మంబున, ఘనషండత్వాబ్ధి మునిఁగి ♦ కష్టింతు రిలన్. 68

గీ. పంచసాయక విను నాదు♦భక్తతతికి
ద్రోహు లగుచుఁ బాపిష్ఠు లౌ♦దుష్టమతుల
ధర నగమ్యాంగనలయందుఁ ♦ దగులఁ జేసి
శీఘ్రమున నాశ మొందఁగాఁ ♦ జేయు మదరి. 69

గీ. అనుమార్గణ వినుము మ♦దాశ్రితులకు
గరిమ ధర్మావిరుద్ధభో♦గములయందు
వాంఛ పుట్టించి తత్సుఖ♦ప్రదుఁడ వగుము
పొమ్ము సకలశుభంబులుఁ ♦ బొందు నిన్ను. 70

మ. ననుఁ బూజింపుచు నాదుభక్తజనముల్ ♦ మన్నించుచున్ వారితో
మనువారిన్ బహుజాగరూకతఁ బరా♦మర్శించుచున్ గామసౌ
ఖ్యనితాంతానుభవంబు వారలకుఁ గ♦ల్గం జేయుమీ తన్మనో
వనజాతంబు లభీష్టపూర్తిఁ గని చె♦ల్వొం బంది తోషింపఁగన్. 71

మ. అని సర్వేశ్వరి యాజ్ఞ యిచ్చిన లతాం♦తాస్త్రుండు హృష్యన్మనో
వనజాతుం డయి యట్ల కాఁ గనుచుఁ ద♦ద్వాక్యంబు భక్తిన్ శిరం
బున నందంబుగఁ దాల్చి హస్తయుగళం♦బుల్ ఫాలదేశంబునన్
వినయం బొప్పఁగ సంఘటించి కదలెన్ ♦ విస్ఫూర్జదంచద్గతిన్. 72

వ. ఆసమయంబున. 73

సీ. ఆమహావీరుని♦సోమకూపంబున, బహుకోటిమదనులు ♦ ప్రభవ మొంది
యతిసుందరాంగు లై ♦ యఖిలజగన్మోహ,కరణప్రవీణులై ♦ సరసిజాది

పంచబాణవిభాసి•పాణిసరోజులై, లావణ్యరత్నాక•లాపు లగుచు
సురుచిరాకారభా•సురశుకారూఢులై, కీర్తితాంచితవిమా•కేతను లయి
గీ. శక్రపుండ్రేక్షుకోదండ•హస్తు లగుచు, భృంగమౌర్వీధ్వనుల దెసల్ • పిక్కటిల్లఁ
గోకిలబలంబు లెల్లను • గూడి రాఁగ, జగతి నెల్లెడ విహరించి • రగణితధృతి. 74
వ. ఇవ్విధంబున. 75
క. మదనునివలనం గలిగిన, మదనసహస్రములు గదిసి • మ్మోచక్రమునన్
మదిరాక్షీపురుషుల నమ్మోదమునఁ దేలించి రమిత•మోహపరులై. 76
వ. అంత. 77
సీ. ఆజగన్మాతచే • నాజ్ఞాపితుం డైన, యామహాకందర్పుఁ • డతిముదమున
నచ్చటఁ గదలి స్థా•ణ్వాశ్రమంబున కేఁగ, సమకట్టి నిర్భరో•ద్యములు నగుచు
రమణీయశృంగార•రసము మూర్తం బైన,కరణి నిజాంగవి•స్ఫురణ దనర
నతిశయప్రేమతో • రతిదేవి తనయంత, నాలింగనసుఖంబు • నోలి నొసఁగ
గీ. సకలసైన్యేశుఁ డైనని•శాకరుండు, ప్రాణసఖుఁ డౌవసంతుని•వరపరిణతి
నసమసమరజయోపాయ•హారిమధుర,వచనములు వల్క విసుచు న•వార్యపటిమ.
క. ఇలఁ గలవిరహులగుండెలు, ఝలుఝల్లు మనంగఁ జటుల•జయయాత్రామం
గళకాహళరవముక్రియన్, గలకంఠరవంబు బోరు•కలుగఁగ దెసలన్. 79
ఆ. పీఠమర్దుఁ డగుచుఁ • బెంపుగాంచినరాగ,పురుషుఁ డుచితమధుర•సరసవచన
రచన నెరపుచుండఁ • బ్రతివాక్యముల వాని, నాదరింపుచును స•మగ్రమహిమ.
సీ. సంసారసాగర•సాచరజైకపు,రాయణు లగుచు మీఁ • దరయ లేక
యనవరతంబు సు•ఖామిషాపేక్షులై, లలితవైరాగ్య మ•ర్గస్థలముఁ జేర
నిచ్చ సేయక యిత•రేతరప్రేమాంబు,మగ్నులై యధిక ప్ర•మాదు లైన
నరనారు లనెడుమీ•నముల నొక్కటి నైనఁ, దప్పి పోవకయుండఁ • జెప్ప వలవి
గీ. గానితనదుమాయాబల•కౌశల మను,జాలమునఁ గ్రమ్మి నిజసిదే•శమున నిలిపి
యతులమైనయాశ్రీదేవి•యాజ్ఞ నఖిల,భూములఁ జరించె వలరాజు •పొలుపుమీఱ.
వ. ఇట్లప్రతిహతంబుగా విహరించుచు నించువిలుతుండు కాంచనశైలశరాసనుమ
నంబు మంచుమలముద్దుఁగూఁతురిసమంచితసుందరరూపంబునందు సంచలింపక
నివసించునట్లుగా నొనరించి సకలసురసంచయంబులకుఁ గ్రించుం డగుతారక
నక్తంచరునిబాధఁ జలఁగించవలయు నని తనమానసంబునఁ దలంచి యొక్కనాఁ
డొక్కశుభముహూర్తంబునఁ బ్రయాణంబై. 3

సీ. స్థాణ్వాశ్రమమున న♦త్యంతంబు నియతితోఁ, దపమునల్పెడుచంద్ర♦ధరునికడకు
సపరివారంబుగాఁ ♦ జని తన కెంతయు, మిత్రుఁడై పరఁగిన♦చైత్రుఁ డతివి
చిత్రంబుగా నూత్న♦పత్రపుష్పఫలాది,సంపన్నముగఁ దదా♦శ్రమవరంబుఁ
గావించుచుండఁగఁ ♦ గలకంఠశుకశారి,కాకలధ్వను లెల్ల♦కడలు మ్రోయ
గీ. గంధశైలాగతం బగు♦గంధవహము,చల్లఁదనము నంతట వెద♦చల్లుకొనుచుఁ
బెల్లున సమస్తజీవుల♦యుల్ల మలర,విసరసురవిసరార్థ మ♦య్యసమబలుఁడు. 83
మ. సుమకోదండమునన్ ద్విరేఫగుణమున్ ♦ జోద్యంబుగాఁ గూర్చి ద
ర్పము శోభిల్ల నిరూఢమోహగుణసం♦పాదిప్రసూనాస్త్రసం
ఘము లాదైవతసార్వభౌమునిపయిన్ ♦ గాఢంబుగా నేయ దా
న మహాదేవున కాక్షణంబ సడలెన్ ♦ ధైర్యంబు వైరాగ్యమున్. 84
గీ. అవని నింద్రియవర్జితుం ♦ డజుఁడు నిర్వి
కారుఁ డాజగదీశుఁ డ♦గణ్యమహిముఁ
డయ్యు మదనాస్త్రమోహితుఁ ♦ డగుచుఁ జిత్త
మద్రినందనరూపంబు♦నందు నిల్పె. 85
గీ. ఏమి చెప్పఁగవచ్చు నా♦వామదేవుఁ, డలఘుధైర్యస్థితిఁ దొఱంగి ♦ యనుపమాన
మోహపాథోనిధితరంగ♦ములకుఁ జిక్కి, శైలతనయను ధ్యానల♦క్ష్యంబుఁ జేసె.
వ. ఇవ్విధంబున. 87
మ. తనుఁ గాంతామణితోడఁ గూర్ప మును పు♦ద్యద్గర్వముం బూనుక్రొ
న్ననవిల్కాని విరాగినై కినుకకుం ♦ బాత్రంబుగాఁ జేసి య
ప్పనికిం జిత్తమునందుఁ గుంది మరలన్ ♦ ప్రఖ్యాతశౌర్యాఢ్యుఁ గా
ముని గెల్పింపఁ దలంచెనో యనఁగ శం♦భుం డంగజాధీనుఁ డై. 88
సీ. ధారణ వదలి భూ♦ధరసుతాధరసుధా,పారణ సేయ సం♦భ్రమము నొందు
నాంతరచంద్రబిం♦బావలోకము మాని, గౌరీవదనచంద్రుఁ ♦ గనఁగఁ దివురుఁ
గుండలి నరయక ♦ కుధరాత్మజాస్తన,మండలి నరయ నె♦మ్మదిఁ దలంచు
స్వస్వరూపవిమర్శ ♦ సడలి ప్రియాస్వాయ,మాలింగనస్పర్శ ♦ మభిలషించు
గీ. నంతకంతకు గాఢరా♦గాంతరంగుఁ
డగుట నఖిలజగంబు హి♦మాద్రిజాస్వ
రూపముగఁ గాంచుచుండుభ♦ర్గుండు ప్రేమ
దనదుసర్వజ్ఞతయును సా♦ర్థకతఁ జెంద. 89

గీ. సర్వమంగళమందహా♦సంబుతోడ, నమ్మహాదేవిరమ్యఫా♦లమ్ముతోడ
సమము లౌటను జాహ్నవీ♦చంద్రరేఖ, లెలమి శిరసావహించె స♦ర్వేశ్వరుండు.

కం. తనుఁ దాఁ గనుచుండుమహా,ఘనుఁ డభవుం డపుడు శైల♦కన్యక నెదలోఁ
గనుచుండెఁ దమ కభేదం, బని తెలిపినకరణిఁ దత్ప♦రాయణుఁ డగుచున్. 91

వ. మఱియు నమ్మహాత్ముండు. 92

చ. మును తనుఁ గొల్వఁగా వినయ♦ముల్ భయభక్తులు లజ్జయున్ గడ
లోకన వసుధాధరాత్మభవ ♦ కూరిమి డగ్గఱువేళ నాసరో
జనయన చూచునట్ల భయ♦సంచలదృష్టులఁ జూచులేఁతలే
డిని గని దానిఁ జేతఁ గొని ♦ డెందము సంతసమందఁ గన్గొనున్. 93

కం. మలయసమీరము దనపైఁ, బొలసినయపు డెల్లఁ దనదు♦భూషణఫణినా
థులఁ గినియు దీనఁ దమయాఁ,కలి దీర్ప రటంచు శివుఁడు ♦ గామవశుం డై. 94

ఉ. చిన్నటనాఁటనుండి దయ♦చేతను శీర్షమునన్ ధరించుచున్
మన్నన చేసినాఁ డని మ♦నంబున నెన్నక తాఁ గళాఢ్యుఁడన్
గ్రొన్ననవిల్తుమామ నని ♦ క్రొవ్వి మదంబున మిన్నుముట్టి యా
పన్నశరణ్యు నవ్విభుని ♦ బాధలఁ బెట్టఁ దొడంగె రాత్రులన్. 95

చ. తను మును బాధపెట్టినస♦దాశివుఁ గ్రమ్మఱ బిట్టలంపఁగా
మనసిజుఁ డాత్మలోనఁ బగ ♦ మానక పువ్వుల ఱువ్వ జెల్లు న
య్యనఘునిమూర్తు లైనమల♦యానిలపూర్ణశశాంకు లమ్మహా
త్ముని నలయింప నేమిపని ♦ ధూర్తులు గారె తలంచి చూడఁగన్. 96

వ. వెండియు. 97

సీ. పూర్వదృష్టం బైన♦భూధరాత్మజదేహ,సౌందర్య మెల్లఁ ద♦త్క్షణమ తనకు
సాక్షాత్కరించిన♦సరణి దోఁచిన నమ్మ,హానుభావుండు ధై♦ర్యంబు వదలి
గండమండలములఁ ♦ బాండిమ చూపట్టఁ, గన్నుల బాష్పాంబు♦కణము లురుల
నఖిలలోకాద్భుతం ♦ బగునమ్మహాదేవి,సర్వావయవదివ్య♦చారుతయును

గీ. మాటిమాటికిఁ దలఁచుచు♦మగువ మున్ను, దన్ను సేవించువేళ న♦య్యున్నమిన్న
భక్తిసౌశీల్యవినయాది♦భవ్యగుణము, లాత్మలో నెంచి మెచ్చు న♦య్యాలుజోఁడి.

కం. ఆపద్మేక్షణ తనదుస,మీపంబున నిలువఁ దాను ♦ మృదుమధురతరా
లాపంబు లాడమికి నెం,తో పరితాపంబు నొందు ♦ ధూర్జటి మదిలోన్. 99

వ. ఇవ్విధంబున విరహవేదనాధూయమానమానసుండై తనమనంబున. 100

సీ. నాఁటివేళల నొక♦నాఁడైన ననురాగ,కలితదృష్టులఁ బ్రియుఁ ♦ గాంచ నైతి
సరసమాధుర్యవా♦క్సతురత నక్కిలి,కించితపతి నల♦రించ నైతి
నాకుఁ గాన్కగఁ బ్రసూ♦నములఁ జేసినహంస,మిథునంబుఁగనిదాని ♦ మెచ్చనైతి
నిసువురఁ గూర్పంగ ♦ నరుదెంచురతిపతి, హితకారి యంచు నూ♦హించ నైతి
గీ, నిన్నియపరాధములకు స♦యియ్యగురుఁబోఁడి
దనమనంబున నే మని ♦ తలఁచు నొకొ-
యోనగాత్మజ కిపుడు నా♦యం దనుగ్ర
హంబు వచ్చునె నిశ్శ్రే తు♦కంబు గాఁగ. 101
క. తనయెదురఁ బ్రసూనాస్త్రునిఁ, గినిసితి నని యత్తుషార♦గిరికన్య మనం
బున నది నేరముగ గ్రహిం,చినయదియో కరుణ నన్నుఁ ♦ జేకొనియెడునో. 102
వ. అని యంతకంత కగ్గలించుమోహావేశంబున. 103
ఉ. హా యను నిట్లు సేయఁ దగ♦వా యను నాయెడ నేర మేమి గా
రీ యనుఁ గౌఁగిలింపుము మ♦హీధరరాజకుమారికాలలా
మా యను నిన్నుఁ బాసి క్షణ ♦ మైనను దాళఁగ నోప మంజువా
ణీ యను న న్వరింపు తరు♦ణీ యను నిందుధరుండు ప్రేమతోఁ. 104
వ. మఱియును. 105
ఆ. వెఱ్ఱి దెలసె నింక ♦ వేయును నేల యీ,వెఱ్ఱినియమములును ♦ వెఱ్ఱినిష్ఠ
వెఱ్ఱిమౌనములును ♦ వెఱ్ఱితపంబులు, విడుతు నింతనుండి ♦ విజయి నగుదు. 106
వ. తదనంతరంబ. 107
క. జలజజకల్పసహస్రం,బులు దన కొకక్షణము గాఁగ ♦ మును గడపుశివుం
డలగిరిజావిరహంబునఁ, గలఁగి తలఁచె క్షణము బ్రహ్మ♦కల్పము గాఁగన్. 108
క. గిరిజాతావిరహజ్వర,పరిలిప్తమహేశదేహ♦పరితాపంబున్
హరియింపఁ జాలవయ్యెన్, శిరస్థగంగాప్రవాహ♦శీతాంశుకళల్. 109
వ. ఇత్తెఱంగున దుస్సహం బైనవిరహంబున బడలి స్వకీయాశ్రమవనం బెల్లఁ
గలయఁ గ్రుమ్మరుచు నప్పరమేశ్వరుండు. 110
సీ. శారికాకోకిల♦కీరధ్వనులు విన్న,నతివపల్కులు విన ♦ నాత్మఁ గోరు
గజరాజహంసల♦గమనము ల్గిలకించి, వనజాక్షినెన్నడఁ ♦ గనఁగఁ దివురు
మల్లికాజాతిసు♦మప్రకరముఁ గాంచి, యింతిహాసముఁ జూడ ♦ నిచ్ఛయించు
లాశితజంబీర♦మాలూరఫలవీక్ష, సతిగుబ్బచనుదోయి ♦ మతిఁ దలంచు

గీ. నల్లకలువలచా ల్గన్న • నగతనూజ, చారుతరరోమరాజిఁ దా • నన్స్మరించు
మేనకాప్రియతనయాప్ర•మేయదేహ, కాంతిమగ్నాంతరంగుఁడై • కాలగళుఁడు.

వ. మఱియును. 112

సీ. కదళికాయుగళంబుఁ • గనుఁగొన్నమాత్రన, సతియూరుసౌందర్య•సరణిఁ దలఁచు
ఖంజరీటయుగంబుఁ • గాంచినమాత్రన, మగువకన్నులయొప్పు • మదిఁ దలంచు
బర్హిపింఛంబు నే•ర్పడఁ జూచుమాత్రన, యప్పడంతుకగొప్ప•కొప్పుఁ దలఁచుఁ
జంపకపుష్పద•ర్శనము సల్పినమాత్ర, నెలఁతుకఘ్రాణంబు•చెలువుఁ దలఁచుఁ

గీ. జేరి యరుణాంబుజముల వీ•క్షించుమాత్ర
నాఘనశ్రోణికరచర•ణాంబుజములు
దలఁచుఁ దదధికచారుతా•సలలితంబు
లగుట నఖిలేశ్వరుఁడు మోహ • మతిశయిల్ల. 113

వ. మఱియును. 114

గీ. తదవయవసామ్యగతవస్తు•తతులలోన, నొకటి యైనను జూడ న•య్యువిదరూప
మఖిలమును దోఁచు శివునకు •నాక్షణంబ, తద్వశం బయిచిత్తంబు •దగిలి యుండు.

వ. వెండియు నమ్మహానుభావుం డయ్యండజయాన తనదండ నిలిచి నింపువేడుక
నుపచారంబు లొనర్చునాఁటిచర్యలు దలంచి. 116

ఆ. నాతపఃఫలంబు • నగజాస్వరూపమై, యెలమి నెదుర నిలువఁ • దెలియ లేక
మౌనముద్ర దాల్చి • యానితంబినితోడఁ, బలుకనైతి నెంత•పాప మహహ. 117

క. వాసంతకుసుమభూషిత, భాసురదేహలత యగుచు • భయభక్తులతో
నాసన్నిధి కరుదేరఁగ, నాసుదతి బహూకరించ • నైతిఁ గటకటా. 118

సీ. కరిరాజగమన కే•సరిమధ్య హరిణాక్షి, రోలంబవేణి మృ•ణాళపాణి
కలకంఠకంఠి చి•లుకలకొల్కి చక్రియు,గ్మస్తని రంభోరు•కాండయుగళి
మల్లికాహాస చం•పకనాస క్రముకకం,ధర కదళీదళ•చరమభాగ
బంధుజీవాధరి • పల్లవాంఘ్రి లతాంగి, యిందీవరేక్షణ • కుందరదన

గీ. లలితశైవాలరోమాళి • జలజవదన, సైకతశ్రోణి మకరంద•సరసవచన
వారిజాకరసుందరా•వర్తనాభి, ధరణిధరకన్య వనదేవ•తగ నెసంగె. 119

వ. అని తలంచుచున్నంత. 120

క. ఆదేవుఁ డిట్లు మదనో,న్మాదంబున నుండు టెఱిఁగి • నందీశ్వరభృం
గ్యాదిగణనాయకులు భ,క్త్యాదరభయభరితహృదయు • లగుచు రయమునన్.

క. బహువిక్లబుఁ డగుశివునకు, బహువిధశైత్యోపచారపరికల్పన మ
న్వహ మొనరించుచు నుండ వి,రహతాపము దఱుఁగదయ్యె రాజధరునకున్.

వ. ఇవ్విధంబున శిలాదనందన భృంగిరిటి చండ కుంభోదర ప్రముఖు లైనమహాగణశ్రేష్ఠు లెప్పుడు నెడపడకయుండఁ బల్లవశయ్యారచన కదళీదళవీజన తుషారజలసేచన ఘనసారమిళితగంధసారానులేపనాదిశిశిరోపచారంబులు సేయ నెట్టిదాననించుక యైనఁ దాపంబు దీఱక శిలీభూతంబు లైనహిమజలఫలకంబుల నధివసించి చిత్రపట్టంబున నఖిలలోకసౌందర్యాతీతం బైనపర్వతరాజనందనసుందరాకారంబు నిజకరాంగుళీనఖముఖంబుల లిఖయించి వ్రీడానమ్రంబును మందహాససమన్వితంబును నైనయాననంబు మొద లైనయమ్మహాదేవియవయవంబులు మాటిమాటికి సప్రేమంబుగా నవలోకించుచు నంతటఁ దనియక యాచిత్రపటంబు పులకపటలభరితం బైనవక్షోభాగప్రముఖనిజాంగంబులయం దతిగాఢంబుగా నుంచుచుఁ జిత్తాసంగంబున నత్యంతప్రవృద్ధం బై యనురాగరసప్రవాహంబు దలమునుక లై ప్రవర్తిల్లుచుండఁ బ్రపంచం బెల్లఁ బ్రియామయంబుగాఁ జూచుచుఁ దద్రూపన్యస్తమానసుం డై విరహోన్మాదంబున నబ్బామినీలలామంబుఁ దాదృశదశాపన్నఁగా భావన సేయుచుఁ దత్సల్లాపసంస్పర్శనచుంబనాలింగనాదుల కాససేయుచుఁ దదధీనహృదయుం డై తచ్చింతాపరాయణుం డై తత్కథాప్రసంగయాపితసమస్తాహోరాత్రుం డై తదీయశీలంబు బహుముఖంబులం గొనియాడుచుఁ దద్రూపసౌందర్యనిరంతరదర్శననిరతుం డై తత్క్రీడాభోగవిషయికబహువిధసంకల్పమాలికాగ్రథనకౌశలమాలికశ్రేష్ఠుం డై తన్మయత్వంబు నొంది యయ్యిందుశేఖరుం డదనమనంబున నిట్లు క్రమక్రమవివృద్ధం బగుచున్నయీపంచబాణబాణక్షతవేదనామయం బైనయామయంబునకు మఱియొకయౌషధం బెచ్చట వెదకిన లేకయున్నది యిమ్మచ్చెకంటిని యథావిధిఁ బాణిగ్రహణవైభవంబునఁ గైకొని యిచ్చకు వచ్చినట్టు లమ్మానినీమణియధరసుధాపానంబున నిప్పరితాపంబు నడంతుఁగాక యని మనంబున నిశ్చయించి మదనోన్మాదంబునఁ జరించుచుండె. 123

చ. అది యొకలీల గాక నిఖిలాగమవేద్యుఁడు దేవదేవుఁ డు
న్మదబహిరంతరింద్రియసమస్తవికారవిదూరుఁ డార్తదుః
ఖదళనశీలుఁ డాశ్రితసుఖప్రదభాసురమూర్తి యాతనిం
గదియునె ప్రాకృతుంబలె వికార మఖండసుఖాత్ముఁ డౌటచేన్. 124

వ. అది యట్లుండె వినుము. 125

చ. మదనునకు న్జయం బొసఁగ • మానసపద్మమునందు నిల్పి తాఁ
దిద్రిదశనుతుండు శంభుఁడు గి•రిప్రవరాత్మజయందు గట్టిగా
హృదయము నిల్పినప్పుడ త•దీహితరీతి నిజాంతరంగ మా
త్మదయితునందుఁ జేర్చెఁ గుసు•మప్రపదరుం దయచేసి గౌరియుఁ౯. 126

వ. అంత నమ్మదనుండు 127

క. గంగాధరుచిత్తమ్ముఁ గ,రంగించి జయంబు గాంచి • ప్రమదంబున ను
ప్పొంగుచు నచ్చటఁ గదలెఁ గు,రంగేక్షణ నగజమదిఁ గ•రంగించుటకు౯. 128

ఆ. కదలి చని గిరీంద్ర•సదనంబునందు ని,తాంతనిష్ఠతోడఁ దనయభీష్ట
మొందుకొఱకు నాత్మ•మందిరదైవతోఁ,పాస్తి చేయుగట్టు•పట్టిఁ గాంచె. 129

వ. కాంచి మహారాజ్ఞీప్రదత్తమహనీయాజ్ఞాకరణధురీణుం డగుకుసుమబాణుండు. 130

మ.కడునిశ్శంకమనస్కుఁడై చుమ సుమనః•కాండాసనం బూని య
ప్పుడఁటి౯ దీవ్రతరప్రసూనశరసం•పాతంబుల న్నొంపఁ జే
డ్పడి పుష్పాధికసౌకుమార్యవతి యా•ట౯ భూమిభృత్పుత్రి యా
మృదురూపంబునఁ జిత్తము న్నిలిపి యు•ద్రిక్తాంగజోన్మాదత౯. 131

సీ. విలసత్కపోలముల్ • విరహపాండిమ గ్రమ్మి, కపురంపుఁబలుకుల•కరణి వెలయ
వేఁడినిట్టూర్పుల • వేఁగుచుఁ గెమ్మోవి,చిగురాకు నీరస•స్థితి భజింప
నంగవల్లిక దుర్భ•రాంగజాగ్నిజ్వాల, వడదాఁకి బడలిక • వాడునూప
శ్రమజలసిక్తాన•నము హిమాంబునిషిక్త,వారిజాతముభంగి • వన్నె దఱుఁగఁ

గీ, జెలులతోఁబల్కనొక చోట•నిలిచియుండఁ,బవ్వళింపఁగమధురాన్న•పానములుగ్రి
హింప నిదురింప ధృతి లేక•యిందుధరుని,సుందరాకారమునని ల్పి•డెందమపుడు.

వ. ఇవ్విధంబున నమ్మందగమన కందర్పబాణవేదన సహింప నోపక తనలో ని ట్లని
తలంచె. 133

సీ. హిత ముపదేశింప • మతిఁ గోరి మాతండ్రి,పాలికి నారదుం • డేల వచ్చె
వచ్చెఁ గాకేమి మ•ద్వైవాహికప్రసంగ,ఁ బేల చేసె నీ•హ్మాధరుండు
చేయుఁగాకేబాల •శీతాంశుధరున కర్ధాంగ మౌ నని యెందు • కతఁడు నొడివె
నొడివెఁగాకీతఁ డ•ప్పుడ యేల నను సదా,శివునకు శుశ్రూష •సేయఁ బనిచెఁ

గీ, బనుచుఁగాకేలమదనుఁడా•భవ్యచరితు, గెలుతుఁగాకనితనమదిఁ•దలఁచెదలఁచు
గాక యతనిపై శివుఁ డేల • డాక నలిగె, నలుగుఁగాక న స్స్రపసేయ •కరుగ నేల.

క. ఇదియంతయు విధి చేసిన,యది మదిలోఁ దలఁపఁగా ద•యాంబుధి గాఁడో
మదభీష్టము నెఱుఁగండో, సదవనశీలుండు గాఁడొ • చర్చింపఁ దగు౯. 135

క. మదభీష్టము సాధింపఁగ, మదిఁ దలఁచి శివుఁ ద్రిలోక•మాన్యుఁ గొలిచియున్
దదనుగ్రహంబు వడయుమి, నెదవె న్లాఘవము దైవ•యోగమువలనన్. 136

ఉ. అన్నిదినంబు లాఘనుని•యాదరముం బడయంగఁ గోరియున్
సన్నియమంబుతోఁ బనులు • సల్పుచు భక్తియుఁ బ్రేమయుం దగన్
గన్నులసన్నవర్తిలియుఁ • గాంచనభూధరచాపుమన్ననన్
గ్రన్ననఁ గాంచ లేనయితిఁ • గ్రమ్మఱ నిం కిట నేమిసేయుదున్. 137

చ. పతి యనురక్తుఁ డైన సతి•ప్రాయముఁ జక్కఁదనంబు సద్గుణో
న్నతియు విలాసమున్ సరస•నవ్యమృదుప్రియసత్యవాక్ప్రవ
త్కృతియు సమస్తభంగులను • గీర్తివహించు సదా ప్రియానుకూ
లతఁ గనలేనిభామిని సు•లక్షణ యయ్యుఁ బ్రసిద్ధి గాంచునే. 138

గీ. త్రిభువనాతిసౌందర్య•దివ్యమహిముఁ, డైనయఖిలేశ్వరునిఁ గరు•ణాలవాలు
శర్వునిఁ బ్రసన్నుఁగా జేయఁ•జాలనైతి, నాదులావణ్య మెట్లు వ•ర్ణనకు నెక్కు.

మ. విరితూపు ల్నిగిడించి నాదుమది యా•విశ్వేశురూపంబుపై
మరగం జేసినపంచబాణుఁ డిపుడ•స్మద్రూపసౌందర్యవై
ఖరిపై నమ్మహితానుభావునిమనః•కంజాతము న్నిల్పఁగా
వెరవేదె న్మనుమోసపోవుటను యా•విర్భూతసంతాపుఁడై. 140

క. ప్రబలు లగువారిదెసఁ జన, రబలు లయినవారిఁ జేరి • యలయింతురు తా
ము బలాఢ్యు లయ్యు నట్టుల, యబలుల గెల్వంగ వలఁతి • యబ్జాస్త్రుఁ డిలన్.

శా. నాయుల్లంబు గరంగఁ జేసినటు లా•నాళీకబాణుండు సో
పాయుండై శితికంఠుచిత్తముఁ గరం•పన్ శక్తి లేకున్నఁ గా
కాయుత్కృష్టచరిత్రుమానసము ప్రే•మాయత్త మానేని ని
ట్లాయాసంబు వహింతునే మునివరుం • డన్నంతయుం దప్పునే. 142

సీ. కరుణామృతంబు సా•కార మైనట్టులు, నియమంబు మూర్తమై • నిలిచినట్లు
శాంతంబు దా మూర్తి•మంత మాపోలిక, నైశ్వర్య మాకృతి • నందినట్లు
శృంగార మవయవ•జృంభితం బగు తీవ, ధైర్యంబు సాంగమై • తనరినట్లు
చాతుర్య మక్షిగో•చర మైనవైఖరి, జ్ఞానంబు రూపంబుఁ • గాంచినట్లు
గీ. తనువు నొందినగాంభీర్య • మనఁగ దేహి
యైనవిక్రమ-మన విగ్ర•హంబు నొందు
నయ-మనఁగఁ జెన్నుమిగులుచు•న్ప్రాణనాథు
మ్మృడునిఁ గనుఁగొన కీతను•వెట్లు నిల్చు. 143

సీ. ఆమహాత్మునం దుత్త♦మాంగంబుపైఁ దాల్పఁ,గా మనున్నది తొల్లి ♦ యేమి నోఁచె
నయ్యుఖలేశున ♦ కవతంసమై యుండ, శశిరేఖ యేనిష్ఠ ♦ సలిపెఁ దొలుత
నామహేశుశిఖావి♦హారతఁ గనఁగ ముక్త, తప మేమి సలిపె ధూ♦ర్తప్రసూన
మాపరాత్పరునిక♦ంఠాభరణముగ ము, న్నేవాసి మెలఁగె మ♦హావిషంబు
గీ. పూర్వభవమునఁ ♦ దా మేమి♦పుణ్య మాచ,రించెఁ బున్కలచేఁ గలి♦గించు పేరు
లాదయాంభోధివక్షస్థ♦లాంతరమున, ననఁగి పెనఁగఁగ నిది కడు ♦ నద్భుతంబు.
ఉ. సంకుమదోపమానశుభ♦సౌరభదివ్యజటాకలాపముల్
గుంకుమరేఖపోల్కిఁ దగు♦కోమలఫాలకృశానునేత్రముల్
రాంకవలీల రమ్య మగు♦రాజితపంచనఖాజినంబు మైఁ
బొంకము గాఁగ నొప్పుఫణి♦భూషణు నెప్పుడు చూతుఁ గన్నులన్. 145
సీ. హారపటీరక♦ర్పూరతారాధీశ,హీరాభరుచిమహా♦దారదేహు
నీలకంధరహారి♦నీలనీలాంభోజ,జాలప్రభాళివి♦శాలకంఠు
బృందారకార్చిత♦మందారకనకార,విందాఘపాదార♦విందయుగళు
గంగాతరంగాతి♦శృంగారరంగత్క,రంగాంకరుచిరోత్త♦మాంగలలితు
గీ. మానిజనభాగధేయంబు ♦ దీనకల్ప,తరువు నాశ్రితహృద్రోగ♦దావదహన
వార్షికాబ్దంబు మత్తపః♦ఫలము నెపుడు, గాంతునో నాదుకన్నుల♦కఱవు దీఱ.
వ. అని యంతకంతకుఁ బ్రవృద్ధంబై యింతింత యనరాక దురంతంబైనలతాంత
కుంతసంతాపంబునం జిక్కి యన్నెలంత వంతతో నున్నంతఁ జెంతనుండి తదు
దంతంబు గొంతకొంత యెఱింగినవా రౌటఁ జింతనొంది యాసుదంతీతిలకంబుఁ
జేరి మచ్చిక హెచ్చ నెచ్చెలు లి ట్లనిరి. 147
సీ. ఓయమ్మ నీయభి♦ప్రాయంబు మాతోడ, నించుకైనను విని♦పించ కిట్లు
నీయంతనీవు చిం♦తాయత్తహృదయవై, యతికోమలంబైన♦యంగవల్లి
గాఢసంతాపమ్మఁ ♦ గంది కుందుచు నుండఁ, గారణం బేమి మా♦కంటె నీకు
నెనరు గల్గినవారు ♦ వనజాక్షి వేఱొక, రున్నారె వెదకిన ♦ విన్నఁదనము
గీ. గదిరి నీముఖపద్మంబు ♦ గాంతిఁ దొఱఁగె, నవశిరీషప్రసూనమా♦ర్దవము లైన
నీదుకరచరణాబ్జముల్ ♦ నెరయ నలఁతఁ, జెంది తడబడుచున్నవి ♦ కుందరదన.
క. స్వాంతముననుండి వెడలెడు,సంతాపానలశిఖాళి♦చందంబున దు
ర్దాంతత నిట్టూర్పు వెడలి, తాంతముఁ గావించె నీయ♦ధరపల్లవముల్. 149
గీ. దర్పణంబులకంటె నం♦దంబులైన,నీకపోలంబులందుఁ బాం♦డిమము గదిరి
పొలఁది లవలీదళంబుల♦చెలువుఁ దెగడె, నింక నైనను నీతలం♦పెఱుఁగఁ జెపుమ.

గీ. ఇష్టవస్తులాభంబున ♦ కీవు చింత, సేయుచుండుట నీముఖ ♦ మాయతాశ్రు
జాలమునఁ దోఁగి నీహార ♦ సాంద్ర మైన, పద్మినివిధాన దీపించెఁ ♦ బద్మనయన.
క. నీపాదసేవ సలుపుచు, నేపట్టున నిన్నె కాని ♦ యెఱుఁగని మాతో
నీపరితాపముఁ దెలుపక, యోపఁగ లేనట్టిబాధ ♦ నొందకుము మదిన్. 152
గీ. అంగనామణి నీయంత ♦ రంగమునను, వరుస నెంతయుఁ గూర్చిన ♦ వార మనుచు
నమ్మియున్నట్టిమమ్ము నో ♦ యమ్మ యిపుడు, నీవు పెరవారిగాఁ జూడ ♦ నీకుఁ దగునె.
క. కాంతామణి నీవాంఛిత, మింత దెలిసియున్న దాని ♦ నీడేర్చుటకై
యెంతయు యత్నము సేయమె, చింతింపక నీతలంపుఁ ♦ జెప్పుము మాకున్.
గీ. నీవు దెలుపకమున్న స్వ ♦ భావమునన, నీతలఁపు గొంత కొంత ప్ర ♦ తీత మయ్యె
మున్ను నీసేవఁ గొన్న యా ♦ పన్నశరణు, శివునిఁ గాంక్షించుచున్నావు ♦ చెలియ యిపుడు.
క. అని చెలులు పలుక హిమగిరి, తనయ కలఁకచే నొకింత ♦ దడ వుండి మదిన్
ననుసిగ్గు దొలఁకఁగా ని, ట్లనియె రహస్యముగ వారి ♦ కాదర మెసఁగన్. 156
గీ. ఇంతకాలంబు మీరు న ♦ న్నిప్పు డడిగి, నట్టు లడుగమిఁ దెలుపలే ♦ నైతిఁ గాక
మీకుఁ దెలుపఁగరానిది ♦ నాకు నెద్ది, యైనఁ గలుగునె ప్రాణస ♦ మానులార.
గీ. నేను వాక్రువ్వకున్న మీ మానసమున, కెఱుక రాకున్నయదియె మ ♦ దీప్సితంబు
సారమతులార నాచేత ♦ మీరు వినఁగ, వేడ్కఁ గలదేని దెలిపెద ♦ వినుఁడు తెలియ.
సీ. శ్రీమహాదేవు నా ♦ శ్రితపారిజాతంబు, నాతపఃఫలముచం ♦ దమునఁ బఱసి
బహుకాల మద్దేవు ♦ పాదపద్మంబులు, సేవించియు నభీష్ట ♦ సిద్ధి గనక
కడు లాఘవము నొందఁ ♦ గాంచుట నిప్పుడు, కమలాక్షులార యీ ♦ కష్ట మొందె
సర్వేశ్వరుండు ప్ర ♦ సన్నుఁ డయ్యెడువిధం, బెఱుఁగుదు రేని నా ♦ కెఱుఁగఁ జెప్పఁ
గీ. డట్ల యొనరించి యాకరు ♦ ణాంబురాశి
దయకుఁ బాత్రంబ నగుదుఁ ద ♦ థ్యంబు గాఁగ
నామహోన్నతుఁ జూడని ♦ యట్టినిమిష
ములు యుగములట్లు తోఁచె నో ♦ లలనలార. 159
గీ. డాఁచ నేటికి నాయభీ ♦ ష్టంబు మీకు
నెఱుఁగఁ జెప్పెద దృఢముగాఁ ♦ దెఱవలార
తనువుఁ బ్రాణంబు నతనిసొ ♦ మ్మని తలఁచితి
నవ్విభుని నన్నుఁ గూర్పుఁ డు ♦ పాయ మరసి. 160
గీ. తరుణశశిమౌళికరుణాసు ♦ ధారసార్ద్ర, సాదరకటాక్షజాలముల్ ♦ నాదుమేనఁ
గలయఁ బ్రసరించినపుడ యీ ♦ యలరువిల్తు, తాప మెల్లను దీఱుఁ ద ♦ థ్యంబుగాఁగ.

చ. అని తనవాంఛితంబు తెఱఁ♦గంతయు నన్నలినాయతాక్షి దె
ల్పిన విని వారు డెందమునఁ♦ బేర్చినచింత నగాత్మజాతకుఁ
వనరుహబాణవేదనని♦వారణ మొందఁగఁ గోరి చాల నే
ర్పున శిశిరోపచారములు♦ పూని యొనర్చి రనేకభంగులన్. 162

వ. అంత. 163

సీ. ఆలీసహస్రకృ♦తానేకశిశిరోప,చారశతంబుల♦ శైలరాజ
పుత్రిమనంబునఁ♦ బొడమినమన్మథ,వేదన యడఁగక♦ వృద్ధి నొంద
నప్పరమేశ్వరి♦ యత్యంతహృద్యమై, స్మరకోటిలావణ్య♦సదన మగుచు
నఖిలయోగిధ్యేయ♦ మైనసదాశివు,మూర్తి మనఃపద్మ♦మునను నిల్పి

గీ, యతని నాపాదమస్తకం♦ బాసతోడఁ, గనుఁగొనుచు సంతసిల్లుచు♦వినయమధుర
సరససంభాషణంబులు♦ సలుపుచు నతి, గూఢవర్తనమున నుండెఁ♦గూర్మి వెలయ.

వ, ఇత్తెఱంగున. 165

సీ. గిరిజాత యయ్యవ♦సరమునఁ బూర్వదృ,ష్టం బైనశివునిరూ♦పంబుఁ దలఁచి
యంతటనుండి మ♦హాదేవుఁ డెన్నండు, తనుఁ బెండ్లియాడునో♦ యనుచు నతని
సౌందర్య మెన్నుచు♦ స్వస్థత నిదురింప, కలరుఁ గైదువజోదు♦వలకుఁ జిక్కి
యమృతకల్పంబు లౌ♦నాహారములమీఁద, నరుచి జనింపంగ♦ నాత్మసఖులఁ

గీ, దనయభీష్టంబుసాధింపుఁ డనుచుఁ బ్రార్థ,నంబుసల్పుచు విరహోష్మ♦నలఁగిబయలు
గౌఁగిలించుచు సొలయుచు♦ఁ దామ్రధరేంద్ర,తనయ యిట్టులేకాదశ♦దశల నెనసె.

వ. అప్పుడు. 167

చ. తమశిశిరోపచారములఁ♦ దామరసాక్షికిఁ బుష్పబాణతా
ప మధిక మౌటఁ గాంచి మది♦ వందురి యమ్మహనీయవృత్తమున్
హిమగిరినాథుతోఁ దెలుప♦ నిచ్చఁ దలంచి సఖీమణుల్ ససం
భ్రమముగ నేగి యేకతమ♦ భామినిచర్య లెఱుంగఁ జెప్పినన్. 168

మ. మదిలోఁ దాపమునొంది పుత్రికడక♦మ్మాన్యుండు వే వచ్చి యా
మదిరాక్షీమణిదేహకార్శ్యము మనో♦మాంద్యంబు శర్వానురా
గదయావీక్షణభాషల న్దెలిసి య♦క్కంజాస్యతో ని ట్లనున్
హృదయగ్లాని దొరంగు నీ దగుమనో♦భీష్టంబు చేకూరెడున్. 169

శా. తల్లీ నీమదిలోఁ దలంచినమహా♦తాత్పర్య మిన్నాళ్లకుం
దెల్లం బయ్యె మదీయచిత్తమున క♦ద్దేవుండు నీకోర్కి యు

తుల్లాసంబున సంఘటింపఁగలఁ డీ ♦ వృద్ధ్వన్మనోజార్తిచే
నల్లాఁ బంతయుఁ గంద వందఁ బని యే ♦ ముత్ఫుల్లపద్మేక్షణా. 170

క. భవదుపచారంబుల దుర్భవభయసంహారి యైన♦భవదేవుఁడు ప్రా
భవపూర్ణుఁడు విజితమనో,భవుఁ డెంతయుఁ దుష్టుఁ డయ్యె ♦ బాలిక తోలుతన్.

ఉ. కావున భక్తవత్సలుఁడు ♦ కాంచనశైలశరాసనుండు స
ద్భావ మెలర్పఁగా నతిము♦దంబున నిన్ను వివాహమౌ నిజం
బావనజాతసంభవుని♦యాత్మజుమాట యసత్య మౌనె రా
జీవదళాక్షి యూఱడుము ♦ చిత్తమునన్ దృఢనిశ్చయంబుతోన్. 172

గీ. తనయ నీ వేమి చెప్పిన ♦ దాని నేను, పూని కావింతు శంకరు♦నాన యిపుడు
సందియము లేదు నీమన♦స్సరసిజమునఁ, దలఁచినతలంపుఁ దెలుపఁగా♦వలయు వేగ.

క. అని జనకుం డడిగిన న,వ్వనరుహదళనేత్రి శైల♦వర్యునితో ని
ట్లనియె సదాశివురూపం,బున నామానసము నిలిచె ♦ భూధరతిలకా. 174

సీ. ఆమహాత్ముఁడు నిజో♦ద్యత్తపోనియమభం,గం బయ్యె ననుచు నం♦గజునిఁ గినిసి
యయ్యాశ్రమము వీడి ♦ యాశ్రమాంతరమున,కరుగుట కాని నా♦యందు మున్ను
గలుగువాత్సల్యంబు ♦ వెలితి చేసినవాఁడు, గాఁడు నన్నిటమీఁదఁ♦గావఁ గలఁడు
గావున నెప్పుడో ♦ నావాంఛితము దన,దివ్యచిత్తంబునఁ ♦ దెలిసి వేగ

ఆ. నాదరించు నన్ను ♦ నఖిలేశ్వరుం డది, యట్టు లుండె నిప్పు ♦ డతనిఁ గుఱిచి
తపము సలుపవలయుఁ ♦ దడయక సెలవు నా, కిమ్ము ధారుణీధ♦రేంద్ర నీవు.

గీ. అనిన విని యత్తుషారశై♦లాధినేత, దనమనంబున కమ్మాట ♦ తద్దయు నవి
సహ్య మైనను నిజతనూ♦జాతమహిమ, యమ్మహాదేవిదృఢనిశ్చ♦యమ్ము తెలిఁగు.

క. ఎఱుఁగున్ గావున ధైర్యము, వఱలఁగ నద్దేవిపూన్కి ♦ వారింపక నీ
యుఱునట్ల చేయు మని యే,ర్పఱ ననుమతి యొసఁగెఁ దనదు♦దేవియుఁ దానున్.

వ. ఒసఁగి కూఁతుం గౌఁగిలించుకొని పరమాదరంబు మెఱయఁ బ్రియంబున ని
ట్లనిరి. 178

గీ. పరమకల్యాణి నీవు దు♦ష్కరతపంబు
వలన శంకరు ననురాగ♦వంతుఁ జేసి
యమ్మహాత్మునిదయకుఁ బా♦త్రమ్మ వగుము
మాకు నిది సమ్మతంబు ము♦మ్మాటికైన. 179

వ. అని తమతనూజాత యైనగౌరీదేవితపఃక్లేశంబునకు సహించనివార లయ్యును
మేనకాహిమవంతులు తదీయనిశ్చయం బనివార్యం బని ధైర్యంబున ననుజ్ఞ

యొసంగిన నద్దేవి పితృచరణంబులకు నమస్కరించి వారిచేత దీవనలు గొని జయ
విజయాఖ్యం బైనసఖీద్వయంబు దనతో నరుగుదేర నాహిమవచ్ఛిఖరంబులలోన
గౌరీశిఖరనామంబునం బ్రఖ్యాతం బైనయొక్కశిఖరంబునకుం జని యం దనుప
మనియమంబున నచ్చటిమునులకుం బరమాద్భుతంబుగాం బరమేశ్వరుండు దనకుం
బతి గావలయు నని మనంబునం దలంచి. 180

క. పంచాగ్నిమధ్యమున నప్పంచాననమధ్య ఘనతపం బొనరించెన్
బంచముఖదేవుం దలంచుచు, మించినవేసవితఱిన్ సమిద్ధనియతితోన్. 181

వ. తదనంతరంబ. 182

క. ప్రావృట్కాలంబున నాప్రావృడ్ఘననీలకచ తపం బొనరించెన్
బ్రావృడ్జలధరకంధరు, భావంబున నిల్పి బట్టబయల దృఢమతిన్. 183

వ. మఱియును. 184

క. శిశిరర్తుసమయముల నాశిశిరనగతనూజ తపము చేసె న్మదిలోఁ
బశుపతిని వరింప నహర్నిశముం గంఠప్రమాణనీరములోనన్. 185

వ. అమ్మహాదేవిశరీరాతిసౌకుమార్యంబును నవార్యధైర్యస్థైర్యంబులును నితరదుష్కర
మహాతపఃక్లేశసహిష్ణుతయుం గాంచి సమస్తబృందారకమహామునిసందోహంబు
లద్భుతానందంబులతో సంస్తుతించుచుండె నట్టియెడ. 186

ఉ. ఆయగకన్య తన్ను హృదయంబున నిల్పి సమగ్రనిష్ఠతోఁ
జేయుమహాతపంబునకుఁ జిత్తము హర్షతరంగితంబు గా
నాయహిభూషణుం డతిదయానిధి గావున నత్తపోనిధిన్
డాయఁగ వచ్చెఁ దన్మతిదృఢత్వ మెఱుంగఁగ బ్రహ్మచారి యై. 187

వ. ఇత్తెఱంగున జగత్త్రయసౌందర్యంబు మూర్తీభవించి కనుపట్టినట్లు సకలధర్మ
సముదాయం బేకీభవించి పొడచూపినట్లు వినయాదిసుగుణసందోహంబు దేహం
బు ధరియించి యెదుట నిల్చినట్లు సమస్తవిద్యాకలాపంబు రూపంబు వహించి
గోచరించినట్టు లఖిలతేజస్వితేజస్సముదయంబులు గాత్రసంపన్నం బై నేత్రంబు
లకు సన్నిధిచేసినట్లు బహుకాలసంచితనిజతపఃఫలం బైనశ్రీమహాదేవుండు బ్ర
హ్మచారివేషంబున భావిగార్హస్థ్యోచితంబుగా సాక్షాత్కరించిన సవినయసంభ్ర
మంబుగాఁ బ్రత్యుత్థానంబు చేసి ప్రణామపూర్వకంబు లైనయాసనార్ఘ్యపాద్యాది
వివిధోపచారంబుల నత్యంతసంతుష్టునిఁ జేసిన నమ్మాయావటుండు కుశలప్రశ్న
పూర్వకంబుగా నద్దేవిదేహసౌకుమార్యంబును దదనుచితం బైనతదీయతపశ్చ
ర్యాక్లేశంబునుం బలుమాఱు నుగ్గడించి యానెలంత శాంతిదాంతులు పూని

యింతయలంత నొంద నేల నీమనోరథంబు వినవలయుఁ దెలుపఁ దగునేని దాఁ
పక తెలుపు మనిన నమ్మంజుభాష నిజాభిలాషం బున్నరూపున నెఱింగింపు మని
వయస్యాతిలకంబునకు నయనసంజ్ఞ నాజ్ఞయిచ్చిన నబ్బాలిక యీశైలకన్యక
కాలకంధరు వరింపం గోరి యీరీతి సమగ్రస్థైర్యంబున నుగ్రతపంబు సేయుచు
న్న దని నిజంబ విన్నవించిన నాకపటబ్రహ్మచారి పకపక నవ్వి యోహో చాలుఁ
జాలు మేలు మేలు! బాలా యీలీల బేలవై యేల యింతజాలిం బడియెద విది
యెంతవింత యింతయైన గుణదోషచింత లేక యీదోషాకరశేఖరుఁ బెండ్లియాడ
గోరెద వతనికులగోత్రంబులు శ్లాఘనీయంబులుగా విచారించి కాంక్షించితో
జగంబున నెవ్వారలు తత్కులగోత్రంబు లెఱుంగరు? కలిమి విచారించి వాంఛ
చేసితో యాతం డాదిభిక్షుం డగుట నీవును నెఱుంగుదువు బలిమి విచారించి
యిచ్ఛయించితో భస్మాసురుండు వెంట నంటి తఱుమ నతండు పలాయనంబు
నొందుట లోకప్రసిద్ధంబు ధార్మికత్వంబు విచారించి యపేక్షించితో యాధూ
ర్తావతంసుండు నిర్వహించినఘనకార్యం బతండు చేతులఁ దాల్చినకపాలపాత్రయు
ఖట్వాంగంబు నిప్పటికిఁ దెలుపుచున్నవి భూషణసారస్యంబు విచారించి యభిల
షించితివో భూత్కారఘోరంబు లైనయాశీవిషవారంబు లతనిశరీరంబునఁ గర్ణ
పూరకేయూరహారాదులై సింగారంబున నలంకరించుచున్నవి సహాయసౌష్ఠ
వంబు విచారించి సంతోషించితో యెప్పుడు నతం డసంఖ్యాతభూతవ్రాతసమే
తుండై యుండు శివశంకరాదితదీయసౌమ్యనామంబులు విచారించి యనుష్ఠిం
చితో యందుల కేమి భీమోగ్రాదినామంబు లతనికి రూఢంబు లైనవి యార్జ
వంబు విచారించి తత్సాంగత్యం బంగీకరించితో యతనిపలుకులఁ దేనియయుఁ
గుత్సిత విషంబుఁ గలిగియుండు నతనివిహారస్థానయోగ్యతయు నంగరాగరమణీ
యతయు విచారించి సమ్మతించితో భూమిజను లెద్దాని నమంగళం బని ప్రసం
గింతు రట్టిపితృవనంబునఁ గ్రీడింపుచుఁ దచ్చితాభస్మంబు మేన నంతట ననూనం
బుగాఁ బూయుచుండు నింక నొక్కవిశేషంబు కలదు వినుము తన కున్నచిన్న
తనం బెల్లవారికిఁ దెల్లం బైనదియ యేమి సెప్పుదు నతం డిప్పటికి మొలకు
వలువ గట్టికొనండు సదారుధిరార్ద్రంబు లైనసామజశార్దూలచర్మంబు లతనికి వల
సినప్పుడు పరిధానప్రావరణంబులు లోకంబున సాంసారికులకు నొక్కవృష
భంబు భవనంబున నుండరా దని పెద్దలు పలుకుదురు తనయింట నెన్నఁటికి
నొక్కవృద్ధోక్షంబె యున్నది గాని రెండవయది లేదు దాని నెక్కి యిచ్చవచ్చి
నచోటికి వచ్చుచుఁ బోవు చుండు నొక్కగహస్యంబు గలదు నీకు దాఁపనేల

చెప్పెద సుప్రసిద్ధం బైనదారిద్ర్యాతస్కరాధిపత్యంబులకుం దోడఁ నటవిటగాయకవిద్యలు నతనికి సమ్యగంబుగాఁ బరిచితంబు లని పెక్కుచోట్ల విన్నవాఁడ నిమ్మాట నీమనంబున నే యుంచుము నీవు శిరీషపుష్పసుకుమారశరీర వతికోమలహృదయ వనేకసుగుణమణిగణశేవధి విట్టినీకు నాస్థాణునకు నెవ్విధంబున సాంగత్యంబు పొసంగు నిటువంటియనుచితం బైనకోరిక గోరఁదగునే యని మఱియు ని ట్లనియె. 188

మ. అలరుంబోఁడిరో యింక నైనను లలాటాక్షు న్వివాహంబు గాఁ
దలఁపుల్ జేయక రూపము న్విభవముల్ దాక్షిణ్యముం దేజముల్
బలముల్ ప్రాయము నాభిజాత్యముఁ గళాప్రాగల్భ్యముం గల్గు స
న్నలఘుప్రౌఢి వరింపరాదె తగనే యజ్ఞాక్షి నీ కిన్నిటన్. 189

వ. అని సాభిప్రాయంబుగాఁ బలికిన నావర్ణిశిఖామణివాక్యంబులు విని యావరవర్ణిని మహాపురుషనిందావాక్యశ్రవణంబున విస్మయజుగుప్సాభయంబులు మనంబున ముప్పిరిగొనఁ గరాంబుజయుగంబునఁ గర్ణద్వయంబు గప్పి యోహో చాలుఁ జాలు నింతయతిసాహసవాచాలత్వంబు దగునె నీవు బ్రాహ్మణుండవు గావున నింతవట్టు సైరించితి నింక నిటువంటిమాట లాడితేనిఁ జాల నొప్పమి వచ్చు నని మఱియు ని ట్లనియె. 190

క. లోకజనసమానునిఁగా, శ్రీకంఠునిఁ దలఁచి నింద సేయఁగఁ దగునే
యాకరణిఁ దన్మహిమ భాషాకాంతున కైనఁ దెలియ శక్యమె విప్రా. 191

చ. అతనికృపాకటాక్షలవ మంది కదా విధివాసవాదిక
క్రతుభుజు లెల్లఁ దత్తదధికారము లందిరి భూసుపర్వ త
ద్వితతమహత్త్వముం దెలిసి వేదము లైనను సన్నుతింప లే
వితరులు దక్షులే తలఁప కిట్లు భవాదృశు లాడఁగూడునే. 192

సీ. ఆమహాత్ముఁడు దన్ను ననిశంబు భక్తితో, సేవించుఘనుల రక్షించు టెంత
సద్భక్తితో నైన సాధ్వసంబున నైన, నవశత నైన హాస్యమున కైనఁ
దనపేరు నొడివినంతన కిరాతుల నైన, శబరుల నైనను జడుల నైనఁ
గితవుల నైనను పతితుల నైనను, శ్వపచుల నైనఁ బావనులఁ జేయు

గీ. పరమపావనమూర్తి యాభవ్యకీర్తి
యతనిపనులును వేషంబు నాహ్వయములు
నార్యసంస్తుత్యములు మహిమాస్పదములు
వానియాథార్థ్య మెఱుఁగ నీవశమె విప్ర. 193

క. భూసురవేషివి నిక్కపు, భూసురుఁడవు గావు నీవు ♦ భూసురుఁ డైనన్
వేసర కిటు దూషించునె, యీసర్వేశ్వరు మహేశు ♦ నతిసాహసుఁడై. 194

వ. అని పలికి వెడవెడ నలుక వొడమిన నడంచుకొని సఖీతిలకంబునుం గనుంగొని.

క. చెలి యీబ్రాహ్మణు నిచ్చట, నిలువక గెంటింపు మింక ♦ నిలిచినఁ బలుకున్
జులుకని పలుకులు ధూర్తజ, నులసహవాసంబు మాని ♦ నుల కర్హంబే. 196

గీ. పిన్న వైనను బుద్ధిచేఁ ♦ బెద్ద యనుచు, నెఱుఁగ కిటువచ్చితిమిగాక ♦ యితనిచర్య
యిట్టి దగునేని మన కేల ♦ యిచట నిల్వ, ననుచు దిగ్గున లేవంగ ♦ నల్ల నగుచు.

ఆ. నాతి నీతపంబు♦నం గొనివైచిన, దాసు నెపుడు నీదు♦తలఁపులోన
మెలఁగుచున్నవాని నలిగి ♦ యీవిధమునఁ, బరుషభాషణములు ♦ పలుకఁ దగునె.

క. వెఱవాఁడఁ గాను చెలి న, న్నెఱుఁగవె నీవాఁడఁ జూడు ♦ మిప్పు డనుచు నా
కఱకంఠుఁడు నిజరూపము, తెఱవకుఁ గాన్పించి పట్టె ♦ దేవీకరమున్. 199

చ. అపుడు భయంబు లజ్జయును ♦ హర్షము నాత్మఁ బెనంగొనంగ నా
చపలవిలోచనామణి స♦సంభ్రమయై యెటుపోవ నిల్వఁగా
నిపుణత లేక కంపమున ♦ నివ్వెరపాటును గల్గి యాపురా
ణపురుషుఁ జూడ నోడి వద♦నం బటు వాంచి మొగిడ్చెఁ జేతులన్. 200

వ. అపుడు. 201

క. కరుణాకరుఁ డగుశంభుఁడు, తరుణీమణి బుజ్జగించి ♦ తడయక నిన్నున్
బరమోత్సవములతోడన్, బరిణయమయ్యెద నిజంబు ♦ పద్మదళాక్షీ. 202

గీ. ఇన్నిదినములు ననుఁగూర్చి ♦ యివ్విధమునఁ, బరమదుష్కరతపమున ♦ బడలుచున్న
నిన్నుపేక్షించినట్టినా♦నేర మిపుడు, సైఁచి మొగమెత్తి దయఁజూడు ♦ చంద్రవదన.

సీ. నీబెళుకుఁజూపులు ♦ నేర్చిన దని కురం,గంబుఁ దాల్చితిఁ గదా ♦ కంబుకంఠి
నీయూరుకీర్తి నె♦న్నికఁ గాంచె నని భుజం,గముఁ దాల్చితిఁ గదా ♦ కమలగంధి
నీనెన్నుదురుసాటి ♦ జానొందె నని యర్ధ,చంద్రుఁ దాల్చితిఁ గదా ♦ చంద్రవదన
నీమందహాసకాం♦తిఁ బోసంగె నని గాంగ,ఝరముఁ దాల్చితిఁ గదా ♦ జలదవేణి

గీ, యిట్లు నామది నీరూప ♦ మెనసియుండ, నేను నినుఁ జూడ నిట వచ్చు ♦ టెంతవింత
నాఁటినీసేవ మఱవంగ ♦ నావశంబె, కల్పకోటుల కైన నో♦కలువకంటి. 204

గీ. ముదిత నాలోచనచకోర♦ములకు నీదు, వదనరాకాశశాంకుని♦వలనఁ బొడము
మందహాసచంద్రికల న♦మందలీలఁ, దృష్టి గావింప కిటు మోము ♦ ద్రిప్పఁ దగునె.

సీ. నేరంబు దలఁచి దం♦డించెదవేని లో♦లాక్షి నీ కొకసమ♦యంబు రాదె
యప్పుడ మదనభూ♦తావేశ ముడుగంగఁ, గసిదీఱఁ గీల్జడ ♦ విసరరాదె

తెఱవ సీమదిపగ ♦ దీఱఁ జుఱుక్కున, నునుమోవి మొనపంట ♦ నొక్కరాదె
యలుక దీఱఁగ మోహ♦నాంగి కఠోరవ,క్షోజయుగ్మంబునఁ ♦ గ్రుమ్మరాదె
గీ, కుసుమకోమలి పైపయి ♦ నెసఁగుకసరు, దీఱ బాహాపాశముల బం♦ధించరాదె
పిదప దయచేయరాదె సం♦మ్మదముమీఱఁ, గరుణయెన లేనియధరామృ♦తం బొసఁగి.

క. భవదీయకరగ్రహణో,త్సవమునకుఁ బ్రియత్న మిపుడు ♦ సత్వరముగ నో
ధవళాక్షీ చేసెద నని, యువతీమణి నధికసమ్మ♦దోదధిఁ దేల్చెన్. 207

వ. ఇట్లు శైలరాజనందనం బరమానందకందళితహృదయారవిందం జేసి యచ్చటఁ గదలి
నిజనివాసంబుఁ బ్రవేశించి. 208

పంచచామరము. కృపాతరంగిణీశుఁ డభ్ర♦కేశుఁ డాత్మలోఁ దుపా
రపర్వతాత్మజామణీక♦రగ్రహేచ్ఛ హెచ్చఁగా
నెపంబునం దలంచినంత ♦ నిల్చెఁ దక్షణంబునన్
దపస్విసప్తకంబు సాధ్భు♦తంబుగాఁ బురస్థలిన్. 209

వ. ఇత్తెఱంగునఁ దపోనిష్ఠాగరిష్ఠులైనవసిష్ఠాదిసప్తర్షిశ్రేష్ఠులు తమమీఁదియనుగ్రహాతిశ
యంబున స్మరణమాత్రంబున సన్నిధికి రప్పించినయన్నిలింపవంద్యచరణునిచరణాంబు
జంబులకు సాష్టాంగదండప్రణామంబులు చేసి చేతులు మొగిడ్చి యి ట్లని స్తుతించిరి.

రగడ. జయజయదయారసవి♦శాలనయనాంభోజ,జయజయసదాభక్త♦జనగృహామరభూజ
జయజయ తపోధన♦స్వాంతాంబురుహమిత్ర, జయజయబ్రహ్మాది♦సంస్తుత్యచారిత్ర
జయజయ విచిత్రరా♦జతపర్వతవిహార,జయజయ కిశోరజల♦జాతరిపుకోటీర
జయజయ సమస్తదివి♦షత్పాలనధురీణ,జయజయ వలక్షపు♦ష్కరవిలోచనబాణ
జయజయోత్తాలకాం♦చనమహీధరచాప, జయజయత్రిపురసం♦క్షయకారణాటోప
జయజయశ్రుతిచతు♦ష్టయశతాంగతురంగ, జయజయ దివాకరని♦శాకరశతాంగాంగ
జయజయ తరంగిణీ♦శ్వరభాసురనిషంగ, జయజయ సమస్తభూ♦చక్రదివ్యశతాంగ
జయజయ కరాబ్జవిల♦సద్బాలసారంగ, జయజయ జటాజూట♦సంగతవియద్గంగ
జయజయ పటీరఘన♦సారనిభధవళాంగ, జయజయ విలోచనకృ♦శానుపతితానంగ
జయజయ జగత్త్రయా♦శ్చర్యగరళగ్రసన, జయజయ గజాజినా♦చ్ఛాదనతనూల్లసన
జయజయమృకండుతను♦జాతరక్షణధుర్య, జయజయకృతాంతమద♦సంహారికృతశౌర్య
జయజయాంగీకృతా♦ష్టవిధమూర్తివిలాస,జయజయకృతాన్యదు♦ర్జయషడూర్మినిరాస
జయజయ మహాబిలే♦శయకృతాలంకార, జయజయధారాది♦షట్చక్రసంచార
జయజయామితపద్మ♦జాండభాండాధార, జయజయ విలాసార్థ♦సాంఖ్యయోగవిచార

జయజయాపారసంసారసాగరపోత, జయజయ జగచ్చరిత సత్కీర్తివిఖ్యాత
జయజయాస్మత్ప్రభో జడమానసాన్పాహి, జయజయమహాదేవ సౌఖ్యంసదాదేహి.

వ. అని స్తుతియించి దేవా దేవర దివ్యచిత్తంబున మమ్ముఁ దలంచినప్రయోజనంబు దెలిపి యప్పనికి నాజ్ఞాపింపవలయు నిన్నెపంబున మామీఁదియనుగ్రహంబు ప్రకటంబు చేసితిరి గాక యవాప్తసకలకాము లైనమీ కేమిటఁ గొఱంత భక్తజనమనస్సంతోషణంబె మీకుఁ బ్రయోజనం బట్లగుటఁ గర్తవ్యం బానతియిచ్చి మమ్ముఁ గృతార్థులఁ జేయుం డనిన నమ్మహామునులకు నద్దేవతాసార్వభౌముం డి ట్లనియె.

క. జగదుపకృతికై యెప్పుడు, గగనంబునఁ దిరుగుతరణికరణిం గరుణన్
జగదుపకృతికై మీ రిటు, జగతిం దిరుగుచుండుదు రాదె సన్మతులారా. 213

సీ. అమృతాంశుదర్శనం బఖిలజగంబుల, కానందకర మైనయట్టు లిపుడు
మీదర్శనం బప్రమేయతపశ్శీలు, రార మాకానందకారి యయ్యె
ననితరసాధ్య మైనట్టికార్యం బొక్కఁ, డాలసె దాని ఘటింపవలయు వేగ
గిరిసార్వభౌముఁ డై వరకీర్తి గాంచిన, హిమవంతునొద్దకు నెలమి సరిగి

గీ. మద్ధితార్థంబుగాఁ గొన్నిమాటలాడ, వలయుఁ దత్కార్యపద్ధతిఁ దెలుపువాఁడ
వారిమాటెఱుం గెఱిఁగినవారు మీరు, సావధానంబుగా వినుఁ డాదరమున. 214

వ. ధర్మవిదులారా యనాశ్రమి యై యొకదినం బైనను గడపరా దనుమాట మిము బోఁటిపెద్దలు వలుకుచుందురుగదా యటుగావున భద్రచరిత్ర యగునద్రిరాజపుత్రిం బాణిగ్రహణంబు సేయవలయుఁ దొల్లి వైరాగ్యంబున నేను దపంబు సలుపుసమయంబునఁ దనతండ్రిపంపున నచ్చటికి వచ్చి యమ్మచ్చెకంటి నాయిచ్చకు వచ్చునట్లు బహుకాలం బనేకవిధపరిచర్య చేసినది తదీయశీలంబును శుభలక్షణంబులును నామీఁదిమక్కువయును నాఁడు కొంత యెఱింగినవాఁడఁ బదంపడి క్రించుఁదనంబున మదంబు మించి పూనిక వహించి వంచన గావించి మదిఁ గలంచుటకుఁ బొంచి వచ్చినయించువిల్తునిఁ గోపించిచూచితి నప్పుడు మత్సంరంభంబుఁ జూచి యాచకిత హరిణాక్షి చకితహృదయయై జనకునొద్దకు వచ్చి యచ్చట నుండ నొల్లక తదనుమతి వడసి తదీయశిఖరంబున నుగ్రతపంబు సేయుచున్నది యానార్యవతంసంబు సలుపునవిహార్యజగదాశ్చర్యకరతపశ్చర్యలు గని యార్యవతంసంబు లెల్ల నార్య యని కొనియాడుచున్నవా రదిగావున శమవంతులారా మీరు హిమవంతునిశాంతంబునకుం జని కుశలప్రశ్నపూర్వకంబుగా హైమవతీవైవాహికప్రసంగంబు సుసంగతంబుగాఁ జరిపి తదనుకూలంబుగా మేనకాదేవిసన్నిధి నతనితో సంభాషణంబు గావించి యయ్యిద్దఱకు మనఃపరితోషణం బొనర్చి సత్వరంబుగా శుభకార్యంబు

సంఘటింపుం డని చెప్పి వేగంబ యిచటికి రావలయు మీయంతటిమహానుభావులు చేయంబూనినకార్యంబు సఫలం బౌటకు సందియం బేమి యని యానతిచ్చిన సంతోషితాంతరంగులై యమ్మునిపుంగవు లట్ల కాక యని యచ్చటం గదలి పర్వతసార్వభౌమునిమందిరంబు ప్రవేశించి యుచితప్రకారంబునం దత్సందర్శనంబు నడపి సపరివారుండై యతం డొనర్చునాసనార్ఘ్యపాద్యాదివిశేషార్చనంబుల నత్యంతసమ్మోదంబు నొంది రప్పుడు వసిష్ఠమునిబృందారకుం డందఱియనుజ్ఞం గొని యిందుధరుసందేశంబు దెలుప నుద్యోగించి తొలుత సమయోచితంబుగా నన్యోన్యకుశలప్రశ్నోత్తరంబులు జరపి పిమ్మట నో శైలరాజ భవత్కుమారిక యిపు డెచట నున్నదె మున్ను కొన్నిదినంబులు స్థాణ్వాశ్రమంబున సదాశివునకుఁ బరిచర్య చేసి మఱి యిచ్చటికి వచ్చిన దని విన్నవారము తచ్చరిత్రంబు వినవలయు నెఱింగింపు మనినఁ గించిల్లజ్జావనతవదనుండై యతం డమ్మహాత్ములారా తపోమహత్త్వంబున లోకత్రయవర్తనంబు కరతలామలకంబుగాఁ జూచుచున్నమీకు నపరిజ్ఞానం బించుకంత గలదె యైనను మీరు నామీఁదివాత్సల్యంబున నిచ్చటికి విజయంచేసి మాయోగక్షేమంబు లరయుటవలన మన్మందిరంబు పవిత్రం బయ్యె సకలశ్రేయంబులకు నేను భాజనంబనై సమానులలో నుత్తమశ్లోకుండ నైతి నిప్పుడు మీరాజ్ఞయిచ్చినప్రశ్నంబునకు సదుత్తరంబు విన్నవించెదఁ జిత్తగింపవలయు. 215

గీ. తొల్లి యొకనాఁడు నారదుం ♦ డుల్ల మలర, నిచటి కేతెంచి నాతోడ ♦ నిష్టగోష్ఠి
సలుపుచు మదంకమునఁ జెల్వ ♦ గులుకునాదు,తనయఁ గన్గొని భావివృ ♦ త్తాంత మరసి.

క. ఈమానిని యమృతాంశుశి,రోమణి కర్ధాంగ మగుచుఁ ♦ బ్రోన్నతి గాంచున్
నామాట వేదవాక్యము,గా మదిలో నమ్మవలయు ♦ భూమిధరమౌళీ. 217

వ. అని తనయామహత్త్వంబు కొంత దేటపఱిచి. 218

క. పరిచర్యార్థంబుగ న,త్తరుణేందువతంసునొద్దఁ ♦ దడయక నీ వీ
హరిణాక్షి నుంచిర మ్మా,గిరివర నామాట చిత్త ♦ గింపు దృఢముగన్. 219

ఆ. అనిన నట్ల కాక ♦ యని కన్యఁ దోడ్కొని, యమ్మహాత్ముఁ డున్న ♦ యచటి కరిగి
వినయ మొనర నతనిఁ ♦ గని ముని చెప్పిన,యట్ల యామృగాక్షి ♦ నచట నునిచి. 220

సీ. మరలివచ్చితి మునీ ♦ శ్వరులార మఱికొన్ని,నాళ్లకు మదనుఁ డం ♦ ధకవిపక్షు
భంగింపఁ బోయి త ♦ త్ఫాలనేత్రాగ్నిచే, సమసినపిమ్మటఁ ♦ జంద్రధరుఁడు
నచ్చట లేచి స్థ ♦ లాంతరంబున కేగె, నంతట భయమందు ♦ నక్కుమారి
నే నిటఁ దోడ్కొని ♦ నెమ్మి వచ్చితి నంత, దపము సేయంగఁ జి ♦ త్తమునఁ దలఁచి

గీ. మాకు నెఱిఁగించి మే మెంత ♦ మాను మన్నఁ, జెవిని బెట్టక నాదగు♦శిఖరచయము.
మ్రోన నొక్క శృంగమున న♦నూననిష్ఠ, వ్రతము చెల్లించుచున్న ద♦వ్వనరుహాక్షి.

గీ. అన్నిదినములు పరిచర్య ♦ యాచరించి, మృడునివలనఁ బ్రసాదంబు ♦ వడయనైతి
నాదుసౌజన్య మేల సౌం♦దర్య మేల, యని మనంబునఁ గుత్సించు ♦ నలరుఁబోఁడి.

చ. అనిశము నమ్మహాత్మునిమ♦హాత్మ్య మెఱింగినసజ్జనుల్ దయా
వననిధి భక్తవత్సలుఁ డ♦వారిగ దీనులకోర్కు లెల్లఁ బ్రీ
తి నొసఁగువాఁ డటంచు విను♦తింతురు తత్పరిచర్య గోరుచు
న్ననను నొకానొకప్పు డయి♦నన్ మది నేల తలంపఁడో యనున్. 223

గీ. మీరు సకలంబు నెఱిఁగిన♦వారు గాన, మిమ్ము నడిగెద సజ్జన♦మిత్రులార
తెలుపుఁ డబ్బాలికామణి తలఁచుకోర్కి, సఫలముగ నెన్నఁ డొనరించు♦శంకరుండు.

వ. అని తదాగమనప్రయోజనంబున కనుకూలంబుగాఁ బలికినహిమవంతునిపలుకులకు నందఱుమును లానందించి మందస్మితసుందరముఖారవిందులై రప్పుడు వసిష్ఠుం డతని కిట్లనియె. 225

ఉ. నీకు మనఃప్రియంబుగ వి♦నిర్మలకీర్తి సదాశివుండు పా
ణీకరణోత్సవంబున ఘ♦నాఘనవేణి భవత్తనూభవన్
జేకొనఁగాఁ దలంచి మముఁ ♦ జెచ్చెర నిప్పరిపాటిఁ దెల్పఁగా
మీకడ కర్థిఁ బంపెఁ దర♦మే వినుతింపఁగ నీదుభాగ్యమున్. 226

సీ. ఇదమిత్థ మని నిర్ణ♦యింపఁ దరంబు గా, దేమహామహునిస♦మిద్ధమహిమ
యాబ్రహ్మకీట మీ♦యఖిలచరాచరం, బౌదలఁ దాల్చు నే♦యధికునాజ్ఞ
క్షమ ఏష ఏవ శ♦క్తు మకర్తు మన్యథా, కర్తు మన్ కీర్తి యే♦ఘనునిసొమ్ము
సకలసురాధీశ♦మకుటరత్నార్చు లే,భవ్యునిపదనఖ♦ప్రభలఁ బెనఁగుఁ

గీ. బరమయోగీంద్రహృత్పద్మ♦పద్మమిత్రుఁ, డాదిమధ్యాంతరహితుఁ డ♦నంతవిభవుఁ
డామహేశ్వరుఁ డల్లుఁ డై♦నపుడ నీకు, సరి గలరె యెందు వెదకిన ♦ శైలరాజ. 227

క. నీ విటఁ గూఁతున్ దోడ్కొని, వే వచ్చిననాఁటనుండి ♦ వేవిధముల నా
భావజ్ఞుఁ తన కొనర్చిన, సేవావిధ మెన్ను నతఁడు ♦ చిత్తములోనన్. 228

చ. సరసిరుహాక్షి సేయుపరి♦చర్యకుఁ జిత్తమునన్ బ్రమోదమున్
బొరసియు నాలతాంగికిఁ బ్ర♦భూతముదం బొనరింపనైతి నా
సరసవచోవిలాసముల ♦ సాదరదృష్టుల నంచు నమ్మహే
శ్వరుఁ డెదఁ గుందుఁ బూర్వనిజ♦చర్య దలంచి సవిస్మయాత్ముఁడై. 229

శా. సర్వజ్ఞుం డఖిలాశ్రితవ్రజవిప ♦ త్సంహారి యద్దేవుఁ డా
పర్వేందూపమవక్త్రుఁ డెందమునఁ దన్ ♦ భావించుచున్ దేవగం
ధర్వర్షిప్రవరాద్భుతావహతపో ♦ ధౌరేయ యై యున్కి దా
సర్వంబున్ మను నిట్లు పంచునపు డో ♦ శైలేంద్ర తెల్పెన్ దయన్. 230

గీ. తనయనుగ్రహమంబుజో ♦ ద్భవుఁడు మొదలు, గాఁగఁ గలుగు సురోత్తముల్ ♦ గాంక్ష సేయ
క్ష్మాధరోత్తమ భవదను ♦ గ్రహము నీదు, భాగ్యమునఁ గోరుచున్నాఁడు ♦ భర్గుఁ డిపుడు.

క. కావున భవత్తనూజన్, దేవోత్తముఁ డైన వామ ♦ దేవున కెలమిన్
వేవేగ నొసఁగి పెండిలి, గావింపు జగద్ధితంబు ♦ గా గిరివర్యా. 232

క. మారారాక ప్రతీక్షించుచు, నారాజవతంసుఁ డుండు ♦ నటు గావున శృం
గారనిధానము నీసుత, సారగుణోదారఁ జూచి ♦ చనఁగా వలయున్. 233

ఆ. ఏము దెలిపినపుడ ♦ యిట వచ్చు శంభుండు, దపము పండె నింకఁ ♦ దడయ నేల
కుధరమౌళిఁ దోడు ♦ కొని రమ్ము నీకూఁతుఁ, బిలువఁ బంపు బంధు ♦ బృందములను.

మ. అని మౌనీంద్రులు పల్క శైలవిభుఁ డ ♦ త్యానందమున్ బొంది భా
గ్యనిధానం బగుకూఁతుఁ జేరి యలవృ ♦ త్తాంతంబు విన్పించి ప్రా
ర్థనతోఁ దోడ్కొనివచ్చి యామునులకుం ♦ దండప్రణామంబు చ
య్యనఁ జేయించిన వా రొసంగి రపు డ ♦ య్యబ్జాక్షికిన్ దీవనల్. 235

వ. అట్లు దీవించి యమ్మహాత్ము లమ్మానినితో ని ట్లనిరి. 236

గీ. అధికదుష్కరనియమంబు ♦ లాచరించి, యతిమృదులగాత్రి నీ వింత ♦ యలయ నేల
సకలజగములఁ దనకను ♦ సంజ్ఞ నిలువు, మేరుధన్వి నీకనుసంజ్ఞఁ ♦ గోరుచుండు. 237

వ. అని మఱియును. 238

సీ. తల్లి నీ విటమీఁదఁ ♦ త్రైలోక్యసంపూజ్య, చరణాబ్జుఁ డగుమహే ♦ శ్వరునిఁ గూడి
యఖిలభద్రములకు ♦ నాలవాలంబ వై, యద్దేవునర్ధదే ♦ హంబ వగుచు
నాశ్రితు లగుమమ్ము ♦ ననిశంబు నాత్మలోఁ, దలఁచి సంరక్షింప ♦ వలయు నిదియ
మావిన్నపంబు నీ ♦ మానసంబున నిడి, మఱవకు మనిన న ♦ త్తెఱవ లజ్జ

గీ. నాననము వాంచి కేల్మోడ్చి ♦ మౌనముద్రఁ, జెంద బాలే తవాభీష్ట ♦ సిద్ధి రస్తు
శీఘ్రమేవ యటంచు న ♦ చ్చిగురుఁబోఁడిఁ, గాంచి యందఱు భక్తి దీ ♦ వించి రపుడు.

వ. అంత నమ్మునులు హిమవంతుం గనుంగొని. 240

గీ. ప్రీతితో విశ్వకర్మను ♦ బిల్వఁ బంచి, మితము లేకుండ వేగ ని ♦ ర్మింపఁ బంపు
వివిధభవనంబు లీశ్వరు ♦ వెంట వచ్చు, నమితగణయూధములు నిల్వ ♦ నర్హములుగ.

మ. పరివారాన్వితులై భవన్నగరికిన్ • బద్మాక్షపద్మోద్భవుల్
పురుహూతప్రముఖాష్టదిక్పతులు సం•భోజాప్తశీతాంశు లీ
శ్వరునాజ్ఞన్ బరమప్రమోదమున భా•స్వత్ప్రౌఢి నేతెంతు రో
సరసాగ్రేసర వారికిం దగినపూ•జ ల్వేడ్కఁ జేయం దగున్. 242

క. సురగంధర్వోరగఖేచరకిన్నరయక్షసిద్ధ•చారణవిద్యా
ధరకింపురుషాదులు వత్తురు వారికి ముద మొనర్పు • తుహినసగేంద్రా. 243

చ. అనిన హిమాద్రిభర్త యటు • లయ్యెడు నే నన నెంతవాఁడ నో
ఘనమతులార యింతయు న•కారణబాంధవుఁడైన యాత్రిలో
చనునియనుగ్రహంబున ను•సాధన మయ్యెడుఁగాక యాకృపా
వననిధితోడ నిట్ల తెలు•ప న్వలయు న్మునులార వేఁడెదన్. 244

మ. అనుచున్ భక్తి నమస్కరింప భవది•ష్టావాప్తి వేగంబ యా
సని మోదంబునఁ బల్కి యిచ్చటికిఁ దెం • గర్ధేందుచూడావతం
సునకున్ దెల్పెద మి మ్మనుజ్ఞ తుహిన•క్షోణీధరగ్రామణీ
యన నానందము నొంది లెస్స యటు నే•యం గర్తలం చాడినన్. 245

క. అతనిచే ననుమతి గొని, యాతాపసముఖ్యు లరిగి • యంతయు మదనా
రాతి కెఱిఁగించి రధికవి,నీతిసుధాతుల్యవాక్య•నిపుణత వెలయన్. 246

వ. ఇవ్విధంబున. 247

మ.మునిచంద్రుల్ దమపోయివచ్చినపని • న్మోదంబుతో విన్నవిం
చిన నద్దేవుఁడు వక్త్రపద్మ మలరన్ • జిత్తంబు రంజిల్ల న
య్యనఘాచారులఁ బెక్కుమన్ననల న•త్యానంద మొందించుచున్
వినయాఢ్యుం డగునందికేశ్వరు దయ • న్వీక్షించి లేనవ్వునన్. 248

క. ఇలఁ గలగోత్రంబులలో,పల బలవంతుండు చాల • బలఁగముచేఁ బు
ష్కలుఁ డలహిమవంతుం డ,త్యలఘుయశుఁడు బాంధవమున • కర్హుఁడుమనకున్.

మ. మనకున్ బర్వతసార్వభౌమునకు సం•బంధంబు లోకత్రయీ
వినుతంబై యిటు నేఁటికిం గలిగె శ్రీ•విం దత్పురీసత్తమం
బునకున్ బోదము సర్వపారిషదులన్ • బొల్పొంద రప్పింపు చ
య్యన నందీ యని యాజ్ఞయిచ్చె శివుఁ డ•త్యంతప్రమోదంబునన్. 250

క. మనసిజహరునానతిఁ జయ్యన శ్వేతముఁ బూని నంది • యాగచ్ఛత యం
చును దమఁ బిలిచినమాత్రన, చనుదెంచె గణాధినాథ•సముదాయంబుల్. 251

క. చనుదెంచి నందికేశ్వరు, మునుఁ గని తదనుమతి నర్హా♦ముగ శంకరుద
ర్శనమునఁ దత్సంభావన, ననుపమ మగుముదము నొంది ♦ రాగణనాథుల్. 252

క. లెక్కయిడఁగ శక్యము గా, దొక్కక్కగణాధినాథు♦నెద్దిగణములన్
మిక్కిలిబుద్ధిబలము గల,యక్కమలోద్భవున కైన ♦ ననఘచరిత్రా. 253

వ. ఇవ్విధంబున నప్పరమేశ్వరుండు దనకుఁ బుత్రనిర్విశేషనిరవధికప్రేమాస్పదుఁడై చిత్తానువర్తులై నిజాజ్ఞ సకలలోకంబులయందు యథేచ్ఛంబుగా సంచారంబు సలుపుచు దుర్జననిగ్రహంబును సజ్జనానుగ్రహంబునుం గావించుచున్న మహానుభావులు మహాకాళుండును మహాకర్ణుండును గుంభోదరుండును నికుంభుండును నీలగ్రీవుండును బన్నగాంతకుండును భైరవుండును గాలభైరవుండును స్వచ్ఛందభైరవుండును విశ్వఘస్మరుండును మణికంధరుండును గపాలవంతుండును మణిమంతుండును గేతుమాలియు మకరలోచనుండును సోమకుండును నూర్ధ్వకేశుండును సింహకేతుండును నాదిగాఁ గలబహుకోటిసంఖ్యాకు లగుగణాధ్యక్షులు నలుగడల బలసి తన్ను సేవింప నాసన్నవర్తి యగునందికేశ్వరుం గనుంగొని వైవాహికమహోత్సవసందర్శనార్థం బఖిలలోకవాసులు సనాయకంబుగా నిచ్చటికి వచ్చునట్లు సేయవలయు ననవుడు మహాప్రసాదం బని పరమానందంబున నచ్చటన యుండి మధురస్వరంబున ని ట్లనియె. 254

సీ. వీనులవిందుగా ♦ వినుఁడో సకలలోక,పతులార పార్వతీ♦పరిణయమున
కీశ్వరేశ్వరుఁ డామ♦హేశ్వరుం డిదె విజ,యంచేయుచున్నవాఁ♦డద్రిసార్వ
భౌముఁ డాహిమవంతు♦పట్టణంబునకుఁ బ్రా,భవము శోభిల గణ♦ప్రభలతోడ
సపరివారంబుగా ♦ సత్వరంబుగ మీరు,చనుదెండు మాస్వామి♦శాసనంబు

గీ. సావధానంబుగా శిర♦సావహించి, యనిన వారల కందఱ ♦ కాత్షణమునఁ
గర్ణములలోనఁ జెప్పిన♦కరణి యయ్యె, నెఱిఁగి వర్ణింపఁ దరమె నం♦దీశుమహిమ.

వ. ఈచందంబున సమస్తలోకంబులవారలకు నందికేశ్వరునాజ్ఞావచనంబు లోక్కపరి వినవచ్చిన వార లమితానందంబున నిందుధరవివాహమహోత్సవసందర్శనకౌతుకంబు డెందంబుల సందడింపఁ దమతమసుందరీబృందంబులతోడ నప్పుడ కదలి యమందప్రయాణంబుల వచ్చుచుండి రంత కుమున్న యప్రమేయప్రభావుండగునవ్వామదేవుండు దనదివ్యచిత్తంబునఁ దలంచినంతన శతానందుం డపరిమితానందుం డగుచు శైలనందనాబాలేందుధరులపరిణయంబు సందర్శింప భాషాసుందరీసమేతంబుగా సత్యలోకవాసుఁ లైనయుప్రబహ్మలును బ్రహ్మర్షులును వి చి

త్రవిమానారూఢులై తనచుట్టుఁ బరివేష్టించి రా నిజరాజవాహ్యం బైనరాజహం
సంబు నెక్కి సత్వరంబుగా నచ్చటికి వచ్చిదూరంబున రాయంచ డిగ్గి యుచిత
పరికారంబున మహాగణేంద్రసేనామధ్యంబునఁ బేరోలగంబున్నయప్పరమేశ్వరుం
గాంచి నమస్కరించి యువ్విరించి యంజలి ఘటియించి యి ట్లని వినుతించె.256

సీ. పశ్యల్లలాటాయ ♦ బాలేందుజూటాయ, తే నమో స్త్వష్టమూ♦ర్తే నమోస్తు
సర్పేంద్రహారాయ ♦ కర్పూరగౌరాయ, తే నమోస్తు జగత్ప♦తే నమోస్తు
పురదైత్యభంగాయ ♦ భూతిలిప్తాంగాయ, తే నమోస్తు దయాని♦ధే నమోస్తు
పాథోధితూణాయ ♦ పద్మాక్షబాణాయ, తే నమోస్తు కపర్ది♦నే నమోస్తు
గీ, తే నమోస్తు త్రియీమూర్త♦యే నమోస్తు, తే నమోస్తు జగద్వ్యాపి♦నే నమోస్తు
తే నమోస్తు మహామహి♦మ్నే నమోస్తు, తే నమోస్తు పరబ్రహ్మ♦ణే నమోస్తు.257

గీ. తే నమోస్తు శ్రితార్తిహం♦త్రే నమోస్తు, తే నమోస్తు త్రిశూలపా♦ణే నమోస్తు
తే నమోస్తు మాయావట♦వే నమోస్తు, తే నమోస్తు మహాతేజ♦సే నమోస్తు.258

క. అని స్తుతియించిన భాషా,వనజాక్షీవల్లభుని స♦వాత్సల్యాలో
కనమునఁ గుశలప్రశ్నం,బున సంభావించి చాల ♦ ముదమందించెన్. 259

వ. మఱియును. 260

క. ఆరాజధరుఁడు మది నిం,డారినప్రేమమునఁ దలఁచి♦నంతన వచ్చెన్
శ్రీరామామణితోడన్, నారాయణుఁ డాక్షణంబునన్ ♦ హరుకడకున్. 261

వ. అప్పుడు. 262

సీ. కలశాంబునిధికన్య ♦ చెలువుగుల్కుచు నుర,స్స్థలమునఁ జిరతటి♦త్కళ రహింప
రాజవాహ్యంబై చ♦రత్సువర్ణాద్రియో,యన విహంగేంద్రుండు ♦ తను వహింప
వలెవాటు వైచిన♦స్వర్ణాంబరముడాలు, సుస్థిరేంద్రశరాస♦శోభఁ దాల్ప
సదయకటాక్షవీ♦క్షాసుధావృష్టిచే, శ్రితమనోరథసస్య♦తతి ఫలింప
గీ, సర్వశాలసుసంగత♦చాతకముల,భాతి శయ్యాదిరూపస♦ర్వప్రధాన
బలపరివృఢాదు లిరువంకఁ ♦ గొలువ నొప్పె, మదనజనకుఁ డపూర్వవా♦రిదము రేవ.

వ. మఱియును. 264

గీ. తారకాగ్రహశోభితం ♦ బై రహించు,నిర్మలాంబరభాతి వ♦ర్ణింపఁ దగియె
నఖిలభూషాయుధస్ఫూర్తి ♦ నతిశయిల్లి, విశదవిస్తారకీర్తి శ్రీ♦విష్ణుమూర్తి. 265

వ. ఇట్లు వచ్చి పుండరీకాక్షుండు సముచితంబుగా నవ్విరూపాక్షునిం గాంచిన నద్దేవుండు
దనప్రాణసఖుం డైనవాసుదేవునిఁ బ్రణయగౌరవమధురంబుగా సంభావించి తత్సు

ల్లాపసౌఖ్యం బనుభవించుచున్నంత నందీశునాజ్ఞ మహేంద్రుం డైరావణారూఢుం డై వసు రుద్రాదిత్య గరుడ గంధర్వకిన్నర కింపురుష సిద్ధసాధ్యాప్సరోయక్షాదులతోం గూడం ద్రివిష్టపంబుననుండి కదలి తోడిదిక్పాలకులు సపరివారంబుగాం దనచుట్టు బలసి రా మహావిభవంబుతో నుత్సవసందర్శనకుతూహలుండై యచ్చటికి వచ్చి దేవదేవుం డగునవ్వామదేవుని సందర్శించి తదీయపాదకమలంబులు నిజకిరీటరత్నకాంతిప్రసవంబులం దోలుతం బూజచేసి యనేకవిధంబులం బ్రస్తుతులం దేల్చి యమ్మహాత్మునిమన్నన నడసి ముదం బందుచుండె నప్పుడు సమస్తగణదేవతాగణపరివృతుండై తారకగణమధ్యవర్తి యైనరాకామృగాంకు ననుకరింపుచు శ్రీకంఠుండు శుభయాత్రామహాత్మ్యం బెంత తనదివ్యచిత్తంబున నంకురింప శ్రీవత్సాంకునితో సస్మితంబుగాం దద్విషయసంభాషణంబు సేయునంతలోన. 266

సీ. ద్యోనదీఝరము శుం♦భోష్ణీష మయ్యె సు,ధారోచి రత్నకో♦టీర మయ్యె
మారభస్మము గంధ♦సారలేపం బయ్యె, జ్వలననేత్రము ఫాల♦తిలక మయ్యె
జలజాసనకపాల♦ములు హీరమణు లయ్యె, భుజగముల్ హారాది♦భూష లయ్యె
సామజచర్మంబు ♦ హేమాంబరం బయ్యెం, బులితోలు వెలిపట్టుం♦బుట్ట మయ్యె
గీ. సరవితోం గోటిమదనుల♦చక్కందనము, లొక్కండై కనుపట్టిన ♦ ట్లొప్పు మిగిలె
దివ్యదేహంబు దనయంత ♦ దేవదేవుం, డైనశివునకుం జూడ న♦త్యద్భుతముగ. 267

వ. ఆసమయంబునం దదీయచిత్తానువర్తు లగుటంజేసి. 268

క. అతిలోకశౌర్యులై ము, న్నతిభీషణమూర్తు లైన♦యాసకలగణ
ప్రతతులు సుందరసౌమ్యా,కృతులం గనుపట్ట నభ్ర♦కేశునియెదురన్. 269

వ. ఇవ్విధంబున. 270

గీ. అమితశృంగారమున నట్లు ♦ కొమరుమిగులు,నాపరాత్పరుమహనీయ♦రూపవిభవ
లక్షణంబులు గనుంగొన ♦ లక్షవేల,కన్నులుగవ లైనం జాలునే ♦ కలశజన్మ. 271

వ. అదియునుం గాక సకలలోకప్రత్యేకనాయకులును సమస్తగణనాయకులును భయభక్తులతో ముకుళితహస్తులై సేవించుచుండ నిండోలగంబుండునక్కుండలీశ్వరుం డలుపియఖండప్రాభవంబు గొనియాడ రెండువేలజిహ్వాలు గలయండజమండలేంద్రున కైన నలవి గా దన్న నితరులకు శక్యం బగునె యిత్తెఱంగున నయ్యనంగదమనుండు గమనోద్యోగంబునం బ్రవర్తిల్లుచున్నంత నంతకుమున్న యక్కడ. 272

సీ. శంకరచిత్తాను♦సారియై సురశిల్పి, యగువిశ్వకర్మ న♦గాధిరాజు
దలంచినమాత్రం ద♦త్పట్టణంబున కేగు,దెంచి మహావైభ♦వాంచితముగ

నవరత్నమయహిర♦ణ్మయరౌప్యమయములు, బహుభోగ్యవస్తువి♦భాసితములు
సమధికాయామవి♦స్తారంబు లసదృశ,చిత్రకర్మకళావి♦చిత్రతరము

గీ, లగునసంఖ్యాతగృహములు ♦ నగరిచుట్టు, సుందరోద్యానపంక్తులు ♦ చూడ నద్భు
తముగ నిర్మించె స్వర్గలో♦కములు వేయు,నైన నప్పురిసరి యౌనె ♦ యనఁగజనులు.

వ. మఱియును. 274

ఉ. బంధువు లౌసుమేరుముఖ♦పర్వతముఖ్యుల వారి కెప్పుడున్
బంధువులై ప్రసిద్ధిగను♦వాహినులన్ మఱి వారికిన్ సదా
బంధువు లౌసముద్రుల న♦పారముదంబునఁ బిల్వఁబంచె స
ద్బంధుఁడు భూధరాదిగణ♦బంధుసముద్రుఁడు కూఁతుపెండ్లికిన్. 275

వ. ఇట్లు మంచుగట్టులతేఁడు పిల్వఁబంచినఁ గాంచనశైలకైలాసమలయమాల్యవద్ద్రో
హణపారియాత్రాదిప్రభూతమహీధరనాయకులును గంగాయమునాసరస్వతీనర్మదా
గోదావరీకృష్ణవేణీకావేరీతామ్రపర్ణీపినాకినీప్రభృతితరంగిణీకురంగనయనసంగతులై సక
లసరిత్పతులును దివ్యరూపంబులు ధరియించి యోషధీప్రస్థపురంబునకు వచ్చి హిమ
వంతునిం గాంచిన నతండు వారల నెల్లఁ దగుతెఱంగున సంభావించి యోగ్యనివేశం
బుల నుండఁబంచి సముచితముదం బొనరించుచుండె. 276

సీ. అపు డహంపూర్వ మ♦హంపూర్వ మని దివౌ,కఃపరివృఢు లూడి♦గములు సలుప
వందులరీతిఁ గై♦వారముల్ సేయుచుఁ, బుంరూపముల వేద♦ములు భజింప
స్వస్తికృద్భువనప్ర♦శస్తమంత్రావళుల్, చదువుచు సంయమీ♦శ్వరులు నడువ
మంగళాచారస♦మ్యక్ప్రవర్తకుఁ డయి, జలజాసనుఁడు దన♦సరస రాఁగ

గీ, సంచరద్రౌప్యభూధరో♦చ్చాయ మగుచు, డం బగుమహోక్షరాజవా♦హ్యంబు నెక్కి
కదలె శుభలగ్నమునఁ బారి♦షదులతోడఁ,బరమపూరుషుఁ డోషధి♦ప్రస్థమునకు. 277

క. ప్రమథాధిపహిమవద్గేహములనడిమిత్రోవ నెల్ల ♦ నతిసాంద్రముగా
నమరులు గల్పతరులతాం,తములు నెరపి రపుడు జాను♦దఘ్నము గాఁగన్. 278

వ. ఇత్తెఱంగున సకలలోకేశ్వరుం డగునమ్మహేశ్వరుండు మహావిభంబుతోఁ జని చని.

సీ. ఎడ నెడ రంభాదు ♦ లెంతయు వేడ్కతో, సరసనాట్యకళాప్ర♦సక్తి జరపఁ
దుంబురునారదా♦దులు గానకుశలులై, నైజకథాకర్ణ♦నంబు సలుప
నేదిష్ఠుఁడై యంబు♦జోదరుం డవసరో,చితవాక్యచాతురిఁ ♦ జెన్నుమిగుల
సైన్యసంఘముల ని♦స్సమ్మర్దముగ నేత్ర,సంజ్ఞచే నందికే♦శ్వరుఁడు నడపఁ

గీ. చారుతరముగ నిర్ఝర♦భేరు లులియఁ, గల్పతరుపుష్పవృష్టులు ♦ ఘనము గాఁగ
మంచుగుబ్బలిపోల్ ప్రవే♦శించె శంభుఁ, డఖిలజగముల కానంద ♦ మతిశయిల్ల. 280

వ. అప్పుడు. 281

క. హితులును బాంధవులుం బురో,హితులు సతులుం దోడ రాఁగ ♦ నెదురుకొని జగ
త్పతిఁ బూజించె మహీధర,పతి సానుచరంబు గాఁగ ♦ భక్తియుతుండై. 282

క. ఆజగతీధరమణికృత,పూజకు సంతుష్టుఁ డగుచు ♦ భూతేశ్వరుఁ డం
భోజనయనాది దేవస,మాజముతో నరిగె నగర♦మధ్యపథమునన్. 283

వ. ఇవ్విధంబున. 284

ఆ. రాజవీథి వృషభ♦రాజవాహ్యము నెక్కి, రాజమాన సైన్య♦రాజి వొగడ
రాజరాజసఖుఁడు ♦ రా జగతీధర,రాజనగరిలోని♦రాజముఖులు. 285

వ. అమ్మహామహునిఁ జూచువాంఛ మధురస్వరంబున. 286

సీ. రావె ముద్దులగుమ్మ ♦ రావె పుత్తడిబొమ్మ, రావె చిల్కలకొల్కి ♦ రావె కల్కి
రావె యొప్పులకుప్ప ♦ రావె చక్కెరలప్ప, రావె తేనియసోన ♦ రావె చాన
రావె నిర్మలహాస ♦ రావె చంపకనాస, రావె మన్మథుదంతి ♦ రావె యింతి
రావె కోకిలవాణి ♦ రావె పల్లవపాణి, రావె సుందరపాల ♦ రావె బాల

గీ. సకలలోకేశ్వరుం డైన♦శంభుఁ డిప్పు, డదిగో మనహైమవతి వివా♦హంబు గాఁగ
వచ్చుచున్నాఁ డమితవైభ♦వంబుతోడఁ, గాంచఁ బోదము కన్నులు ♦ గలఫలంబు.

వ. అని యొండొరులం బిల్చుచు ససంభ్రమంబుగాఁ జతుర్విధాలంకారశోభితలై రమ్య
హర్మ్యాగ్రంబు లెక్కి. 288

సీ. ఒఱ దీసి మెఱపించు♦చెఱకువిల్తుకటారు, లకలంకరాకాసు♦ధాంశుకళలు
తరళతారహితసౌ♦దామినీలతికలు, రతిదేవిపెంపుడు♦రాచిలుకలు
సూనాస్త్రుపట్టంపు♦టేనికగున్నలు, శ్రీమూర్తులు వహించు♦జీవమణులు
నడయాడుమిహికుంద♦నంపుశలాకలు, మరుతోఁటఁ దిరుగుక♦స్తురిమెకంబు

గీ. లనఁగఁ జూపట్టి రమలకాం♦చనమణిమయ,చారుహర్మ్యాగ్రములమీఁద ♦ సారసాక్షు
లభవదర్శనలాలస ♦ లగుచు నగరి,రాజవీథికి నుభయపా♦ర్శ్వములయందు. 289

వ. అప్పుడు. 290

శా. కాంచెన్ బౌరవధూకదంబక మన♦ర్ఘ్యప్రస్ఫురద్రత్నభూ
షాంచద్గాత్రునిఁ దప్తకాంచనసము♦ద్యద్భాసమానద్యుతిన్
బంచాస్త్రాయుతకోటిసుందరు నదం♦భప్రాభవాడంబరున్
బంచబ్రహ్మపరాయణద్విజమనః♦పద్మద్విరేఫున్ శివున్. 291

క. కాంచి యురుదండి యక్కిలి,కించితవతు లంతరంగ♦కీలితదృష్య
త్వంచశిలీముఖకుహనా,వంచితలై యిట్టు లని ర♦వారణఁ దమలోన్. 292

క. ఎందును గంటిమె యీదృశ,సౌందర్యాదిప్రసిద్ధ♦సకలసుగుణముల్
కందర్పుఁ డతనిదాసుఁ డ,నం దగు నిక్కముగ నంగ♦నామణులారా. 293

సీ. సౌందర్యగరిమ వా♦చామగోచర మహో, చాతుర్య మార యా♦శ్చర్యమూల
మద్దిరా సౌకుమా♦ర్యం బెన్నఁ గొలఁది గా, దన్నన్న ప్రాభవం ♦ బద్భుతంబు
గాంభీర్య మాహా సు♦ధాంభోధిధిక్కారి, లావణ్య మహహ చో♦ద్యావహంబు
మాయురే వైభవ♦మహిమ లోకోత్కృష్ట, మమ్మచెల్ల విలాస ♦ మప్రమేయ
గీ. మిభగమనలార యిమ్మహా♦ప్రభువులీల, లర్థిఁ గనుఁగొన్నఁ బురుషుల♦కైనఁ జిత్త
ములు గరఁగు నన్నచో వెన్న♦పోల్కిఁ గాంచు,సరసిజాక్షులచిత్తము ♦ ల్గరఁగు టరుదె.

వ. అని రందు మఱియును. 295

ఉ. చక్కఁదనాలకుప్ప వని ♦ శంభుఁడు నీపయిఁ గన్నువైచె నీ
చక్కఁదనంబు యౌవనము ♦ సార్థక మయ్యె నటంచు నొక్కతే
జక్కవగుబ్బలాఁడి నొక♦జక్కవగుబ్బెత వల్కెఁ బ్రేమచే
నక్కమలాక్షి మేనఁ బుల♦కాంకురము ల్వహియించె వింతగన్. 296

చ. వదలిననీవి నాఁగక య♦వారణ నిబ్బెపుగుబ్బచంటిపైఁ
జెదరినపయ్యెదన్ సవర♦చేయక చెచ్చెర వచ్చి ప్రేమతో
మదవతి నీవు చూడ స్మయ♦మానముఖుం డయి చూచె నిన్ను నా
సదయుఁ డటంచుఁ దెల్పె నొక♦సారసలోచన యొక్కయింతికిన్. 297

సీ. తరళాక్షి యితనిని♦ద్రాచెక్కుటద్దంబు, లొద్దికతోఁ గూడి ♦ ముద్దు లిడఁగ
భామిని యమృతంబు♦పై నైన నరుచి పు,ట్టించునీతనిమోవి♦ తేనె నాన
సుదతిరో యితనిపే♦రెదకు సమగ్రవ,క్షోజకాఠిన్యంబుఁ ♦ జూపి యలమ
యెలనాఁగ తమి దీఱ ♦ నితనిఁ బైకొని యథే,చ్ఛంబుగాఁ బురుషాయి♦తంబు నెఱప
గీ. నేమితప మొనరించెనో ♦ హిమనగేంద్ర,కన్యకామణి యహహ సా♦మాన్యమే మ
హామహుం డైనయితని పొం♦దనుచు మేను,వొంగలోలోనగుటకలు♦మ్రింగెనొకతె.

సీ. సరసిజానన బార ♦ సాఁచి కొల్వఁగ వచ్చు, నమ్మ యీఘనునిబా♦హాంతరంబు
హర్యక్షమధ్య వ్రు♦ప్పాస్త్రి చేరల కెక్కు, డమ్మ యీభవ్యునే♦త్రాంబుజములు
నాతి మేలిమిఁ గుంద♦నము నిందనము సల్పు, నమ్మ యీధన్యుదే♦హప్రభాళి
సుందరీమణి కందుఁ ♦ జెందనిపూర్ణేందుఁ, డమ్మ యీదేవుని♦యాననంబు

గీ. కొమ్మ భూషణభూషణ ♦ మమ్మ యీమ,హానుభావునిరూప మం♦టంచు నొక్క
మించుఁబోఁడిఁ జూపి యా♦పంచబాణ,పంచబాణునిసొబగు వ♦ర్ణించె నొకతె. 299

వ. మఱియు నమ్మగువలు దమలోన. 300

క. హారుఁ డజినాంబరుఁడు దిగం,బరుఁ డని మును విందు మిప్డు ♦ డహాహా యీసుం
దరుఁడు ధరించినదివ్యాం,బరములు లోకములఁ గలవె ♦ పద్మదళాక్షీ. 301

క. భైక్షాహారుం డని యీ,యక్షాధ్యక్షసఖు విందు ♦ మబల త్రిలోకా
ధ్యక్షుఁ డగునింద్రుఁ డితనిస,మక్షంబున భృత్యభృత్యుఁ ♦ డయ్యె న్గంటే. 302

మ. ధవళాక్షీ నృకపాలభూషణుఁడు ను♦ద్యత్సర్పభూషాఢ్యుఁ డం
చవనిన్ బల్కఁగ విందు మీసకలలో♦కాధీశ్వరుం డర్థితో
సవిలాసంబుగఁ దాల్చినట్టిమణిభూ♦షాశ్రేణితో సైకపున్
రవ కైనన్ సరివచ్చునే నవనిధా♦నస్వామిసర్వస్వమున్. 303

వ. అని యనితరసాధారణప్రభావగణ్యుం డగునద్దేవవరేణ్యునిలావణ్యతారుణ్యాదిగుణం
బుల వర్ణించుచు. 304

క. కొల్లలుగా సర్వజగ,ద్వల్లభుపైఁ గురిసి రపుడు ♦ వనితాజనముల్
మొల్లముగఁ గల్పసుమములు, మల్లెలు హేమప్రసూన♦లాజాక్షతముల్. 305

వ. మఱియును. 306

క. రాజకళాధరునకు నీ,రాజనము లొనర్చి రపుడు ♦ రాజనిభాస్యల్
రాజతసౌవర్ణమణివి,రాజితపాత్రముల దీప♦రాజి మెఱయఁగన్. 307

వ. ఇవ్విధంబున నపరిమితవిలాసంబుతో రాజమార్గంబున వచ్చునమ్మహాదేవుని నత్యం
తభయభక్తియుక్తంబుగాఁ దోడితెచ్చి. 308

సీ. బహుయోజనాయామ♦పరిణాహరత్నహా,టకమయాస్థానమం♦టపయుతంబు
సరసతరస్వచ్ఛ♦జయమంత్రపాళికో,భయపార్శ్వగతకల్ప♦పాదపంబు
దినమణిస్పర్ధిమ♦ధ్యేమహామంటపో,ద్భాసిమాణిక్యసిం♦హాసనంబు
హరిచామరవీజ♦నాద్యుపచారకృ,త్సౌవర్ణయంత్రపాం♦చాలికంబు

గీ. స్ఫటికమణికుడ్యకుట్టిమ♦శాతకుంభ,కుంభరత్నమయస్తంభ ♦సంభృతంబు
నైనయొకదివ్యమందిరం ♦ బద్రినాథుఁ, డెలమి విడిపట్టుఁ జేసె స♦ర్వేశ్వరునకు. 309

వ. అం దమందానందంబున నిందుకళాధరుం డఖిలగణాధ్యక్షులతోడ నిష్టగోష్ఠీవినో
దంబుల నుండునంతఁ దదనుజ్ఞాతుండై శైలపురందరుండు శతానందగోవిందపురంద
రాదిబృందారకశ్రేష్ఠుల నత్యంతసంప్రార్థనాపూర్వకంబుగా యథాయోగ్యంబు లైన
దివ్యసుందరమందిరంబులఁ దత్పరివారసమేతంబుగా విడియించి మైనాకాదినిజనంద

నలుం దానును వారికి వివిధోపచారంబులు నడపుచు వైవాహికకార్యనిర్వాహణ ధూర్వహమానసుండై యుండె నంతకు మున్ను మేనకాహిమవంతులయానతి ననేకరాకాశశాంకవదనలు లావణ్యసేవధి యైనగౌరీదేవికిఁ బరిణయాలంకరణం బొనరింపఁ దొడంగి రప్పుడు. 310

గీ. మదనమార్గణపుంజంబు • పొది వెడల్చి, పదనిడ మెఱుంగువెట్టిన • యపను దోఁపఁ
గొదమతేఁటులఁ జెదరంగ • గదుమఁ జాలు, సుదతివేనలి నులిదీర్చె • ముదిత యొకతె.

మ. తలయంటెన్ మధుశుద్ధతైలమున ర • త్నస్వర్ణపీఠంబుపైఁ
గలకంఠీమణి నుంచి కంకణరణ • త్కారంబు తోరంబుగాఁ
గలవాణీశుభగానము ల్చెలఁగఁగాఁ • గౌఁదీఁగ జవ్వాడఁగా
బలుగుబ్బ ల్నటియింపఁగా నొకశర • త్పద్మాక్షి సోత్కంఠ యై. 312

చ. మదగజగామినుల్ భువన • మాన్యకుఁ బర్వతరాజకన్యకున్
ముదమున శాలిశూర్ణమును • ముద్గరజంబు నిశాపరాగముల్
మెదపి ప్రసూనమార్దవము • మెచ్చనిమేన నలుంగు వెట్టి రా
మదనుకటారి సాననిము • మాడ్కిఁ దళ త్తళ లగ్గలంబుగన్. 313

గీ. తమపయోధరహేమకుం • భముల కెపుడు, బాంధవము లొమితోష్ణను • గంధిద్రవ్య
గాంగజలపూర్ణమణిమయ • కలశతతుల, జలకమాడించి రగజాత • నలరుఁబోండ్లు. 314

వ. అప్పుడు. 315

సీ. తరళాక్షి యొకతె బి • త్తరిమేనితడి యొత్తెఁ, జలువదువ్వలువ హ • స్తములఁ దాల్చి
సుదతి యొక్కతె చంద్ర • వదనకటీతటి, లలితకౌసుంభచే • లంబు గట్టె
ముదిత యొక్కతె కుంద • రదనబింకపుఁజన్నుఁ, గవకు గుత్తపుఁజంట • రవికఁ దొడిగె
వనిత యొక్కతె హైమ • వతికిఁ గీల్జడ యల్లి, మందారకుసుమదా • మములు చుట్టె
గీ. రమణి యొక్కతె యావక • రసము లందె, లేఁతచిగురులకంటెను • లేఁత లగుచు
లీల భక్తులలేములఁ • దూలఁ దోలు, సుందరీమణిపాదార • విందములకు. 316

క. తిలకుసుమనాస యొక్కతె, తిలకింపఁగ వింత గాఁగఁ • దీర్చెఁ దిలకిసీ
తిలకంబునకు న్గుంకుమ, తిలకము చెలువలరునలిక • దేశమునందున్. 317

క. కాంచనసుమనోనాసకుఁ, గాంచనమయదివ్యరత్న • ఖచితరుచికన
త్కాంచి ఘటియించె జలనిధి, కాంచీకటి యొర్తు ఘనజ • ఘనమండలిపై. 318

గీ. కమ్మవిల్కానిచేతికి • లొమ్మ యనఁగ, నెమ్మె గుల్కెడుముద్దుల • గుమ్మ కవుసు
కొమ్మ యొక్కతె వజ్రాల • కమ్మ లతిము, దమ్ముతో నుంచెఁ గర్ణయు • గ్మమ్మునందు.

సీ. తారహారంబు లోకరాజ♦కీరవాణి, కంబుకంఠశిరోమణి♦కంఠసీమఁ
బొందుపఱిచెఁ దదూర్ధ్వభూషణ♦భూషణాంగ,సంగతంబులై యవి వింత♦రంగు దాల్ప.

క. కంజవిలోచనమృదుపద,కంజములకుఁ గంజరాగ♦ఖచితవిభాస్వ
న్మంజీరయుగము ఘటియిం,చెం జందనగంధి యొకతె ♦ చెలువమరంగన్. 321

గీ. ఖంజనవిలోచనామణి♦కన్నుఁగవకు, నంజనము దిద్దె నొకశర♦త్కంజవదన
పొలఁతి యొక్కతె చేర్చుక్క♦బొట్టు దీర్చె, దంతిగమనమనోజ్ఞసీ♦మంతసరణి. 322

క. నవరత్నఖచితవిస్ఫుర,దవతంసము సంఘటించె ♦ నఖిలేశ్వరి యా
నవనిధరసుతకు నొకపల్లవమృదుకర సహజసురభి♦లాలితమౌళిన్. 323

గీ. భవ్యమణిమయసౌవర్ణ♦పాత్రిభరిత, మృగమదాగరుఘనసార♦మిళితమృదుల
గంధసారం బొకప్రసూన♦గంధి యలఁదె, లోకజనయిత్రి నెమ్మేనఁ ♦ బ్రాకటముగ.

క. పొంకముగ నొక్క విలస,త్పంకజముఖి శైలసార్వ♦భౌమతనయకున్
పంకేజరాగమణిమయ,కంకణములు దొడిగె హస్త♦కంజాతములన్. 325

క. ఆసుదతీమణిగంధఫ,లీసుందరనాస నొక్క♦లీలావతి యెం
తో సొగసు గాఁగ మణిమయ,నాసాభరణంబు వెట్టె ♦ నవరుచిరముగన్. 326

గీ. మఱియు బహువిధభూషాస♦మాజమునఁ గ,లంకరహితేందువదన ల♦లంకరింప
మానినీమణి మదనసా♦మ్రాజ్యలక్ష్మి,యో యనఁగ నొప్పె నఖిలనే♦త్రోత్సవముగ.

వ. అట్టియెడ. 328

క. శ్రీసంధిల శుభలగ్నం, బాసన్నం బయ్యె ననుచు ♦ నల్లనఁ జని ప
ద్మాసనుఁడు విన్నవించిన, నాసర్వేశ్వరుఁడు భూరి♦హర్షముతోడన్. 329

సీ. అకలంకరాకాసు♦ధాంశుమండల మన, స్మయమానసుందరా♦స్యంబు దనరఁ
జిత్రంబుగా స్వత♦స్సిద్ధమై వాహిక,శృంగారమున మేను ♦ చెలువు గులుక
నాశ్రితజనసమ్మ♦దామృతవర్షిమై, దయమానలోచన♦త్రయము వెలయఁ
దనతోడఁ గదలుబృం♦దారకాదులఁ బల్కు,లాలనోక్తులఁ దేనె♦చాలు పర్వఁ

గీ, దలఁచినంతనిజాగ్రత♦స్థాయి యైన,దివ్యభూషావితాన దే♦దీప్యమాన
రాజతగిరిప్రధానవి♦భ్రాజమాన, మగుబలీవర్దరాజవా♦హ్యంబు నెక్కి. 330

క. గణనాథులు బృందారక,గణనాథులు బలసి రాఁగ ♦ గణనాతీత
ప్రణుతప్రాభవ మొప్పఁగ, నణిమేతరమహిముఁ డభవుఁ ♦ డప్పుడు గదలెన్. 331

శా. స్ఫీతప్రాభవలీల బోరుకలిగెన్ ♦ భేరీమృదంగాదినా
నాతూర్యప్రకరంబు మందరగిరిం♦ద్రిక్షుబ్ధదుగ్ధాబ్ధిసం

జాతధ్వానముఁ గ్రేణిసేయుచు హిమ♦త్క్ష్మాభృన్మహామందిరా
యాత్త శ్రీగళసేనలో నఖిలహృ♦ద్యశ్రోత్రపర్వంబుగన్ . 332

ఉత్సాహము. అమితవైభవంబు మీఱ♦ నట్లు వచ్చుచున్నయా
కుముదబాంధవావతంసుఁ♦ గోర్కు లుల్లసిల్లఁగా
హిమవసుంధరాధరేంద్రుఁ♦ డెదురుకొని వినీతియు
క్తముగఁ బూజ చేసె బంధు♦జనులుఁ దాను భక్తితోన్. 333

వ. మఱియును. 334

గీ. అమ్మహాత్మునితోఁ గూడ♦ నరుగుదెంచు,నంబుజభవాంబుజాక్షశ♦క్రాదులైన
పెండ్లివారల నెల్ల సం♦ప్రీతితోడ, భూమిధరభర్త వేర్వేఱఁ♦ బూజచేసె. 335

వ. ఇవ్విధంబున. 336

ఆ. శైలరాజు సల్పు♦సవిశేషపూజల, సానుచరము గాఁగ♦ సంతసిల్లి
యిందుధరుఁడు వచ్చె♦ సుందరసమ్మర్ద,మందగమనమున న♦మందమహిమ. 337

వ. ఇట్లు వచ్చి మాణిక్యతోరణవిరాజితంబును సర్వాలంకారసుందరంబును నైనహిమవ
న్నగేంద్రమందిరబహిర్ద్వారంబు చేరి తదీయరత్నమయదేహళీప్రాంతంబున ననంత
విభవుం డగునయ్యభవుం డౌపవాహ్యంబు డిగ్గునెడ. 338

మ. బలుపుంగుబ్బల వ్రేఁగునన్ నడుము కం♦పం బంద ముత్యాలక
మ్మలడా ల్నిద్దపుఁజెక్కులందు దుముక♦ న్నాభామామణుల్ చేరి మం
గళగానంబులు సల్ప మేనక సమ♦గ్రప్రీతితో వచ్చి య
య్యలఘుప్రాభవుఁ డైనశంభునకుఁ బా♦ద్యం బిచ్చి సద్భక్తితోన్. 339

క. నునుసిగ్గును లేనగవును, గనుఁదమ్ములఁ దొలఁక నీల♦గళునకు నీరా
జన మొనరించి గిరుక్కునఁ, జనియెన్ లోపలికిఁ దోడి♦సఖులుం దానున్. 340

వ. ఆలోన. 341

క. ఒకగణనాథుఁడు మణిపా,దుకయుగ్మము మ్రోల నిలుప♦ ధూర్జటి గడు వే
డుకఁ దొడిగె శ్రుతిపథగా,శికభూషణ మైనపదకు♦శేశయయుగళిన్. 342

గీ. అప్పు డుభయపార్శ్వములఁ శ్రీ♦హరియునంది, కేశ్వరుఁడునిచ్చు కేల్దమ్ము♦లిందుమౌళి
యుభయహస్తాబ్జములఁదాల్చి,యొయ్యనడిచెఁ,బ్రాభవంబొప్పఁగల్యాణభవనమునకు.

వ. ఇవ్విధంబున సకలగణబృందబృందారకసందోహపరివృతుండై యల్లనడచి. 344

సీ. స్వచ్ఛగారుత్మత♦స్తంభసహస్రంబు, లేచాయఁ జూచిన♦ నింపు గులుక
మణికుడ్యవిస్ఫుర♦న్మాణిక్యదర్పణ,శ్రేణు లెల్లెడ నతి♦చిత్రములుగ

స్థూలమౌక్తికఝల్లరీలలితంబై వ,మహితవితానసమాజ మమరఁ
గమనీయనవరత్నఖచితసౌవర్ణక,ల్యాణపీఠంబు మధ్యమునఁ దనర

గీ. భవ్యమై వాహికద్రవ్యభాసమాన, మై యఖిలసేత్రిపర్వమై యమరశిల్పి
నిర్మితంబై సకల్యాణభర్మమంట,పముఁ బ్రవేశించె శంకరుం డసితమహిమ. 345

వ. అట్లు ప్రవేశించి. 346

సీ. జయజయధ్వనులతో సర్వదేవోత్తముల్, భక్తివినమ్రులై బలసి కొలువఁ
బరమశుభావహభవ్యమంత్రావళుల్, సుస్వరంబుగ మహర్షులు పఠింప
వినయాంజలులతోడ వేడ్కఁ బుత్రులుఁదాను, శైలనాథుఁడు దనముందల నిలువ
సైన్యాధిపతుల సన్నమ్ముర్ధముగ నంది, వేత్రసంచాలనమాత్ర నిలుప

గీ. ఘటితహస్తాబ్జయుగళుఁడై కమలగర్భుఁ, డల్లనల్లన మనవిసేయంగ నపుడు
లలితకల్యాణపీఠ మలంకరించె, శంకరుఁడు భక్తలోకవశంకరుండు. 347

వ. ఇవ్విధంబున దివ్యరత్నఖచితసౌవర్ణపీఠంబున సుఖాసీనుండై తనయుభయపార్శ్వంబుల గోవిందశతానందు లనర్ఘ్యమణిమయపీఠంబులపైఁ దేజరిల్ల నఖిలగణాధ్యక్షులను సనకాదిదివ్యయోగీంద్రులను వసిష్ఠాదిమహర్షివరిష్ఠులను బురందరాదిబృందారకశ్రేష్ఠులను సూర్యాదినవగ్రహంబులను దక్కినగరుడగంధర్వకిన్నరకింపురుషసిద్ధసాధ్యచారణయక్షగుహ్యకాదిసమస్తదేవజాతులను శేషవాసుకైరావతాదిభుజంగప్రధానులను మఱియు సమస్తలోకవాసులను నిస్సమ్మర్దంబుగా నుచితాస్తరణంబులఁ గూర్చుండ నాజ్ఞయొసంగె నప్పుడ శేషభువనవాసు లెల్ల నొక్కచోటికి వచ్చుటఁ జేసి తద్భారంబునకు సహింపక భూమి యుత్తరభాగంబునఁ గ్రుంగఁబడి యొడ్డగెడవైన నెప్పటియట్ల నిల్వఁ దగినదివ్యచిత్తంబునఁ దలంచి మహానుభావుం డనుగ్రహాతిశయంబున నిన్నుఁ జేరఁ బిలిచి దానికి సరియెత్తుగా దక్షిణదిగ్భాగంబున నివసింప నాజ్ఞాపించినఁ దత్పరిణయమహోత్సవనిరీక్షణకాంక్ష నప్పనికి సమ్మతింపకున్న బహుభంగుల బుజ్జగించి యెట్టకేలకు నొడఁబఱిచి యచ్చటికి నద్దేవుండు వనుప నీ వక్కార్యంబు నిర్వహించుట జగత్ప్రసిద్ధంబె కదా నీమహిమ యిట్టిది యమ్మహాత్మునియవరావతారంబు గానివారికి నిట్టిపరిభావంబు గంటె కలశసంభవా యది యట్లుండె నాసమయంబున. 348

క. జనకుం డగుహిమవంతుని,యనుమతి మైనాకముఖ్యు లతిమోదమునన్
వినయాన్వితులై తనుఁ దోడ్కొనిరా నపరిమితతూర్యఘోషము చెలఁగెన్. 349

మ. గిరిభామల్ సురకామినుల్ భుజగపంకేజేక్షణల్ సిద్ధసుం
దరులున్ సాధ్యనితంబినుల్ గరుడకాంతల్ కిన్నరస్త్రీలు కిం

పురుషాబ్జాస్యలు చారణప్రమద లం♦భోరాశిసీమంతినుల్
నరవామాక్షులు మానినీమానినులు గం♦ధర్వాంగనల్ గొల్వఁగన్. 350

సీ. సానఁబట్టినచిత్త♦జన్మునిమోహన,సాయకం బన మేను ♦ చాయఁ గులుకఁ
గందర్పజయభేరి♦కాధణంధణలచే, రత్నకంకణనూపు♦రంబు లులియ
మంజులస్మరధను♦శ్శింజినీలత యనఁ, దళుకుఁగీల్జడ కటి♦తటి నటింప
మరునింద్రనీలంపు♦టురు లన లజ్జచే, సొబగొందునరగంటి♦చూపు లలర

గీ. మానినీమణు లిరువంక ♦ వేనవేలు, గదిసి యల్లన నడిపించి ♦ పొదివి రాఁగ
నమితవిభవవిలాస యై ♦ హిమనగేంద్ర,తనయ కళ్యాణమంటపం♦బునకు వచ్చె. 351

వ. అప్పుడు. 352

క. సురగురుఁడు సురజ్యేష్ఠుఁడుఁ, దెరవట్టిరి సకలజనుల♦దృష్టు లలర నొం
డొరుఁ గనుఁగొనఁ దివ్యవధూ,వరులనడుమ స్వస్తిమంత్ర♦వాదకుశలులై. 353

వ. అంత. 354

సీ. చంద్రబింబము కాదు ♦ జలజాతమో కాదు, దర్పణమో కాదు ♦ తరుణిమోము
కలువరేకులో కావు ♦ ఖంజనంబులో కావు, మీనంబులో కావు ♦ మెలఁతకన్ను
లలరుబంతులో కావు ♦ పలిజక్కవలో కావు, పైఁడిబిందెలో కావు ♦ పడతికుచము
లలమెఱుంగో కాదు ♦ కలికిచిల్కయొ కాదు, మరుముల్కియో కాదు ♦ మచ్చెకంటి

గీ. యనుచుఁ గ్రమమునఁ దెరవంచు♦నపుడు గాంచి, కాంచనాద్రిశరాసుఁడ♦మ్మించుఁబోఁడి
భవ్యరూపంబు భావించుఁ♦బట్టఁజాల,కబ్బురపుఁదమి యెదలోన ♦ గుబ్బటిలఁగ. 355

వ. మఱియును. 356

ఉ. కాంచినయట్లు తన్విభుఁడు ♦ గాంచినయప్పు డపర్ణ గాంచుఁ దాఁ
గాంచినయప్డు శూలి కడ♦గంటఁ గనుంగొనుఁ దన్ను శైలజా
కాంచనశైలచాపు లిటు ♦ గాంచిరి వంచన నొండొరున్ దమిం
గాంచినవార లెల్ల సరి♦గాంచనిమోదముఁ గాంచుచుండఁగన్. 357

వ. అయ్యవసరంబున. 358

సీ. మోదంబుతో మేన♦కాదేవి నిజకర,కమలకీలితరత్న♦కలశభరిత
పావనజలము దో♦డ్తో వంప మాణిక్య,పాత్రస్థితం బైన♦భర్గుపాద
జలజయుగ్మంబుఁ బ్ర♦క్షాళన మొనరించి, తన్మహానియతీ♦ర్థంబుఁ దానుఁ
బత్నియుఁ బుత్రులు ♦ బాంధవులును మోద, మావహిల్లఁగ శిర♦సావహించి

గీ. దివ్యగంధానులేపన♦దివ్యమాల్య,దివ్యభూషణసముదయ♦దివ్యవస్త్ర
జాలమున సర్వపర్వత♦సార్వభౌముఁ, డఖిలసురసార్వభౌముఁ బ్రీ♦తాత్ముఁ జేసె. 359

మ. మధువై రిపఁ్రముఖామరోత్తములు సం♦భావింప సద్భక్తి భూ
మిధరగ్రామణి చంద్రజూటునకుఁ బే♦ర్మిం దా సమర్పించెఁ గా
మధుగాజ్యాదికకల్పవృక్షసుమనో♦మాధ్వీరుచీమిశ్రమౌ
మధుపర్కంబు తదీయమానస మహా♦మాన్యప్రమోదంబుగన్. 360

వ. ఇవ్విధంబున జగదీశ్వర సపర్యాచరణమహోత్సవం బాచరించి. 361

క. ధారాపూర్వంబుగ సిం,హారాద్రివిభుండు శివల♦యాప్తకళాశ్రో
టీరునకు నొసఁగె నిజక,న్యారత్నము నఖిలజనులు♦ హర్షింపంగన్. 362

క. మంగళగానము లెసఁగె సు,మంగళదేవ్యాదు సర్వ♦మంగళకు జగ
న్మంగళసంపాదక మగు,మంగళసూత్రంబు గట్టె♦ మహనీయముగన్. 363

క. సల్లలితకల్పశాఖా,పల్లవముఁ దెమల్చువిబుధ♦పతిగజ మన భా
స్వల్లీల శైలజాకర,పల్లవము గ్రహించెఁ బ్రమథ♦పతి మోదమునన్. 364

క. పొంకముగ గిరిసుతాహరి,శాంకవదనతోడ ధృతశ♦శాంకుఁడు ఫణిరా
ట్కంకణుఁడు శంకరుఁడు శుభ,కంకణము ధరించె హస్త♦కంజాతమునన్. 365

వ. అప్పుడు. 366

చ. చెలు లిరువంక హెచ్చరిక♦సేయఁగ బేడిసమీల నేలుచూ
పుల నునుసిగ్గు లేతనగ♦వున్ దొలఁకం గలకంఠి ముత్తియం
బులతలఁబ్రాలు నించె శశి♦భూషణు నౌదల నిందిరావచో
జలజముఖీశచిప్రముఖ♦సాధ్వులు సంతసమంది చూడఁగన్. 367

సీ. చిగురాకుజిగి నేలు♦మగువ కేల్దోయిలోఁ, బరిశుద్ధవిద్రుమ♦భాతిఁ దనరి
తారకానాథకో♦టీరుఁ డాహరుమౌళిఁ, దారకాబృందసుం♦దరతఁ గాంచి
శంకరకంఠనై♦ల్యాంకసంగతములై, హరినీలమణులభా♦స్వరతఁ దాల్చి
బాలసూర్యప్రభా♦భాసి యాశివుమేన, స్ఫుటపద్మరాగవి♦స్ఫూర్తి నొంది

గీ, సాంబశివదేవపై వాహి♦కంబు లైన, భవ్యముక్తాఫలంబులు ♦ భక్తజనుల
కభిమతార్థప్రదంబులై ♦యఖిలలోక,వాసులకు నెల్ల నేత్రోత్స♦వం బొనర్చె.

వ. ఇవ్విధంబున. 369

మ. తనమౌళిన్ గిరిరాజపుత్రి వెసము♦క్తాస్తోమముల్ నింప న
ట్లన తానున్ శుభమౌక్తికప్రతతి వే♦డ్కం గన్యచే మించకుం
డ నిడం బూని తదంచితావయవసౌం♦దర్యంబు వీక్షించుశం
భునివిస్మేరత తత్సఖీమణులకున్ ♦ బుట్టించె సుస్మేరతన్. 370

వ మఱియును. 371

క. తనమూర్తి యగుచు నెప్పుడుఁ, గనుసంజ్ఞ మెలంగువహ్ని ◆ గరుణించి ముదం
బునఁ బ్రియయుఁ దానుహోమం, బొనరించె మహేశుఁ డమరు ◆ లుత్సుకతఁగనన్.

గీ. కోరి తమ్ముఁ దలంచిన ◆ కొంగుముళ్ళు, శుభములని లోకులకుఁ దెల్పు ◆ సొంపుదోఁప
సంగతిగఁ గొంగుముళ్ళతో ◆ సలిపిరాద్య, దంపతులు హవ్యవాహప్ర ◆ దక్షిణంబు.

ఉ. బాలమృగాక్షి మున్ను భయ ◆ భక్తులతో వివిధోపచార మెం
తో లలితంబుగా జరపఁ ◆ దొయ్యలిచిత్తము సంతసిల్ల నాఁ
డేల మెలంగ నైతి నని ◆ యెంచి ప్రసన్నతకై స్పృశించె నా
శైలసుతాంఘ్రిపల్లవము ◆ శంభుఁడు సప్తపదీమిషంబునన్. 374

సీ. తలుపు బిగించి బి ◆ త్తరులు నవ్వుచు వధూ, వరులనామంబు లొం ◆ డొరుల నడుగ
సంగతిగా సర్వ ◆ మంగళాన్వితుఁడ నై, యేను వచ్చితి నని ◆ యీశ్వరుండు
కౌశలంబున నే స ◆ దాశివాన్విత నయి, యరుగుదెంచితి నని ◆ హైమవతియు
మగువలు మెచ్చఁ జ ◆ మత్కారముగఁ బల్కు, నవసరోచితముగా ◆ నబ్జభవుఁడు

గీ, పంచబాణారి కర్థిఁ జూ ◆ పించె నపుడు, భవ భవద్భక్తివిభవప్ర ◆ భావమున మ
హోన్నతస్థానకలితుఁడై ◆ యొప్పు ధ్రువుని, దయఁగటాక్షించుమంచు సంతసముతోడ.

గీ. మము దయాదృష్టిఁ గనుఁగొన ◆ నమయ మిదియ
యని యరుంధతి దనమ్రోల ◆ నర్థి నిలువ
నగతనూభవ ముసిముసి ◆ నగవుతోడ
నప్పరమసాధ్వి నాదరం ◆ బడరఁ గాంచె. 376

సీ. భూరిసంప్రీతి మే ◆ నారుంధతీముఖ్య, కాంతామణులు వెన్కఁ ◆ గదిసి నిలువ
నిరువంకఁ గూర్చుండి ◆ యిభవరదాదులు, భర్మాచలాదులు ◆ వేర్మిఁ గనఁగ
నరవిందసంభవుం ◆ డగ్రభాగంబున, వినయంబుతో శుభ ◆ విధులు నడప
నన్యోన్యసంగతి ◆ నంకురత్పులకసాం, ద్రంబులై నిజభవ్య ◆ తనువు లలర

గీ, మోద మిగురొత్తఁ గల్యాణ ◆ వేదియందు, సొరిది నేకాసనమునఁ గూ ◆ ర్చున్నయట్టి
సకలజగదీశ్వరీమహే ◆ శ్వరులసదయ, దృష్టి రక్షించుఁ గాత నా ◆ శ్రితుల నెపుడు.

వ. ఆసమయంబున. 378

క. చదివించెఁ గమలభవుచే, మదనజనకుఁ డఖిలలోక ◆ మాన్యుండు త్రయీ
విదితు లగువధూవరులకు, ముద మొదవ ననర్ఘ్యరత్న ◆ భూషాంబరముల్. 379

గీ. అపుడు దమకృతార్థతకుఁగా ◆ నంబుజభవ, శంబధరముఖ్యులతులభూ ◆ షాంబరంబు
లమరగురుచేతఁ జదివించి ◆ రలశివాస, దాశివాఖ్యసనాతన ◆ దంపతులకు. 380

వ. అంత. 381

ఉ. అన్యదురాసమైనయశ ♦ మబ్బె సమస్తజగచ్ఛరణ్యు ల
నన్యతపఃఫలంబు లఖి♦లాగమవేద్యులు సర్వదేవతా
మాన్యు లనాదిదంపతులు ♦ మా కిటు గూఁతురు నల్లుఁ డౌటచే
ధన్యుల మైతి మంచు గిరి♦దంపతు లాత్మఁ బ్రమోద మందుచున్. 382

సీ. సకలలోకైకనా♦యకు లయ్యు బ్రహ్మాది,దైవతాభీష్టప్ర♦దాత లయ్యు
నాత్తాఖిలైశ్వర్యు ♦ లయ్యు నాత్మారాము, లయ్యు నిజాశ్రితు ♦ లర్థిఁ దమకుఁ
బరమాణు వైన సం♦ద్భక్తితో నర్పింప, గరిమ సువర్ణాద్రి♦గాఁ దలంచు
నవ్వధూవరులకు ♦ నత్యంతభక్తితోఁ, దమకుఁ గల్గినవస్తు♦తతులలోన

గీ. నుత్తమోత్తమవస్తువు ♦ లొసఁగి రపుడు, హారణముగ మేనకాహిమ♦గిరివరేణ్యు
లీమహామహులకు నియ్య ♦ నెంతవార, మనుచుఁ దమమదిలో లజ్జ ♦ యంకురింప.

వ. ఇవ్విధంబున వైవాహికకార్యంబు నిర్వహించి పర్వతసార్వభౌముం డయ్యఖిలదేవతాసార్వభౌమునిసంపూర్ణానుగ్రహంబు వడసి పరమానందభరితహృదయుండై నిజసుందరియుం దానును బ్రియనందనం గౌఁగిలించుకొని యయ్యిందువదన దమకుఁ గావించుసవినయప్రణామంబున నత్యంతసంతోషంబు నొంది యాలోకజనయిత్రితో లోకమర్యాదానురూపంబుగా నుచితోక్తులు జరపి యానవఁబోఁడి ననిచివచ్చుటకు మైనాకాదినిజనందనుల నియోగించి మహనీయవిభవంబుతో నవ్వధూవరుల వీడుకొల్పిన. 384

మ. అమితప్రాభవుఁ డైనశంభుఁడు హిమా♦హార్యాత్మజాయుక్తుఁడై
కమలాక్షాంబుజసంభవాదిసురము♦ఖ్యవ్రాతముల్ దోడ రాఁ
బ్రమదోత్కర్షముతో మహోక్షవరదృ♦ప్యద్వాహనారూఢుఁడై
ప్రమథశ్రేష్ఠులు గొల్వఁగాఁ జనె నదం♦భస్ఫూర్తి రౌప్యాద్రికిన్. 385

వ. ఇట్లనంతవిలాసం బైనకైలాసంబునకుం జని యం దమందానందంబున నిజమందిరంబుఁ బ్రవేశించి యిందుధరుం డాశతానందగోవిందపురందరాదిదైవతశ్రేష్ఠులను వసిష్ఠాదితపోనిష్ఠుల ననుపమజ్ఞాననిస్తంద్రు లగుసనకాదియోగీంద్రులను దక్షి .నగరుడగంధర్వసిద్ధవిద్యాధరాప్సరోయక్షకిన్నరకింపురుషాదిదేవజాతులను దత్తదనురూపసవిశేషసంభావనంబున సంతుష్టులం జేసిన వారలు యథార్హంబుగా నప్పరమేశ్వరుచేత ననుజ్ఞాతులై సపరివారంబుగా నిజనివాసంబులకుఁ జని రంత.

మ. తముఁ గూర్పం దటి వేచి రేయుఁ బవలున్ ♦ దాత్పర్యసంయుక్త చి
త్తమునన్ వెట్టికి నొంటి లేదని దృఢో♦త్సాహంబుతోఁ దొంటిబ

న్నము భావింపక పుష్పబాణముల వి♦న్నాణంబుతోఁ బూజసే
యుమనోజుఁ గెలిపింపఁ బూనిరి దయాం♦ధ్యుల్ శాంకరీశంకరుల్. 387

వ. ఇట్లు పరస్పరక్రీడాసక్తహృదయులై యయ్యాదిమదంపతు లున్నంత నొక్కశుభ
లగ్నంబున. 388

సీ. తరళవిచిత్రము♦క్తాఝల్లరీబృంద,మహితవితాన స♦మన్వితంబు
కామధేనుక్షీర♦కల్పవృక్షఫలాది,బహుభోగ్యవస్తువి♦భ్రాజితంబు
కర్పూరదీపని♦కాయకాలాగరు,ప్రముఖధూపసుగంధ♦వాసితంబు
తాంబూలదర్పణ♦తాలవృంతాద్యుప,చారకృత్స్వర్ణపాం♦చాలికంబు
గీ. భరితచిత్రకళావిభా♦సురము నైన, కేళికాసౌధమున భూరి♦లీల హంస
తూలికాతల్పమున వేడ్క ♦ నీలకంఠుఁ, డువిదరాక ప్రతీక్షించు♦చుండునంత. 389

గీ. నెచ్చెలులు చేరి యచ్చిక♦బుచ్చికలుగ, గుసగుసలఁ దెల్పఁ గ్రేగంటఁ♦గసరుకొనుచు
నగతనూజాత తత్ప్రార్థ♦నాగృహీత,చతురలంకారవిభవ యై ♦ చాలఁ దనరె.

వ. అప్పుడు ప్రౌఢ లగువయస్యాతిలకంబు లమ్మానినితో నేకాంతంబున నిట్లనిరి.

సీ. రమణ నీపతిప్రేమ ♦ ప్రకటంబు గాకముందె, భవదభీష్టము బయ♦ల్పుఅప కమ్మ
కాంతునితమకంబుఁ ♦ గని తదిష్టముఁ దీర్పు, కెలనాఁగ యెడపెట్టి ♦ మెలఁగ కమ్మ
వనితరో మక్కువ♦ పనులఁ జొక్కించునా,థునిమీఁద వేసటఁ ♦ గినియ కమ్మ
వలపు హెచ్చఁగ బలి ♦ జెలువుండు పైకొనఁ,జెలువ డెందములోన ♦ సొలయ కమ్మ
గీ. పఙ్కజేక్షణ నీమది♦కొంకు దీఱి, ప్రౌఢతారూఢవై క్రమ♦క్రియము గాఁగ
నభిమతక్రీడల నిజేశు ♦ ననఁగి పెనఁగి, యతులితానందవార్ధి నో♦లాడవమ్మ. 392

క. అని బుజ్జగించి మెల్లన, యనుఁగుఁజెలులు దెలుప విననియట్టుల లజ్జా
వనతముఖి యైనగిరినం,దనఁ దోడ్కొనివచ్చి రతిము♦దంబున వారల్. 393

గీ. ఇట్లు దోడ్కొనివచ్చి మ♦హేశుఁ డున్న,తల్పమునుపాంతమున భూమి♦ధరతనూజ
నునిచియె కొక్కనెపమున♦వనితలెల్ల, వేడ్క నొండొరుఁగనుగీటి♦ వెడలిరపుడు.

క. తనుఁ దోడ్కొనివచ్చిన య,య్యనుఁగుఁజెలుల నచటఁ గాన ♦ కవనీధరనం
దన సాధ్వసమును సంభ్రమ,మును లజ్జయు మనములోన ♦ ముప్పిరిగొనఁగన్.

ఆ. మరలి చనఁ దలంపఁ ♦ దరుణిచిత్త మెఱింగి,హరుఁడు సత్వరముగ ♦ నరిగి తనదు
కరయుగమునఁ దార్చి ♦ విరులపానుపుఁ జేర్చి, కురులచిక్కు దీర్చి ♦ సరు లమర్చి.

క. సరసాగ్రణి యఖిలాంతః,కరణజ్ఞుఁడు నగుట నీల♦కంఠుఁ డపుడు భూ
ధరకన్యామణియంతః,కరణము గరఁగించె నొక్క♦క్షణమాత్రమునన్. 397

సీ. పయ్యెదలోఁ డాఁపఁ ♦ బని యేమి విరిబంతు, లని కేలఁ జనుఁగవ ♦ నాక్రమించుఁ
బగడ మోబింబమో ♦ పరికింతమని మోము, మోముపైఁ గదియించి ♦ ముద్దువెట్టుఁ
గదలకుమని యూఁగి ♦ పెదవి పల్మొన నొక్కి, విడుమంచు మెల్లన ♦ నుడువ నేర్పు
గిలిగింత గొలిపి బి♦ట్టులుక జళ్కకుమని, క్రిమ్మి గాఢంబుగాఁ ♦ గౌఁగిలించుఁ
గీ. దొలుత లజ్జామిషంబున ♦ నలరుఁబోఁడి, తనకు సహకారి గాకున్నఁ ♦ దాను బలిమి
నెలమి నలమి శ్రీకంఠుఁ డ♦భీష్టలీలఁ, గలసి నగజాత నానంద♦జలధిఁ దేల్చె. 398

చ. కరగతకాంచనాద్రి యయి ♦ కాంచిన మోదము రాజతాద్రిమం
దిరుఁ డయి కాంచు మోదముఁ బ్ర♦తీతముగా లఘుబిందుయుగ్మమై
ఖరి మదిఁ దోఁచె శంభునకు ♦ క్ష్మాధరనాథసుతాకుచాఖ్యసుం
దరగిరియుగ్మలాభజని♦తప్రకటాద్భుతమోదవార్ధిలోన్. 399

క. చాతుర్యైకనిధానం, బౌ తరుణశశాంకమౌళి ♦ యప్పుడ చేతో
జాతబహువిధక్రీడల, శీతాచలతనయఁ బ్రౌఢఁ ♦ జేసెన్ లీలన్. 400

వ. మఱియును. 401

సీ. కైలాసహిమశైల♦కనకాద్రిమలయభూ, ధరపారియాత్రాది♦గిరులయందు
మానసబిందుపం♦పాప్రముఖంబులౌ, వర్ణితబహుసరో♦వరములందు
సురనదీముఖ్యవి♦శ్రుతమహానిమ్నగా, రమణీయతీరదే♦శములయందు
నందితరసికౌఘ♦నందనచైత్రరథ, ప్రధానోద్యాన♦తతులయందు
గీ. మలయపవనశరచ్చంద్ర♦మాధవాదు, లలరువిల్కాని పనుపున ♦ వలచినపుడు
వచ్చి తనసేవ యొనరింప ♦ వామదేవుఁ, డద్రిజను గూడి యమితహ♦ర్షాబ్ధిఁ దేలె.

వ. ఇవ్విధంబున ఖండేందుమౌళి యఖండానందరసైకవిగ్రహుండును నవాప్తసకలకాముండును స్వాత్మారాముండును వస్త్వంతరశూన్యుండును నపరిచ్ఛిన్నుండును త్రిగుణాతీతుండును నయ్యు లోకానుగ్రహార్థం బుమామహేశ్వరనామంబుల లీలాగృహీతదివ్యమంగళవిగ్రహులైన తమ్ముఁ గూర్పఁ బునర్జన్మంబు నొందిన కందర్పునిఁ గృతార్థునిఁ జేయఁ దనడెందంబునం దలంచి శైలరాజనందనం గూడి సకలసురాసురసమ్యగ్వాంఛితంబైన సుధారసంబునందు నించుకేనియు వాంఛ సేయని మహానుభావుం డా మధురాధర యధరసుధారసంబు యథేష్టంబుగా మాటిమాటికిఁ దనివి లేక గ్రోలుచు నిజనేత్రానందకారణంబై నవశిరీషప్రసూనసుకుమారంబై సర్వాతిశయలావణ్యపూరంబైన తదీయశరీరంబుఁ బలుమాఱు నవిరామంబుగా గాఢాలింగనంబు సలుపుచు నమ్మహాదేవి యక్కృత్రిమప్రేమాతిరేకంబునఁ బ్రకటీకృతనిజవక్షోజకాఠిన్యసంరంభంబుగాఁ దనకు నొసం

గుపునఃపునఃపరిరంభంబుల సర్వతోధికప్రమోదంబునం దేలుచుఁ దత్తత్సమయోచితంబుగా సప్రేమంబులు సదైన్యంబులు సవినయంబులు సదయంబులు సబహుమానంబులు ససంభ్రమంబులు సభ్రూభంగంబులు సభయంబులు సవ్రీడంబులు సావలేపంబులు సస్మితంబులు నగుచు మదనవిజయైకసాధనంబులు మోహసంపాదకంబులు నగు నయ్యిందీవరేక్షణనిరీక్షణజాలంబులం దగిలి యమృతమధురంబులు నితాంతరసంబులు నతిచతురంబులు. మాధుర్యనిరస్తవిపంచీనాదంబులు సంవర్ధితశ్రోత్రమనఃప్రమోదంబులు నైనయాచిలుకలకొలికిపలుకుల కనురూపంబుగా నర్మగర్భంబులైనచమత్కారానుషంగవాక్ప్రసంగంబులు నలుపుచు సర్వజ్ఞుండయ్యు నవనవక్రీడావిశేషసంజనితసంతోషపారవశ్యంబున నితరం బేమియు నెఱుంగనివాఁడ పోలె నుండుచుఁ దత్తత్క్రీడావసరంబుల నొండొరులకౌశలంబునకు సంతోషించి యన్యోన్యప్రశంస జరిగించుచు మిథఃకృతచుంబననఖరచేష్టాసరసల్లాపాదికాంక్షానురూపనర్మక్రియాసముదాయంబునఁ బరస్పరంబు మిక్కుటంబుగా రంజించుచు బహుకాలంబు క్రీడించి యంతట నప్పరమపురుషుండద్భుతప్రభావసంపన్నంబైననిజతేజం బాసాధ్వీతిలకంబునందు నిలిపిన నక్కుసుమకోమలి భరింప నోపక దాని భూమియం దుత్సర్జనంబుచేసె నవ్విశ్వంభరయుఁ దాను సర్వంసహ యయ్యుఁ బరమేశ్వరరేతోధారణంబునం దసమర్థయై పావకుఁ బ్రార్థించిన నతం డప్పుడు ధరించియుఁ బిదపఁ దద్భారంబునకు విసివి కృత్తికలార్వురయం దవ్వీర్యంబు గ్రమక్రమంబున నిక్షేపించె నంతట వారును దాని మోచుసామర్థ్యంబు దమకుఁ గలుగమి భావించి శీతలప్రవాహ యగు గంగాతరంగిణియందు విడిచి రాభాగీరథియుఁ దత్తేజోభరణంబు దనకు వెక్కసంబైనఁ దలంకి యాత్మీయం బగుశరవణంబుఁ జేర్చె నంతఁ గతిపయదినంబులలోన నమ్మహేశ్వరతేజంబు కుమారస్వరూపంబునఁ బరిణమించి షడాననంబులఁ గృత్తికాస్తన్యపానంబు చేసి తత్కారణంబున షడాననుండును సదా కుమారత్వంబున విలసిల్లుటం జేసి కుమారుండును నన నెగడినయబ్బాలునిఁ గొనివచ్చి సురనది పార్వతీపరమేశ్వరులయొద్ద నునిచి యరిగిన నమ్మహాత్ముండును నిరతిశయమహిములైనజననీజనకులచేత నుపలాలితుండై దినదినంబున నభివృద్ధినొందుచుఁ బార్వతీనందనుండును మహేశ్వరతనయుండును వహ్నిసంభవుండును గంగాత్మజుండును గార్తికేయుండును శరవణోద్భవుండును ననునామంబులఁ బ్రసిద్ధి వహించి జననమాత్రంబున స్వతస్సిద్ధం బైనమహానుభావంబున లోకోత్కృష్టుండై సకలలోకగురువైన జనకునివలన నఖిలవిద్యలు వడసి తదనుజ్ఞాతుండై సర్వసుపర్వ

మనఃపర్వంబుగా గీర్వాణసేనాధిపత్యధూర్వహత్వం బంగీకరించి యమోఘం బైనశక్తిప్రభావంబునఁ ద్రిలోకకంటకుం డైనతారకాసురు ససైన్యంబుగా సంహరించి భువనంబుల కానందం బాపాదించె నప్పు డక్కుమారవరువలనఁ ద్రైలోక్యరాజ్యంబు నిష్కంటకంబుగాఁ దనకుఁ జేకూరుటకు సంతసిల్లి మహేంద్రుండు దనకూఁతు దేవసేన యనుకన్యామణి నయ్యుమాకుమారునకు సమర్పించి మహావిభవసమేతంబుగా వివాహం బాచరించిన సౌందర్యసౌకుమార్యసౌశీల్యాదిసమస్తసద్గుణవిరాజమాన యగున ద్దేవసేన సకలజగజ్జనపీజనకు లైనయుత్తమా మలకు నత్యంతశుశ్రూష సేయుచు మహనీయసుగుణసముదాయుం డైనమహా కార్తికేయునిం గూడి యభిమతభోగంబు లనుభవించుచు సుఖంబుండె. 403

సీ. అసమాస్త్రుఁ డీరీతి • నసమసామర్థ్యమై, యమరహితం బైన•యలఘుకార్య
మహాత్మ్యమున, సాధించి హర్షిత•స్వాంతుఁ డగుచు
విశ్వసమ్మోహన•విద్యాధురీణుఁ డై యతులితజయలక్ష్మి • నతిశయిల్లి
సకలకంబుల•సంస్తుతుల్ గైకొని, యలవసంతాదులు • బలసి రాఁగ
గీ, ననుపమానమహావిభ•వాఢ్యమైన, శ్రీపురముఁ జేరి యచట న•శేషలోక
జనని యగుచక్రినాయికఁ • గని వినీతి, నధికభక్తిప్రణామంబు • లాచరించి. 404

వ. ముకుళితకరకమలుండై యి ట్లని విన్నవించె. 405

క. పరమేశ్వరి మీయానతి, శిరమునఁ దాల్చి చని తుహిన•శిఖరిసుతాశం కరులకు గూర్చితి వారునుఁ, బరస్పరదృఢానురాగ•బద్ధహృదయులై. 406

క. అలఘబలుం డగుషణ్ముఖుఁ, గలిగించి రతండు వేల్పు•గమికాఁడై దో ర్బలమున దారకదైత్యు, న్నలహంబునఁ గూల్చె సురని•కాయము లలరన్. 407

క. అని విన్నపంబున విజ్ఞాపన మొనర్చిన సరోజ•బాణునిఁ గరుణన్ గనుఁగొని శ్రీలలితాంబిక, ఘనతరసంతోష మాత్మఁ • గడలుకొనంగన్. 408

గీ. బహువిధంబుల మన్నించి • పంచశరుని, నధికసంప్రీతుఁ జేసి న•ర్వామరులును సకలశక్తులుఁ దనుఁ గొల్వ •జగము లేలె, శ్రీమహారాజ్ఞి దనమన•ప్రియునిఁ గూడి.

క. అని యిట్లు కలశజన్మున, కనిమిషవినుతప్రభావుఁ • డగుహయవదనుం డనుపమదయతో నెఱిఁగిం, చిన నమ్ముని సంప్రమోద•చిత్తుం డయ్యెన్. 410

సీ. సకలకల్యాణదా•యక మయి సర్వపా, పఘ్నమై యత్యంత•పావన మయి
ద్వైపాయనప్రణీ•తం బయి తనరి బ్రహ్మాండపురాణస్థ • మైనయట్టి
శ్రీలలితాంబచ•రిత్రంబు ధాన్యవాట్యమరేశ్వరస్వామి • కర్పితముగఁ
దెలుఁగున రచియించె • నిలఁ బ్రసిద్ధంబుగాఁ, బార్వతీశంకర•పాదభక్తుఁ

